# గీతా కల్పవృక్షము

## Gita in Daily Life

( నిత్యజీవితములో భగవద్గీత )



శిష్యస్తేహం, శాధి మాం త్వాం ప్రపన్నం

e - Instruct me - I take refuge in thee.



ర చ యి త :

"గీతా సాహిత్య శిరోమణి"

పండిత పెమ్మరాజు రాజారావు

46-12-24, దానవాయిపేట,

రాజమండ్రి - 533103.

(తూ॥ గో॥ జిల్లా.)

ఓమ్

శ్రీ వెంకటేశాయనమః

శ్రీమన్, కృపాజల నిధే, కృత సర్వలోక,
సర్వజ్ఞ, శక్త, నతవత్సల, సర్వశేషిన్
స్వామిన్, సుశీల, సులభాశ్రితపారిజాత,
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥

శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినాం
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్॥



This book is published with the financial assistance of Sri Thirumala Tirupathi Devasthanams under their scheme "Aid to publish religious books;'

ప్రకాశకులు :

పెమ్మరాజు రాజారావు

దానవాయిపేట, రాజమండ్రి.

1985



ఓమ్

'గీతా కల్పతరుం భజే భగవతా
కృష్ణేన సంరోపితం
వేదవ్యాసవివర్ధితం శ్రుతిశిరో బీజం
ప్రబోధాంకురమ్ ।
నానాశాస్త్ర రహస్యశాఖ మరతి
క్షాంతి ప్రవాళాంకితం
కృష్ణాంఘ్రి ద్వయ భక్తిపుష్ప సురభిం
మోక్షప్రదం జ్ఞానినామ్॥'

సకలములైన కోరికలను చేకూర్చునట్టి గీతాకల్పవృక్షమును భక్తితో సేవించుచున్నాను. షడ్గుణైశ్వర్య సంపన్నుడగు శ్రీకృష్ణభగవానుడే దీనిని పాదుకొల్పినాడు. వేదవ్యాసమునీంద్రునిచే నిది వృద్ధిపొందినది. జ్ఞానభాండారములగు ఉపనిషత్తులే దీని యొక్క బీజములు. ఆత్మ ప్రబోధమే దీని అంకురము. వివిధ శాస్త్రసారములే దీనికొమ్మలై వెలసినవి. త్యాగ - సహనములే దీనికి చిగురుటాకులు. శ్రీకృష్ణ పాదయుగళ భక్తియే సురభితకుసుమములు. జ్ఞానప్రదము, మోక్ష ప్రదము నగు గీతాకల్పవృక్షమును భజించుచున్నాను.



ఓమ్

# గీతా కల్పవృక్షము

( Gita in the Daily Life )

(నిత్యజీవితములో భగవద్గీత)



"గీతా సుగీతా కర్తవ్యాకి మన్యైః శాస్త్రసఙ్గ్రహైః
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతా ॥"

*　　*　　*

శ్రీ భగవానుని ముఖపద్మమునుండి జాలువారిన అమృతస్రవంతి భగవద్గీత యగుటచేత నదియే నిరంతరమును పఠింపదగినదియును, ధ్యానింపదగినదియును నైయున్నది. ఇక ఇతరములగు శాస్త్రములతో నెట్టి ప్రయోజనమును లేదు. ( వేదవ్యాసమహర్షి )

*　　*　　*

శతాధిక కథామధురిమలతో సనాతన నవీన వ్యాఖ్యాన పరిమళములతో గీతోక్త జీవితవిధానమును ప్రతిబింబింపజేయు నూటయిరువదియొక్క దివ్యప్రసంగ వ్యాసాల మధుర మందార మాలయే "గీతా కల్పవృక్షము."




రచయిత :

గీతా సాహిత్య శిరోమణి

పండిత పెమ్మరాజు రాజారావు

46–12–24, దానవాయిపేట,

రాజమండ్రి.

సర్వస్వామ్యములు
రచయితవి

ముద్రణ వేయిప్రతులు
1985 – రక్తాక్షి



మూల్యము :
ముప్పదిరెండు రూపాయలు



ప్రాప్తిస్థానము :
పెమ్మరాజు రాజారావు
46-12-21, దానవాయిపేట,
రాజమండ్రి-523103.

మరియు

కల్లూరి రాధాకృష్ణశర్మ
46-16-28,
రాజమండ్రి

ముద్రణ :
బి. వి. అండ్ కో. ప్రెస్,
ఇన్నీసుపేట, రాజమండ్రి-1.

# గీతాకల్పవృక్షము

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | గీత - జ్ఞాన భాండారము. | 1 |
| 2. | గీతా మాతకు పూజాపుష్పము. | 6 |
| 3. | భగవానుడే నీకు సారథి. | 13 |
| 4. | సంజయునిద్వారా గీతావాణి. | 18 |
| 5. | ధర్మక్షేత్రమగు కురుక్షేత్రము. | 21 |
| 6. | కురుక్షేత్రములో భగవానుడు. | 23 |
| 7. | అర్జునుని విషాదకారణము. | 26 |
| | రెండవ అధ్యాయము - సాంఖ్యయోగము. | |
| 8. | గీతా హృదయము. | 30 |
| 9. | ఉత్తిష్ఠ - పరన్తప. | 36 |
| 10. | శరణాగతి - గీతామందిర సింహద్వారము. | 39 |
| 11. | ఆత్మబోధామృతము. | 44 |
| 12. | ఆత్మ - శరీరము. | 50 |
| 13. | ధీరుడే అమృతత్వమును బొందును. | 53 |
| 14. | వియోగ మేల దుఃఖహేతువు. | 55 |
| 15. | స్వధర్మముద్వారా మోక్షము. | 58 |
| 16. | కర్మయోగమునకు నాలుగు ముఖ్యసూత్రములు. | 63 |
| 17. | కామ్యకర్మలు మానవుని బంధించును. | 67 |
| 18. | ఫలత్యాగము - ఉదాహరణము. | 70 |
| 19. | స్థితప్రజ్ఞ లక్షణములు - గీతా సందేశము. | 73 |
| 20. | కామరహితుడు - ఆత్మానంద రహితుడు - స్థితప్రజ్ఞుడు. | 77 |
| 21. | సుఖదుఃఖములను నిగ్రహించువాడే స్థితప్రజ్ఞుడు. | 80 |
| 22. | రాగము, భయము, క్రోధము - వీనిని విడనాడుటచేత స్థితప్రజ్ఞత్వము. | 83 |
| 23. | బాహ్యవస్తు నిరాకరణమే ఇంద్రియనిగ్రహము కాదు. | 91 |
| 24. | ఇదియే మోక్షము - బ్రాహ్మీస్థితి. | 97 |
| | మూడవ అధ్యాయము - కర్మయోగము | |
| 25. | రెండు ప్రధాన మార్గములు. | 101 |
| 26. | కర్మయోగో విశిష్యతే. | 104 |

27. యజ్ఞములు - సేవాకార్యములు. 106
28. ఐదు మహాయజ్ఞములు. 109
29. విశ్వసృష్టి - స్వధర్మము. 116
30. కామక్రోధములు. 118

నాల్గవ అధ్యాయము - జ్ఞానయోగము.

31. గీత - అనాది. 122
32. భగవానుడు నిరాకారుడు, సాకారుడు 124
33. కృష్ణావతారతత్త్వము - రాసలీలా విశేషములు. 126
34. నాలుగు వర్ణములు. 131
35. నిష్కామకర్మకు మరికొన్ని యుదాహరణములు. 133
36. సేవాకార్యములే యజ్ఞములు. 135
37. సాధుసంఘంబు సకలార్థ సాధనంబు. 137
38. శ్రద్ధావంతునకే జ్ఞానము. 140
39. పవిత్రమగు భక్తిచే సాధింపజాలని దేదియును లేదు. 144

ఐదవ అధ్యాయము - కర్మసన్యాసయోగము

40. గృహస్థుడు, సన్యాసి - ఎవరు గొప్పవారు ? 150
41. సన్యాసము రెండు రకములు. 154
42. లోకములో సమానత్వ మెక్కడ ? 157
43. ఆనందాన్వేషణము. 159
44. కామక్రోధముల వేగమును నిరోధింపుము. 163
45. కఠోపనిషత్తులోని పుణ్యకథ. 165
46. పండితాః సమదర్శినః 169
47. అభితోఽబ్రహ్మ నిర్వాణమ్. 173

ఆరవ అధ్యాయము - ఆత్మసంయమ యోగము

48. అనుష్ఠాన వేదాంతము. 179
49. మనస్సుయొక్క ప్రభావము. 181
50. మితాహార విహారములు - యోగసాధనములు. 184
51. బ్రహ్మచర్యదీక్ష కలవానికి అసాధ్యము లేదు. 188
52. ధ్యానమున కొక ప్రణాళిక. 191
53. మంచిపని చేయువానికి నాశనము లేదు. 193

ఏడవ అధ్యాయము - విజ్ఞాన యోగము

54. మహాభక్తి తరంగిణి. 195
55. సృష్టి దేనితో చేయబడినది. 198

56. జలములో, కాంతిలో, శబ్దములో, వీర్యములో భగవానుని దర్శనము. 201

57. సువాసనలో, తేజస్సులో, తపస్సులో పరమేశ్వరుని ఆరాధనము. 204

58. మాయను తరించుట ఎట్లు ? 205

59. భక్తులు నలుగురు. 209

ఎనిమిదవ అధ్యాయము - అక్షర పరబ్రహ్మయోగము

60. మరణకాలమున భగవన్నామ స్మరణము. 215

61. మరణ స్మృతివలన ఫలము. 220

62. భక్తిచేతనే భగవానుడు బంధింపబడును. 223

63. శుక్లమార్గము - కృష్ణమార్గము. 227

తొమ్మిదవ అధ్యాయము - రాజవిద్యా రాజగుహ్యయోగము

64. భగవంతునికన్నను భగవన్నామమే గొప్పది 231

65. నాభక్తుని రక్షణ బాధ్యత నాదే. 235

66. పత్రం, పుష్పం, ఫలం, తోయం. 240

67. భగవద్విశ్వాసము గలవానికి అసాధ్యము లేదు. 244

68. మహాపాపియైనను ఈశ్వరారాధనముచే పవిత్రుడే. 247

69. యోగక్షేమం వహామ్యహం. 250

పదవ అధ్యాయం - విభూతి యోగము

70. గీతా వైభవము. 257

71. భగవంతుడు సర్వవ్యాపి. 262

72. ప్రకృతిలో భగవానుని ఆరాధన. 266

73. సృష్టిలో ఈశ్వర దర్శనము. 270

పదునొకండవ అధ్యాయము - విశ్వరూప సందర్శనయోగము

74. విశ్వరూప దర్శనమునకై అర్జునుని ప్రార్థన. 272

75. భగవానుని విశ్వరూప దర్శనము. 274

76. నిమిత్తమాత్రం భవ. 276

77. గీతాసారము - పంచసూత్ర ప్రణాళిక. 280

పండ్రెండవ అధ్యాయము - భక్తియోగము

78. ఇది ధర్మస్వరూపామృతము. 284

79. సగుణ నిర్గుణముల తారతమ్యము. 286

80. సగుణ నిర్గుణములు భగవానుని రెండు రూపములు. 290

81. అభ్యాసమార్గమున హరిపాదము లాశ్రయింపుము. 292

82. పుణ్యకర్మల ద్వారమున భగవత్ప్రాప్తి. 295

83. సర్వకర్మ ఫలత్యాగము - మరియొక సాధనము. 297

84. భక్త లక్షణములు. 300
85. భక్తిమందార షట్కము. 302
86. భక్తిపుష్ప పంచక సౌరభము. 309
87. భక్తి పద్మత్రయ దివ్యశోభలు. 313
88. ఆధ్యాత్మ కుసుమ షట్కము. 316
89. ఆరు పుష్పాల మధురమాల. 319
90. మరికొన్ని భక్తిపుష్పాలు. 322

పదమూడవ అధ్యాయము - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

91. శరీరము తాత్కాలిక గృహము. 327
92. జ్ఞాన దీపావళి. 330
93. తొమ్మిది జ్ఞానపుష్పాల అనంతశోభ. 332
94. నిత్యజీవితములో జ్ఞాన సాధనాత్రయము. 341
95. మరికొన్ని జ్ఞానపుష్పాలు. 349
96. మిక్కిలి దూరస్థుడు, సన్నిహితుడు భగవానుడే కదా! 353

పదునాల్గవ అధ్యాయము - గుణత్రయ విభాగయోగము

97. జ్ఞానములలోనెల్ల నుత్తమ జ్ఞానము. 359
98. తమోగుణ లక్షణములు - దానిని జయించు విధానము. 360
99. రజోగుణ విజయోపాయము. 363
100. సత్త్వగుణమును కూడ నిగ్రహింపుము. 363
101. త్రిగుణముల ప్రాబల్యము - మూడు ఉదాహరణములు. 364
102. పద్మపురాణములో నుండి ఒక కథ. 366
103. త్రిగుణాతీతుని లక్షణములు-భక్తియే త్రిగుణాతీతస్థితికి పరమసాధనము 371

పదునైదవ అధ్యాయము - పురుషోత్తమ ప్రాప్తియోగము

104. పరమరహస్యమైన మహాయోగ శాస్త్రము. 373
105. సంసార మహావృక్షము. 374
106. మహాత్యాగముచేత మాత్రమే బ్రహ్మజ్ఞాన సింహాసనము. 376
107. పురుషోత్తమ దర్శనము. 380
108. ఈ అధ్యాయములోని కొన్ని రహస్యములు. 381
109. ఆత్మసాక్షాత్కారమునకు పంచసోపానములు. 386

పదునారవ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగయోగము

110. ఇరువదియారు దేవతాగుణములు - దైవీసంపద 389
111. అజ్ఞానముకూడ రాక్షస లక్షణమే. 396

112. విపరీత భావనలు - అసుర వికారములు 398
113. నరకద్వారములు మూడు. 400
పదునేడవ అధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము
114. నీ నివాసగృహమే నీప్రవృత్తిని తెలుపును. 405
115. ఆహారమే నీశీలమును మార్చు పరమోపాయము. 406
116. తపశ్శాలివి గమ్ము. 410
117. దానశీలుడ వగుము. 411
పదునెనిమిదవ అధ్యాయము - మోక్షసన్యాస యోగము
118. గీతాచార్యుని ద్వాదశ మహోపదేశములు. 415
119. భగవానుని రహస్య సందేశము. 418
120. మాశుచః దుఃఖించవద్దు, మామేకం శరణం వ్రజ. 421
121. సంజయుని ముగింపు పలుకులు. 425



## * పాఠకులకు సూచన *

ఈ గ్రంథములోని శీర్షికలయొక్క కొన్ని క్రమసంఖ్యలు పొరబాటుగా ముద్రింపబడినవి. ఈదిగువ నుదహరించిన రీతిగా సరిదిద్దుకొన ప్రార్థన.

| పుట | శీర్షిక సంఖ్య తప్పు | శీర్షిక సంఖ్య ఒప్పు |
|---|---|---|
| 223 | 60 | 62 |
| 227 | 61 | 63 |
| 240 | 64 | 66 |
| 244 | 65 | 67 |
| 247 | 66 | 68 |

సూచన :- **154** వ పుటలో 10 వ పంక్తి తరువాత 41 వ శీర్షికగా "సన్యాసము రెండు రకములు" అని గుర్తించుకొన ప్రార్థన.

# మనవి మాటలు

భగవద్గీత కేవలం పారాయణ గ్రంథం మాత్రమే కాదు. గీతా పారాయణాం వలన అనేక మహత్తర పుణ్యఫలితాలు కలుగుననుట పరమసత్యమే. అంతమాత్రమే గాదు, గొప్పదగు అనుష్ఠానగ్రంథం. నిత్యదైనందిన జీవితములో, తల్లిగా, తండ్రిగా, ప్రియసహోదరునిగా, ప్రేమాస్పదుడగు సన్మిత్రునిగా, సచివునిగా, సారథిగా, నెయ్యముగా, నేస్తముగా, ఆప్తబాంధవుడుగా, హితుడుగా,గురువుగా, సద్గురువుగా; జగద్గురువుగా, మానవుని లాలించి, ప్రేమించి పాలించి, బోధించి, శాసించి హితోక్తులను గరపి మహాపురుషునిగా, తీర్చిదిద్దుతుంది గీత.

మానవుడు ఏవిధంగా జీవించాలో, భాషించాలో, ఏవిధంగా భుజించాలో ఎప్పుడెప్పుడు ఎంతెంత ఏరీతిగా భుజించాలో, ఎట్లు సంఘంతో కలిసి మెలసి నడుచుకోవాలో, ఎట్లు నడవాలో ఏలాశయనించాలో, వేయేల జీవితంలో గల చిన చిన్న విషయాలు మొదలుకొని మహత్తరమైన ఆత్మసాక్షాత్కారం వరకు మరెన్నో నిత్యదైనందిన జీవితరహస్యాలు మధురంగా, మంజులంగా, మృదులంగా,ముచ్చటగా, మహనీయంగా, కమనీయంగా పలికిన దివ్యవాణియే గీతావాణి.

వర్తమానకాలంలో విజ్ఞానశాస్త్ర పరిశోధనలు బహుళంగా విస్తరించిన దుష్ఫలితాలుగా మానవునిలో దురహంకారము, ఇంద్రియ భోగలాలసత్వము, దురాశలు, ఇంద్రియభోగపదార్థముల పట్ల విపరీతమగు కాంక్షలు పెరిగిపోయి భూమండలాన్ని నీతినియమాలు లేని పైశాచిక రాక్షసభూమిగా మార్చివేసిన వనుటలో నాశ్చర్యము లేదు. రేడియోలు, టెలివిజన్లు, గ్యాసుస్టవులు, మున్నగు తదితర సుఖభోగములనిచ్చు విద్యుత్పరికరాల సమృద్ధి, మానవుని యంత్రములకు దాసునిగా జేసి వారి వ్యక్తిత్వాన్ని క్రుంగతీస్తున్నాయి. అట్టి భోగవస్తువుల సముపార్జనం కొరకు నీతినియమాలు విడనాడి ధర్మా

ధర్మాల పరికింపక విశేష ధనసముపార్జనమును పురికొల్పుచున్నది. వీనిఫలితముతే దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, మోసపువ్యాపారములు, వంచనాక్రియలు మున్నగు పైశాచిక క్రియల విలయతాండవం.

ప్రతిరంగంలోను అవినీతి పిశాచమే తాండవిస్తోంది. రాజకీయ రంగంలో, వాణిజ్యరంగంలో, వ్యాపారరంగంలో, వైద్యరంగంలో, విద్యారంగంలో ఆహారరంగంలో, ప్రభుత్వరంగంలో, పారిశ్రామిక రంగంలో, విశేషంగా అవినీతి, దగా, మోసమే కానవస్తున్నది. నీతి, ధర్మము, ప్రేమ, కారుణ్యము, సహనము మున్నగు దివ్యగుణగణాలు మరుగైపోయినవి. ధనార్జనమే జీవితలక్ష్యంగా, ఇంద్రియ భోగాలే జీవితపరమావధిగా భావింపబడుచున్నవి.

ఇక అధ్యాత్మికరంగంలో చూస్తే, భక్తి అంటే తప్పట్లూ తాళాలతో చేసే భజనలు మాత్రమే అని, ధ్యానయోగమంటే ముక్కుమూసికొని మూలకూర్చుండుట మాత్రమే అని, జ్ఞానమంటే గ్రంథాలను కంఠస్థముచేయుట మాత్రమే అని, సన్యాసమంటే కాషాయాంబరధారణ మాత్రమే యని భావించే వారి సంఖ్య పెరిగిపోయింది.

'సత్యభాషణ, ధర్మానుష్ఠానము, సేవాశుశ్రూషలు, ప్రేమ, కరుణ నిత్యజీవితంలో అనుష్ఠానం చేయడమేభక్తి. పరోపకారము, త్యాగమే జ్ఞానము. భోగవిలాసత్యాగము,నిరాడంబర జీవితమే సన్యాసము. అమానిత్వాది గుణములతో జీవించడమే మతము. అని గీతాచార్యుని బోధ.

భారతీయ తత్వసారమైన భగవద్గీతను నిత్యదైనందిన జీవితంలో అనుష్ఠాన యోగ్యంగా ప్రబోధముచేసే రచనలు ఈనాడు ఎంతోఅవసరం. మానవదృక్పథము భోగలాలసత్వమునుండి త్యాగపథమునకు మారవలెను. వేదాంతము వేరు. నిత్యజీవితము వేరు,' అని తలంచుట పొరపాటు. నిత్యదైనందిన జీవితంలో వేదాంతాన్ని సమన్వయం చేసికొని జీవించాలి. నీ వ్యాపారములో, నీ వృత్తిలో, నీపలు

కలో, ఏ భాషలో, నీ సంపాదనలో, నీ భోజనంలోని ప్రతిచిన్న వ్యవహారములోను, వేదాంత భావన కావలసియున్నది. అప్పుడే మానవుడు మహాపురుషుడౌతాడు.

ఈ పరమలక్ష్యంతో 'గీతా కల్పవృక్షము' నూట ఇరువదియొక్క శాఖలతో (శీర్షికలతో) శతాధిక పుష్పసౌరభాలతో విలసిల్లినది. సనాతనములగు శంకర రామానుజాది భాష్యాలను నవీనములగు గాంధీ, తిలకు, అరవింద, భావే, అనిబిసెంటు, శివానంద మున్నగు పుణ్య వ్యాఖ్యానాలతో సమన్వయించే నిత్యజీవితమున కనుగుణముగా వేదాంతాన్ని తీర్చిదిద్ది ప్రబోధము చేయుటే దీనిలక్ష్యము. ప్రతి శీర్షికయును మానవుని ఉత్తేజవంతం చేస్తుంది. ఇందలి కథలు, గాథలు, మహాపురుషుల సూక్తులు, వారి జీవితానుభవ సందేశాలు సామాన్య మానవజీవితాన్ని పవిత్రం చేస్తాయని చెప్పుటలో అతిశయోక్తి లేదు.

ముఖ్యంగా సామాన్యమానవుని స్థాయికి దిగివచ్చి అతని జీవితానుభవంతో మేళవించి గీతానుష్ఠానాన్ని మధురంగా, మంజులంగా, హితంగా, ప్రియంగా. చెప్పుటే గీతాకల్పవృక్ష లక్ష్యమని పాఠకులు భావించగలరు. గీతోక్త జీవితవిధానాన్ని ప్రతిబింబించే దివ్యరచన. వర్తమానకాలంలో మానవజాతిని పెనవేసికొని యున్న అవినీతి, దురాచారములు, దౌర్జన్యము, మున్నగు ఆసురీభావాలను తొలగించి ప్రసన్న ప్రశాంత ప్రవిమల వాతావరణాన్ని సృజించి సంఘాన్ని శీలసంపన్నము చేయగలదను పుణ్యభావనతో ఆంధ్రలోకానికి దీనిని మరల సమర్పించుచున్నాము.

ఇట్లు,

గీతా ప్రచార సంఘము.

దానవాయిపేట, రాజమండ్రి.



# కృతజ్ఞతా కుసుమాంజలి

రాజమహేంద్రవరములోని ప్రకాశనగరులోనున్న కమ్యూనిటీ హాలులో The world Teacher Trust (విశ్వగురుపీఠము) వారి ఆధ్వర్యవములో 1984వ సం॥ మార్చి నెల 1వ తేదీనుండి నలుబది రెండు దినములు గీతాజ్ఞానయజ్ఞము నిర్వహించు సదవకాశము గీతాచార్యుడు ప్రసాదించినాడు. గీతాంతర్గతమగు సాంఖ్య యోగమును గూర్చి ప్రతిదినమును సాయంకాలము సహృదయులగు సాధకుల సమక్షంలో పుణ్యప్రవచనముచేయు సేవాభాగ్యము నాకు లభించినది. మిక్కిలి వైభవముగా, దీక్షతో, ఓర్పుతో ఈకార్యక్రమములను నిర్వహించిన The world Teacher Trust సభ్యమహాశయులకును ముఖ్యంగా ఆత్మీయమిత్రుడు ప్రధానకార్యకర్త సహృదయ త్యాగమూర్తి యగు మాన్యశ్రీ శ్రీపతి రఘురామ కుమార్ మహాశయులకు నాకృతజ్ఞతా నమస్సుమాంజలులు.

ఈ జ్ఞాన యజ్ఞ సందర్భమున పలువురు వదాన్యులగు భక్తులు గీతాకల్పవృక్ష గ్రంథ ముద్రణమునకు ఆర్థికముగా సహకరించిరి. వారి పుణ్యనామధేయములు ఈ గ్రంథమునందు కృతజ్ఞతాసూచకముగా ముద్రింపబడినవి. మరియు విశేషవిరాళము లొసగి గ్రంథముద్రణమునకు మరెంతగానో సహకరించిన కొందరు భక్తుల ఛాయాచిత్రములను సంగ్రహవివరణములను కృతజ్ఞతాసూచకముగ ఈగ్రంథములో ముద్రించుటకు గీతాప్రచారసంఘము నిర్ణయించుట ముదావహము.

1. ప్రప్రథమముగా ఈగ్రంథముద్రణమునకు తాను విరాళ మొసగుటయేగాక తన మిత్రులచేతను బాంధవులచేతను విరాళములు సేకరించి ఇప్పించి సహకరించిన సన్మిత్రవరేణ్యుడు శ్రీ కోరంకి వీర్రాజుగారు స్తవనీయులు. రాజమహేంద్రవరమున దానవాయిపేటలోగల సుప్రసిద్ధ వైశ్యప్రముఖులు. ధర్మపత్ని శ్రీమతి రామలక్ష్మిగారు. వీరి జనకులు కీ శే. వెంకటరత్నంగారు. జనని శ్రీమతి మహాలక్ష్మిగారు. నిరంతరమును భగవదారాధనా తత్పరులగు వృద్ధతపస్వి శ్రీ వీర్రాజుగారు. అనేక సంస్థలకు పండితులకు గ్రంథములకు గుప్తదానము లొసంగిన వదాన్యుడు. వీరికి అయిదుగురు కుమారులును ఒక కుమార్తెయును గలరు 1) శ్రీ పాండురంగ విఠల్ 2) శ్రీరామకృష్ణ సుబ్రహ్మణ్యం 3) వీరవెంకటసత్యనారాయణ 4) లక్ష్మీనారాయణ 5) విశ్వేశ్వరరావు. కుమార్తె చి॥సౌ॥ జయలక్ష్మి. పార్థసారథి వీరికి సర్వశుభములను ప్రసాదించుగాత!!

2. పూజ్యులు బ్రహ్మశ్రీ పరసా పద్మరాజారావుగారు. ధర్మపత్ని శ్రీమతి శేషావతారంగారు. పశ్చిమగోదావరి జిల్లా తాళ్ళపూడి వాస్తవ్యులు. సుప్రసిద్ధవస్త్ర వ్యాపారులు. సుమారు పండ్రెండు సంవత్సరములు తాళ్ళపూడి గ్రామపంచాయితీ సర్పంచిగా సేవచేసిన ప్రతిభావంతు డగు కర్మయోగి శ్రీ పద్మరాజారావుగారు. వీరి

పవిత్ర నామధేయముతోనే ఆ గ్రామమందలి పరిషత్ ఉన్నత పాఠశాల విలసిల్లుట మహాభాగ్యము.

వీరి జననీ జనకులు కీ॥ శే॥ శ్రీమతి కుటుంబలక్ష్మి, కీ॥ శే॥ శ్రీమన్నారాయణ రావుగారు. వీరి జననం 18-2-1905. ఎనుబది పూర్ణవసంతాల వసంతమనోజ్ఞమూర్తి శ్రీ పద్మరాజారావుగారు. అనేక సంస్థలకు, కవిపండితులకు పేదవిద్యార్థులకు సహాయములందించిన వదాన్య శేఖరులు. వీరికి నలుగురు కుమారులు గలరు 1) శ్రీ ప్రభాకర విశ్వేశ్వరశాస్త్రి 2) శ్రీ భాస్కరకుమార్ B. Sc. 3) ఉదయభానూజీ M. Com.. L. L. B. 4) శ్రీ సూర్యచంద్ర బోస్. వీరి జామాత శ్రీ U. V. రమణారావుగారు Addl. Asst. Engineer, Kovvur మాకు సహృదయ మిత్రుడు. భగవానుడు వారికి సర్వశుభములను ప్రసాదించు గాక!

3) శ్రీ మావూరి సుబ్రహ్మణ్యంగారు - రాజమహేంద్రవరమునగల సుప్రసిద్ధ వైశ్యప్రముఖులు, వస్త్రవ్యాపారము. ధర్మపత్ని శ్రీమతి జానకిగారు. వీరి జననీ జనకులు కీ॥ శే॥ శ్రీమతి మల్లమ్మగారు, కీ॥ శే॥ శ్రీ మల్లికార్జునుడుగారు. శ్రీ సుబ్రహ్మణ్యంగారు మిక్కిలి సహృదయులు - నిరాడంబరులు అనేకులకు గుప్తదానము లొసంగిన వదాన్యశేఖరులు. భగవానుడు వీరికి సర్వశుభములను ప్రసాదించు గాక !!

4) పూజ్యులు భక్తవరేణ్యులు శ్రీబత్తుల వెంకట్రావుగారు. ధర్మపత్ని కీ॥ శే॥ శ్రీమతి రామలక్ష్మిగారు. రాజమహేంద్రవరమున సుప్రసిద్ధ వైశ్యులు - తైల వ్యాపారము. అనేక సంస్థలకును కవిపండితులకును దానధర్మములు గావించిన వదాన్యులు. పార్థసారథి వారికి సర్వశుభములను ప్రసాదించుగాక!

ఈ గ్రంథముద్రణమునందు ప్రారంభమునుండియు నాకు సర్వవిధముల సహకరించిన ఆత్మీయమిత్రుడు, భక్తవరేణ్యుడు, శ్రీ అయ్యగారి శ్రీరామపంతులుగారికి నాహృదయ పూర్వక నమస్సుమాంజలులు. ఈ గ్రంథమును ఆకర్షణీయముగా ముద్రించియిచ్చిన పండితవరేణ్యులు శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారికి నా వందనములు. ఈ జ్ఞానయజ్ఞమున నాతో సర్వవిధముల సహకరించిన పూజ్యులు శ్రీ కస్తూరి వెంకటరత్నంగారికి, శ్రీ అడివి లక్ష్మీనారాయణమూర్తిగారికి, శ్రీ పులగుర్త సూర్యవరప్రసాదుగారికి, బ్రహ్మశ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణగారికి, శ్రీ కల్లూరి రాధాకృష్ణశర్మగారికి నాయొక్క కృతజ్ఞతలు.

నమస్కారములు
పెమ్మరాజు రాజారావు,
గీతా ప్రచార సంఘము.
దానవాయిపేట, రాజమండ్రి.



శ్రీ పరస పద్మరాజారావుగారు
ధర్మపత్ని శ్రీమతి శేషావతారంగారు
తాళ్ళపూడి (ప. గో. జిల్లా)

సంస్మరణ



కీ. శే. శ్రీ కోరంగి వెంకటరత్నంగారు
(శ్రీ కోరంగి వీర్రాజుగారి పితృదేవులు)

వదాన్యశేఖరులు



శ్రీ కోరంగి వీర్రాజుగారు
ధర్మపత్ని శ్రీమతి రామలక్ష్మిగారు
దానవాయిపేట, రాజమండ్రి.

ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# గీతాకల్పవృక్షము

మొదటి అధ్యాయము - అర్జున విషాదయోగము

## 1. గీత - జ్ఞాన భాండారము

శ్రీకరుండై, సర్వమంగళకరుండై, సకల ప్రాణికోటుల హృదయాంతరాళములలో మహాచైతన్య స్వరూపుడై ప్రకాశించు ఆనంద తపఃఫలమునకు, - సుగుణంబుల పుంజమునకు, గోపకామినీ బృందముల నోములపంటకు - మేఘశ్యామల సుందరమూర్తికి - నవనీత చోరునకు - కాళీయ ఫణి ఫణాగ్ర మనోహర నాట్యాచార్యునకు - గోవర్ధనోద్ధరునకు, - మురళీమోహన చక్రవర్తికి- మందస్మిత సుందర వదనారవిందునకు - శతకోటి మన్మథ మన్మథునకు, శాంత గంభీర మనోజ్ఞ మధురమూర్తికి,-గీతాసార్వభౌము డగు శ్రీకృష్ణపరమాత్మునకు సాష్టాంగదండప్రణామ సహస్రములు !

పవిత్రమగు భగవద్గీతయొక్క సుందర సువ్యాఖ్యాతలగు శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్య, జ్ఞానదేవుల; గాంధీ, లోకమాన్యతిలకు, అరవిందఘోషు, అనిబిసెంటు మున్నగు పవిత్రమూర్తుల యొక్క పాదపద్మాలకు నమోవాక సహస్రములు !!

మంగళకరమగు గీతాపఠన పాఠన శ్రవణ, ప్రచార ప్రబోధన శీలురగు పుణ్యనరనారీమణులకు సాహృదపూర్వకమగు భక్త్యంజలులు !!

"భగవద్గీత" అనగా 'భగవానునిచేత గానము చేయబడినది' అని యర్థము. ఆకారములేని పరమేశ్వరుడు ఆకారమును ధరించి,

ద్యాపరహితుడైన పరంజ్యోతి స్వరూపుడు సుమనోహర సుందర శరీరమును దాల్చి, గుణశూన్యుడైన పరమేష్ఠి సద్గుణ గణములతో శోభిల్లి - ధర్మక్షేత్రమైన కురుక్షేత్ర సంగ్రామ రంగస్థలమున నిల్చి పార్థుని నిమిత్తమాత్రునిగా జేసికొని, సర్వ వేదముల సారమును సకలోపనిషత్తుల సందేశమును, సకల పురాణేతిహాసముల సానుభూత విశేషమును, సర్వమతముల సంపూర్ణ సాహిత్య సారమును, మధురముగా - మంజులముగా - మహిమోపేతముగా - సుమనోహరముగా, సుందరముగా, సంగ్రహముగా, సమగ్రముగా సారభూతముగా, సంశయ రహితముగా, భగవానుడు గానము చేసియున్నాడు. ఇదియే భగవద్గీత. "The song of Lord" - దేవుని దివ్యగానము.

ఇది సర్వమతముల సారము, సర్వశాస్త్రముల మూలము, సకల మార్గముల కేంద్రము, సకలరహస్యముల కీలకము, సత్యధర్మముల విధానము, శాంతిమంత్రముల నిధానము, సర్వరోగములకు దివ్యౌషధము, సకలమానవులకు జీవనరసాయనము, సర్వతీర్థములకు మహాతీర్థము, సర్వతాపత్రయ హర మగు గీతామృత మిది.

"భగవద్గీతయే భగవంతుడు" - భగవంతుడే భగవద్గీత. భగవంతుడు వాచ్యస్వరూపము. భగవానుడు వాచకస్వరూపము 'వాచ్యవాచకయోరభేదః' వాచ్యవాచకములకు భేదమే లేదని శాస్త్రము వక్కాణించును. కావున గీతాపఠనము, పాఠనము, శ్రవణము ప్రబోధము, ప్రచారము మున్నగునవి భగవదారాధనా, సేవా, తపోధ్యాన స్వరూపములే. ఈభావనయే నన్ను గీతాప్రబోధనా వ్యాఖ్యానములకు పురిగొల్పినది. జ్ఞానభాండారమగు భగవానుని దివ్యవాణికి వ్యాఖ్యానముసేయు దివ్యశక్తి నా కెక్కడ నున్నది! సంస్కృత భాషలో నాకు గల పాండితీప్రతిభయు శూన్యము. వేదవేదాంగ వేదాంత శాస్త్రానుభవమూ, అదియును గానరాదు. వక్తృత్వ పటిమయు గానరాదు. మహాపురుషుల మహనీయ సేవాభాగ్యము

కూడ నాకు తగినంతగా లేదనియే చెప్పగలను. గీత యందలి యాస క్తియే నన్నీవిధముగా ప్రవచన సేవకునిగా జేసినది. నా చిత్తశుద్ధిని కాంక్షించియే నేనీ కార్యక్రమమును ప్రారంభించితిని. ఇదియే నాకు భగవదారాధనము. ఇదియే తపస్సు ధ్యానమును గాగలదు.

సంసార భయంకర తాపత్రయాందోళనములమధ్య గీతా పఠనము నాకు శాంతిపథము. సంసార గాఢాంధకారములో నిది మెఱపు తీగ వంటిది. దరి గానని విశాలమగు జీవితపు ఎడారులలో నిరాశతో, నిస్పృహతో పయనించు పాంథుల కిది 'ఒయాసిసు' వంటిది.

ఏ మహనీయ తపస్సీయ దివ్యశక్తి కిరాతకుడైన వాల్మీకిచే మధురాతిమధురంగా రామాయణ దివ్యకావ్యాన్ని గానము చేయించినదో-ఏమహాద్భుత మహత్తర దీప్తి చింతాస్వాంతుడైన వ్యాసుని చేత భాగవత సుందర మహాకావ్యరాజమును సృష్టింపజేసినదో, ఆ కమనీయ పరాశక్తియే నన్నావహించి గీతాప్రవచన వ్యాఖ్యానాదులను గావించుగాక !! ఆ మహారస పూర్ణస్వరూపిణి నా లేఖిని ద్వారా రసప్రవాహములను వర్షింపజేయును గాక !! ఆ విశ్వమహాకవిసమ్రాట్టు నా జిహ్వేంద్రియముపై నిల్చి గంగాస్రవంతి భంగి దివ్యవాక్యామృతములను ప్రవహింపజేయును గాక!! 'మూకం కరోతి వాచాలం' భగవానుని దయ యున్నచో మూగవాడుకూడా వేద వేదాంగ సారమును గంభీరముగా ప్రవచనము చేయగలడు. ఆమహామహుని కరుణాలేశము లేకున్నచో మహాపండితుడు గూడ మూగవాడే యగునుగదా! అట్టి కరుణానిధి యగు పరమానంద మాధవుని దివ్యపాదారవిందముల నాశ్రయింతును.

జ్ఞానభాండారమగు భగవద్గీత సర్వప్రపంచమునకు జ్ఞానజ్యోతి. సర్వమతమహాపండితుల సమక్షములో అమెరికా ఖండమందు 'గీత'ను గూర్చి గానము చేయుచు వివేకానంద యతీశ్వరుడు 'న భూతో న భవిష్యతి' అని గానము చేసియున్నాడు. అనగా 'గీత'వంటి ఉత్తమో

త్తమ మహాకావ్యరాజము ఏ దేశములోను - ఏ భాషలోను గత యుగ ములయందు జన్మించి యుండలేదు. 'గీత' వంటి పుణ్యగ్రంథము వర్త మానకాలమున ఏ భాషలోను ఏ దేశములోను గానరాదు. ముందు రానున్న యుగములయందు గూడ 'గీత' వంటి మహాత్తర పుణ్య గ్రంథము ప్రభవింప బోదని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

పుణ్య భారతవర్షమున భగవద్గీత కల్పవృక్షమై-కామధేనువై చింతామణియై విరాజిల్లినది. ఇది భారతీయుల పుణ్యవిశేషము. పుణ్య గీతామృతధారలు వర్షించిన భారతావనిలో బుట్టిన మన మందర మును ధన్యులము! మన మంపరమును ఆ వేదసాహిత్యమునకు వార సులము. మన రక్తనాళములలో తేజోనిధులగు మహర్షి పుంగవుల దివ్యరక్తము ప్రవహించుచున్నది. సర్వప్రపంచమునకు 'గీత' జ్ఞాన జ్యోతియై భాసిల్లుచున్నది.

వర్తమాన యుగపురుషుడు - భారత భాగ్యవిధాత సత్యా హింసల దివ్యమూర్తిగా ఖండఖండాంతరములచే ప్రశంసల నందిన పూజ్యబాపూజీ 'గీత'ను గూర్చి భాషించిన మధురవాక్యముల నాల కింపుడు. ఆదివ్యవాణి మీకు తేజస్సును ప్రసాదించుగాత! ఆ యమర వాణి మీలో నిద్రాణమైయున్న ఆధ్యాత్మికశక్తిని మేల్కొల్పును గాక !

**Those of you who know Sanskrit should to-morrow, if possible today buy Bhagavad Geeta and begin to read the book. Those of you who do not know Sanskrit must learn Sanskrit, if only for the sake of 'Geeta'. My friends, I tell you that Geeta contain treasures of knowledge which yon have not seen what ever.'**

'మీలో సంస్కృతభాష వచ్చినవా రున్నయెడల, రేపటిరోజు ననే - కాదు కాదు, సాధ్యమయినచో ఈ దినముననే పవిత్రమగు

ఈసందర్భమున వినోబాజీ తన ప్రవచనములో నొక చక్కని యుదాహరణమును ఇచ్చియున్నారు.

ఒక న్యాయాధికారి కలడు. ఆతడు మహాబుద్ధిశాలి. న్యాయ శాస్త్రానుసారముగ నిందితులను విచారించి వారికి శిక్షలను విధించు చుండును. తన స్వహస్తములతో వందలకొలది నిందితులకు ఉరిశిక్షలను విధించినాడు. ఆతని చేయి వణకలేదు. తీర్పు వ్రాయునపుడు కన్నులు చెమ్మగిల్లలేదు. కలము జారలేదు.

ఒకనాడు ఆతని కుమారునిపై హత్యానేరము మోపబడి విచారింపబడెను. ఆతనికి ఉరిశిక్షను న్యాయశాస్త్రప్రకారము విధించవలసియున్నది. న్యాయాధికారి కలమును చేబూని తీర్పు వ్రాయసాగినాడు. కాని కలము కదలుటలేదు. నేత్రములు చెమ్మగిల్లినవి. అర్జునుని గాండీవమువలె ఆతని కలము జారిపోయినది. కారణము పుత్రమోహ మాతనిలో నావహించినది. మరణదండమును వ్రాయజాలక పోయినాడు. తన ధర్మపతనమును తా నంగీకరింపక 'ఆ ఉరిశిక్ష నాగరికలక్షణము కా దనియు, దానిని రద్దుచేయుట న్యాయశాస్త్రము యొక్క విధి యనియు ఏమేమియో చెప్పసాగెను. అర్జునుడును ఇదియే రీతిని పలుకసాగినాడు కదా!

ఈ ప్రజ్ఞావాదములను భగవానుడు ఖండించుచు తత్త్వోపదేశ మును ప్రారంభించుచున్నాడు.

మానవునకు దుఃఖమును బాధను కలిగించునది 'మమకారమే' గాని వస్తువియోగము కాజాలదు. దీనికి రెండు నిత్యజీవితోదాహరణ ములను మనవి చేసెదను.

అణువుకంటెను మిక్కిలి సూక్ష్మమైనవాడు మఱియు స్థూలపదార్థము లన్నిటికంటెను మహాస్థూలస్వరూపుడు. భగవద్గీతా గ్రంథవిషయము గూడ నంతియే. గీతవంటి మిక్కిలిసూక్ష్మగ్రంథము, సమగ్ర సంపూర్ణ గ్రంథము ప్రపంచములో మరియొకటి లేదు. ఏడునందల శ్లోకములు మాత్రమే గలిగి చిన్న అగ్గిపెట్టెలో పట్టగల చిన్నగ్రంథ మిది. లక్షల కొలది వ్యాఖ్యానములతో రసపుష్టితో మహాబృహత్తమమై, క్షణ క్షణమును పెరిగిపోవుచున్న మహాకావ్య మిది. వామనుని విశ్వరూపమువలె ఇంతింతయై, మరియు తానింతై, విశ్వభాండార మంతయు నిండిన విశ్వగ్రంథ రాజమే 'భగవద్గీత'.

భారతపుణ్యోద్యానమున విలసిల్లిన కల్పవృక్ష మిది!! ఆ మనోహర కల్పవృక్షచ్ఛాయలయందు సుఖాసీనులై సుస్థిర శాంతి సుఖానందములను బొందుడు.

## 2. గీతామాతకు పూజాపుష్పము

నేను గీతాప్రవచనము చేయుచున్న సమయమున ఒక నారీమ తల్లి యిట్లు ప్రశ్నించెను."స్త్రీలు భగవద్గీతను చదువరా దని కొంద రందురు. సాధువులును సన్యాసులును మాత్రమే దానిని ముట్టుకొన నర్హులని మరికొంద రందురు. మడిబట్టతోనో,పట్టుపంచెను ధరించియో మాత్రమే గీతను చదువవలయునని యింకొకరు పలికెదరు. బాలురును, బాలికలును, యువతీయువకులును గీతను చదివినచో సన్యాసులగుదురని యింకను కొందరు నుడువుదురు. అంగన్యాస, కరన్యాసములతో, గురూపదేశములతో మాత్రమే గీతను చదువవలయుననియు లేనిచో ప్రమాదములను గలిగించుననియు బెడిసికొట్టుననియు కొందరు చెప్పుచుందురు. ఈ విషయములో భగవంతుని యుద్దేశమేమియో తెలిపెదరా ?"

గీతాగ్రంథ పఠనాదులనుగూర్చి ఈరీతిగానే చెప్పుచున్నవా రింకను మన సంఘములో గానవచ్చుచునే యున్నారు. గీతను చదువుటకు ప్రతివారును అర్హులే. స్త్రీ పురుష భేదముగాని, బ్రాహ్మణా బ్రాహ్మణభేదముగాని, పండిత పామర తారతమ్యముగాని, వయోగత తారతమ్యములుగాని పాటింప నవసరము లేదు. ప్రారబ్ధకర్మములచే బాధపడువా రందరును గీతామాత పాదముల నాశ్రయింపుడని భగవానుడు చెప్పినాడు. మనకు జన్మము ప్రారబ్ధమువలననే గలిగినది కదా. కావున మానవులై పుట్టినవా రందరును గీతాపఠనకు శ్రవణమునకును అర్హులే. అన్నము తినుటకు అర్హు లెవరు? – ఆకలి గలవా రందరును – మంచినీరు త్రాగుటకు అర్హు లెవరు? – దాహముగలవా రందరును – ఔషధము తీసుకొనుటకు అర్హు లెవరు? రోగములతో బాధపడువా రందరును – గీతాపఠనకు అర్హు లెవరు? జరా దుఃఖ తాపత్రయములతో బాధపడువా రందరును –

భగవాను డిట్లు పలుకుచున్నాడు.

"ఇదం తే నాతపస్కాయ, నా భక్తాయ కదాచ న
నచా శుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్య సూయతి"

(అ 18 – శ్లో 67)

తపశ్శీలత లేనివానికి – భక్తిభావము లేనివానికి – గురుసేవా నిరతి లేనివానికి – భగవంతునియెడ ద్వేషభావము గలవానికిని గీతాబోధ తగదు.

ఎట్టివారికి గీతాబోధ తగదో భగవానుడు చెప్పినాడు. ఇందు పండిత పామరు లని గాని, బ్రాహ్మణాబ్రాహ్మణు లని గాని – స్త్రీ పురుషులని గాని– బాలవృద్ధు లనిగాని గృహస్థుడు, సన్యాసియనిగాని భేదభావములను భగవానుడు తెలుపుటలేదు. మనమేల యిట్టి సంకుచిత భావములను కలిగియుండవలెను.

ఇట్టి సంకుచిత స్వార్థభావమువలననే భారతీయ సంస్కృతి దిగజారుచున్నది.

గీతాదేవిని ఆశ్రయించుటకు గల అర్హతలు ఏకాగ్రమగు చిత్తము, మరియు భక్తి.

ఏకాగ్రచిత్తమునకు ఒక ఉదాహరణమును తెలిపెదను.

ఒకప్పుడు హిందూ మహమ్మదీయులకు పోరాటము గలిగినది. ఆ యుద్ధములో ఒక బాణము ఒకానొక మహమ్మదీయ ఫకీరు కడుపులో గ్రుచ్చుకొన్నది. పాప మావ్యక్తి తీవ్రముగ బాధను పొందుచుండెను. వైద్యుడు వచ్చి పరీక్షించెను. బలవంతముగ బాణమును లాగివేసినచో ప్రమాదము రాగలదని చెప్పెను. అప్పుడు అచ్చట నున్న ఆతని మిత్రు లిట్లు పలికిరి. 'వైద్యమహాశయా, ఈ ఫకీరు మహాభక్తుడు. సాయంకాలము నాలుగు గంటలకు ఈయన నమాజు చేసికొనును. అప్పు డీయనకు శరీరస్మృతియే యుండదు. అప్పు డీయన కడుపులోని బాణమును తీసివేయవచ్చును.'

సరిగా నాలుగుగంట లగుసరికి ఆ ఫకీరు ప్రార్థనలో నిమగ్నుడాయెను. ఆయనకు బాహ్యాస్మృతియే లేదు. వైద్యు డాబాణమును తీసివేసి చికిత్స గావించి కట్టుకట్టెను. ఈ విషయమే ఆ ఫకీరునకు తెలియదయ్యెను. ఎంతటి ఏకాగ్రత! అట్టి ఏకాగ్రచిత్తమే కావలయు నని గీత ప్రబోధించుచున్నది.

నా మిత్రులగు శ్రీరామతీర్థస్వామి ఒకనాడు ఇట్లు నాతో చెప్పిరి. ఏకాగ్రచిత్తముయొక్క ఆ యుదాహరణము నన్ను ముగ్ధుని గావించినది. దానినే దిగువ నుదాహరించుచున్నాను.

ఆంధ్రదేశములో గుంటూరుమండలములో నొక మహాపండితు డుండెడివాడు. ఆయన శతాధిక గ్రంథకర్త. మహాతత్త్వవేత్త. భగవద్గీతకు సంస్కృతభాషలో అద్భుతమగు వ్యాఖ్యానమును రచించిన పుణ్యమూర్తి. ప్రారబ్ధవశమున ఆయన వీపుపై రాచకురుపు వేసినది. వైద్యులు పరీక్షించి, శస్త్రచికిత్స చేయవలయునని చెప్పిరి. అందులకుగాను మత్తుమందు నీయవలసియుండెను. ఆ మహాపండితుం డిట్లు పలి

కెను. 'నేను గీతకు వ్యాఖ్యానమును వ్రాసుకొనుచుందును. మీరు శస్త్రచికిత్స చేయుడు.'

ఆయన ప్రసన్న శాంత గంభీరమూర్తియై ఏకాగ్రమగు చిత్తముతో గీతాభాష్యము వ్రాయుచుండెను. శస్త్రచికిత్స పూర్తియగు వరకును ఆయన యట్లే యుండెను.

ఏమి ఆ ఏకాగ్రచిత్తము! ఆ మహాకవిచంద్రుడు స్వర్గీయ బెల్లంకొండ రామారాయ కవిచంద్రుడు.

గీతా పారాయణమునకు ముఖ్యముగా కావలసినది భక్తి భావము. అది లేనిచో మిగిలిన వెన్నియున్నను వ్యర్థమే యగును. ఎన్నియున్నను భక్తిభావము లేనిచో పారాయణఫలము శూన్యము. ఒక మనోహరమగు ఉదాహరణముతో మీ కీవిషయమును సువ్యక్తము గావించెదను.

అది కురుక్షేత్ర పుణ్యస్థలము. అందొక వేదబ్రాహ్మణుడు ప్రతి దినమును గీతా పారాయణము చేయుచుండెను. ఆయనకు సంస్కృత భాషా ప్రవేశము లేదు. వ్యాకరణ శాస్త్రమురాదు. అందుచే తప్పులతోను ఉచ్చారణ దోషములతోను పారాయణమును సాగించుచుండెను. ఆయన నేత్రములనుండి పారాయణ కాలమంతయు బాష్పములు జలజల రాలుచుండును. అచ్చటకు వచ్చుచున్న పండితులు, బ్రాహ్మణులు మున్నగువా రాతనిని చూచి పరిహాసముచేయు చుండిరి. 'తప్పులతో పారాయణము చేయుచున్నావు మహాదోషమని నిందించువారు కొందరు, 'బెడిసికొట్టు' నని బెదరించువారు మరి కొందరు.

కాని ఆ పారాయణశీలుడగు బ్రాహ్మణుడు వారి బెదరింపులను గాని నిందలను గాని పరిహాసములను గాని లక్ష్యపెట్టక తదేకధ్యానముతో పారాయణమును సాగించుచునే యుండెను. ఒకరోజున పుణ్యమూర్తియగు శ్రీ చైతన్యస్వామి ఆ ప్రదేశమునకు వచ్చుట తటస్థిం

చెను. ఆయన వెంట చాల మంది పండితులు కవులు బ్రాహ్మణులు వచ్చిరి.

శ్రీ చైతన్యుడు బ్రాహ్మణుని గాంచి యిట్లు పలికెను. 'మహాశయా ఏమి ఈ పారాయణ విధానము, తప్పులతో ఉచ్చారణ దోషములతో గీతను బఠించుచున్నారే, మీ నేత్రములలో నుండి కన్నీరు కారుచున్నదే, ఏమి విశేషము ?'

ఆ గీతాపాఠకుడు శ్రీచైతన్యునకు నమస్కరించినాడు.'అయ్యా నాకు పాండిత్యమురాదు. సంస్కృతములో ప్రవేశము లేదు. శ్రీకృష్ణ పాదారవింద భక్తియే నాకు గల సమస్తార్హతలును.'

నేను గీతాగ్రంథమును విప్పి పారాయణమును ప్రారంభింతును. వెంటనే నాకన్నుల యెదుట ఒక మహాదివ్యస్యందనము గోచరించును. ఆ రథము బంగారుకాంతులతో చూడ శోభితమై యుండెను. ఓహో ఆ మహారథమునకు తెల్లని నాల్గుగుఱ్ఱములు కట్టబడి మంగళకరములై శోభిల్లుచున్నవి. ఆ దివ్యరథముపై కపిధ్వజము తాండవించుచున్నది. ఆ మహారథము యొక్క మధ్యభాగములో కోటి సూర్యుల దివ్యకాంతులతో, కరుణారసము వర్షించు నేత్రములతో, చిరునవ్వు లొలుకు ముఖపద్మముతో శ్రీకృష్ణభగవానుడు ప్రకాశించుచున్నాడు. ఆ దివ్యమూర్తి సందర్శనముతో నాశరీరము రోమ హర్షమును చెందుచున్నది. ఆ మహాపురుషుని దివ్యపాదారవింద సన్నిధానములో అర్జునుడు శరణాగతిని బొంది ప్రార్థించుచున్నాడు. ఆ మహా సన్నివేశము తిలకించునపుడు నా కన్నుల నుండి ఆనంద బాష్పములు జలజల వర్షించుచున్నవి. నేను గీతాగ్రంథ పారాయణమును గావించునంతసేపును ఆ దివ్యదర్శన మహాభాగ్యము కలుగుచునే యుండును. ఇదియే నా పారాయణము. ఇంతకు మించి నాకేమియును తెలియదు.

ఆ మాటల నాలకించినంతనే శ్రీ చైతన్యస్వామి ఆ బ్రాహ్మణుని ఆలింగనము గావించుకొని 'ధన్యుడవు నీవు, మహాధన్యుడవు. నిత్యమును శ్రీకృష్ణ సాక్షాత్కారమును బొందు నీ గీతాపారాయణము సర్వశ్రేష్ఠమైనది' అనెను. అప్పటనున్న పండితులను గాంచి శ్రీ చైతన్యు డిట్లు పలికెను. 'ఓ పండితులారా. మీరు గీతాపారాయణమును గావించునపు డెన్నడైనను నిట్టి అనుభూతిని బొందినారా? మీ కన్నులనుండి ఆనందబాష్పము లిరీతిగా వర్షించినవా?

అట్లు కాకున్నచో మీ పారాయణములు నిష్ఫలములు. మీ పఠనములు నిస్సారములు. మీ పాండిత్యములు వ్యర్థములు. 'భగవంతుని వ్యాకరణ శాస్త్రముతో బంధింపలేము. పాండిత్యప్రభావముతో కట్టివేయలేము. పవిత్రమగు భక్తిపాశముతోనే భగవంతుడు బంధింపబడును. కఠిన తపశ్చర్యలకు గాని యోగీశ్వరులకు గాని పట్టుగొనరాని పరమేశ్వరుడు యశోదమ్మ భక్తిపాశములతో కట్టబడి ఒకనాటికి బంధింపబడినట్లు శ్రీ పోతనామాత్యులు భాగవతములో వర్ణించినాడు.

కం॥ చిక్కడు క్రతువుల వ్రతముల
చిక్కడు దానముల శౌచ శీల తపములన్
జిక్కడు యుక్తిని భక్తిని
చిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ.

గీతా పారాయణమునకు నిష్కల్మష మగు చిత్తము, పవిత్రమగు భక్తి, ముఖ్యములగు అర్హతలు.

అంతమాత్రముచేత దోషములతో పారాయణము చేయుమని ఈ కథా ఘట్టము హెచ్చరించుటలేదు. ముఖ్యముగా, పెద్దల నాశ్రయించి క్రమబద్ధముగా శాస్త్రవిహితముగా దోషరహితముగా, పారాయణము గావించుటే కర్తవ్యము. ఒకవేళ నట్టి సౌకర్యములును సావకాశములును లభించక పోయినప్పుడు పరమ పవిత్ర భక్తిభావ

ముతో గీతా పారాయణమును గావించిన ఆ పవిత్ర జ్ఞానాగ్నిలో సర్వదోషములును భస్మములై పోవును.

గీతా మాతకు పూజా పుష్పములు 'భక్తిశ్రద్ధలు'. పాండిత్య వ్యాకరణములుగావు.

> 'ఎచ్చట గీతాపఠనము, శ్రవణ ప్రవచనములు
> జరుగుచుండునో అచ్చట నేను విలసిల్లుచుందును.
> నేనే కాదు సర్వదేవతలును ఋషులును యోగు
> లును పన్నగులును, గోప గోపికా బృందము
> లును నారదోద్ధవులును అచ్చటనే విలసిల్లుచు
> సహకరింతురు.'

కావున భక్తిశ్రద్ధలతో నిరంతరమును గీతను పఠింపుడు-శ్రవణము చేయుడు. ప్రబోధము సేయుడు. ఇంతికంటెను భగవానునకు నీవుచేయు ప్రీతికరమగు కార్యము లేదు.

'గీతా మే చోత్తమం గృహం' ఏ గృహములో భగవద్గీత గలదో ఆ గృహమే పవిత్రమగు గృహము'

మీగృహములయందు గీతా గ్రంథమును నెలకొల్పుడు. నీ మేజా బల్లపై 'గీత' వెలయు గాక! నీ జేబులో గీత వసించుగాక! నీ పడకగదిలో పార్థసారథి దివ్యమూర్తి ప్రకాశించు గాత.'

ఎచ్చట గీతా పఠన పాఠన శ్రవణాదులు జరుగుచుండునో ప్రయాగాది పుణ్యక్షేత్రములు అచ్చటనే నెలకొని యుండును. ఆ ప్రదేశము పాడిపంటలతో, పైరుపచ్చలతో, భోగభాగ్యములతో, సిరిసంపదలతో తాండవించు చుండును. కావున గీతామాతను భక్తిశ్రద్ధ లను పూజాపుష్పములతో నర్చించి, పూజించి, ధ్యానించి, జపించి, మహావీరులై విజయపరంపరలతో విలసిల్లుదురు గాక!

## 3. భగవానుడే నీకు సారథి
## God is only thy Charioter.

సర్వలోకములను పరిపాలించు పరమేశ్వరుడు - తన అపార కరుణా కటాక్ష వీక్షణముల చేత 'సకల ప్రాణికోటులకును సుఖశాంతులను ప్రసాదించు పరంజ్యోతి స్వరూపుడు అర్జునునకు సారథియై గుఱ్ఱములను తోలుచున్నాడు. ఏమి ఆశ్చర్యకర సన్నివేశ మిది- విశ్వసారథియే పార్థసారథియైనాడు - ఆ మహాసారథియే నీకును రథసారథియై నీ జీవిత రథమును నడుపగలడు. అర్జునుడు ఆహ్వానించినట్లుగా నీవును ఆ మంగళస్వరూపుని త్రికరణశుద్ధిగా నాహ్వానింపుము. శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు రథసారథి యెట్లు కాగలిగినాడో తెలిసికొందము. ఈ సందర్భమున గీతతో సంబంధము గల మహాభారత పుణ్య కథను కొలదిగా తెలిసికొని ఆనందింతము గాక.

విశ్వ సాహిత్యములో మహాభారత కావ్యముయొక్క స్థానము మహా విశిష్టమైనది. వ్యాసభగవానుని అమృత కవితా సృష్టి కిది మహాలంకారము. వేదాంతుల కిది మహా వేదాంతసార ఖండము. పౌరాణికుల కిది మహాపురాణము. ధర్మ కోవిదుల కిది మహాధర్మ శాస్త్రము. కవితా పిపాసువులకిది కవితామృత రత్నాకరము. రాజకీయ వేత్తల కిది మహారాజ నీతి ప్రణాళికా రహస్య గ్రంథము. వేయేల - మహాభారతము ప్రకృతి యొక్క సంపూర్ణ ప్రతిబింబ స్వరూపము. ఇట్టి పవిత్ర మహాభారతంబున భీష్మ పర్వమున విలసిల్లుచున్నది విశ్వమంగళస్వరూపిణి యగు గీతావాణి!

మరియొక విశేషము - మహా భారతము పదు నెనిమిది పర్వములు - కురుక్షేత్ర యుద్ధమున పాల్గొన్న అక్షౌహిణుల సంఖ్యయు పదు నెనిమిది - మహాభారత యుద్ధము జరిగిన దినముల సంఖ్యయు పదు నెనిమిది - భగద్గీత యొక్క అధ్యాయములును పదు నెనిమిది -

స్థితప్రజ్ఞ లక్షణములు వర్ణితములగు శ్లోకముల యొక్క సంఖ్యయు పదునెనిమిది - ఈశావాస్యోపనిషత్తు నందు గల మంత్రములును పదునెనిమిది - మహా పురాణములును పదునెనిమిదియే. 'పదునెనిమిది' అను సంఖ్య మహాపవిత్రమయినది. సంఖ్యాశాస్త్రానుసారముగా 'సోఽహం' అను మహా మంత్రార్థమును సూచించును.

కురుక్షేత్ర మహా యుద్ధమునకు గల పూర్వ కథాసందర్భమిది. ధర్మరాజు రాజసూయ యాగమును మహా వైభవముగా చేసినాడు. అర్జునుడు సకల రాజన్య లోకములను జయించి కప్పమును స్వీకరించి ధన కనక వస్తువాహన విశేషములను ధర్మరాజు పాదముల సన్నిధిని గుమ్మరించినాడు. ఎక్కడ గాంచినను పాండవుల యొక్క ప్రతిభా విశేషగీతలే. ఏ మూల నాకర్ణించినను పాండుపుత్రుల యశోమయ దివ్యగాథలే. ఏ మూల చూచినను పాండుకుమారుల విజయ చిహ్నములే. పాండవుల ఈ మహా వైభవము, ఈ సువిశాల కీర్తిసంపదలు, దుష్టబుద్ధిగల దుర్యోధనునకు దుస్సహములయ్యెను. అసూయా మాలిన్యము రాజరాజు హృదయము నావరించినది. అసూయాపూరితుని హృదయము విషపూరితము గదా! 'అసూయ క్షయవ్యాధి' వంటిదని పెద్దలందరు. కాని ఈ దుర్గుణము క్షయవ్యాధి కంటెను, మహాభయంకరమైనది. క్షయవ్యాధి తా నావహించిన వానిని మాత్రమే వేధించి తుదకు సర్వనాశనము గావించును. 'అసూయా మహావ్యాధి' ఎవరిని ఆవహించునో వానిని మాత్రమే గాదు పుత్ర మిత్ర బాంధవ పరివార సమేతముగా సర్వనాశనము గావించును. ఇందుల కీ మహా భారతయుద్ధమే మహా నిదర్శనము. అందువలనే 'అసూయను' రాక్షస లక్షణముగా గీత వక్కాణించినది. ఎన్ని సుగుణములున్న నేమి - 'అసూయ' యను నీ చెడ్డగుణ మొక్కటి యుండినచో మానవుడు సర్వవిధముల పతనమును బొందును. కావుననే 'అసూయా రహితుడవు గమ్ము' అని గీత మరల మరల హెచ్చరించును.

అసూయా విషముతో గూడిన దుర్యోధనుని చిత్తములో విషప్రాయాలోచనములే బయలుదేరినవి - అధర్మము వలన నగుగాక, అన్యాయము వలన నగుగాక, అమంగళకర కార్యముల వలన నగుగాక-పాండవులను రాజ్యభ్రష్టులనుగాచేసి పతనముగావించ వలయుననియే దృఢసంకల్పము జేసినాడు. దుష్టచతుష్టయము గుమి గూడినది. దురాలోచనములు చెలరేగినవి.

మాయజూదము ఏర్పాటు గావింపబడినది. ధర్మబుద్ధిగల యుధిష్ఠిరుడు పారిబ్బనశమున నందు ప్రవేశించినాడు. ఎంతటి మహాత్ముడైన నేమి? ఏదియో ఒక చిన్న దోష గుణము ఉండకపోదు. గదా! మాయాద్యూతమున ధర్మరాజు భార్యాసమేతముగా పూర్తిగా ఓడిపోయినాడు. మహాభారత మీ కథా వృత్తాంతము నంతను మనోహరంగా వర్ణించినది. తుదకు ధృతరాష్ట్రుని సమక్షమున పాండవులు పండ్రెండు సంవత్సరములు వనవాసమును, ఒక్కయే డజ్ఞాత వాసమును జేసివచ్చినచో వారి రాజ్యభాగము వారి కిచ్చి వేయబడు నట్లుగా నిర్ణయింపబడినది. పదమూడేండ్లును ప్రశాంతముగా గడిచి పోయినవి. నిర్ణీతకాలానంతరము తమ రాజ్యభాగమును తమ కీయ వలసినదిగా పాండవులు కోరినారు. కృష్ణుని రాయబారము జరిగినది. 'వాడిసూది మొనమోపిన నేలయైనను' పాండవుల కిచ్చుటకు దుర్యోధనుడు నిరాకరించినాడు. యుద్ధ మనివార్య మయినది. ఉభయులును యుద్ధమునకు తమ తమ బలములను గూర్చుకొనసాగిరి.

ఒకనాడు దుర్యోధనుడు ద్వారకకుపోయి శ్రీకృష్ణుని దర్శనము కొరకు వేచియున్నాడు. అప్పుడు కృష్ణుడు నిద్రపోవుచున్నాడు. అప్పుడు కృష్ణుడు నిద్రపోవుచున్న కారణముచేత ఆయన శిరోభాగమున నున్న యొక పీఠముమీద రాజరాజు సుఖాసీనుడైనాడు. కొంచెము సేపటిలో అర్జునుడుకూడా అచ్చటికి వచ్చినాడు. నిద్రించుచున్న భగవానుని పాదసన్నిధిని వినమ్రుడై నిలచియున్నాడు. కొలది

నిమిషములకు శ్రీకృష్ణుడు నిద్రనుండి మేల్కొనినాడు. కన్నులు తెరచిన వెంటనే పాదముల సన్నిధిని వినమ్రుడై నిలచియున్న పార్థుని తొలిసారిగా చూచినాడు. తలను పైకెత్తి చూచుసరికి రాజరాజు గోచరించినాడు. ఇరువురతోడను కుశలప్రశ్నలను వేసినాడు గోపాలుడు. చక్రవర్తి పార్థుడు వచ్చిన కారణమును గూర్చి ఆ లీలామానుషమూర్తి వారల నిరువురను ప్రశ్నించినాడు. 'రాబోవు కురుక్షేత్ర యుద్ధములో నీ సహాయమును అర్థించి వచ్చినార' మని యిరువురును జవాబు చెప్పిరి.

అంతట భగవానుడు చిరునవ్వు నవ్వుచు నిట్లు పలికెను. 'సరియే, మీరిరువురకును తప్పక సహాయము చేయవలయుననియే నా యాకాంక్ష. నావద్ద యుద్ధమునందు ఆరితేరిన మహావీరసైనికులు నవకోటి నారాయణు లున్నారు. వా రందరను ఒక భాగముగా జేసెదను. నేనొక్కడను వేరొక భాగముగా నుందును. నేను మాత్రము యుద్ధము చేయను.

సలహాదారుడుగా మాత్రముగా వర్తింతును. మీ కేభాగము కావలయునో కోరుకొనుడు. అయితే మీ యిరువురిలో చిన్నవాడు పార్థుడుకదా, కనుక అతడే ముందుగా కోరుకొనదగినవాడు. నేను కూడ ముందుగా చూచినదియు పార్థునే.

ఈ పలుకులు వినినంతనే దుర్యోధనునకు చాల నిరాశయు, చీకాకును గలిగించినవి. మహా - నల్లవాడు నన్ను మోసగించుచున్నాడు. మహాసైన్యము నంతను పార్థున కీయవలయు నను తలంపుతోనే ముందుగా నాతని కోరుకొమ్మని పలికినాడు. ఇక నిరాయుధుడును, ఉనయోగ రహితుడును నగు నీ నల్లగొల్లవాడు నాకెందులకు?

ఇంతలో పార్థుడు కృష్ణునకు నమస్కరించుచు 'నీవే నాకు కావలయును' అని పలికెను. ఈ పలుకు లాలకించి నంతనే దుర్యో

ధనునకు మితిమీరిన సంతోషము కలిగెను. మహాసైన్యమును వెంట బెట్టుకొని రాజరాజు వెడలిపోయెను.

అనంతరము శ్రీకృష్ణుడు పార్థా, 'నీవెంత తెలివి తక్కువ వాడవోయి అనవసరముగా నన్నే కోరుకొంటివి? మహాసైన్యమును నీవు తప్పక కోరుకొనునట్లు చేసితిని. కాని నీవు పొరపాటుగా వర్తించితివి' అని పలికెను. పార్థు డంత నిట్లు పలికెను. 'శ్రీకృష్ణా, నీవు సర్వశక్తి సంపన్నుడవు. మహాప్రభుడవు, నీవు మాపక్షమున నుండ, తప్పక విజలక్ష్మి మమ్ములనే వరించును గదా! మహాసైన్యములు ఏమి చేయగలవు? నీ పవిత్ర కరుణా కటాక్ష వీక్షణమే మాకు కావలసినది. నీవే మాకు అండ. నీవే మాకు ఆశ్రయము'

'ప్రభూ! 'ఈసందర్భమున నాకొక చిన్న విన్నప మున్నది. ఈ కురుక్షేత్ర సంగ్రామ రంగమున నీవు నారథమునకు సారథివై యుండ వలయునని నా యాకాంక్ష' అని పార్థుడు వినయముతో, భక్తితో పలికినాడు. భగవానుడు సర్వాదా భక్తపరాధీనుడు గదా! ఆయన భక్తులపాలిటి కల్పవృక్షము. కామధేనువు, చింతామణి.

**'Ask and it shall be given, knock and it shall be opened'** అని బైబిలు వచించును.

భక్తిపూర్వకముగా వాంఛింపుము. భగవానుడు నీకు తప్పక దానిని ప్రసాదించును. ప్రేమ పురస్సరముగా స్వర్గద్వారమును తట్టుము. అది వెంటనే తెరువబడును.

పార్థునివలె నీవును ప్రేమ, భక్తి పురస్సరముగా భగవానుని ప్రార్థింపుము. భగవానునితప్ప అన్యమును దేనిని వాంఛింపకుము. ఆశ్రయమును ఆసక్తియు నొక్కటిగా నుండవలయును. ఆ మహాసారథి నీజీవిత సారథియై సర్వసుఖశాంత్యానందములను నీపై వర్షించును.

## 4. సంజయుని ద్వారా గీతావాణి

### Voice of Gita through Sanjaya.

కురుక్షేత్ర యుద్ధారంభమునకు ముందుగా వ్యాసభగవానులు ధృతరాష్ట్రుని వద్దకువచ్చి 'నీకు కురుక్షేత్ర మహాసంగ్రామమును చూడవలయునని యున్నదా? అచ్చటి విషయములను వినవలయునని కోరిక యున్నదా? అట్లు వాంఛింతు వేని నీకు దివ్య దృష్టియును దివ్య శ్రవణ శక్తియు ప్రసాదింతును' అని తెలిపెను. ధృతరాష్ట్రుడందు లకు అంగీకరింపలేదు. 'నా నేత్రములతో నావంశ క్షయమును నేను చూడజాలను. ఇదిగో ఇచ్చట సంజయు డున్నాడు. ఈయన మహా బుద్ధిమంతుడు - జితేంద్రియుడు. ఈయనకు ఆశక్తులను ప్రసాదింపుము ఆయన కురుక్షేత్ర యుద్ధమున జరిగిన విశేషములను చూచియు, వినియు, నాకు తెలియ చెప్పగలడు.' అని ధృతరాష్ట్రుడు పలికెను. అట్లే వ్యాస భగవానుడు సంజయునకు దివ్య దృష్టిని ప్రసాదించి నాడు. అచ్చట జరగిన విషయముల నన్నిటిని సంజయుడు చక్కగా చూడ గలిగినాడు. మనస్సులలో కలిగిన భావపరంపరలను గూడ గ్రహింప కలిగినాడు. వాటి నన్నిటిని ధృతరాష్ట్రునికి నివేదించినాడు.

భగవానుని గీతోపదేశము నంతను సంజయుడు విని ధన్యుడై నాడు. సంజయుడు అనగా 'చక్కగా ఇంద్రియములను నిగ్రహించిన వాడు' అని అర్థము. సంపూర్ణముగా ఇంద్రియ నిగ్రహాము గల వానికే భగవద్వాణి వినిపించును. వానికే భగవంతుని విశ్వరూప మును కానుపించును.

అట్టివానికే దివ్యదృష్టి కలుగును. ఈనాడు పాశ్చాత్య దేశము లలో టెలివిజన్ (**Television**) ప్రచారములోగలదు. శాస్త్రజ్ఞులు భౌతిక శాస్త్ర విజ్ఞానముచేత దీనిని నిర్మించినారు. ఈ యంత్రము ద్వారా ఇతర దేశములందు జరుగు కార్యములను మన మిచ్చట

చూడనచ్చును. సరియును ఈ దినములలో రేడియో (Radio) బహుళ ప్రచారము నందున్నది. యంత్రము యొక్క సాధనము చేత వేలకొలది మైళ్ళ దూరమందున్నను శబ్దములను వినగలుగు చున్నాము.

పూర్వకాలమునందలి భారతీయ మహర్షుల మానసికశక్తి అద్భుతమైనది. వారి మానసములే రేడియో సెట్లు మరియు టెలివిజన్ యంత్రములును నై యున్నవి. ప్రతిభా వంతులగు మహర్షులు దివ్య దృష్టిచేత భూలోకములోనున్న విశేషములనే గాక ఇతర లోకములలో గల విషయములను కూడ గ్రహింప గలిగిరి. చంద్రలోకములోను, సూర్యాది వివిధ గోళములలోను గల రహస్య విషయములను వారు గ్రహించిరి. వారు దివ్యదృష్టిచేత వర్తమానమును మాత్రమేగాక భూతకాలమును మరియు భవిష్యత్కాలమును గూడ చూడ గలిగిరి. వారి ప్రజ్ఞా విశేషములకు అవధిలేదు.

అట్టి వ్యాసాది మహర్షుల దివ్య సంతానము మనము. అట్టి ఋషీశ్వరులకు వారసులము మనము.

ఋషి ప్రోక్తమయిన దివ్యసారస్వతము మనది. ఋషీశ్వరులు పుట్టిన పవిత్ర దేశములో జన్మించిన మన మందరము ధన్యులము.

భగవద్గీత విలసిల్లిన దివ్య దేశము మనది. గీతాశ్రవణము చేత మన మందరమును పరిపూతుల మగుదుము గాత!

ఎన్నడో, ఎప్పుడో భగవచ్చింతన చేయవచ్చునని నీవు భావించవద్దు. ఇప్పుడే, ఈక్షణములోనే ఆధ్యాత్మిక దివ్య జీవన పథము నవలంబింపుము. ఈ సందర్భమున మానవ ప్రకృతిని చిత్రించుచు వ్యాస దేవుడు శాంతిపర్వములో నొక చక్కని కథాఘట్టమును చిత్రించినాడు. అంపశయ్యపై పరుండి, మహా తేజశ్శాలి యగు భీష్మ బ్రహ్మచారి ధర్మరాజునకీ కథను గానము చేయుచున్నాడు.

ధర్మరాజా, ఒక జలాశయములో మూడు చేపలు వసించుచు న్నవి. అందు మొదటి దాని పేరు దీర్ఘదర్శి. రెండవదాని పేరు ప్రాప్తకాలజ్ఞుడు. మూడవదాని పేరు దీర్ఘసూత్రుడు. దీర్ఘదర్శి, తన తన మిత్రులతో నిట్లు పలుకును. ఎండాకాలము రాబోవుచున్నది. ఈ జలాశయము ఎండిపోగలదు. జాలరులు వచ్చి వలలు పన్ని మన లను పట్టుకొన గలరు. కావున మన మిప్పుడు మరియొక పెద్ద జలా శయమునకు పోవుదము' అంత ప్రాప్తకాలజ్ఞుడిట్లు పలికెను. 'నీవు చెప్పినది. బాగుగానే యున్నది. కాని యింత తొందరగా మన మీ జలాశయమును వీడిపో నవసరము లేదు. ఒక వేళ జాలరులు వచ్చి నను వారి వలలను పడునైన నా కోరలతో కొరికి తప్పించుకొని పోవచ్చును. మూడవ చేప యిట్లు పలికెను. 'మిత్రులారా మీరు వెఱ్ఱివారు. ఎండాకాలము రానేరాదు. వచ్చినను నిందలి నీ రెన్న డును నింకిపోజాలదు. జాలరులు వచ్చినను బంధింపజాలరు. ఇది అసంభవము.

దీర్ఘదర్శి మిత్రుల మాటలను సరకుచేయక తాను మరొక పెద్ద జలాశయమునకు పోయి సుఖముగా నుండెను. రెండు మూడు రోజులలోనే జాలరులు వచ్చి వలలువేసిరి. కాని ప్రాప్త కాలజ్ఞుడు మిక్కిలి ఉపాయశాలి యగుటచే తప్పించికొని పారిపోయెను. పాపము దీర్ఘసూత్రుడు మాత్రము బంధింపబడి నాశనమును పొందెను.

ప్రపంచములోనున్న మానవులను మూడు వర్గములుగా వారి మానసిక స్థితులనుబట్టి విభజింపవచ్చును. ఈ కథలోని జలాశయమే సంసార సాగరము. అందలి జలములే ఆయువు. దీర్ఘదర్శివలె కొందరు తమ జీవితకాలమంతయు వ్యయమై పోవుచున్నదని విచారించి తత్ క్షణమే ఆత్మ విచారమునకు పూనుకొందురు. మరికొందరు బాల్య యౌవనములను వృథాగా గడిపి వృద్ధాప్యములో భగవచ్చింతనము గావింతురు. ఇక మూడవ తరగతి మానవులు జడస్వరూపులు. వారి

కెవ్వరు చెప్పినను వినరు. శాస్త్ర వాక్యములను మన్నింపరు. అహంకార మమకారబద్ధులై చరింతురు. అట్టి వారు నీర్ఘసూత్రునివలె మృత్యువు వాతబడి నశింతురు.

కావున చిన్నతనమునుండియు బ్రహ్మవిచారము చేయవలెనని యే గీతా శాస్త్రము ప్రబోధించుచున్నది.




---

## 5. ధర్మ క్షేత్రమగు కురుక్షేత్రము

### The battle-field of Kurukhetra - the field of righteousness.

గీతలోని మధురాతిమధురమైన తొలి శ్లోకము నాలకింపుడు.

'ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః

మామకాః పాండవాశ్చైవ కి మకుర్వత సంజయ' 'సంజయా! ధర్మభూమియై కురుక్షేత్రమునందు యుద్ధము చేయుటకై సమావేశమయిన నా కుమారులయిన దుర్యోధనాదులును, పాండురాజు సంతానమయిన ధర్మరాజాదులును ఏమి చేసిరో నాకు వివరించి తెలుపుము' అను ధృతరాష్ట్రుని వచనముతో భగవద్గీతా మహాకావ్యము ప్రారంభ మగుచున్నది. ఎంత గంభీరమగు ప్రశ్న? పవిత్రమగు 'ధర్మ' శబ్దముతో నీ కావ్య మారంభమగుచున్నది. దేనిచే సర్వమును ధరింపబడుచున్నదో అదియే ధర్మము. కురుక్షేత్రమును గూర్చి వివరింపుమని జిజ్ఞాసువులు కోరుచున్నారు. గాన దానినిగూర్చి కొలదిగా ముచ్చటించెదను. ఈ శ్లోకమునందు విరాజమానమగుచున్న గంభీరమగు ఆంతరంగికార్థమును గూడ మనము గ్రహింతము గాక.

'పంజాబు'లోని 'అంబాలా' అను పట్టణమునకు దక్షిణముగాను, ఢిల్లీ నగరమునకు ఉత్తరముగాను కురుక్షేత్ర మున్నది. ఇచ్చట కురు

క్షేత్రమను పట్టణము ఇప్పటికిని గలదు. ప్రతి సంవత్సరమును వేల కొలది యాత్రికులు ఆ పుణ్యభూమిని దర్శించుటకు వచ్చుచుందురు. దీనిపొడవు అయిదు యోజనములు. వెడల్పు గూడా అయిదుయోజనములే. యోజన మనగా ఎనిమిది మైళ్ళు. ఈ విశాల ప్రదేశము నందే భారత యుద్ధము జరిగినట్లు గ్రంథములు చెప్పుచున్నవి. కౌరవ పాండవులకు మూలపురుషుడైన కురువుచేత దున్న బడుటచేత దీని కా నామధేయము వచ్చినది. ఆ చోటనే ఇంద్రుడు అగ్ని, బ్రహ్మ, మున్నగువారు తపస్సు చేసి రనియు, అందుచే నిది 'పుణ్యభూమి' యనియు ఇందు మరణించువారు పుణ్యలోకమును బొందుదు రనియు చెప్పబడు చున్నది. ఈ పుణ్యస్థలముయొక్క ఇతర విశేషములును మీరు తెలిసికొన గోరినచో దయయుంచి మహా భారతము - నవపర్వమును - శతపథ బ్రాహ్మణమును తిలకింపగోరుచున్నాను.

బాహ్యమగు కురుక్షేత్ర యుద్ధమునుగూర్చి మాత్రమే గాక యథార్థమగు మానస కురుక్షేత్రము యుద్ధమును గూర్చియే ఈ 'తొలిశ్లోకము విశేషముగా వివరించు చున్నది. ప్రతి మానవుని మనస్సులోను కురుక్షేత్ర యుద్ధరంగ మున్నది. ప్రతిమానవుని మనస్సులోను కౌరవులును, పాండవులును గూడ నున్నారు దయ - ప్రేమ- సద్భావము - క్షమ - శౌచము మున్నగు గుణములే పాండవుల కుదాహరణములు. హింస - అసత్యము - అశౌచము - దర్పము మున్నగు గుణములే కౌరవ సైన్యముల కుదాహరణములు. బాహ్యమగు కురుక్షేత్ర యుద్ధము పదునెనిమిది దినములు మాత్రమే జరిగినది. కాని మన హృదయాంతరాళములయందు జరుగుచున్న కురుక్షేత్ర మహాయుద్ధము పదునెనిమిది దినములు మాత్రమేకాదు - మన జీవితాంతము వరకును జరుగుచునే యున్నది. ధర్మాధర్మములకును - సత్యాసత్యములకును న్యాయాన్యాయములకును మన

మానస రంగములలో జరుగుచున్న నిరంతర మహాయుద్ధమే బాహ్యమగు కురుక్షేత్ర మహాయుద్ధముయొక్క స్వరూపము.

బాహ్యముగా కురుక్షేత్రయుద్ధము వాస్తవముగా జరిగినే యుండును. కాని వ్యాసభగవానుఁడు మానవకోటి యొక్క అంతరంగిక యుద్ధమును ద్యోతకము చేయుటకే బహిరంగ యుద్ధమును సాధనముగా తీసికొని యున్నాడు.

మన శరీరమునకు క్షేత్రమని భగవద్గీత పేరుపెట్టినది. (ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మి త్యభిధీయతే. (అ 13 – శ్లో 1)



## 6. కురుక్షేత్రములో భగవానుడు

### Bhagavan in Kurukhetra.

భగవద్గీత మహావిశిష్టమైన కావ్యము. గీతామృతమును పానము చేసిన నరులు నారాయణ స్వరూపులగుదురు. గీతారసాయమును సేవించిన జనులు జనార్దను లగుదురు. ఇది జ్ఞానవిజ్ఞానములను బోధించు సమగ్ర కావ్యము. జ్ఞానమనగా శాస్త్రీయవిషయములను తెలిసికొనుట యని అర్థము. విజ్ఞాన మనగా అనుభవ పూర్వకముగా దానిని గ్రహించుట యని యర్థము. ఈ రెంటి సమన్వయమే సంపూర్ణ జ్ఞానము. గీతలోని ప్రతి యధ్యాయమును ఈవిషయమును బోధించును. సూత్రములను – నీతులను – బోధించు – కావ్యములు భారతీయ సాహిత్యమునందును – విదేశీయ సారస్వతములందును కూడ అనేకములు గలవు. కాని సూత్రమును అనుభవమును సమన్వయించుచు బోధించు దివ్య గ్రంథము భగవద్గీత యొక్కటియే. అందువలననే 'సర్వ శాస్త్రమయీ గీతా' అని ప్రశంసింపబడినది.

భగవద్గీతలోని ఈ తొలి అధ్యాయమును, రెండవ అధ్యాయమునందలి 10 వ శ్లోకమువరకును గీతాశాస్త్రమునకు పీఠిక యగు

చున్నది. భగవానుని దివ్యోపదేశముల కిది యుపోద్ఘాతము. గీతార్థ వివరణమున కియ్యది ఆధారము. శూరుడును, మహావీరుడును నగు అర్జునుడు శోకాకుల చిత్తుండై యుద్ధనిరాకరణమును గావించుట మనకు ఆశ్చర్యముగా గోచరించవచ్చును.

అదిగో కురుక్షేత్ర మహా యుద్ధ రంగము – పదునెనిమిది యక్షౌహిణుల మహా సైన్యము కోలాహలముచేయు చున్నది.

అదిగో గంగా నందనుండైన భీష్మ బ్రహ్మాచారి కౌరవుల పదునొకండక్షౌహిణులకు సర్వ సేనాధ్యక్షుడై మహాగంభీరముగా విలసిల్లుచున్నాడు. ఆ వంక ఏడు అక్షౌహిణులకు సేనానాయకుడై బుద్ధిశాలియగు ధృష్టద్యుమ్నుడు భాసిల్లుచున్నాడు. యుద్ధప్రారంభ దినమున ధృష్టద్యుమ్నుడు పాండవబలములను వజ్రవ్యూహముగా ఏర్పాటు చేసినాడు. దాని ముఖద్వారమున గదా పాణియై భీకరాకారముతో నిలబడి యున్నాడు భీమసేనుడు.

భీముని చూచినంతనే భయము కల్గెనో – లేక వ్యూహాకారమున నున్న కారణములచేతనో – మరి యేలను భీతిజెందెనో గాని దుర్యోధనుడు ద్రోణాచార్యులవద్ద కేగి పాండ సైన్యమును గూర్చి వర్ణించుచున్నాడు. మరియు పాండవ సేనలలోని విరాటాది మహావీరులను తెలుపుచున్నాడు. పిదప తన సేనలలో భీష్మ, ద్రోణ, కర్ణాది వీరులను గూర్చియు పలుకుచున్నాడు.

ఇంతలో గంభీరముగా సింహనాదముజేసి శంఖములను పూరించినారు. యుద్ధవాద్యములు మ్రోగింపబడినవి. కౌరవ బలములన్నియును యుద్ధమునకు సిద్ధముగా నున్నట్లు తెలుపబడినది.

ఆ సమయములో తెల్లని గుఱ్ఱము కట్టిన రథము – అది సామాన్య రథము కాదు – దేవతారథము – దానిపై నధిరోహించి యున్నారు కృష్ణార్జునులు. పాంచజన్యమును పూరించుచున్నాడు మాధవుడు. అదిగో! వెను వెంటనే గాండీవమును ధ్వనింప జేసినాడు

సవ్యసాచి. తోడనే కాశీకుమారులు విరాటాది మహావీరులును తమ తమ శంఖములను పూరించినారు. పాండవులు కూడా యుద్ధమునకు సిద్ధముగా నున్నట్లు బుజువైనది. అర్జునుడు గాండీవమును చేత బూని బాణప్రయోగమునకు సిద్ధముగా నున్నాడు. ఆశ్చర్యము-పరమాశ్చర్యము. భగవంతుని లీలలు అద్భుతములు. భగవానుడు పార్థుని హృదయాకాశమున విషాద మేఘముల నావరింప జేసి యాతనిని శోకాకులితచిత్తునిగా చేసి యాతనిని శరణాగతుని గావించి ఆతని ద్వారా పవిత్ర గీతా సందేశమును విశ్వమునకు చాటనెంచినాడు కాబోలును!

కృష్ణా! ఇటు చూడుము. దుర్మార్గులగు కౌరవులకు సహాయము చేయుటకై ఎవ్వరెవ్వరు వచ్చియున్నారో నేను చూడవలయునని యున్నది. ఒకమారు రథమును రెండు సేనలకును మధ్యభాగమున నిలుపుము' అని అర్జునుడు పలుకుచున్నాడు. వెంటనే పార్థసారథి రథమును రెండు సేనలకును మధ్యభాగమున నిలిపి, పార్థా! ఇదిగో 'నీ రక్తస్పర్శగల బాంధవలోకము నంతను చూడుము' అనెను. భగవానుని ఆ పలుకులలో ఏమి రక్తియున్నదో కదా! పార్థుడు తన విశాలనేత్రములను విప్పి ఉభయసైన్యములను తిలకించినాడు. అందులో నున్నవా రందరును ఎవరు?- తనకు తాతలు - తండ్రులు- బావలు- మామలు - మేనమామలు - గురువులు - బాంధవులు - మిత్రులు. ఆతని నేత్రము లొక్కసారిగా చెమ్మగిల్లినవి. నయనాంబుజముల నుండి బాష్పాంబులు రాలసాగినవి. అంతవరకు వీరుడై - ధీరుడై సమస్త శాత్రసమూహమును గాండీవముతో చిత్రవధ గావింప నెంచిన వీరకేసరి యగు అర్జునుని నోటిగుండా ఎట్టి పిరికితనపుమాటలు వచ్చుచున్నవో చూడుడు!

'ఓకృష్ణా నాకాళ్ళు వణకుచున్నవి. అవయవములన్నియును కంపమును బొందుచున్నవి. నాలుక ఎండిపోవుచున్నది. శరీరము

రోమహర్షమును చెందుచున్నది. మాధవా, ఏమి చేయుదును? గాండీవము చేతిలోనుండి జారి పడిపోవుచున్నది. నా శిరస్సు గిరగిర తిరుగుచున్నది. ఏమందువు.

'న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ' కృష్ణా నాకు రాజ్య మక్కర లేదు. నాకు విద్యాబుద్ధులు చెప్పిన గురువులను చంపగలనా - బాంధవులను సంహరింపగలనా - వీరందఱను చంపిన నాకు పాపము సంభవించగలదు. కులక్షయదోషము నన్నావరించును- వీరుల సంకరదోషము నన్ను పట్టుకొనును. మిత్రద్రోహము చేసినవాడ నగుదును. ఇట్లు కన్నీరుమున్నీరుగా నేడ్చుచు బంధువధ చేయజాలక రథముపై కూర్చుండిపోయెను.

అర్జునుని విషాదమును గురించి వర్ణింపబడిన భాగ మగుటచేత దీనిని అర్జున విషాదయోగ మని పిలిచినారు. అర్జునుడు ఏడ్చినను నది యోగమేయైనది. అర్జునుడు భగవానుని సన్నిధిని ఏడ్చినవాడు గనుక నది యోగమైనది. మన మో భార్యాపుత్రుల యెదుటను - అధికారుల వద్దను నేడ్తుము. గనుక మన దుఃఖము యోగముగాక రోగ మగుచున్నది.

భగవానుని పాదారవిందములవద్దనే దుఃఖింపుము. ఆదుఃఖము యోగమై నిన్నుద్ధరించును.



## 7. అర్జునుని విషాద కారణము

### The reasons for Arjuna's grief.

అర్జునుడు యుద్ధమును నిరాకరించుటకు కారణమేమి-భయము చేతనా? పిరికితనముచేతనా? అహింసాతత్వముచేతనా? - మరి యెందుచేత?

అర్జునుడు మహావీరుడు - ధీరుడు - బలపరాక్రమ సంపన్నుడు. 'వచ్చెడువాడు ఫల్గుణుడు. అవశ్యము గెల్తు మనంగరాదు' అని ఉత్తర గోగ్రహణ సందర్భమున భీష్మునివంటి పరాక్రమశాలియే పలికినాడు గదా - ఫాలాక్షుని నెదిరించిన జోదు - రాక్షసగణములను సంహరించిన మహావీరుడు-లోగడ అనేక యుద్ధములలో పాల్గొని విజయపరంపరల నొందిన విజయుడు - రాజసూయ సమయమున సకల రాజసమూహములను జయించిన ధనంజయుడు - మచ్చునకైనను ఆతనిలో పిరికితనము గానరాదు. పిరికితనముచేతను, భయము చేతను అతడు యుద్ధమును మానెనందమా -అది సరికాదు. అహింసా తత్త్వ మాతనిలో నాటుకొని యున్నందున హింసాప్రవృత్తిని వదలి యుద్ధనిరాకరణమును గావించెనందమా? అదియును సరికాదు. ఆతని ప్రకృతి హింసాతత్త్వమే కాని అహింసాప్రవృత్తి గాదు.

గాఢమగు మమకారము- బాంధవుల యెడల గల గాఢానురాగము ఆతనిని యుద్ధమునుండి మరలింపచేసినవి. యుద్ధములో నున్నవారు తన స్వజనులును, ఆప్తబాంధవులును కాని పక్షమున నాతడు తప్పనిసరిగా యుద్ధమును చేసియేయుండును. మమకార మాతని స్వధర్మమునుండి పరాఙ్ముఖుని గావించినది. మమకారము అజ్ఞానసూచకము. ధర్మపరాయణుడగు వ్యక్తి పతనము నొకానొకప్పుడు పొందినచో తన పతనావస్థను బహిర్గతముచేయక ధర్మమను వేషమును ధరించి పతనమును కప్పిపుచ్చుచు పలుకుచుండును. ఇదియే అర్జునుని స్థితి. అర్జునుడు కర్తవ్య పథమునుండి జారి దానిని కప్పిపుచ్చుటకు ఎన్నెన్నో ధర్మోపన్యాసములను గావించినాడు. యుద్ధమే దోషమని వాదించినాడు. ఇవి యన్నియును ప్రజ్ఞావాదములని భగవానుడు వానిని ఖండించినాడు. మమకారజన్యమైన ఆతని భాషణము జ్ఞానచిహ్నమగు వైరాగ్యము కాదు.

ఈసందర్భమున వినోబాజీ తన ప్రవచనములో నొక చక్కని యుదాహరణమును ఇచ్చియున్నారు.

ఒక న్యాయాధికారి కలడు. ఆతడు మహాబుద్ధిశాలి. న్యాయ శాస్త్రానుసారముగ నిందితులను విచారించి వారికి శిక్షలను విధించు చుండును. తన స్వహస్తములతో వందలకొలది నిందితులకు ఉరిశిక్షలను విధించినాడు. ఆతని చేయి వణక లేదు. తీర్పు వ్రాయునపుడు కన్నులు చెమ్మగిల్లలేదు. కలము జారలేదు.

ఒకనాడు ఆతని కుమారునిపై హత్యానేరము మోపబడి విచారింపబడెను. ఆతనికి ఉరిశిక్షను న్యాయశాస్త్రప్రకారము విధించవలసియున్నది. న్యాయాధికారి కలమును చేబూని తీర్పు వ్రాయసాగినాడు. కాని కలము కదలుటలేదు. నేత్రములు చెమ్మగిల్లినవి. అర్జునుని గాండీవమువలె ఆతని కలము జారిపోయినది. కారణము పుత్ర మోహ మాతనిలో నావహించినది. మరణదండమును వ్రాయజాలక పోయినాడు. తన ధర్మపతనమును తా నంగీకరింపక 'ఆ ఉరిశిక్ష నాగరికలక్షణము కా దనియు, దానిని రద్దుచేయుట న్యాయశాస్త్రము యొక్క విధి యనియు ఏమేమియో చెప్పసాగెను. అర్జునుడును ఇదియే రీతిని పలుకసాగినాడు కదా!

ఈ ప్రజ్ఞావాదములను భగవానుడు ఖండించుచు తత్త్వోపదేశమును ప్రారంభించుచున్నాడు.

మానవునకు దుఃఖమును బాధను కలిగించునది 'మమకారమే' గాని వస్తువియోగము కాజాలదు. దీనికి రెండు నిత్యజీవితోదాహరణములను మనవి చేసెదను.

నా మిత్రుని ముదుసలి తల్లి చనిపోయినది. నా మిత్రుడు మాతృవియోగమునకు విపరీతముగా దుఃఖించుచున్నాడు. ఆమె మరణమునకు నాకెంతమాత్రము దుఃఖము కలుగలేదు. నేను వారి యింటికిపోయి వేదాంతసూక్తులను చెప్పి వచ్చినాను. కొద్దిదినముల యనంతరము నా యింటిలో నా మాతృదేవియును మరణించెనని భావింపుడు. అప్పుడు నా దుఃఖమునకు మేర లేదు. నా మిత్రునకా సమయమున నెట్టి దుఃఖమును లేదు. పైగా ఆతడు నాకు వేదాంతోపదేశమును చేయసాగినాడు.

దీని సారాంశ మిది-మృత్యువే దుఃఖహేతువు కాదు. అదియే దుఃఖహేతువైనచో ఎచ్చట మృత్యువు కలిగినను మనమందరమును దుఃఖపడవలసినదే. అట్లు జరుగుటలేదు. మృత్యువు కలిగిన వీధి యందే మరొకయింటిలో అదేసమయమున మహావైభవముగా వివాహ శుభకార్యము జరుగుటలేదా? మమకారమే దుఃఖహేతువు గాని మృత్యువుకాదు. నా మిత్రునియింటిలో ఒకనాడు బంగారు గొలుసు పోయినది. ఆతడు మిగుల దుఃఖించినాడు. ఆ వస్తువుయొక్క వియోగమునకు ఆతడు బెంగపెట్టుకొనినాడు. కాని నాకు విచారము కలుగలేదు. కొన్ని మాసములకు నాయింటిలో నొకవిలువగల వస్తువు పోవుట తటస్థించినది. అప్పుడు నాకుకలిగిన విచారము వర్ణనాతీతము. దీనికి కారణమేమి? మమకారమే దుఃఖమును కలిగించుచున్నది. మమకార నాశనమే సుఖము. గీతలోని ప్రతి యధ్యాయమును ఈ విషయమునే సుస్పష్టము చేయుచున్నది.

# గీతా కల్పవృక్షము

రెండవ అధ్యాయము - సాంఖ్యయోగము

## 8 సంక్షిప్తగీత - గీతా హృదయము

**The essense of Geeta**

గీతా సార్వభౌముని యనుగ్రహముచేత గీతలోని ఉపోద్ఘాత రూపమున తొలి యధ్యాయమును బూర్తిచేసి రెండవ అధ్యాయములో ప్రవేశించుచున్నాము. ఈ అధ్యాయము గీతకు ప్రాణప్రదము వంటిది. భగవద్గీత యందుగల సమస్త విషయములును ఈ యధ్యాయములో సూక్ష్మముగా తెలుపబడియున్నవి. భగవద్గీత ముఖ్యముగా కర్మ-భక్తి-జ్ఞానములను గూర్చి వివరించుచున్నది. ఈమూడు ముఖ్య సిద్ధాంతములును వాని ముఖ్యాంగములును - వాని యనుభవ విశేషములునుకూడ ఈ యధ్యాయము సువ్యక్తము చేయును. ఈ యధ్యాయము నందలి సూత్రములనే విశదీకరించుచు - విపులపరచుచు - సువ్యాఖ్యానము గావించుచు మిగిలిన అధ్యాయములు విలసిల్లినవి. మోక్ష సన్యాసయోగ మను ఆఖరి యధ్యాయము ఈ విషయముల నన్నిటిని సమీక్ష చేయుచు ముగిసినది. ప్రతిభావంతుడగు శాస్త్రవేత్త శాస్త్రరచనలలోని తొలి అధ్యాయమునందు తా నా శాస్త్రము ద్వారా సువ్యక్తము చేయవలసిన విషయములను సూక్ష్మముగా దెలిపి మిగిలిన యధ్యాయములలో వానిని విపులీకరించుచు తుది అధ్యాయములో ప్రధాన విషయములను సమీక్షచేయుచు ముగించును. ప్రతిభావంతుడగు వ్యాసకర్తయూ తన వ్యాసమున కది యే రీతిని ప్రారంభోపసంహారములను గావించును. మహాశాస్త్రకారుడగు గీతాచార్యుడును శాస్త్రమర్యాద ననుసరించుచు గీతా యోగ

శాస్త్రమును రచించినాడు. అందువలన ఈ యధ్యాయమును 'సంక్షిప్త గీత' యని చెప్పుదురు. దీనిని మీరు సమగ్రముగా గ్రహించితిరా - గీత యంతయు గ్రహించినట్లే యగును. ఇది అమూల్యమైన అధ్యాయము. సాంఖ్యయోగ మని దీనికిపేరు. సాంఖ్య మనగా ఆత్మజ్ఞానము. ఈ అధ్యాయములో ప్రధాన విషయము ఆత్మజ్ఞాన ప్రబోధము గనుక దీని కా నామధేయము కలిగినది. ఇది 72 శ్లోకములు గల సుదీర్ఘ మగు - గంభీర మహా భావగర్భితమగు అధ్యాయము. ఈ అధ్యాయమును అర్థసౌలభ్యముకొరకు కొన్ని ప్రకరణములుగా విభజించి చర్చింతము.

దీనిలో 1 వ శ్లోకము నుండి 10 వ శ్లోకము వరకును అర్జునుని విషాదయోగమే వర్ణితమయినది. దీనిలో 2, 3. శ్లోకములలో శ్రీకృష్ణుడు లౌకికమగు సామాన్యబోధను చేసి అర్జునుని కర్తవ్యతా ముఖమున బెట్ట ప్రయత్నించినాడు. 11 వ శ్లోకములో గీతాబోధ ప్రారంభమగును. 11 నుండి 30 వ శ్లోకము వరకును సాంఖ్యప్రకరణము. మహాగంభీరమైన ఆత్మానాత్మ వివేకమును గూర్చి భగవానుని మధురవాణి యిందు వెలసింది. 11 నుండి 30 వరకు స్వధర్మానుష్ఠానప్రకరణము. ఇందు స్వధర్మాచరణము యొక్క ఆవశ్యకతను గూర్చి భగవానుని ప్రవచనము 40 వ శ్లోకము నుండి 53 వశ్లోకము వరకును కర్మయోగసిద్ధాంతముయొక్క వివరణము కలదు. ఇది కర్మయోగ ప్రకరణము. 54 వ శ్లోకమునుండి 72 వ శ్లోకము వరకును స్థితప్రజ్ఞ ప్రకరణమును. స్థితప్రజ్ఞుని లక్షణమును గూర్చి భగవానుడిందు మనోహరముగా గానము చేసినాడు. ఇట్లీ యధ్యాయము మహారస ప్రవాహమై - సుందరమై - సుమనోహరమై - శోభిల్లుచున్నది.

భారతీయాధ్యాత్మిక, మహాసారస్వతములో ఉపనిషత్తుల స్థానము మహోమహోన్నతమైనది. కాని గీతయొక్క స్థానము మరింత

మహోన్నతమైనది. ఉపనిషత్తులు ఆత్మజ్ఞాన ప్రబోధమునే ప్రధాన లక్ష్యముగా గలిగియున్నవి. భగవద్గీత ఆ మహాజ్ఞాన విశేషమును నిత్యదైనందిన జీవితములో ఆచరణానుష్ఠాన స్వరూపముగా చిత్రించినది. ఇదియే గీతా మహాశాస్త్రముయొక్క మహోజ్వల ప్రతిభా విశేషము. ఉపనిషత్తులు 'సత్యంవద, ధర్మంచర' (సత్యమును పలుకుము - ధర్మమును ఆచరించుము) అని పలుకుచుండగా గీతాశాస్త్రము ఆ సత్యమును నిత్యజీవిత వివిధరంగములో నెట్లు పలుకవలయునో, దైనందిన జీవితములో ధర్మము నెట్లాచరించవలయునో ప్రయోగాత్మకంగా- అనుష్ఠాన స్వరూపముగా బోధించును. భగవద్గీత సూత్రమును (**Theory**) మాత్రమే గాక దానికి నిత్యదైనందిన జీవితములో ననుష్ఠాన విధానమును (**Practical**) తెలుపును. ప్రతి అధ్యాయమునందును ఈ రెండును అనగా సూత్రానుష్ఠానములు **Theory and practical**) సమన్వయ స్వభావముగా భాసిల్లును. నిత్యజీవితములో అనుష్ఠానమునకు పనికిరాని వేదాంతము యొక్క ప్రయోజన మేమి?

గీత కేవలము పారాయణ గ్రంథము మాత్రమే గాదు. ఏ యేకాదశినాడో - కృష్ణాష్టమినాడో - మడిబట్ట కట్టుకొని పారాయణము గావించి, ఆ గ్రంథము పట్టుబట్టతో చుట్టబెట్టి దేవతార్చన పేటికలో భద్రపరచినంతమాత్రమున గీతానుష్ఠానము పూర్తి కాదు. అట్లు పారాయణమును గావించుట పవిత్ర కార్యక్రమమే యనుటలో సందేహము లేదు. అంతమాత్రము చాలదు. గీత నిత్యజీవిత ప్రణాళికా ప్రబోధనా గ్రంథము. నీ వెట్లు కూర్చుండవలయునో-ఎట్లు పరుండవలయునో - ఎట్లు భుజింపవలయునో - సంఘములో నెట్లు చరింపవలయునో - వేయేల ప్రతిక్షణమును నీ నిత్యజీవితములో పరమేశ్వర సాక్షాత్కారమును బొందుచు - ఎట్లు జీవించగలవో ప్రయోగాత్మకముగా - అనుష్ఠాన పూర్వకముగా తెలుపును. గీత గురువు, దైవము,

సారథి, సఖుడు, నెయ్యము, తోడు నీడ. కావుననే మహాత్ముడిట్లు పలుకును. 'నా మనస్సు చీకాకుగా నున్నప్పుడు - అంధకారము నన్నావహించినపుడు - భయాందోళనలు నన్ను చుట్టుముట్టినపుడు - నిరాశ నన్ను పీడించినపుడు నేను గీతాగ్రంథమును తెరతును. అందులోనుండి యొక దివ్య శ్లోకము నాకన్నుగవకు సాక్షాత్కరించి నాకు జ్ఞానకాంతిని గల్గించును. నాలోని చికాకు మాయమగును. నిరాశ తొలగిపోవును. భయాందోళనములు తొలగిపోవును. నేను ప్రసన్న చిత్తుడ నగుదును. నాకు మహోన్నత ధైర్యోత్సాహానందములు కలుగును.

కావున ప్రతివారును నిరంతరము తమ జేబునందు గీతాగ్రంథమును గలిగియుండవలయును. భగవానుడే నీ చెంత నున్నటుల నీవు మహానుభూతిని బొందగలవు.

గీతలోని మరియొక్క అద్భుత విశేషమును మనవి చేయుదును. ఏ స్థాయిలో - ఏ తావులో - ఏరంగములో - నున్న మానవునకు ఆ స్థాయిలోనే, ఆ రంగములోనే పరమేశ్వరానుభూతి సాక్షాత్కారములను ప్రసాదించును. పాఠశాలలో బిడ్డలకు పాఠములను చెప్పుచుండు ఉపాధ్యాయునకు ఆ పాఠశాలా ప్రాంగణములోనే పరమేశ్వరానుభూతిని గలిగించునది గీతా శాస్త్రమే. వర్తక వాణిజ్య వ్యాపారములను చేసికొను వ్యాపారికి, తన దుకాణములోనే బ్రాహ్మీస్థితిని ఎట్లు పొందవచ్చునో తెలుపునదియే గీతా శాస్త్రము. యుద్ధరంగములో శత్రుసంహారమును గావించు వీరసైనికున కా స్థలములోనే ఆత్మసందర్శనమును గావించుకొను టెట్లో గీత సువ్యక్తము చేయును. ఇంటిలో గృహకృత్యములను గావించుకొను ఇల్లాలు తన గృహారామములో మోక్షసామ్రాజ్యమును బొందు టెట్లో గీత చిత్రించినది. ఇట్టి అద్భుతమగు మహోన్నత గ్రంథరాజము విశ్వసాహిత్యములో మరెచ్చట నున్నది? పుణ్యభారత సుందర మహోద్యానమున గీతా

శాస్త్రము కల్పవృక్షమై విలసిల్లినది. ఆ మహోజ్వల ప్రశాంత మహనీయ, తపనీయ, కమనీయ, కల్పవృక్ష సుందర మనోహర దివ్యచ్ఛాయలలో మనము విహరించి, విశ్రాంతినొంది, జీవిత మహాలక్ష్యమును బొందుదుము గాక!

గీతా హృదయమును సంపూర్ణముగా గ్రహించు శక్తి గీతా సార్వభౌమునకు తప్ప మరియెవ్వరికిని లేదు.'మాంతు వేద న కశ్చన' అని భగవానుడే పలికినాడు. శంకరుడా గీతా రత్నాకరములో మునిగి కొన్ని రత్నములను తెచ్చి మన కదించినాడు. రామానుజులు జలరాశిలో మునిగి మరికొన్ని మాణిక్యములను తెచ్చినాడు. మధ్వాచార్యులును అట్లే గావించి మరికొన్ని మణులను పైకి దీసినారు. అదియే రీతిని లోకమాన్యుడును గాంధీ,భావే, జ్ఞానదేవు, అరవిందుడు మున్నగు మహాపురుషు లా మహారత్నాకరములో మునిగి తమకు లభించిన రత్న మాణిక్యములను దెచ్చి వెదజల్లినారు. రత్నాకరములో రత్నములకు లోటు లేదుగదా. ఎందరందు ప్రవేశించినను వారి వారి శక్తిని, భక్తిని, యోగత్యను, కృషిని, శ్రద్ధను, బట్టి వారి కాయారీతుల జ్ఞానరత్న సందోహములు లభించుచుండును.

అయితే గీతాహృదయ మేమి? భక్తియా? జ్ఞానమా? కర్మయా? ఈ మూడింటియొక్క సమన్వయ స్వరూప మే గీతా హృదయము. గీత ప్రబోధించునది కర్మ, భక్తి, జ్ఞాన సమన్వయమగు సంపూర్ణ యోగము. భగవానుడే సంపూర్ణ సమన్వయ సమగ్ర తత్వమును ప్రతి అధ్యాయమునందును మరల సువ్యక్తము గావించినాడు.

భక్తి వేరు – జ్ఞానము వేరు – కర్మ వేరు – అని భావించుట పొరపాటు. ఇట్టి విభాగములను గీత సహించదు. పండిన మామిడి పండులోనుండి దాని రుచిని– సువాసనను, బరువును, వేరు చేయజాలనట్లు భక్తి జ్ఞాన కర్మలను వేరువేరుగా చూపుట సాధ్యము గాదు. మానవులయొక్క భిన్న భిన్న మానసిక స్థాయిలను బట్టి అర్హతలను

బట్టి గీత వారికి ఆయారీతుల సుగ్రాహ్యమగుచు, సుజ్ఞాన ప్రబోధము గావించును. ఇది గీతలోని మరియొక్క గొప్పవిశేషము. దీనికి ఉదాహరణముగా నేను వినియున్న ఉపనిషత్తులోని దొక చిన్న కథను తెలిపి ఈ వ్యాసమును ముగింతును.

ఒక దినమున మానవులును, దానవులును, దేవతలును, గలిసి ప్రజాపతి నద్దకు వచ్చిరి. ప్రజాపతి వారిని గౌరవించి సుస్వాగతము పలికి వారు వచ్చుటకు గారణ మే మని యడిగెను. మీవద్దనుండి బ్రహ్మజ్ఞానోపదేశమును పొందగోరి వచ్చినా మని వారు బదులుచెప్పిరి. ప్రజాపతి సంతసించి 'సరే మీకొక యక్షరమును బోధించుచున్నాను. అని 'ద' అక్షరమును ఉపదేశించి వారిని పంపివేసెను.

వారందరును తమ తమ నివాసముల కరగి యిట్లని ఆలోచించిరి. 'మనము ఇంద్రియభోగులము. పరమేశ్వర సాక్షాత్కారము ఇంద్రియభోగులకు లభించదు.

ఇంద్రియ దమనము ఆవశ్యకము. ప్రజాపతి దమనమును గురించియే మనకు చెప్పదలచి సంజ్ఞారూపకముగా 'ద' అను ఏకాక్షర మంత్రమును మనకు చెప్పినాడు.

ఇది సరియగు ఆలోచనయేగదా! ఇంద్రియనిగ్రహము లేనిదే పరమేశ్వరానుభూతి యెన్నడును కలుగదు. దేవతలయొక్క మానసికప్రవృత్తి ననుసరించి 'ద' అను అక్షరము వారి కట్టి జ్ఞానమును ప్రసాదించినది.

ఇక దానవులయొక్క ఆలోచనలను చూడుడు. మనము రాక్షసులము, క్రూరస్వభావులము, దయారహిత చిత్తులము. దయలేని వారికి దయాస్వరూపుడగు భగవానుడు కానరాడు. దయకు చిహ్నముగా 'ద' ప్రథమాక్షరమును మనకు ప్రజాపతి ఉపదేశించినాడు. 'ఇదియును యథార్థమేకదా! దయాపూరితచిత్తమే ఈశ్వరానుభూతిని బొందగలుగును. వారి ఆలోచనలు సరిగానే యున్నవి.

ఇక మానవుల విషయ మాలోచింతము, మనము మనుష్యు లము. సంపాదనయే, కూడఁబెట్టుటయే, మనకు లక్ష్యముగానున్నది' త్యాగము లేనిదే ఈశ్వర సాక్షాత్కారము కలుగదు. దానమే పరమేశ్వరానుభూతికి సాధనము. దానిని నిరూపించుటకే ప్రజాపతి 'ద' అను అక్షరమును సంజ్ఞారూపముగా బోధించినాడు.' ఇదియును పరమసత్యమే. ఇట్లే గీతామహాశాస్త్రము వ్యక్తులయొక్క భిన్నభిన్న మానసిక ప్రవృత్తులనుబట్టి వారివారి కాయారీతుల నర్థమిచ్చును.

గీతాహృదయమంతయు గీతాచార్యు డీ ద్వితీయాధ్యాయమున సూక్ష్మరూపముగా సుమనోహరముగా గానము చేసినాడు.



# 9. ఉత్తిష్ఠ పరంతప!

## Get up o' conqurer of enemies.

పార్థుడు ఉభయసేనా మధ్యమక్షోణిలో నిలిచి, రక్తస్పర్శ గల బాంధవలోకమును తిలకించి, మోహపాశబద్ధుడై ధర్మమును నిర్వహించక కన్నీరు మున్నీరుగా నేడ్చుచు కర్తవ్యతామూఢుడై రథముపై కూలబడిపోయెను. పార్థుని మనస్సు కేవలము తమోగుణ ముతోనున్న పార్థునకు జ్ఞానప్రబోధ మెట్లు? జ్ఞానామృత దివ్యధారల చేతగాని అర్జునుని మహామోహ భయంకర వ్యాధినిర్మూలనము గాదు.

వ్యాధిని గమనించి చికిత్సచేసినగాని వ్యాధి కుదరదు. ఒకరోగి విపరీతమగు శిరోవేదనముచేత బాధపడుచు ఒకవైద్యుని వద్దకు పోయెను. ఆయన వెంటనే అమృతాంజనమును మర్దనాచేయు మని సలహా యిచ్చినాడు. చేసినాడు కాని ఆ రోగము తగ్గలేదు. మరలా వైద్యునివద్దకు పోగా ఈసారి తైలమునిచ్చి శిరస్సునకు మర్దనాచేయు మని చెప్పెను. రోగి అట్లుచేసెను. కాని శిరోవేదన తగ్గలేదు. మరు

నాడు మరల వైద్యునివద్దకు పోయెను. ఈసారి ఆయన రోగిని సరిగా పరీక్షచేసి అతనికి మలబద్ధకారణముచేత శిరోవేదనము కలుగుచున్న దని గ్రహించెను. వెంటనే విరేచనముల మందు నిచ్చెను. తోడనే శిరోవేదన నశించెను. రోగమునకు మూలకారణమును గ్రహించి చికిత్స చేయవలెను గదా.

పార్థునకు గలిగిన భయంకరవ్యాధి యేమి ?

'మమకారము–' దీనికి అజ్ఞానము నశించవలెను. కావుననే భగవానుడు వెంటనే 'సాంఖ్యము'ను ప్రబోధించెను. చీకటిని పోగొట్టవలెనన్న దానితో యుద్ధము చేయనక్కరలేదు. దీపమును వెలిగించిన చీకటి తనంత తానే తొలగును. ఆత్మజ్ఞానోదయముచేత అజ్ఞానము నశించును.

ఇప్పుడు తమోగుణములో పడియున్న పార్థునకు రజోగుణము గలిగించవలసి యున్నది. తమోగుణముకన్న రజోగుణమే మేలు కదా. మరల రజోగుణములోనుండి సాత్విక గుణస్థాయికి పార్థుడు రావలయును. అప్పుడే బ్రహ్మజ్ఞాన ప్రబోధము.

శ్రీ భగవానుడు అర్జునునిలో రజోగుణ ప్రవృత్తిని గలిగించుచున్నాడు. ఈ అధ్యాయములోని రెండు మూడు శ్లోకము లీ విషయమును సువ్యక్తముగావించును. 'ఓ అర్జునా! ఈ సంధిగ్ధసమయములో నీకీ శోకము ఏల దాపురించినది. యుద్ధము మనకు అనివార్యమై సంభవించినది. ఇది ధర్మయుద్ధమునకు కావలసిన అన్ని సన్నాహము లను కావించుకొని యిప్పుడు దుఃఖించుట కేవలము అవివేకము. దీని వలన ఇహముకాని పరముగాని లేదు. ఇది ఎంత అపకీర్తికరమోయీ పార్థా!

నీవు నపుంసకుడవు కాబోకుము. నీకీ నపుంసకత్వము ఒక పర్యాయము సంభవించిన సంభవించి యుండవచ్చును. ఆనాడు అమరావతీ నగరమున త్రిభువన సుందరి యగు ఊర్వశి నిన్ను కామించి,

ప్రేమించి, పులకించి నీసాంగత్య మర్థించినది గదా. కాని నీవు జితేం ద్రియ చక్రవర్తివై ఆ మోహనాంగిని ధిక్కరించితివి. కాని తిరస్కృత యగు నా సుందరాంగి కోపించి, 'నీవు నపుంసకుడ వగుము' అని శపించి నది. కాని ఆ శాపము నీకు వరప్రసాదమై విరాటుని కొలువుకూట మున అజ్ఞాతవాసమున కుపకరించినది. నీ విప్పుడు వీర్యవంతుడవే నోయీ పార్థా'

నీవు కుంతీకుమారుడ వనుమాట మరచిపోకుము. నీ తల్లి 'నేను వీరమాతను' అని సగర్వముగా చెప్పుకొనుచున్నది. నీ దుఃఖాశ్రు వుల నామె తిలకించెనా, యిక నామె తలయెత్తుకొని తిరుగలేదు. నీవు విజయశ్రీ సమేతుడవై వత్తువని నీ సోదరులును భావించు చున్నారు. కాని నీస్థితి విపరీతముగా నున్నది. క్షత్రియధర్మమునకు భిన్నముగా నున్నది. పాండువంశమునకే నీవు కళంకమును తెచ్చు చున్నావు.

నీ పతాకముపై నెగురుచున్న కపిరాజు నిన్ను హేళన చేయును. భీష్మ ద్రోణులే నీ పిరికితనమును చూచి నవ్వుదురు. విరో ధులు నిన్ను అతిచులకనగా పరిహసింతురు. అర్జునా, క్షుద్రమగు హృదయ దౌర్బల్యమును విడనాడుము. ఓ అర్జునా! యుద్ధమునకై లెమ్ము. విచారమును బొందకుము. ఔదాసీన్యము నుజ్జగించి కర్మ వీరుడవై రణరంగమున ధీరుడవై-మహాప్రతాపశాలివై-నిలువుము.'

క్లైబ్యం మాస్మ గమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప'

(అ 2 - శ్లో 3)

అని భగవానుడు పార్థుని హెచ్చరించుచున్నాడు ఈ శ్లోకమే గీతయొక్క మహాసందేశమని శ్రీవివేకానందస్వామి చెప్పుచున్నారు. దీనినే 'ఏకశ్లోకీ' భగవద్గీత యని కూడా పలువురు పెద్దలు వచిం తురు. పార్థుని నిమిత్తమాత్రునిగా నిడికొని భగవానుడు సమస్తపీడిత

ప్రజానీకమును హెచ్చరించుచు నూతన శక్తి తేజస్సులను ప్రసాదించుచున్నాడు.

'ఓమానవుడా! భీతిల్లకుము – నిర్వీర్యుడవు కావద్దు – అశాంతిని బొందకుము– చీకాకును బొందవద్దు సుమా – బాధలు రానిమ్ము, కష్టములు మీదపడనిమ్ము, తాపత్రయములు నిన్ను చుట్టుకొననిమ్ము, క్లేశపరంపరలు నిన్ను ఆవహింపనిమ్ము, దుఃఖభారములు నీపై స్వారీ చేయనిమ్ము, నీవుమాత్రము చలింపకుము. నీ సత్యస్వరూపమును ధ్యానింపుము.'

ఈ మహాసందేశము ఏకశ్లోకీ భగవద్గీత సంక్షుభిత దుఃఖిత మానవలోకమున కెట్లు సుఖానందోత్సాహ సందేశ మిచ్చుచున్నది?

ఈ దివ్యవాణిచే పార్థునిలో చైతన్యము కలిగినది. తమోగుణము తగ్గినది. రజోగుణము కానవచ్చినది. ఆత డిట్లు పలుకును. 'ప్రభూ! గురువులగు భీష్మ ద్రోణాదులను యుద్ధరంగమున నే నెట్లు సంహరింతును. పుష్పరాశులచే నర్చించవలసిన గురుపితామహులను బాణములతో నేనెట్లు కొట్టిచంపుట అని దుఃఖించుచున్నాను.' అను ప్రశ్నకే భగవానుడు ఇట్లు అని సమాధానము చెప్పబోవుచున్నాడు.

పార్థుని సాత్వికమానసికస్థాయికి తీసికొనివచ్చి, ఆతనిచే శరణాగతిని బొందునట్లు చేసి, ఆతనిద్వారా పవిత్రమగు గీతామృతమును సర్వలోకములకును ధారపోయ తలచినాడు కాబోలు భగవానుడు. అది భగవానుని యిచ్ఛ.

---

## 10. శరణాగతి - గీతామందిర సింహద్వారము

### Self-surrender - Gateway of Gitamandir.

మంగళకరమగు గీతా దివ్యమందిర సింహద్వారమున మనము ప్రవేశించుచున్నాము. గీతామందిర ప్రవేశమునకు అర్హత 'శరణాగతి'. జాతి, మత, వర్గ, కాల, వయో,లింగ భేదములతో నిమిత్తము

లేక శరణాగతి యను పత్రముచు బొందినవా రందరికిని ఆ మహామం దిర పుణ్యప్రవేశమున కర్హత గలదని భగవానుడు గానము చేయును. మనమును భగవానుని దివ్యపాదారవిందములయొక్క సంపూర్ణ శర ణాగతిని బొంది ఈ దివ్యధామమున ప్రవేశింతము గాక !

భగవంతుని దర్శించుటకుగాని - ఆయన సహాయమును బొందు టకుగాని - కావలసినది శరణాగతి. శరణాగతిని పొందినవానికే భగ వానుడు ప్రసన్నుడగును. పాండిత్యముకాని - అధికారపదవులుగాని - నీ వర్పించు వివిధ ధ్యానముగాని - వ్రత యజ్ఞయాగాదులు గాని మెప్పింపలేవు. 'నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపం దగున్ దీనునిన్ రావే ఈశ్వర, కావవే వరద, సంరక్షించు భద్రాత్మకా !' యని రోదనము చేయుచు తన్ను శరణాగతిని బొందినపుడే భగవంతుడు గజరాజును రక్షించినాడు.

'హేకృష్ణ! పుండరీకాక్ష! ద్వారకానిలయా! అచ్యుత! దీనా వస్థలోనున్న నేను నిన్ను శరణాగతిని బొందితిని, రక్షమాం' అని రెండు చేతులను జోడించి స్వామిని ప్రార్థించినపుడే భగవానుడు ద్రుపదకన్యకు అక్షయవస్త్రదానము చేసినాడు. భగవానుని అర్జునుడు శరణాగతిని పొందినాడు. కావుననే అతనికి తత్త్వోపదేశమునకు అర్హత కలిగినది.

ఒక జిజ్ఞాసువు గీతాపండితుని నిట్లు ప్రశ్నించినాడు. 'మహా శయా! భగవద్గీతయొక్క సారాంశ మేమిటో ఒక్క వాక్యములో దయయుంచి తెలిపెదరా ?'

మిత్రమా! చెప్పెదను. ఒక్కవాక్య మననేల - ఒక్కమాటలో ఒక్క పదములో - ఒకే పలుకులో - గీతయొక్క సారాంశ మంత యును తెలిపెదను. 'శరణాగతి' 'శరణాగతి' 'శరణాగతియే' గీత యొక్క మహాసందేశము.

ఇది ముమ్మాటికిని యథార్థము. ఈవిషయము గీత యందలి ప్రతి అధ్యాయమునందు తెలియవచ్చుచునే యున్నది.

కార్పణ్య దోషోపహత స్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్.
(అ. 2 శ్లో. 7)

'ఓ దేవా! కార్పణ్య మను మహాదోషము నన్నావరించినది. నా మనస్సంతయు వ్యాకులమై పోయినది. నేను ధర్మాధర్మములను, సత్యాసత్యములను, న్యాయాన్యాయములను గుర్తింపలేని స్థితిలో నున్నాను. నా కేది శ్రేయోమార్గ మగునో దానినే ప్రబోధింపుము. దేవా! నేను నీకు శిష్యుడ నగుచున్నాను. నీవేమి చెప్పిన నట్లే చేయు వాడను, నన్ను శాసింపుము, నేను నిన్ను శరాగతిని బొందుచున్నాను' అని పార్థుడు భగవానుని దివ్యపాదారవిందములను పట్టుకొన్నాడు.

పార్థు డిప్పుడు తనలోని లోపములను, దోషములను గ్రహింప గలిగినాడు. తన దోషములను దాను గ్రహించినప్పుడే భగవద్దర్శన మునకు అర్హత గలుగును. కాని మానవులు తమ దోషములను తాము గణింపక, యితరుల దోషములను లెక్కించుచుందురు.

'తప్పు లెన్నువారు తండోపతండంబు
లుర్విజనుల కెల్ల నుండు తప్పు
తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు'

అని వేమన కవియోగీంద్రుడు మనోహరముగా గానము చేసినాడు.

ఏసుక్రీస్తు యిట్లు పలుకును. 'నీ కంటిలోనున్న దూలమును నీవు చూడజాలవు. కాని ఎదుటవాని నేత్రములలోని నలుసులను మాత్రమే నీవు చూతువు.' ఇది ఎంత లజ్జాకరము !

ఒక గ్రామములో కొందరు పురుషులు దోషముచేసిన యొకానొక స్త్రీనిగాంచి పరిహసించుచు, దూషించుచు నామెను రాళ్ళతో కొట్టి చంప ప్రయత్నించుచుండిరి. ఆసమయమున కరుణారసమూర్తి యగు జీససు ఆ దారిని పోవుట తటస్థించెను. వెంటనే ఆయన వారలను వారించి యిట్లు పలికెను. నాయనలారా, మీరామె దోషము చేసినదని ఆమెను చావమోదుచున్నారు. మీలో దోషములు చేయనివారెవరైన నున్నయెడల వారుమాత్రమే రాళ్ళను పుచ్చుకొని యామెను కొట్టవచ్చును.

ఆ పలుకులను వినినంతనే యందరును తమ చేతులలోని రాళ్ళను క్రిందపారవేసిరి. తలవంచుకొని తమదారిని తాము పోయిరి. నీలో గంపలకొలది దోషములను పెట్టుకొని యితరులను లెక్కపెట్టుదువా? ఎంత అవివేకము! ముందు నీవు పరిశుద్ధుడవు కావు. ముందు నీవు పవిత్రుడవు కమ్ము. ఇతరుల దోషముల నెన్ను అర్హత నీకు లేదు. ఇతరులను నీవు సంస్కరింప ప్రయత్నింపకుము. నిన్ను నీవు సంస్కరించుకొనుము.

మహర్షి యగు భర్తృహరి కవీశ్వరు డిట్లు పలికెను. 'తెలివి యొకింత లేనియెడ దృప్తుడనై కరిభంగి సర్వమున్ దెలిసితినంచు గర్వితమతిన్ విహరించితి దొల్లి యిప్పుడుజ్వలమతులైన పండితుల సన్నిధి నించుక బోధశాలినై తెలియనివాడనై మెలగితిన్ గత మయ్యె నితాంత గర్వమున్'

నాలో జ్ఞానము కొంచెమైనను లేనపుడు మదపుటేనుగువలె గర్వించి సర్వమును నాకే తెలియునని విహరించినాను. ఇప్పుడుగొప్ప వారగు పండితుల నాశ్రయించి కొలది కొలదిగా గ్రహించుచు 'నే నేమియును తెలియనివాడ నని గ్రహించితిని. నా గర్వమంతయును పోయినది. ఈరీతిగా మహాకవి శేఖరుడగు భర్తృహరి మహర్షియే పలుకుచున్నపుడు ఇక సామాన్యుల విషయ మెంత ?

తే న్నావహించిన కార్పణ్య(అజ్ఞాన) మహాదోషమును గుర్తిం చినాడు పార్థుడు. దానికి తరణోపాయ మేమి? భగవంతుని పాదార విందముల నాశ్రయించుట ఎట్లు? సంపూర్ణమగు ఆత్మార్పణ భావ ముతో - పరమశ్రద్ధాన్విత చిత్తముతో - ఎందు నిమిత్తము? - శ్రేయోమార్గమును కాంక్షించి సామాన్యులగు భక్తులు భౌతిక భోగభాగ్య ధన ధాన్య గౌరవాధికార సంపదలు కాంక్షించి భగవా నుని ఆశ్రయింతురు. అది ఉత్తమ భక్తివిధానము కాదని భగవద్గీత ప్రబోధించును. శ్రేయోమార్గమును కోరియే పార్థుడు పార్థసారథిని ఆశ్రయించినాడు. శ్రేయస్సు అనగా ఆత్మకళ్యాణమార్గము. తొలి అధ్యాయములోని 31 వ శ్లోకములోను, రెండవఅధ్యాయములోని 7వ శ్లోకములోను, పంచమాధ్యాయములోని తొలి శ్లోకము నందును పార్థుడు శ్రేయోమార్గమును గూర్చియే మరల మరల కోరుకొనును.

సమస్తమును భగవంతునకు సమర్పింపుము. సర్వభావముల తోను ఆయనను శరణు పొందుము. మోక్షమందిర ప్రవేశమున కింతకంటె వేరొక మార్గములేదు.

భగవానుని శరణమును బొందిన భక్తమీరాబాయికి ముండ్ల పాన్పు హంసతూలికా తల్పమయినది. కాకోలవిషపాత్ర అమృత పాత్ర అయి శోభిల్లినది.

భగవానుని ఆశ్రయించిన ప్రహ్లాదకుమారుని జలధిరాజు తన తరంగ హస్తములతో ముద్దాడినాడు. పరమేశ్వరుని శరణాగతిని బొందిన ఉత్తరను, గర్భములో నున్నదన్న యామె శిశువును కాపాడి రక్షించినాడు. తన్ను శరణాగతిని బొందిన పార్థునిపై పార్థసారథి జ్ఞానామృత దివ్యధారలను వర్షింపచేయుచున్నాడు.



## 11. ఆత్మ బోధామృతము.

**The nectar of self knowledge.**

మానవుడనగా రెండు వస్తువుల సమ్మేళనస్వరూపము. ఒకటి ఆత్మ. రెండవది అనాత్మ. శరీరము-శరీరి; దేహము-దేహి; క్షేత్రము, క్షేత్రజ్ఞుడు; జడము, చైతన్యము; తిరుగలి రాళ్ళవలె ఒకటి చలనము లేనిది, రెండవది చలించునది. ఈ రెంటిసమ్మేళనమే సృష్టిలోని ప్రతి జీవి యున్నైయున్నది. ఈ రెండును విరుద్ధములగు గుణస్వభావములు గలవి. ఆత్మతత్వము వేఱు - శరీరతత్వము వేఱు. ఈ రెంటి భేదమును అనుభవపూర్వకముగా గ్రహించుటే మోక్షమునకు సోపానము. ఆత్మానాత్మవివేకమును గూర్చియే భగవాను డిందు పలుకు చున్నాడు-

శ్లో. అశోచ్యా నన్వ శోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః
(అ. 2 - శ్లో. 11)

ఓ అర్జునా! ఎందులకా శోకము! ఎవనిగూర్చి యాశోకము! ఎవరి కొరకు నీవు దుఃఖింప నవసరములేదో వారినిగూర్చి శోకించు చున్నావు. మఱియు పండితునివలె సంభాషించుచున్నావు. కాని జ్ఞానము మాత్రము లేశమైనను నీలోలేదు. జ్ఞాని యగువాడు చనిపో యినవారిని గూర్చి గాని, బ్రతికియున్నవారిని గూర్చి గాని శోకింపడు గదా? అని పరిహాసముచేయుచు మాధవుడు పలుకుచున్నాడు. నీవు కాని, నేనుగాని, ఈ రాజలోకము గాని, నాశము చెందువారము కాము.

నీవు ఆత్మస్వరూపుడవు. భగవత్ స్వరూపుడవు నీవు.జరామరణ ములు లేనట్టి- వృద్ధిక్షయములు లేనట్టి - జనన మరణములు లేనట్టి పరంజ్యోతి స్వరూపుడవు నీవు - అవినాశివి నీవు. ఆ మహాచైతన్య భాండారమే నీవు.

ప్రతిమానవుడును దైవమూర్తి యని ఉపనిషత్సార మగు గీత మనకు ప్రబోధముచేయుచున్నది. క్షుద్రమగు శరీరము నీవుకావు. దహింపబడు దేహము నీవుకావు. నీవు అఖండ సచ్చిదానందస్వరూపు డవు. సృష్టిని తారుమారు చేయగల మహాశక్తి నీలోనున్నది. క్షణ క్షణమును జీర్ణమగుచున్న రోగభూయిష్ఠమగు నీచశరీరము నీవుకావు. ఏమి గంభీరమగు ఉపనిషత్సందేశము!

పిరికిపందలను మహావీరులనుగా జేయుసందేశమిది. మానవుడు ఆత్మస్వరూపుడని చెప్పుచున్నదే! ఆత్మ శరీరములో ఎచ్చటనున్నది! అని ఒకసోదరి ప్రశ్నించుచున్నది. ఆత్మ శరీర మంతటను వ్యాపించి యున్నది. పరమాత్మలేని పరమాణువే లేదు. అది సర్వవ్యాపకము.

'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి' ఈశ్వరుడు హృదయస్థానములో విరాజమానుడై యున్నాడని గీత తెలుపు చున్నది. పరమాత్మ సర్వవ్యాపి యని తెలుపుచు హృదయమునందు వెలుగుచున్నాడని తెలుపుటలో పరస్పర విరుద్ధభావములను సూచిం చుటలేదా? అని పలుకుచున్నను అందు విరుద్ధ మేదియును లేదు.

ఆవు శరీరములో పాలు ఎచ్చటనున్నవో చెప్పుము. పొదుగులో నున్న వని నీవు సమాధానము చెప్పెదువు. పొదుగును కోసినచో పాలువచ్చునా రక్తము వచ్చుచున్నది. వాస్తవముగా చెప్పవలెనన్న చో గోవుయొక్క శరీరమం దంతటను పాలున్నవి. ఆ తిన్న ఆహారము రక్తముగా మారి తద్రక్తసారమే క్షీరరూపమును బొందుచున్నది.

అనగా గోవుయొక్క శరీరమందున్న రక్తమునం దెల్లెడలను క్షీరము లున్నవి. కాని చెవులను పిండినచో పాలువచ్చునా? కొమ్ము లను లాగినచో పాలు వచ్చునా? రావు. పొదుగువద్ద మాత్రమే ఘర్ష ణము చేసినచో పాలువచ్చును.

శాస్త్రము మిమ్ములను మూడు ప్రశ్నలను వేయుచున్నది. కస్త్వం? కోహం? కుతఆయాతః నీవెవ్వరవు? నేనెవ్వడను? నీవు ఎచట

నుండి వచ్చినావు? ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పుము. చూతిము! నా పేరు భీమయ్య, సోమయ్య, వెంకట్రావు, సుందరమ్మ, కృపావర్మ, అని మీరు సమాధానము నిత్తురు. కాని గీత ఏమనుచున్నది? మిత్రులారా! మీ పేర్లు అవిగావు. మీతల్లిదండ్రులు మీ జనన కాలమున సంజ్ఞార్థముగా మీకుపెట్టినపేర్లు మాత్రమే అవి. మీరు భగవత్స్వరూపులు సృష్టికర్తలు! ఆత్మస్వరూపులని గీత మీకు బోధించుచున్నది. మీరువచ్చినది పరమాత్మనుండి. మరల పోవునది ఆపరమాత్మవద్దకే' అని గీత పలుకుచున్నది. నీవెట్టివాడవో తెలియునా !

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః. 23

నిన్ను శాస్త్రములు ఛేదింపలేవు. అగ్నిహోత్రుడు నిన్ను కాల్పజాలడు. జలములు నిన్ను తడుపజాలవు. వాయువు శోషింప చేయలేదు. అట్టి ఆత్మస్వరూపుడవు నీవు. నశింపని పదార్థము కొరకు శోకము.

ఇక శరీరతత్వమును గూర్చి చెప్పుచున్నాను వినుము.

'దేహినోస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి ॥
( అ 2-శ్లో 13 )

శరీరము నిరంతరమును మార్పును చెందుచుండును. చంద్రకళలువలె శరీరమునకు వృద్ధిక్షయములు గావు. శరీరము ప్రతిక్షణమును చనిపోవుచునేయున్నది. దుర్భిణీ యంత్రంముతో నీ శరీరముపై చూచినచో కోట్లకొలది పరమాణువులు క్షణక్షణమును నశించుచున్నట్లును, క్రొత్త పరమాణువులు కలుగుచున్నట్లు తెలిసికొనగలవు. ప్రతిక్షణమును నీ శరీరమిట్లు మార్పుచెందుచున్నను నీస్థూల నేత్రమునకీ రూపాంతరము గోచరించుట లేదు.

శరీరములో స్పష్టముగా గోచరించు మార్పులైన నీవు గమనించుచున్నావా?

నీవు తల్లి గర్భమునుండి పుట్టినప్పుడు కాళ్ళును, చేతులును కదపలేవు. నీ బరువుకూడ రెండు మూడు పౌనులుమాత్రమే. కొద్దిమాసములకు నీవు ప్రాకగలుగుచున్నావు. అనగా నీశరీరము మార్పుచెందుచున్నది. మరికొంతకాలమునకు శరీరములో మార్పు కలుగుచున్నది. నీ విప్పుడు పరుగెత్త గలుగుచున్నావు. కొన్నిసంవత్సరములకు బాల్యము నశించి యౌవనము కలుగుచున్నది. పూర్వపు చలనములేని బాల్యస్థితి కాదు. ప్రాకునట్టిస్థితియు కాదు. వాస్తవముగా చూచిన కొత్తశరీరమే నీకు కలిగినది. కాని బాల్యముపోయి కౌమారమువచ్చినను, కౌమారము నశించి యౌవనము ప్రాప్తించినను నీవుశోకించుట లేదు. పైగా సంతసించుచున్నావు. కొంతకాలమునకు వృద్ధాప్యము వచ్చుచున్నది. ఇదియును శరీరంలో కలుగుచున్న ఒక మార్పే. కాని దీనికి నీవు దిగులుచెందుచున్నావు. బాల్య యౌవనములు ఎట్లు శరీరమందు మార్పులో అట్లే వృద్ధాప్యముకూడా మార్పేయని భావించిన నీకు శోక ముండదు. మరణముకూడా ఒకమార్పే. మరణానంతరము కర్మానుసారముగా నూతన జన్మ కలుగుచున్నది. నిరంతరమును మార్పుచెందు శరీరమునుగూర్చి విచారించుట బుద్ధిహీనత. ఏడుసంవత్సరము లగుసరికి శరీరములోని ప్రతి రక్తబిందువును మార్పుచెంది నూతన రక్తబిందువు లేర్పడునని వైద్యశాస్త్రము చెప్పును.

'జాతస్య హి ధ్రువో మృత్యుః
ధ్రువం జన్మ మృతస్యచ' (అ 2 - శ్లో 27)

పుట్టిన ప్రతిప్రాణియు మరణించుట తప్పదు. రాజాధిరాజగుగాక - నిరుపేద యగు గాక - పండితుడగుగాక - పామరుడగుగాక - బలవంతు డగుగాక - బలహీను డగుగాక-మరణ మనివార్యము. జననము కలిగినపుడు మరణమున్నది. కనుక జనన మరణ రహితమగు మార్గమును పొందు మని గీత బోధించుచున్నది.

ఈ సందర్భమున మనోహరమగు నొక యుదాహరణమును మనవి చేయుదును.

గ్రీకు సామ్రాజ్యాధిపతియగు అలెగ్జాండరు సార్వభౌముడు! హిమాలయ పర్వతప్రాంతములలో నొక పర్యాయము విహరింపసాగి నాడు. భారత వర్షములో కాంతాకాంచనములను విసర్జించిన పుణ్య మూర్తులున్నారని ఆయన లోగడ వినియుండెను. అట్టి మహాపురుషుల దర్శనభాగ్యము లభించునాయని ఆయన జిజ్ఞాసువై తిరుగుచుండెను. కొంతదూరములో విశాలమగు నొక పెద్దరాతిబండ గోచరించు చున్నది. దానిపై ఆజానుబాహుడగు నొకసుందరవ్యక్తి పద్మాసనాసీ నుడై కూర్చుండి యుండెను. ఆయన దిగంబరుడు. శరీరము బంగారు కాంతులను ప్రసరింపచేయు చుండెను. అర్థనిమీలిత నేత్రములతో మూర్తీభవించినశాంతి దేవతవలె గోచరించు నా మహనీయునివైపు అలెగ్జాండరుచక్రవర్తి పరుగులెత్తెను. ఆ దివ్యమూర్తిని గాంచి చక్ర వర్తి నిశ్చేష్టితుడయ్యెను. భారతీయదివ్య పురాణములలో వర్ణింప బడిన మహాత్ము లిట్టివారలే యైయుందురని ఆయన భావించి లోలోన- నమస్కరించెను. ఆ దేవతామూర్తిని పరీక్షింపగోరి గ్రీకు చక్రవర్తి యిట్లు గంభీరముగా పలికెను. 'ఓ దిగంబరమూర్తీ,నీ వెవ్వరవు? నేను సువిశాలసుందర గ్రీకు సామ్రాజ్యాధిపతిని - అలెగ్జాండరు మహాప్రభు వును నేను - లేచి నీవు నాకు నమస్కరింప వేమి?

మౌని చంద్రుడు మాటాడుట లేదు.

'నాయధికార ప్రభావమునకతడు తలయొగ్గుటలేదు. కాంచన కాంతాసక్తిని కలిగించి చూచెదను. గాత' అని భావించి అలెగ్జాండ రిట్లుమరల గంభీరముగా పలికెను.

'ఏమోయీ; నేను గ్రీకు సామ్రాజ్యాధిపతిని. కోట్లకొలదిమహా సేనాసమూహముల కధిపతిని నేను. సర్వప్రపంచమును జయించుటకు బయలుదేరిన మహావీరశేఖరుడను. నేను నీయందు దయగలిగి నిన్ను

నా దేశమునకు తీసికొని పోవలచుచున్నాను. సర్వసుఖ భోగభాగ్యము లతో నీవు తులతూగగలవు. అందమగు సుందరాంగు లెందరో నా యంతఃపురమునగలరు. నీ యిచ్చవచ్చిన వన్నెలాడులను పరిణయ మాడి నా వసంతోద్యానమున వారలతో సర్వసుఖభోగములను బొందుదువు కాన వెంటనే లేచిరమ్ము'

మునీంద్రుని నోటినుండి ఒక్క పలుకైనను వచ్చుటలేదు. చక్రవర్తి దిగ్భ్రాంతుడైనాడు. 'ఏమిది? కాంతా వ్యామోహామునకు గురికానివా రీజగములో నుందురా? ఏమైనను గానిమ్ము. ఇంకను ఈ తాపసిని పరీక్షింతునుగాక'అని భావించి వెంటనే తన యొరలోనుండి భయంకరమగు కరవాలమును పైకి తీసెను.

'ఓయీ చూచుచున్నావా-ఈ భయంకర కరవాలము లక్షల కొలది వీరాధివీరుల వేడి రక్తధారలను దాహాము కొన్నది. నే నెన్ని చెప్పినను మాటాడకున్నావు. రాజాధిరాజు నగు నన్నే ధిక్కరించు చున్నావా ఏమి నీ సాహసము - పలుకవేమి - ఇదిగో యిప్పుడే ఈ ఖడ్గముతో నీ శిరమును ఖండించుచున్నాను' అని పలుకుచు తనకత్తిని ఝుళిపించెను.

అప్పుడు మునీంద్రుడు చిరునవ్వు నవ్వుచు నిట్లు పలికెను. 'ఓరాజా! ఏమి నీ గర్వము- ఎందుల కీయహంకృతి? నీఖడ్గము నన్ను ఖండింపలేదు. శస్త్రాస్త్రములును ఛేదించలేవు. అగ్ని నన్ను దహింప లేదు. జలములు నన్ను తడుపజాలవు. నేను ఆత్మస్వరూపుడను - సూర్యులకు సూర్యుడను - సర్వశక్తిమంతుడను నేను.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి, నైనం దహతి పావకః'
న చైనం క్లేదయన్త్యాపో, న శోషయతి మారుతః (అ.2 శ్లో.23)

అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽయ,మక్లేద్యోఽ శోష్యఏవ చ,
నిత్యస్సర్వగతస్థాణు, రచలోఽయం సనాతనః (అ. 3 శ్లో. 24)

ఆ మునీశ్వరుల నోటినుండావచ్చిన ఆమధుర దివ్యగీతావాణి నాల కించినంతనే చక్రవర్తి చేతిలోని కరవాలము జారిపోయినది. వెంటనే ఆరారాజు మునిరాజునకు పాదాక్రాంతు డయ్యెను.

ఈ ప్రకరణములోని దివ్య శ్లోకములను పారాయణముచేసి నంతనే మహాశక్తి తేజములు పాఠకునకు కలుగుననుటలో సందేహ మేమున్నది?

ఒకసారి వివేకానందస్వామి హిమాలయములలో ప్రయాణము చేయుచు – కొన్ని దినములు ప్రయాణము చేయుచు – కొన్ని దినములవరకు ఆహారము లేకుండుటచే – మిక్కిలిగా అలసిపోయి ఒక చెట్టు నీడను కూర్చుండెను. వెంటనే గీతలోని ఈ అధ్యాయము లోని ఈ దివ్య శ్లోకరాజములను పారాయణముజేసి మహాశక్తిని, బలమును, తేజస్సును బొంది మరల ప్రయాణము సాగించి గమ్య స్థానము చేరె నని ఆయన జీవితగాథ తెలుపును.

ఈ దివ్యశ్లోకముల పారాయణముచేత నీరసుడు మహాబలశాలి కాగలడు. నిర్వీర్యుడు శక్తిసంపన్ను డగును. సోమరి కర్మయోగి కాగలడు.



## 12. ఆత్మ - శరీరము

**The supreme self and the body.**

ఆత్మయొక్క లక్షణములను గురించియు శరీరముయొక్క లక్ష ణములను గురించియు గ్రహించినాము. ఆత్మకును శరీరమునకు గల సంబంధ మెట్టిదో గ్రహింతము.

వాసాంసి జీర్ణాని యథావిహాయ, నవాని గృహ్ణాతి నరోపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా, న్యన్యాని సంయాతి నవాని దేహీ.
(అ. 2. శ్లో 22)

జీర్ణములయిన వస్త్రములను వదలివేసి క్రొత్త దుస్తులను మానవుడు ధరించునట్లు, ఆత్మ శిథిలమగు శరీరములను వదలి నూతన శరీరములను దాల్చుచున్నది. మానవుడు వదలివేయు మలినమగు చినిగిన బట్టకును ఆత్మ వదలివేయు శిథిల శరీరమునకు పోలిక చెప్పబడినది. అయితే యిచ్చట మీకొక సందేహము గలుగవచ్చును. మలినవస్త్రములను వదలునప్పుడు మానవునకు సంతోషముకలుగుచున్నది. కాని ఆత్మ శరీరమును విడుచునప్పుడు అనగా మరణసమయమునందు దుఃఖమును మానవుడు పొందుచున్నాడు. పైగా బంధుమిత్రులకు కూడ దుఃఖకారణ మగుచున్నది. వ్యాసదేవుని ఈ ఉపమానము సరిగానున్నదా ? యని సందేహించుచున్నావు. సరిగానే యున్నది.

చంటిపిల్లవానికి తల్లి చక్కని చొక్కాను తొడిగినది. బిడ్డ వీథిలోని దుమ్ములో పొర్లి ఆడుచుండుటచేత ఆ చొక్కా యంతయును మలినమై పోయినది. తల్లి వచ్చి చూచి, 'బాబూ, చొక్కా మాసిపోయినది. దీనిని విడిచి క్రొత్తచొక్కాను తొడుగుకొనుము' అని చెప్పును. కాని అజ్ఞానవశమున బాలుడు 'నే నీ చొక్కాను వదలను' అని మారాముచేయును - ఏడ్చును. కాని తల్లి ఏమి చేయును, బాలుడు వలదని యేడ్చుచున్నను, తల్లి ఆబిడ్డ క్షేమమును గోరి ఆమలిన వస్త్రములాగి పారవేయును. మరియొక మంచి చొక్కాను ఇచ్చును. ఇదియే రీతిని భగవానుడు ఆ జీవునియొక్క క్షేమమును కాంక్షించి- అతడు వలదని ఏడ్చుచున్నను సరకుచేయక- శిథిలమయిన ఆ శరీరమును వదలించి వానికితగిన మరొక శరీరమును (చొక్కాను) ఇచ్చుచున్నాడు.

ఇచ్చట మీకు మరొక సందేహము కలుగుచున్నది. మనుష్యుడు శిథిలమైనట్టియు - మలినమైనట్టియు - [illegible] వస్త్రములనే కదా విడుచుచున్నాడు - బాగుగా [illegible] యున్నది. కాని జీవుడు శిథిలమగు దేహమునే విడుచుచున్నా[illegible]



తనము రాకపూర్వమే మరణించువా రెంతమంది? యౌవనమునందే- బాల్యమునందే - మరణించువా రనేకులు కనబడుచున్నారే - ఇవి జీర్ణశరీరములును శిథిలదేహములును కావుకదా? ఈఉపమాన మెట్లు సరిపోవును ?

'జీర్ణాని శరీరాణి'అనుపదమునకు ప్రారబ్ధకర్మానుభవము పూర్తి యగుటచేత జీర్ణమయిన లేక శిథిలమయిన శరీరమని యర్థము. అది యౌవనమగుగాక - వృద్ధాప్యమే యగునుగాక లేక బాల్య కౌమార ములే యగునుగాక. ప్రారబ్ధకర్మానుభవము పూర్తియగుటచేత, ఆ శరీరముయొక్క ప్రయోజనము క్షీణించుచున్నది.అదియే జీర్ణశరీరము. తిరిగి ఆ జీవుడు తా ననుభవింపవలసిన ప్రారబ్ధకర్మకు సరియగు శరీర మును పొందుచున్నాడు. 'శరీరాణి' అని పలుకుటచేత అనేక శరీరము లను లోగడ జీవుడు ధరించినా డని యర్థము. ప్రారబ్ధకర్మానుసార ముగా మనము - దేవ, మానవ, మృగజంతు, పక్షి, సరీసృప క్రిమి కీటక లతాగుల్మాది రూపముల నెన్నిటినో పొందియే యుందుము.

ఈ జనన మరణ క్లేశమునుండి రక్షణమును బొందు మనితోయె శదా శంకరుడు గానము చేయుచున్నాడు.

'పునరపిజననం పునరపి మరణం, పునరపి జననీ జఠరే శయనం
ఇహసంసారే బహుదుస్తారే, కృపయాపారే పాహిమురారే !!
భజగోవిందం భజగోవిందం, గోవిందం భజ మూఢమతే.'

ఓమూఢుడా! ఈ సంసారసాగరము దాటుటకు శక్యముకానిది. మరలమరల పుట్టుచు, మరలమరల మరణించుచు; చీముతోను, నెత్తు రుతోను, దుర్వాసనతోను, కూడిన మాతృగర్భప్రవేశమును బొంది దుఃఖించుచున్నాడు. కరుణాసముద్రు డగు శ్రీహరి పాదపద్మములను ఆశ్రయింపుము. పునర్జన్మ రాహిత్యము సిద్ధించును. ఓ మూఢుడా! గోవిందుని భజింపుము.

## 13. ధీరుడే అమృతత్వమును పొందును.

**The here is only eligible for immortalety.**

'సమదుఃఖ సుఖంధీరం, సోమృతత్వాయ కల్పతే' (అ 2-శ్లో 15)

అమృతత్వ మనగా మోక్షము. దానినే బ్రహ్మనిర్వాణ మని పిలువ వచ్చును. లేదా మీమీ సంప్రదాయానుసారముగా వైకుంఠ మని, కైవల్యమని బ్రహ్మనిర్వాణమని, స్వర్గమని పిలువుడు. జీవుడు పొందు ఉత్తమోత్తమస్థితియే అమృతత్వము. 'ధీరుడు' అనగా ఖడ్గ పాణియై యుద్ధరంగములో ప్రవేశించి అనేకులను చంపిన వాడని మీరు సామాన్యముగా భావింతురు. లేక ఘనకార్యములు చేసిన వాడని మీరు చెప్పుదురు. ఆకాశములో నెగురుట - నీటిలో మును గుట - మరియు నిరంతరములగు సాహస కార్యములను చేయుట వల ననే మానవుడు ధీరుడని పిలువ నర్హుడుకాడు.

ఒకానొకడు హిమాలయ శిఖరముపై కెక్కి- జెండాను స్థాపించ వచ్చును. కాని సామాన్యమగు గృహకలహము సంభవించినచో దుఃఖములో మునిగిపోవచ్చును. ఒకడు పసిఫిక్ మహాసముద్రములో మునిగి అనేకమాసము లుండవచ్చును. కాని తనకు కలిగిన చంటిబిడ్డ మరణించె ననువార్త వినగనే క్రుంగి కృశించిపోయి పిచ్చియెత్తిన వాడు కావచ్చును. అట్టివారు ధీరు లెట్లు అగుదురు ?

'నాయమాత్మా బలహీనేన లభ్యః'

**'Atman cannot be attained by the week.'**

బలహీనునకు ఆత్మ లభ్యముకాదు. బల మనగా రెండువందలపౌనులు తూకము కలిగియుండుట కాదు. బస్తాలను ఎగురవేయుట కాదు. తాటిచెట్టును ఒకగ్రుద్దుతో పడగొట్టిన మహావస్తాదు, భార్య తనకు విడాకులిచ్చినదని బెంగపెట్టుకొని మరణించినాడు. ఏనుగును తన ఛాతీపై నిలిపిన మరియొక వస్తాదు కుమారులతో గృహకలహము వచ్చి మందుత్రాగి మరణించినాడు. పంచాగ్ని మధ్యమున నిలువబడి

తపస్సుచేసిన మహాధీరుడగు మునీశ్వరుడు కిలకిలలాడు ఒక కాంత యొక్క వాలుచూపుల ధాటికి తాళలేకపోయినాడు. లక్షలకొలది సైన్యములను చిత్రవధచేసి మహాపరాక్రమశాలి యయిన సేనాధ్యక్షుడు వేశ్యాంగన బిగికౌగిటిలో బందీ యగుచున్నాడు. వీరా ధీరులు ?

వీరికా అమృతత్వము సిద్ధించునది ? కాదు కాదు. మానవునకు సుఖదుఃఖములను గలిగించునవి యింద్రియములు. వీనిమూలమునే మానవుడు బంధింపబడి జ్ఞానమును గోల్పోవుచున్నాడు. అదిగో శంకరుని దివ్యగానము.

'అంధస్య మే హృత వివేక మహాధనస్య
చోరైర్మహాబలిభి రింద్రియ నామధేయైః
మోహాంధకార కుహరే వినిపాతితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం'

ఓ లక్ష్మీనృసింహస్వామీ, బలవంతులైన యింద్రియము లను దొంగలు రాగాంధుడనైన నన్ను మోసగించి ఆత్మజ్ఞానమను మహాధనమును దొంగిలించుకొని పోవుచున్నారు. అజ్ఞాన మను కారుచీకట్లు క్రమ్మిన భయంకర గుహలో నన్ను పడద్రోసినారు. ప్రభూ ! నీ చేయూత నిచ్చి నన్ను రక్షింపుము.

కన్ను-ముక్కు - చెవి - నాలుక- చర్మము అనునవి జ్ఞానేంద్రియము లైదు. వీనివలన మనకు ఒకప్పుడు సుఖమును మరొకప్పుడు దుఃఖమును కలుగుచున్నవి. ఈ సుఖదుఃఖములును శాశ్వతములు గావు. ఇవి వచ్చుచు పోవుచు నుండును. పనసాది వృక్షముల కరణి లాభాలాభములును కష్టసుఖములును మానావమానములును జయాపజయములును ప్రారబ్ధకర్మానుసారముగా ఆయాకాలములందు వచ్చుచు పోవుచు నుండును. వీనికి వికారముచెందక తితిక్షను వహింపు మని గీత యొక్క హెచ్చరిక. అట్టి తితిక్షాపరుడే మోక్షమునకు అర్హుడు.

తపస్సులు- దానములు - వ్రతములు ఉపవాసములు–ఇవియే మోక్ష ప్రదములని భావించుట తెలివితక్కువ. కావలసినది ద్వంద్వాతీతమగు స్థితి. ఆస్థితిని పొందుటకు పై విధానములు సాధనములు కావచ్చును.

సుఖదుఃఖములను నిగ్రహించినవాడే ధీరుడు. వాడే అమృతత్వమును బొందును.



# 14. వియోగ మేల దుఃఖహేతువు ?

## Why separation sorrowful ?

సంయోగ మెచ్చటగలదో వియోగమును అచటనే యున్నది. ఉదయించిన సూర్యుడు అస్తమించక మానడు వికసించిన పూవు వాడకమానదు. పుట్టినప్రాణి గిట్టకమానదు. సంయోగ వియోగాలు ప్రకృతి సహజధర్మాలు.

భరతుడు చిత్రకూటాద్రిపై నున్న రాముని వద్దకు వచ్చి దశరథుని మరణవార్తను రామునికి తెలియజెప్పి శోకింపసాగినాడు. అప్పుడు రాము డిట్లు పలుకును.

'డాకతోనదిని కాష్ఠంబు కాష్ఠంబు
జోకమై పాసిన చొప్పు దీపింప
పుత్రమిత్ర కళత్రములు పాయుడాయు
మైత్రి ఋణానుబంధముల రూపములు
అవనిపై పుట్టిన యప్పుడే చావు
ధ్రువము జీవున కని రూపింప నరుడు
'తనకులోచితమైన ధర్మమార్గమున
మనెడివా డిహాపర మాన్యుడై యుండు.

(రంగనాథ రామాయణము)

రత్నములు, మణులు, మాణిక్యములకంటె విలువయయిన శ్లోకరాజములు. గీత యంతయును కంఠస్థము గాకున్నను ఈ పదునెనిమిది శ్లోకములైనను ముఖ్యముగా కంఠస్థముచేసి ప్రతిదినము పారాయణము చేయనగును. పవిత్ర ఆశ్రమములలోను, గీతామందిరములలోను ఈ పుణ్యశ్లోకములు ప్రతిదినమును గీతాభక్తులు పఠింతురు.

ఈ ఉత్తమగుణసంపత్తినే గీతాసార్వభౌముడు పలుతావులలో మరల గానముచేసినాడు. అంతమాత్రముచేత నిది పునరుక్తిదోషమనబడదు. మహారచయిత తానే ముఖ్యవిషయమును ప్రజాకోటికి చెప్పదలచినాడో దానిని తన గ్రంథములో అవకాశమువచ్చిన తావునందెల్ల తెలుపుచునే యుండును. అదియే ఆ గ్రంథముయొక్క సందేశ మని చెప్పనచ్చును. గీతాచక్రవర్తి ఈ ప్రధానవిషయమును మరలమరలచెప్పుటలో ఇదియే గ్రంథసందేశ మని తేటతెల్లమగును. గీతలోని మూడు షట్కములందును ఈవిషయము గాననగును. కర్మషట్కములోనిదగు రెండవ అధ్యాయమునందు 'స్థితప్రజ్ఞ' లక్షణములున్నవిగదా. భక్తిషట్కములోనిదగు 12 వ అధ్యాయములో 13 వ శ్లోకమునుండి 20 వ శ్లోకమువరకు భక్తునియొక్క లక్షణములను గూర్చి తెలిపియున్నాడు. అవియును స్థితప్రజ్ఞ లక్షణములనే పోలియున్నవి. మరల మూడవ షట్కమగు జ్ఞానకాండమందు 14 వ అధ్యాయములో 22 వ శ్లోకమునుండి 27వ శ్లోకమువరకును త్రిగుణాతీతుని, గుణములను గురించి పరమాత్మ తెలుపును. ఇవియును పై రెండు భాగములనే బలికియున్నవి. కొన్ని పదజాలమునందు కూడా మార్పులేకుండగనే తెలుపబడినవి. దీనినిబట్టి స్థితప్రజ్ఞు డన్నను, భక్తు డన్నను, త్రిగుణాతీతు డన్నను ఒకడే యని తేలును. మూడుతావులయం దీవిషయమునుగూర్చి తెలిపినను భగవానుడు తృప్తిని చెందలేదు కాబోలు. ఆ పుణ్యగుణసంపత్తిని తన భక్తకోటికి మరలమరల చెప్పదలచినాడు పరమాత్మ. అదిగో! అయిదవ అధ్యాయమును చూడుడు.

ఎవరో నీకు తెలియునా? ఆమె ఎవరికి యిల్లాలో నీ వెరుగుదువా? ఆమె స్త్రీయై యుండెనో లేక పురుషుడై యుండెనో నీ వూహింప గలవా? ఆమె మృగమో - వృక్షమో - క్రిమియో - నీకు తెలియునా? పోనీ ఆమె మరణానంతరము ఏమియగునో నీకు తెలియునా? ఆమె మరల స్త్రీయగునో, పురుషు డగునో, ఎవరికి ధర్మపత్నియో, ఎవరికి భర్తయో, లేక మృగరూపమును ధరించునో, మరే యవతారము నెత్తునో నీ వూహింపజాలవు కదా! ఇదియే రీతిని పుత్రులు, బాంధవులు, మామలు, మేనమామలును గూడా.

జననమునకు పూర్వముగాని, వారి మరణానంతరముగాని, వారి నివాసములు - వారి వర్తనములు నీకు తెలియవు. జనన మరణములకు మధ్యనున్న స్వల్ప పరిమిత కాలపరిచయము మాత్రమున - వియోగమునకై యింతగా దుఃఖింతువు. అనివార్యమయిన మరణమునుగూర్చి శోకించుట యోగ్యముకాదు. నీవు కోటిప్రయత్నములు చేసినను మృత్యువునుండి తప్పించుకొనలేవు.

నీవు రైలుప్రయాణము చేయునపుడు వివిధస్టేషనులనుండి యనేకమంది ప్రయాణికులు రైలులో నెక్కి నీతో మాట్లాడుచుందురు. వారితో నీవును గోష్ఠి సలుపుచుందువు. వారి వారి నియమితములగు స్టేషనులు వచ్చినతోడనే వారు దిగిపోవుచున్నారు. వారి వియోగమునకు నీవు దుఃఖించుచున్నావా? అదియే రీతిని జీవయాత్రయందు ఈ రైలుప్రయాణములో భార్యలుగా, మిత్రులుగా, బాంధవులుగా వత్తురు. వారి వారి కాలానుసారముగా పరిచయమును గలిగించి వారి మార్గమున వారు పోవుచుందురు. దీనికై విచారింపనేల? సంయోగ వియోగములను నిగ్రహించినవాఁడే ధీరుఁడు.

ఆంగ్లభాషలో 'గ్రే' అను మహాకవి యిట్లు పలుకును.

"The pomp of learning, the
boast of heraldry

All the wealth or all the fortune
that can give
Await alike the invitable
hour
The path of glory lead us
but to the grave."

పాండితీప్రాభవము, పరాక్రమ విశేషము, ధనయశంబులు ప్రాప్తించు ధౌరంధర్యము - ఇవి యన్నియును స్మశానమునకే దారి చూపును.

"Keep thy self as a piligrim
and a guest upon the earth
to whom belongeth nothing of
wordly business" (Imitation of Christ)

'ఈ విశాల భూతలరంగమందు సొంతవ్యాపార మెద్దియును లేని యాత్రికునివలెను, అతిథివలెను సంచరింపుము.'



## 15. స్వధర్మముద్వారా మోక్షము-ఉదాహరణములు

**Immortality by the perfarmance of ones own-diety — Examples.**

స్వధర్మాచరణమును గూర్చి గీత విశేషముగా ప్రబోధము చేయుచున్నది. స్వధర్మాచరణము చేతనే మానవుడు మోక్షమును పొందును. మంగలి - చాకలి - కమ్మరి - కుమ్మరి - రైతు - ఉపాధ్యాయుడు - సైనికుడు - ప్రభుత్వోద్యోగి తమ తమ స్వధర్మములను నియమానుసారముగా చేయుటచేతనే అమృతత్వమును బొందుదురు. మహాభారతములో దీని కనేక కథ లుదాహరణములుగా చెప్పబడినవి.

'జాజిలి' యనుపేరుగల బ్రాహ్మణుడు 'తులాధరు'డను వైశ్యునివద్దకు బ్రహ్మజ్ఞానార్థము వచ్చెను. తుల్గాధరు డిట్లు పలికెను.

'ఓ బ్రాహ్మణకుమారా! నాకు వేదములు రావు – శాస్త్రములు తెలియవు. మంత్రోపదేశములు నాకు లేవు. తపస్సులేమియు చేయలేదు. ఇదిగో చూడుము 'తులాదండము' ఎవరు నావద్దకు వచ్చినను– బాలుడగుగాక, వృద్ధుడగుగాక, అంధుడగుగాక ఈ తులాదండ మెప్పుడును సమానముగా నుండునట్లుగా చేసియే సరకుల నిచ్చుచుందును. ధర్మబుద్ధితో నా స్వధర్మమును చేయుదును. ఇదియే నేనుచేయు కర్మ. నా స్వధర్మమే నాకు తపస్సు. ఈ స్వధర్మముచేతనే నా మనస్సు పవిత్రమైన శాంతిని బొందుచున్నది.

భగవద్గీతయొక్క విశిష్టసందేశ మిది. ఏస్థాయిలో నున్న మానవుడు ఆస్థాయిలోనేయుండి మోక్షమును బొందవచ్చును. ఏ స్థానములోనున్నవాడు ఆస్థానమునుండియే తరింపవచ్చును. స్థానమును మార్చనక్కర లేదు. వృత్తిని మరొకటిగా నవలంబింప నవసరము లేదు. మతమునుగాని కాలముగాని మార్చుకొన నావశ్యకత లేదు. బ్రాహ్మణుడును – పంచముడును నిరువురును తమ స్వధర్మము ద్వారా మోక్షమును బొందగలరు.

వంటయింటిలో పనిచేయు ఇల్లాలు వంటయింటిలో మోక్షమును బొందవచ్చును. వంటపని వదలి – భర్తయొక్క శుశ్రూషను వదలి – గురువులనుచేరి వారికిసేవచేసి – అన్యస్థానములకు చేరనక్కర లేదు. అట్లు స్వధర్మమును వ్యతిరేకించుట భయావహ మని గీత చెప్పుచున్నది.

'స్వధర్మే నిధనం శ్రేయః' స్వధర్మములో మరణమే శ్రేష్ఠము. పరధర్మము ఎంత బాగుగా కానుపించుచున్నను దానిని ఆశ్రయింపకుము. అది దుఃఖహేతువు.

కౌశికుడు బ్రాహ్మణకుమారుడు. తల్లిదండ్రులు కడు వృద్ధులు. మాతా పితృసేవయే అతని స్వధర్మము. ఆస్వధర్మము వలననే అతడు తరించగలడు. కాని అతనికి స్వధర్మమునందు లక్ష్యము లేదు. గొప్పగా

తపస్సుచేసి పేరు గడించవలెనని - పురుషార్థమును గడింపవలెనని యాతనికి ఊహకలిగినది.

స్వధర్మమగు మాతా పితృసేవను వదలి అడవిలో తపస్సు ప్రారంభించినాడు కౌశికుడు. కొంతకాలమున కాతనికి కొద్దిపాటి శక్తి కలిగినది.ఒకనా డతడు చెట్టుక్రింద కూర్చుని యుండగా పై నుండి కొంగ యొకటి అతనిపై రెట్టవేసినది. కౌశికునకు ఆగ్రహము కలిగినది. తపోనిధియగు నాపైని క్షుద్రమగు ఈపక్షి రెట్టవేయుటయా యని కోపారుణనేత్రాలతో పై నున్న కొంగను తీవ్రముగా చూచినాడు. ఆతపశ్శాలి కోపాగ్నికి గురియై ఆపక్షి చనిపోయి క్రిందపడినది. కౌశికునకు ఆనందము కలిగినది. తన తపశ్శక్తి ఈవిధముగా పక్షిని సంహరింపకలిగినదని పొంగిపోయినాడు. మోక్షమును పొందుట కుపయోగ పడవలసిన తపశ్శక్తి యీ విధముగా పక్షి మరణనిమిత్తముగా వ్యర్థమైపోయినదని విచారము కలుగలేదు. అహంకారము కలిగినది. అది పతన హేతువుకదా - అంతట ఆపతితమానిశ్వరుడు భిక్షార్థమై గ్రామములోనికి పోయినాడు.

ఒకగృహస్థుని యింటిముందు నిలచి 'భవతి భిక్షాం దేహి' అని పలికినాడు. ఆయింటి యిల్లాలు పతివ్రతాశిరోమణి. ఆ సమయములో ఆమె తనస్వధర్మమగు పతిసేవలో నిమగ్నురాలై యుండెను. అందుచే అతిథి సేవకు ఆలస్యమయినది. కౌశికునకు లోలోన క్రోధాగ్ని రగుల్కొనుచున్నది. 'నావంటి తపశ్శీలుడు గుమ్మమువద్ద వేచియుండగా- ఈ యింటి యిల్లాలు ఇంత ఆలస్యముచేయుచు నన్ను నిర్లక్ష్యము చేయుచున్నదే!' అని అహంకారముతో భావించుచున్నాడు. పతిసేవ పూర్తియైన పిదప ఆమె కౌశికునకు తన యింటగల వస్తువులతో ఆతిథ్యమునీయ గుమ్మమువద్దకు వచ్చినది. కౌశికునకు చాలకోపము కలిగి గుడ్లెఱ్ఱగాచేసి ఆ సాధ్వీమణివైపు చూచినాడు. ఆ పతివ్రత యిట్లన్నది. 'నాయనా!క్రోధారుణనేత్రములతోచూచినచో చచ్చిపడి

పోవుటకు చెట్టుపైనున్న కొంగను కాదుసుమీ? - ఎందులకా అహంకారము. మునీశ్వరునకు కోపము కలిగిన అతడు చండాలతుల్యుడు. నాపతి సేవచేయుటలో నాలస్యమయినది. నీవు కాదుగదా - భగవంతుడు వచ్చినను - నాస్వధర్మమైన పతిసేవ చేసిన పిమ్మటనే వచ్చి ఆభగవంతుని పూజింతును. భగవత్సేవకంటె నాపతి సేవయే నాకు పరమపూజ్యము. నా భర్తయే నాకు భగవంతుడై యింట వెలసి యుండ వేరొక భగవంతుడేల? వేరొక అతిథి పూజయేల? నాస్వధర్మాచరణానంతరమే తక్కినవి సుమా. నీస్వధర్మమైన మాతా పితృసేవను నిర్లక్ష్యముచేసి - తపస్సుచేత మరేదియో సాధింతునని వచ్చినావు.

ఓహో ఏమి పవిత్రవాణి 'సీత, సావిత్రి, దమయంతి, శీలవతుల పూత పాదాంబుజాతపరిపూతభూమి'మన భారతభూమి. ఇట్టి సాధ్వీమ తల్లుల చలువచేతనే భారతభూమి యింకను సస్యశ్యామలమై వర్ధిల్లుచున్నది.

భర్తలకు సేవచేయక గురువు లనుపేరుతో పరపురుషులకు కాళ్లు పట్టిన మోక్షము సిద్ధించునా? భర్తలను తిట్టిపోయుచు పరపురుషులకు పరమాన్నములు నివేదించిన ముక్తిగలుగునా? స్వధర్మమే మోక్షమార్గ మని గీతాచార్యుని దివ్యవాణి.

కౌశికుడు నిశ్చేష్టుడైనాడు. 'అడవిలో పక్షి మరణ మీమె కెట్లు తెలిసినది. ఈమె మహా పతివ్రత' అని గ్రహించి ఆమెకు నమస్కరించినాడు. తల్లీ నాకు జ్ఞానబోధ సేయుము.' అని ప్రార్థించినాడు.

'నాయనా, నేను కాదు నీకు ధర్మోపదేశము చేయగలిగినది. ఇచటికి కొన్నిమైళ్ళ దూరమున నొక నగరమున్నది. అందు ధర్మవ్యాధు డున్నాడు. అతనివద్దకు పొమ్ము. ఆతడు నీకు జ్ఞానోపదేశము చేయగలడు' అని పతివ్రత పలికినది.

కౌశికుడు నగరమునకుపోయి ఒక కసాయి దుకాణములో మాంస విక్రయమును చేయుచున్న ఒకవ్యక్తిని చూచినాడు. ఆతడే

ధర్మవ్యాధుడని తెలిసికొన్నాడు. 'ఏమి? పతివ్రత నాకు నగుబాటు కలుగజేయుటకై ఈ కసాయివాని వద్దకు పంపినదా? హేయమగు వృత్తిచేయు నీతడు నాకెట్లు ధర్మోపదేశము చేయగలడు' అని భావించుచు కౌశికుడు సందేహించుచుండెను.

ధర్మవ్యాధుడు కౌశికుని చూచి, అయ్యా, బ్రాహ్మణకుమారా దయచేయుడు. ఆ పతివ్రత పంపగా వచ్చినారా? దయచేయుడు. ఇటు కూర్చుండుడు. కొద్దిసేపటిలో నా కార్యమును ముగించుకొని యింటికి పోదము' అని పలికెను.

ఓహో, మరింత ఆశ్చర్యముగా నున్నదే, పతివ్రత ఈతని కెట్లు తెలిసినది. బహుశః కొంగయొక్క మరణ వృత్తాంతముకూడ నీతనికి తెలిసియేయుండును కాబోలు అని భావించి సిగ్గుతో కూర్చున్నాడు కౌశికుడు.

మాంస విక్రయమును పూర్తిచేసుకొని ధర్మవ్యాధుడు ఇంటికి వచ్చినాడు. వృద్ధులయిన మాతా పితరులకు నమస్కరించినాడు. స్నానాదులు చేయించినాడు. అపారమగు భక్తిశ్రద్ధలతో వారికి సేవలు చేసినాడు.

'బ్రాహ్మణ కుమారా, ఇదియే నా తపస్సు, దీనివలననే నాకు చిత్త శాంతి కలుగుచున్నది' అని ధర్మవ్యాధుడు పలికినాడు. కౌశికుడు లజ్జపొంది తన పొరపాటును గ్రహించి తన స్వధర్మాచరణమునకు మరలినాడు. ఇట్టి మనోహరములగు ఉదాహరణము లెన్నియో వ్యాసదేవుడు మహాభారతములో తెలియచేసినాడు.

'అర్జునా! యుద్ధము పాపకార్యముకాదు. దోషలేశ మేని లేని కార్యమేదియు లోకములో లేదు. స్వధర్మమే సర్వశ్రేష్ఠము. స్వధర్మము చేయవా? ఈ లోకములోనే నీవు అపకీర్తి పాలగుదువు. ఇక నీకు పరలోక మెక్కడ? స్వధర్మములో మరణించెదవా, నీకు మోక్షము సిద్ధించును.

'తస్మాదుత్తిష్ఠ కౌంతేయ, యుద్ధాయ కృతనిశ్చయః'

## 16. కర్మయోగమునకు నాలుగు ముఖ్యసూత్రములు

Four examples of selfless action.

ఒకనాడు నేను నా మిత్రులతో నిట్లు పలికితిని. 'సోదరులారా మీరు ప్రతిదినమును భగవద్గీత పారాయణము చేయరాదా ? దాని వలన మీ కెంతయో శక్తియు, తేజస్సును గలుగును. గీత మీకు ఇహపరతారక మైనది' అని తెలుపుచు భజగోవింద శ్లోకమును ఈరీతిగా పఠించితిని.

'భగవద్గీతా కించి త ధీతా, గంగాజల లవకణికా పీతా
సకృ దపి యేన మురారి సమర్చా, క్రియతే తస్య యమేనాపి న చర్చా'

భావము :- ఎవరు పవిత్రమైన భగవద్గీతను కొంచెమైనను గురుముఖమున గ్రహించి పారాయణము చేయుదురో-పుణ్యప్రదమగు గంగోదకమును ఒక బిందువైనను త్రాగుదురో - ఎవరు శ్రద్ధతో నొక్క-మారైనను భగవంతుని పూజింతురో ఆతనికి యమునివలన భయము లేదుసుమా. అంతట ఒకమిత్రు డిట్లు పలికెను. 'భగవద్గీత మంచిదే కావచ్చు. కాని అది మనకొరకు కాదు. సంసారాన్ని త్యజించిన సన్యాసులకో - వయస్సుమళ్ళిన పెద్దలకోగాని గృహస్థులకు కాదు. మేమందరమును సంసారాలను త్యజించి సన్యాసమును పుచ్చు కోవలెననియా మీ అభిప్రాయము' అని కోపపడినారు. వారి అవివేకా నికి విషయగ్రహణశక్తి హీనతకు - నేనెంతో విచారించాను. భగవ ద్గీత సన్యాసులకొరకు ఏర్పడిన గ్రంథంకాదు. దానిని పలికినది పూర్ణ గృహస్థుడైన అర్జునునకు - ఎట్టి స్థలములో సంకులమైన మహాయుద్ధ రంగములో. ఆ యుద్ధరంగమే మానవజీవిత మహాయుద్ధమును సూచించును.

గీత కర్మ సన్యాసమును గాక కర్మానుష్ఠానమును గూర్చియే ప్రతి అధ్యాయములోను తెలుపుచున్నది. కర్మసన్యాసము చేయగో

రిన పార్థుని కర్మచేయుటకు నిలువబెట్టినది గీతాసందేశము. భార తీయ తత్వశాస్త్రము కర్మానుష్ఠానమునకే విశేషప్రాధాన్యము నిచ్చు చున్నది. మహాభారతములో శాంతిపర్వములో చక్కని ఉదాహార ణము గలదు. కురుక్షేత్ర మహాయుద్ధమైనతరువాత కురువంశక్షయా నికి ధర్మరాజు చాలా దుఃఖించాడు.

రాజ్యపరిపాలన చేయడానికి అంగీకరించలేదు. దండధారణము వలన పెక్కు పాపములు గలుగును. గాన మహీపాలనము నాకు సమ్మతము గాదు. నేను అరణ్యాలకు పోయి తపస్సు చేసికొంటాను అన్నాడు ధర్మరాజు.

అంపశయ్యమీద పరుండి భీష్మ బ్రహ్మచారి ధర్మరాజునకు బోధచేశాడు. ధర్మజా! నీ అభిప్రాయము చాల తప్పు. అది నృపాల ధర్మము కాదు. కర్తవ్యమగు ధరాపాలనమే చేసి తీరాలి. 'కర్మ యోగో విశిష్యతే' అని గీతావాక్యము.

గీతోపదేశాన్ని ప్రారంభిస్తూనే భగవంతుడు జ్ఞానోపదేశము చేశాడు పార్థునకు. ఆత్మానాత్మవివేకమును గూర్చి తెలుపబడినది. అది సర్వోపనిషత్సారమైన జ్ఞానామృతము. ఆత్మజ్ఞానానుభూతియే మోక్షాన్ని లేక బ్రహ్మనిర్వాణాన్ని ప్రసాదిస్తుంది. అట్టివాడు సమస్త కర్మబంధనాలకు అతీతుడు. ముక్తుడు. కాని ఆత్మసాక్షాత్కారము ఎట్లు సిద్ధిస్తుంది? అది కబుర్లతో వచ్చేదికాదు.

'శివోహం, శివోహం' అని పలుమారులు పలుకుచున్నంత మాత్రాన అతడు శివుడుకాడు. తాను శివమయుడు కావలయును. 'అహం బ్రహ్మాస్మి' అని మాటిమాటికి ఉచ్చరించిన మాత్రాన అతడు బ్రహ్మస్వరూపుడుకాడు. తాను పరమాత్మానుభూతిని పొందవలెను.

ఇది సోమరితనంవల్లను-పుస్తకాలవల్లను-వచ్చేది కాదు. నిరం తరమును ఫలాపేక్షాశూన్యమయిన సత్కర్మాచరణమువల్లనే ఆ మహాస్థితి లభిస్తుంది.

అందుచేతనే గీతలో జ్ఞానోపదేశానంతరము దానికి సాధనముగా నిష్కామకర్మ బోధింపబడినది.

'సాంఖ్యము' అనగా సిద్ధాంత మని, 'యోగ' మనగా కళ యని వినోబాజీ తెలిపినారు. కళ లేని సిద్ధాంతము బూడిదలోపోసిన పన్నీరు. నాట్యశాస్త్రములో నాకు విశేషపరిచయము కల దనుకొనుము. అంతమాత్రము చాలదు. అది సిద్ధాంతభాగము మాత్రము. నేను రంగస్థలములో నిలచి హస్తాదులచే చక్కగా అభినయము చేసి ప్రేక్షకలోకానికి తన్మయత్వాన్ని కలిగింపగలుగవలె. ఇదియే కళ. కళలేని సిద్ధాంతము వ్యర్థముకదా! ఆత్మనిష్ఠయొక్క కళాభాగమే నిష్కామకర్మ. నిష్కామకర్మ మానవుని పవిత్రుని చేస్తుంది.

ఈ నిష్కామకర్మకు నాలుగుసూత్రాలను నిర్వచించింది గీత.

'కర్మణ్యేవాధి కారస్తే, మా ఫలేషు కదాచ న
మా కర్మఫల హేతు ర్భూః, మా తే సంగో స్త్వ కర్మణి'

(అ 2 – శ్లో 47)

ఓ మానవుడా! నీకు కర్మచేయుటకు మాత్రమే అధికారము గలదు. ఇచ్చట 'కర్మ' అనగా ఏదియో పనిని చేయుటగాదు. వ్యభిచారము, దొంగతనము, జూదము మున్నగునవి కూడా 'కర్మలే'. ఇందు ఉదహరించిన'కర్మ'కు ఈపనులు వర్తింపవు. ఇవి నిషిద్ధకర్మలు. శాస్త్రము నిషేధించిన పాపకర్మలు. వీనివలన ఘోరవాది మహానరకములే సిద్ధించును. ఇట్టినీచకర్మలనుగూర్చి ఇచ్చట ప్రస్తావనయే లేదు. ఇచ్చట కర్మ యనగా శాస్త్రబోధితమైన వర్ణాశ్రమాచార ప్రయుక్త మయిన స్వధర్మ మని యర్థము. నీకులోచితమైన సత్కర్మను చేయుటకే నీకు అధికార మున్నది.

ఫలితమునందు నీకు అధికారములేదు ఇది రెండవసూత్రము. ఫలితము నీ యధీనమునందు లేదు. అది భగవానుని యధీనము. ఎన్నడును నీవు ఫలమును వాంఛింపకుము.

'ఫలితమును కోరి కర్మ నారంభింపకుము'. ఇది మూడవ సూత్రము. ఫలము కోరువాడు కృపణుడు. ఫలితమును కోరి కాదు కర్మచేయుట. స్వధర్మాచరణము నీ కర్తవ్యము.

సూర్యుడు ఆకాశముపై నిరంతరము ప్రకాశించుచు వెలుగు నిచ్చుచున్నాడు. దేనికొరకు ? ఏ ఫలమును కోరి? వెలుగు నిచ్చుట సూర్యుని స్వధర్మము. మేఘము వర్షించుచున్నది. ఏ ప్రతిఫలమును కోరుచున్నాడు మేఘుడు. అది వాని సహజధర్మము. చల్లని మలయ మారుతము వీచుచున్నది. దేనికొఱకు. నీవు బిరుదముల నిత్తువనియా? కానుకలను సమర్పింతువనియా? వదవుల నొసంగెద వనియా?అవి తమ కర్తవ్యములను పాలించుచున్నవి. అవిగో పుష్పములు వికసించి సౌరభములను వెదచల్లుచున్నవి.

నది మహావేగముగా ప్రవహించుచున్నది. ప్రవహించుట దాని ధర్మము. అగ్ని జ్వలించుచున్నది. జ్వలనము దాని ధర్మము. అందు ప్రతిఫలకాంక్ష లేదు - ఫలాసక్తి లేదు.

అట్లే నీవును నీ స్వధర్మమును - నీకర్తవ్య కర్మను ఫలాసక్తిని వీడి ఆచరింపుము.

ఫలాపేక్ష లేదుకదా యని కర్మాచరణమును మానకుము. ఇది నాల్గవసూత్రము. అట్లు మానివేయుడం తమో గుణ లక్షణం. తమో గుణం అజ్ఞానం గదా. అది సోమరి స్వభావం. అది పతన హేతువు. శరీరముద్వారా స్వధర్మాచరణము గావించినపుడే క్షుద్రమైన ఈ దేహానికి మహిమ హెచ్చుతుంది. పనిలేక దాచియుంచిన యంత్రానికి త్రుప్పుపట్టి శిథిలమగునట్లు శరీరయంత్రంకూడా సోమరి తనంచేత భ్రష్టమై పతనావస్థను బొందుతుంది. స్వధర్మాచరణము జ్ఞానసిద్ధికి పరమసాధనము మాత్రమే గాక జ్ఞానినికూడా సతతపవిత్రు నిగా చేయును. అందువలననే మహాజ్ఞానికూడా లోకసంగ్రహణార్థము కర్మలను చేయవలయు నని గీత ఆదేశిస్తున్నది. మహాజ్ఞానిని కూడా

ఒక్కొక్కప్పుడు ఇంద్రియాలు ప్రమాదాలను కలిగింపవచ్చును. కావున అట్టి ప్రమాదాలు రాకుండా స్వధర్మ నిత్యకర్మానుష్ఠానము అవసరము.

యోగమునందుండి నీవు కర్మను చేయుము. యోగ మనగా సమత్వబుద్ధి (సమత్వం యోగ ఉచ్యతే) కర్మలయందలి కుశలత్వమే యోగము.

జయాపజయములను లక్ష్యింపక - మానావమానములను సరకు చేయక - సుఖదుఃఖములను పాటింపక - నీ స్వధర్మమును నిర్వహింపుము. అవసరమైనచో స్వధర్మాచరణమునందు నీ శరీరమును బలిదానము చేయుము.

---

## 17. కామ్యకర్మలు మానవుని బంధించును.

### Selfish actions - Bandages of man.

వేదములు మహాపవిత్రములు. అవి మన హిందూధర్మమునకు ఆధారములు. అవి అపౌరుషేయములు. ప్రపంచమందలి తొలి వాఙ్మయమే వేదము. ఆధునిక చరిత్రకారుల పరిశోధనలనుబట్టి చూచినను ఋగ్వేదము క్రీస్తు పుట్టుకపూర్వము నాలుగువేల సంవత్సరముల క్రిందటనే గలదని స్పష్టమగుచున్నది. అట్టి ప్రాచీన వాఙ్మయలక్ష్మికి పుట్టినిల్లు మన పుణ్య భారతభూమి - 'అనంతా వై వేదాః'.

వేదములను నాలుగు భాగములుగా విభజింప నగును.

1) మంత్రభాగములు (Hymens) 2) బ్రాహ్మణములు (Explanation to the Mantras) 3) ఆరణ్యక భాగములు 4) ఉపనిషత్తులు. మంత్రము లనగా ఇహపరసౌఖ్యములనుకోరి దేవతలనుగూర్చి చేయు స్తోత్రములు. బ్రాహ్మణములనగా ఆ మంత్రముల యొక్క వివరణమును యజ్ఞయాగాది క్రతువులు చేయు విధానవివరణ

మును గలిగియుండును. ఆరణ్యకములయందు సన్యాసాశ్రమమునకు సంబంధముకల కర్మకాండల వివరణము. తాత్వికోపదేశములును గలవు. ఉపనిషత్తులు కేవలము జ్ఞానభాగములు – వీనియందు ఆత్మ - పరమాత్మను గూర్చిన ఆధ్యాత్మిక పరమరహస్యము లిమిడియున్నవి. ఈ భాగములు సర్వవిజ్ఞానభాండారము లని చెప్పబడుచున్నవి.

వేదములయొక్క తొలిభాగములయందు అనేక కర్మకాండలను గూర్చియు వానిని ఆచరించుటచేత కలుగు ధన, ధాన్య, పుత్ర, కళత్ర,కీర్తి, ప్రతిష్ఠా, గౌరవాది ఇహలోకసంబంధము లగు ఫలితములును స్వర్గాది పరలోకసౌఖ్యములును తెలుపబడినవి. సామాన్యులగు మానవులు ఈ ఫలితములయందు ఆశ గలిగి ఆ కర్మలను అనగా యజ్ఞము, యాగము, క్రతువు, వ్రతము, దానము, నోము, ఆరాధనము, మున్నగువానిని చేయుచున్నారు. పరమలక్ష్యమగు మోక్షమునందు మాత్రము వారి మనస్సులు లగ్నమగుట లేదు.

ఈ కామ్యకర్మలు మానవుని బంధించు నని గీత తెలుపుచున్నది. కామ్యకర్మలవలన స్వర్గాదిలోకములను బొంది అచ్చట తాము సంపాదించిన పుణ్యము ఖర్చుకాగా – తిరిగి భూలోకమున జన్మించుచున్నాడు.'క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి'. ఇది ఎట్లనగా నా మిత్రుడు మిగుల కష్టపడి వెయ్యిరూపాయలు సంపాదించినాడు. ఈ ధనపుమూటను చంకబెట్టుకొని బొంబాయి నగరము చేరినాడు. అచ్చట హాయిగా మేడలలో బసచేసినాడు. బొంబాయిలో గల సినీమాలు, నాటకాలు, తదితర సుఖభోగవిశేషాలు ఆతనికి సమకూరును. ఎంతకాలమువరకు ? చంకలోనున్న వేయిరూపాయల మూట ఖర్చు అగువరకు. ఖర్చుపెట్టుచుండగా 'ధనము' ఎంతవరకు నిలుచును? వారమురోజులలో మూట కాళీయయినది. ఇక అతడు బొంబాయిలో ఒక్కరోజయినను నిలువగలడా? అందాల మేడలో విశ్రమింపగలడా ? బాడుగ ఈయనిచో తోలిపారవేసెదరు. ఆత డేమిచేయును ? తిరిగి

రై లెక్కి స్వగ్రామమునకు వచ్చిచేరును. ఇట్లే భూలోకములో పుణ్యము ను ఆర్జించినవారి పరిస్థితియు.

'అట్లయిన పుణ్యకర్మలు చేయరాదనియా మీ యుద్దేశము?' అని ప్రశ్నించెదరా -

మా భగవద్గీత పుణ్యకర్మలను నిషేధించుటలేదు. పైగా వానిని తప్పనిసరిగా చేసియే తీరవలయునని శాసించుచున్నది.

ఇదిగో గీతాచార్యుని వాక్యము.

'యజ్ఞ దానతపః కర్మ, నా త్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞోదానం తపశ్చైవ, పావనాని మనీషిణామ్' (అ 18 - శ్లో 5)

అయితే ఆ పుణ్యకర్మలను ఫలితమును కాంక్షింపక ఈశ్వర ప్రీతికొరకు ఆచరింపు మని గీత బోధించును. దానిచే ఆత్మ - శాంతి గలుగును. కామ్యకర్మ - తాత్కాలిక సుఖము నిచ్చినను చివరకు దుఃఖమునే కలిగించును. దశరథుడు సంతానఫలమును కోరి పుత్ర కామేష్టిని చేసినాడు. ఇది కామ్యకర్మ. అది ఫలము నిచ్చినది. నలుగురు కుమారు లుదయించినారు. కాని దశరథుఁడు ఆ పుత్రులవలన దుఃఖమునే పొందినాడు. చివరకు పుత్రవియోగమే మరణ కారణ మయినది.

పై కామ్యకర్మను చేయుటలో అనేక-చిక్కులు బాధలు ప్రతిబంధకములును గలవు. ఎన్నియో నియమములను పాటించుచు క్రమ బద్ధముగాను - విఘ్నములు లేకుండగను చేసినప్పుడే అవి ఫలితము నిచ్చును. ఉదాహరణమునకు సుందరకాండ పారాయణమును తీసి కొందము. కార్యసిద్ధిని కోరి ధనధాన్యముల నర్థించి - ఇతర ప్రయోజనములను సంకల్పించి ఈకర్మను ప్రారంభించినచో విఘ్నములు రాకుండా ప్రతిదినమును నియమానుసారముగా చేయవలయును,

అధఃశయనము, బ్రహ్మచర్యము, మరియు నింకను 'నెన్నియో నియమములు విధానములును శాస్త్రానుసారముగా చేయవలయును.

ఈ పుణ్యకర్మను తాత్కాలికములగు క్షుద్ర సుఖములను కోంక్షిం పక ఈశ్వరప్రీత్యర్థమై గావించినచో నందు ప్రమాద వశమున పొర బాట్లు సంభవించినను అంతరాయము వాటిల్లినను భంగము లేదు. ఈకర్మయంతయు భగవన్మయ మయినది. కొన్ని యజ్ఞయాగాది కామ్యకర్మలలో ప్రత్యవాయములు కూడా కలుగును. సక్రముగా నా పుణ్యకర్మల నాచరింపనిచో వానివలన సత్ఫలితము రాదు సరి గదా దుష్ఫలితములు వచ్చును.

భగవత్ప్రసాదమును పొందుటకు సుగమమయిన రాజమార్గ ముండగా కంటకావృతమయిన క్లిష్టమార్గ మెందులకు ?

కామ్యకర్మలవలన మానవుడు ఆకర్మఫలములను భోగించుటకు మరల వివిధ యోనులయందు జన్మింపవలసి యుండును. జన్మపరంపర లలో పుణ్యపాపములచేత బంధింపబడక తప్పదు. నిష్కామకర్మ సకల భయాపహారము అనంత కల్యాణప్రదము.



## 18. ఫలత్యాగమునకు ఉదాహరణములు

**Sacrifice of fruits of action examples.**

కర్మయోగముయొక్క అవ్యాత ఫలము ఫలత్యాగములోనే యున్నది. ఫలత్యాగము కర్మయోగ విశిష్టతకు చిహ్నము. కర్మను చేసి ఫలితమును కోరితివా - ఆ ఫలితానుభవము ఆకర్మతో నశించు చున్నది. ఇనుపపెట్టెలోనున్న ధనమును ఖర్చుచేయుచున్నచో క్రమ ముగా పెట్టె ఖాళీకాదా ? అట్లే కర్మనుచేసి ఫలితమును పొందించు వాని స్థితియు. ఫలితమును కోరనిచో అది అనంత మగుచుండును. నిష్కామకర్మ మెంత స్వల్పముగా నొనర్చినను అది మహాభయము నుండి రక్షించు నని గీత తెలుపును. కర్మఫలత్యాగముయొక్క ఫలము అక్షయము.

గంగానదిలో ద్రౌపది యొకనాడు స్నానము చేయుచున్నది. నాడొక పర్వదినము. పెక్కురు సాధువులుకూడా గంగలో స్నానము చేయుచున్నారు. ప్రమాదవశమున ప్రవాహవేగముచేత ఒక సాధువు యొక్క కౌపీనము జారి కొట్టుకొనిపోయినది. పాపము సాధువు లజ్జచే నీటిలోనుండి యెంతసేపును గట్టునకు వచ్చుటలేదు. చలి విశేషముగా నున్నను జలములోనే యుండిపోవలసి వచ్చెను. కుశాగ్రబుద్ధిగల ద్రౌపది ఈ విషయమును గ్రహించినది. వెంటనే ఆ మహాసాధ్వి తన పైటచెంగును చింపి నదిలో ఆసాధువు వైపునకు గిరాటువేసినది. ఆ సాధువుయొక్క కృతజ్ఞతానందములకు మేరయేలేదు. అతడు సంతోషముతో దానిని ధరించి తనదారిని పోయినాడు.

ద్రౌపది గావించిన ఈ స్వల్పమగు నిష్కామకర్మ ఎట్టి ఫలితమును ఇచ్చినదో చూతము.

కౌరవుల నిండుసభలో – తన భర్తల సమక్షమున ద్రౌపదీదేవి మానభంగమునకు ప్రయత్నము గలిగినది. దుష్టుడగు దుశ్శాసనుడు ఆమె చీరను బలాత్కారముగా లాగసమకట్టినాడు. ఆ సాధ్వి వలవల యేడ్చుచు ఆపన్నశరణ్యుడయిన భగవానుని ప్రార్థించినది. భగవానుడు మాత్రము ఊరక సహాయముచేయునా ? జీవులు చేసిన కర్మలనుబట్టియే భగవంతుడును ఫలమును పంచిపెట్టును. కర్మసాక్షియు, కర్మ ఫలప్రదాతయు నాతడే కదా !

భగవానుని ఆస్థానములోని జీవులయొక్క పుణ్యాపాపముల గ్రంథము పరీక్షింపబడినది. చిత్రగుప్తుడు ద్రౌపదియొక్క పుటను గ్రంథమునుండి తీసి చూచినాడు. 'దేవా! యున్నది. ఆమె ఒక చిన్న వస్త్రమును పుణ్యప్రదేశమున – పుణ్యకాలమున పుణ్యపురుషునకు సమర్పించినది' అని పలికినాడు. అంత భగవాను డిట్లనెను. 'ఆమె చేసినది నిష్కామకర్మ. దేశకాలపాత్రములు మంగళకరములు. కావున ఆమెకు అక్షయవస్త్రదానమును ప్రసాదించుచున్నాను.

నిష్కామకర్మ స్వల్పమైనను మహాఫలితము ప్రసాదించును.

ఇక కర్మ ఫలత్యాగమునకు మరియొక ఉదాహరణమును చెప్పి ప్రవచనమును ముగింతును.

శరభోజి మహారాజు, పరివారము త్యాగరాజు ఇంటికి వచ్చిరి. 'గాయక సార్వభౌమా! మీరు మహాభక్తు లనియు, ప్రతిష్ఠావంతు లనియును భావించి మహారాజు మిమ్ము బహుముఖముల సన్మానించ నెంచి ఆస్థానమునకు గౌరవపురస్సరముగా తోడ్కొని రమ్మని యీ కానుకలతో మీవద్దకు పంపినాడు. వెంటనే దయచేయుడు, అని ప్రార్థించిరి. తెలుగు గాయకశిరోమణియు, రామభక్తాగ్రగణ్యుడును నగు త్యాగరాజు తన గదిలో రామసన్నిధిని చేతులను జోడించి నిలి చినాడు. నేత్రములనుండి బాష్పములు రాల, తండ్రీ! రామచంద్రా! ధనధాన్యాది మోహమును చూపి నన్ను నీనుండి వేరుచేయ దలచి తివా? నీసేవ చేయుచున్నందులకు ఫలము రాజసన్మానమా? కీర్తిప్రతి ష్ఠలా? నశించిపోవు ఈ ప్రాకృతిక భోగములు నా కెందులకు ? ఇవి నాకు శాశ్వతానందము నిచ్చునా? అని వాపోయినాడు. ఆ మహావేద నలోనుండి – రఘురామ పాదారవిందములపై వర్షించుచున్న ఆ వేద భక్తుని గద్గదకంఠములోనుండి బయలుదేరిన అమృతగీతయే యిది.

నిధి చాల సుఖమా ? –

రాముని సేవాభాగ్యము సుఖమా? ఓ మనసా! నాకుచెప్పుము అని పలికినాడు. రామనామమే అన్నిటికన్నను ఆయనకు ప్రియత మము. రామసాన్నిధ్యమే త్యాగయ్యకు మహానంద సంధాయక మైనది. ధనధాన్యాదులను నిరాకరించినాడు త్యాగరాజు.

ఆ ఫలత్యాగమే త్యాగయ్యను త్యాగబ్రహ్మనుగా జేసినది. అనంతఫలిత మగు బ్రహ్మ నిర్మాణమును చేకూర్చినది.

అదిగో! తెలుగు కవిసమ్రాట్టు అగు పోతన్న ఆ పేదకుటీర ములో భాగవతమును వ్రాసికొనుచున్నాడు. తెలుగుదేశమును భక్తి

ప్రేమామృతముతో పవిత్రము గావించిన పుణ్యశ్లోకి. ఆంధ్ర సాహిత్య క్షేత్రమునకు దివ్యాలంకార మా మహాపురుషుడు. తెలుగునాట జన్మించిన మహాప్రవక్త పోతన కవిశిఖామణి.

'ఓ కవీ! నీవు వ్రాసిన భాగవతమును నా కంకితము నిమ్ము. ధనకనక వస్తువిశేషములతో నిన్ను గౌరవింతును. నీ గృహము సిరి సంపదలతో తులతూగును' అని పలికినాడు సర్వజ్ఞ సింగమభూపతి.

నా సేవకు ఫలము ధనధాన్యములా ? నా కవితారాధనకు ఫలితము రాజసన్మానమా! సర్వలోక కళ్యాణమూర్తి యగు నారాయణ మూర్తికే యిది అంకిత మగునుగాక ! 'బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యను కూళలకు విక్రయింపజాలను.' నేను హాళికుడనై కందమూల కౌద్దాలికుడ నైననేమి ? ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు, వాహనంబులు, సొమ్ములు పుచ్చుకొనుటకంటె సమ్మతి శ్రీవారి కిచ్చుటే నా హృదయ నిశ్చిత భావము. రాముడు పలికించిన కావ్యము రామునకే సమర్పింతును.

ఓహో ! ఏమి ఈ ధర్మ ఫలత్యాగము.



## 19. స్థితప్రజ్ఞ లక్షణములు, గీతాసందేశము.

**Charecterstic qualities of a god - realised soul - Message of Geeta.**

రెండవ అధ్యాయములోని చివరిభాగమే స్థితప్రజ్ఞ ప్రకరణము. ఇది అతి రసవత్తరమయిన పుణ్యభాగము. గీతయొక్క సందేశమే యిది. 55 వ శ్లోకమునుండి 72 వ శ్లోకమువరకును గల 18 శ్లోకాలలో ఈ మహత్తర సుభాషితము గానము చేసినాడు పరమాత్మ. గీతలోని పదునెనిమిది అధ్యాయములలోని సారాంశమును నీ పదునెనిమిది శ్లోకములలోను నిమిడియున్నదని భావే పలికియున్నారు. ఇవి

రత్నములు, మణులు, మాణిక్యములకంటె విలువయయిన శ్లోకరాజములు. గీత యంతయును కంఠస్థము గాకున్నను ఈ పదునెనిమిది శ్లోకములైనను ముఖ్యముగా కంఠస్థముచేసి ప్రతిదినము పారాయణము చేయనగును. పవిత్ర ఆశ్రమములలోను, గీతామందిరముల లోను ఈ పుణ్యశ్లోకములు ప్రతిదినమును గీతాభక్తులు పఠింతురు.

ఈ ఉత్తమగుణసంపత్తినే గీతాసార్వభౌముడు పలుతావులలో మరల గానముచేసినాడు. అంతమాత్రముచేత నిది పునరుక్తిదోషము నకు పాల్పడదు. మహారచయిత తానే ముఖ్యవిషయమును ప్రజా కోటికి చెప్పదలచినాడో దానిని తన గ్రంథములో అవకాశమువచ్చిన తావునందెల్ల తెలుపుచునే యుండును. అదియే ఆ గ్రంథముయొక్క సందేశ మని చెప్పనచ్చును. గీతాచక్రవర్తి ఈ ప్రధానవిషయమును మరలమరలచెప్పుటలో ఇదియే గ్రంథసందేశ మని తేటతెల్లమగును. గీతలోని మూడు షట్కములందును ఈవిషయము గాననగును. కర్మ షట్కములోనిదగు రెండవ అధ్యాయమునందు 'స్థితప్రజ్ఞ' లక్షణము లున్నవిగదా. భక్తషట్కములోనిదగు 12 వ అధ్యాయములో 13 వ శ్లోకమునుండి 20 వ శ్లోకమువరకు భక్తునియొక్క లక్షణములను గూర్చి తెలిపియున్నాడు. అవియును స్థితప్రజ్ఞ లక్షణములనే పోలి యున్నవి. మరల మూడవ షట్కమగు జ్ఞానకాండమందు 14 వ అధ్యాయములో 22 వ శ్లోకమునుండి 27వ శ్లోకమువరకును త్రిగుణా తీతుని, గుణములను గురించి పరమాత్మ తెలుపును. ఇవియును పై రెండు భాగములనే బలికియున్నవి. కొన్ని పదజాలమునందు కూడా మార్పు లేకుండగనే తెలుపబడినవి. దీనినిబట్టి స్థితప్రజ్ఞు డన్నను, భక్తు డన్నను, త్రిగుణాతీతు డన్నను ఒకడే యని తేలును. మూడుతావుల యందు దీవిషయమునుగూర్చి తెలిపినను భగవానుడు తృప్తినిచెందలేదు కాబోలు. ఆ పుణ్యగుణసంపత్తిని తన భక్తకోటికి మరలమరల చెప్ప దలచినాడు పరమాత్మ. అదిగో! ఐదవ అధ్యాయమును చూడుడు.

18 వ శ్లోకమునుండి జీవన్ముక్తుని లక్షణములు గానము చేయబడినవి. మరల ఆరవ అధ్యాయములో యోగియొక్క సుగుణసంపత్తి తెలుపబడినది. పదమూడవ అధ్యాయములో 8 వ శ్లోకమునుండి 13 వ శ్లోకము వరకును జ్ఞాన మనగా నేమియో తెలుపబడినది. పదునారవ అధ్యాయమునందు మొదటి మూడు శ్లోకములందును దైవసంపదను గూర్చిన ప్రస్తావనము గలదు. సమీక్షారూపమగు 18 వ అధ్యాయములో జ్ఞాననిష్ఠుని గుణగణములను గూర్చి సంగ్రహముగా గీతా రచయిత ప్రవచనము చేసినాడు. ఇవియన్నియు ఒకే సుగుణసంపత్తిని గూర్చి తెలుపబడిన దివ్యబోధనలు. ఇట్లు గీతాచార్యుడు భగవద్గీతల యందు ఎనిమిది భాగములయందు వివరించిన ఈ మహత్తర పుణ్యవిషయ, మీ గ్రంథరాజముయొక్క సందేశముగాక మరేమి?

జ్ఞాని, భక్తుడు, సన్యాసి, యోగి, జీవన్ముక్తుడు, త్రిగుణాతీతుడు, సాధువు, కర్మయోగి–ఈపదము లన్నియు ఒకేశబ్దముయొక్క పర్యాయపదములు. గీతయొక్క దృష్టిలో భక్తుడువేరు – జ్ఞానివేరు – యోగివేరు – అని చెప్పుట సరిపడదు. భక్తుడే జ్ఞాని. అతడే యోగి కూడా. ఏమి మహత్తర దివ్యసమన్వయ మిది? అందువలననే గీత యోగశాస్త్ర మైనది. అనగా సమన్వయ శాస్త్రము.

స్థితప్రజ్ఞు డనగా నెవరు? స్థిరమైన ప్రజ్ఞ, లేక బుద్ధి గలవాడు అని యర్థము. దేనియందు స్థిరబుద్ధి గలవాడు? పరమేశ్వరునియందు స్థిరబుద్ధి గలవా డని యర్థము. అనగా ఈశ్వర సాక్షాత్కారమును బొందిన మహాపురుషు డని యర్థము. లేక 'బ్రహ్మవేత్త', 'తత్త్వవేత్త', బ్రహ్మద్రష్ట' అని అర్థము.

జీవితముయొక్క అనిర్వచనీయమైన ఉత్తమస్థితిని బొందిన దివ్యమూర్తియే స్థితప్రజ్ఞుడు.

ఆ మహాపురుషుని లక్షణము లెట్లుండును? అని అర్జునుని ప్రశ్న. ఎంత గొప్పప్రశ్న యిది. బ్రహ్మవేత్తకును, సామాన్య మానవునకును

గల తారతమ్య మెట్టిది ? మహాజ్ఞాని ఏరీతిగా మాట్లాడును ? ఆయన సంఘములో నెట్లు ప్రవర్తించును? నిష్క్రియుడై యున్నప్పు డెట్లుండును ? ఆచారశీలసంపద మెట్టిది ? ఏయే లక్షణములనుబట్టి బ్రహ్మవేత్తను గుర్తింపవచ్చును? (What are the character - stic qualities of God - realised soul ? How does he sit ? How does he walk? How does he move in the society?

ఈనాడు దేశములో దిగంబరులు, అర్ధదిగంబరులు, కౌపీనధారులు, కాషాయాంబరధారులు, గడ్డములను పెంచెడివారు, శిఖాయజ్ఞోపవీతములను త్యజించెడివారు, రుద్రాక్షలు - తులసిపూసలు ధరించువారు, నీటిపై తేలువారు, నీటిలో మునిగియుండువారు, వీరందరును గురువులమని - బ్రహ్మవేత్తల మని పలుకువా రనేకులు గలరు. అట్టి వారిని జాగ్రత్తగా పరిశీలింపుమని గీత చెప్పుచున్నది. ఈ బాహ్యాములగు వేషములే బ్రహ్మవేత్తల లక్షణములు గావు. పంగనామము ధరించి పరభామల కాంక్షించువాడు పరమవైష్ణవుడా ? రుద్రాక్షమాలలనుధరించి రోషాహంకారములను వదలనివాడు పరమశైవుడా? చక్రాంకితములైనవా రందరు చక్రధారియొక్క సాక్షాత్కారములను పొందినవారేనా? తులసిమాలలను ధరించినవా రందరును దూరీకృతపాపులా? కాషాయాంబరమే కాంతాకాంచనవిరాగచిహ్నమా? కాదు కాదు. ఈ పైపై యలంకారములను తిలకించి మోసపోరాదు. కావలసినది హృదయపారిశుద్ధ్యము - ఋజుప్రవర్తనము - కామినీ విరాగాది ఉత్తమ గుణసంపత్తి- సదాచారముతోగూడిన సత్యమార్గ జీవితము. ఈ బాహ్యాలంకారములు, ఆంతరంగిక పారిశుద్ధ్యమునకు సాధనములు మాత్రమే. అంతియేకాని అవి సాధ్యములు కావు.

...—...

## 20. 'కామరహితుడు'-'ఆత్మానందపరుడు' స్థితప్రజ్ఞుడు

**'Undesired and Self delighted' the God realised person.**

పరమపవిత్రమగు స్థితప్రజ్ఞలక్షణములను గూర్చి ముచ్చటించు కొందము గాక !

మనస్సునందు నిరంతరము సాగరమునందువలె కోరికలను తరంగములు పుట్టుచుండును. ఈ కోరికలకు అవధి యనునది లేదు. ధనము కావలెనని, ధాన్యములు కావలెనని, సుందరాంగులు కావలెనని, పుత్రులు కావలెనని, అల్లుండ్రు కావలెనని, ఉద్యోగములు కావలెనని - కోరికలెన్నెన్నియో పుట్టుచుండును. ఇది సామాన్య మానవునిస్థితి. వీరి కోరికలకు అంతులేదు. ఒకకోరిక తీరిన మరియొక కోరిక వచ్చుచుండును.ఇట్టికోరికలతోగూడినవారు గురువు లగుదురో? బ్రహ్మజ్ఞాను లగుదురో? సామాన్య మానవులకును, బ్రహ్మజ్ఞానికిని గల భేదమేమి? ఎట్టి కోరికయు లేనివాడే బ్రహ్మజ్ఞాని. ఆతడే విశిష్ట భక్తశిఖామణి. సామాన్య మానవులకు ఇట్టి కోరికలు నెరవేరుచుండుటచేత తృప్తికలుగుచుండును.

ప్రపంచములో ఏ పదార్థమును శాశ్వత సుఖానందములను ఈయజాలదు. ఇంద్రియములిచ్చు స్పర్శాదిభోగములు తాత్కాలికములు. పైగా అవి దుఃఖహేతువు లని గీత చెప్పుచున్నది.

ఒక సాధువునకు జిలేబీ తినవలయునని కోరిక పుట్టెను. ఆయన వెంటనే ధనవంతులగు తన శిష్యుల కీసంగతి చెప్పినాడు. గురుభక్తి గల ఆ శిష్యులు వెంటనే మణుగులకొలది నేతిజిలేబీని చేయించినారు. జిలేబీగంపలు ఒక గదిలో పెట్టబడినవి. సాధువు లోన ప్రవేశించి తలుపు లోన గొళ్లెముపెట్టుకొని జిలేబీగంపలవైపు చూచినాడు. ఓహో! ఎంతటిరుచి! ఎంత మాధుర్యము! అంటూ సాధువు వానిని

నోట క్రుక్కు-కొనుచున్నాడు. ఓమనసా! నీవు జిలేబీ కావలయునని కోరితివి? ఇదిగో గంపలకొలది జిలేబీ! అనుచు జిలేబీని నోటి కందించినాడు. ఇట్లు కొంచెముసేపు భక్షించిన పిమ్మట మనస్సు ఇట్లనుచున్నది. 'నాకిక చాలు' ఇక అక్కఱలేదు. ఇక నేను తినలేను. కాని స్వామి ఒప్పుకొనలేదు. 'ఓ మనసా! నీవు తిని తీరవలయును. ఈగంపలన్నియును నీకొరకే. తిను తిను - అని బలవంతముగా నోట క్రుక్కు-చున్నాడు. వాంతి కా నారంభించినది. స్వామి ఆగలేదు. ఒక కఱ్ఱతో జిలేబీచుట్టలను నోటిలోనికి త్రోయుచున్నాడు. విపరీతముగా వాంతి యగుచున్నది. నీకు నమస్కారము. ఇక నెన్నడును నిట్టి కోరికను కోరను. బాబూ రక్షించు. ఈ జిలేబీ బాధనుండి నన్ను రక్షించు' అని మనస్సు వేడుకొనసాగెను.

సారాంశ మిది. మనస్సు కోరికలను కోరుచుండును. కాని దాని వలన శాశ్వతసుఖానందములు గలుగుటలేదు. సరిగదా దుఖములే కలుగుచున్నవి.

ఇదియే రీతిని ఇతర ఇంద్రియసుఖములు కూడ తాత్కాలికములు, దుఃఖహేతువులు.

శబ్దేంద్రియమును పరిశీలింతము. సంగీతము అందరకును ఆనందము కలిగించు నని సామాన్యముగా పలుకుచుందురు. ఒక మహాగాయకుని రప్పించి ఆయన కెదురుగా కూర్చుండి సంగీతమును వినుము. రెండు మూడు గంట లట్లే కదలక మెదలక కూర్చుండి వినుము. ఒక పర్యాయము సిగరెట్టు కాల్చుకు వస్తాను. లేక కాఫీ త్రాగి మరల వస్తాను, ఆకలిగానున్నది భోజనముచేసి కూర్చుందము, అని 'శ్రోత' పలుకును. ఆశ్రోతను ఎంతబలవంతము చేసినను కూర్చుండడు.

కారణ మేమి ? ఆ శ్రోతకు శాశ్వతసుఖానందము సంగీతము కలిగించలేదు. కొద్ది నిమిషములు మాత్రము కలిగించినది. తరువాత విసుగుదల పొడసూపినది.

స్త్రీసుఖము కూడా తాత్కాలికము. విశేషమగు కాంతా వ్యసనముచేత ఆతడు నీరసించి వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. స్త్రీదేహ మాతనికి శాశ్వతానంద మిచ్చునా? లేదు.

ఇట్లే మిగిలిన ఇంద్రియములు కూడా. స్థితప్రజ్ఞుడు బాహ్య పదార్థములవల్ల ఆనందమును పొందడు. గీత యిట్లు పలుకును.

'యే హి సంస్పర్శజా భోగా, దుఃఖయోనయ ఏవ తే
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః' (అ5 – శ్లో22)

ఇంద్రియసుఖాలు పరిమితకాలము మాత్రమే వుంటాయి. పైగా అవి దుఃఖమునకు కారణభూతము లగును. అందుచే జ్ఞానులు వానియందు ఆనందమును పొందరు. వానిని నిరాకరింతురు. జ్ఞాని పరమేశ్వరానుభూతిలో నిత్యానందమునుబొందును. ఒక ఉదాహరణము.

శ్రీరాముడు రావణ వధానంతరము సీతాదేవితో అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైనాడు. ఒకనాడాయన జానకితో కూడి ఒక మహాసభలో తనకు రావణ సంహార కార్యక్రమములో సహాయము చేసిన వీరులకు బహుమానము లిచ్చుట ప్రారంభించినాడు. వారి వారి అర్హతలనుబట్టి చీనిచీనాంబరాలు, భూములు,ధనధాన్యాలు మున్నగునవి సమర్పింపబడుచున్నవి. ఆసమయంలో జానకి రాముని చేయి పట్టుకొని 'నాథా! మనము గొప్ప పొరపాటు చేసినాము. అందరికంటెను మనకు ముఖ్యుడు హనుమంతుడు కదా! ఆ మారుతికి మన మెంతో ఋణపడియున్నాము. ఆయన మనకుచేసిన సేవ ప్రశంసనీయము రామా. కావున ముందు ఆయనకు సత్కారము చేయుట మన విధి' అన్నది. అయితే 'నీవు ఆసత్కారము కానిమ్ము' అన్నాడు రాముడు చిరునవ్వుతో సీతాదేవి సంతోషముతో తన మెడలోనున్న రత్నాలహారమును తీసి మారుతి కంఠసీమకు అలంకరింపచేసినది. ఆ హారము తనకు వివాహకాలములో తన జనకునిచేత నొసంగబడిన విలువైన హారము. ఆ హారాన్ని ధరించి అంజనాసుతుడు నూతన

కాంతితో శోభిల్లినాడు. ఆ సత్కారాన్ని పొంది హనుమంతుడు దూరముగా పోయినాడు.

కొంచెము సేపటిలోనే ఒకవార్త. 'హనుమంతుడు రత్నాల హారాన్ని తెంపివేసి, ఒక్కొక్క రత్నాన్నే కొరికి పొడిచేసి పారవేస్తున్నాడు' సీతామాతకు విచారముకూడా కలిగినది. తాను ప్రేమ పూర్వకముగా నిచ్చిన విలువ యగు రత్నాలహారాన్ని వానరుడు పాడుచేసినా డని హనుమంతుని పిలిచి, జానకి 'ఏమి ఈ పిచ్చిపని' అన్నది. ఓతల్లీ! నేనేమి పిచ్చిపని చేయుచున్నాను. నీవు నాకు రత్నహార మిచ్చినావు. అం దొక్కొక్క రత్నమును పరీక్షించుచున్నాను. రామ నామమే నా కత్యంత ప్రియముగదా! ఆ రామనామ మీ రాయిలో గలదేమో అని దానిధ్వని వినవచ్చు నని చెవివద్దపెట్టుకొనుచున్నాను. కాని రామనామ మధురశబ్దము వినవచ్చుటలేదు. ఒకవేళ లోపల నున్నదేమో అని ఆమణిని కొరికి చూచినాను. చప్పరించి చూచినాను. బాగుగా నమలి చూచుచున్నాను. ఎచ్చటను రామనామ మాధుర్యము గోచరించుటలేదు. రామనామ సుధామాధుర్యమే నాకు తుష్టిని గలిగించునది. ఆ సుధామాధుర్యము లేని ఈరాయి నాకెందుకమ్మా' అన్నాడు మారుతి. జానకి ఆతని అత్యంత రామభక్తికి ఆశ్చర్య చకితురాలయినది. సారాంశ మిది. భక్తునకు ప్రియుడు భగవానుడు. భగవానుడే అతనికి సర్వస్వము. ఇదియే స్థితప్రజ్ఞ లక్షణము. 'ఆత్మన్యే వాత్మనా తుష్టః 'ఆత్మచేత ఆత్మయందే ఆనందమును బొందువాడు స్థితప్రజ్ఞుడు.

---

## 21. సుఖదుఃఖములను నిగ్రహించువాడే స్థితప్రజ్ఞుడు

**Who controles the pleasures pains a God man.**

సుఖదుఃఖములను నిగ్రహించుటయే అమృతత్వమునకు సాధనము. మొన్నటి ప్రవచనమున మనము తెలిసికొని యున్నారము.

అట్టివాడే ధీరు డని గీతాచార్యులు నుడివినారు. సుఖదుఃఖములను సమభావముతో చూచుట స్థితప్రజ్ఞుని లక్ష్య మని మరల చెప్పబడు చున్నది. ముఖ్యమగు విషయములను మరల మరల చెప్పుట గీతా సంప్రదాయము. ఇదియే ద్వంద్వాతీతస్థితి యని చెప్పబడినది. ఇది అత్యంత ప్రధానమగు విషయ మగుటచే ప్రతి అధ్యాయ మందును దీనివిషయమగు ప్రశంస గలదు. కావున దీనినిగూర్చి మరల కొన్ని విషయములను గ్రహింతము.

రామాయణమునుండి మీకొక యుదాహరణము మనవి చేసె దను. శ్రీరామునకు పట్టాభిషేకము చేయుటకు దశరథుడు నిశ్చయిం చినాడు. వసిష్ఠగురుడు సుముహూర్తం పెట్టినాడు. తెల్లవారుసరికి రాముడు విశాలసామ్రాజ్యమునకు చక్రవర్తి కానున్నాడు. సర్వ సన్నాహములును పూర్తియైనవి. కాని ఇంతలో పిడుగువంటి వార్త. రాముడు పదునాల్గువత్సరములు అరణ్యములలో వసింపవలయు నని. రాముని ముఖారవిందమును తిలకింపుడు. ఆయనముఖము చిరునవ్వుతో తాండవించుచున్నది. పట్టాభిషేకమున కెంతటి సంతోషమో వనవా సమునకు అంతటి ఆనందమే. సామాన్యమానవున కీస్థితి విపరీత దుఃఖ మునకు హేతువగును. కాని రామున కీరెండును సమానములే. ఆయన నోటినుండి తండ్రినిగూర్చి గాని, కైకనుగూర్చి గాని, భరతునిగూర్చి గాని ఒక్క పరుషవాక్యమైనను రాదు. ఏమి ఆ ద్వంద్వాతీతస్థితి! అదియే స్థితప్రజ్ఞత్వము. అమృతత్వసోపాన మని రాముని యుదాహర ణముద్వారా వాల్మీకి కవిరాజు మనకు తెలుపుచున్నాడు. పరిస్థితుల లోని స్వల్పపుమార్పునకే మనకు ఖేదమోదములు కలుగును. కమ్మని కూర ఆమోదము. చేదుకూర ఖేదము. భార్య సకాలమునకు పుట్టి నింటినుండి రాలే దని మహాదుఃఖము బొందు భర్త లనేకులు. జరీ అంచు చీర కామోదము. జరీలేనిచీర భర్త తెచ్చినచో ఆనోజున ఇంటిలో కురుక్షేత్రయుద్ధమే. నిత్యగృహజీవితములో ఇట్టి ఘట్టాలు

ఎన్నియో కలుగుచుండును. వీటి నన్నిటిని సమన్వయదృష్టితో చూడ వలెను. నిత్యాద్వైతమైన జీవితములో వేదాంతము సమన్వయము కావ లెను. అట్లుకానిచో ఆ వేదాంతమువలన ప్రయోజన మేమి? అది రాద్ధాంతమే యగును.

రాముని ఉదాహరణమే మరల గమనింపుడు. కఠిన కాంతార సీమలయందు బండరాళ్ళపై పరుండినాడు రాముడు. అంతఃపురములో మృదుల హంసతూలికాతల్పమునందును శయనించినాడు. రెండు శయ లును అతనికి సమానములు. రాజగృహములో మధుర పక్వాన్నము లను భుజించువాడు అడవులలో కందమూలములను భక్షించినాడు. ఆ రసనేంద్రియమునకు రెండును సమానములే. అయోధ్యలో ఆయన చీనిచీనాంబరములు ధరించెను. ఇప్పుడు నారచీరలు. రెండిటియందును భేద మాయనకు లేదు. సుఖదుఃఖములు సమానములు. గరిటె క్షీరా న్నములో తిరుగుచున్నను, ఆవకాయకుండలో తిరుగుచున్నను దానికి సమానమే. రసనేంద్రియము కూడా అదియే స్థితిని బొందవలెను. నాలుకకు రుచిని గ్రహించుశక్తి యుండవచ్చును. కాని భేద మోద ములు పనికిరావు.

సుఖదుఃఖములు ప్రారబ్ధకర్మానుసారముగా సంప్రాప్తములగు చుండును. వానిని నిగ్రహించుటకు భగవన్నామస్మరణ సాధన మని చెప్పబడును.

కులశేఖరు లిట్లు గానము చేయుచున్నారు -

'నాస్థా ధర్మే, న వసు నిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాంతరే పి
త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలా భక్తి రస్తు ॥

'ఓ కృష్ణభగవాన్! నాకు ధనమునందుగాని, కామమునందు గాని అపేక్ష లేదు. పూర్వజన్మ కర్మానుసారముగా అవి లభించును.

వానివలన ప్రయోజన మేమి? పరమపురుషార్థము మోక్షమే కదా! నే నెన్నిజన్మము లెత్తినను నీ పవిత్ర పాదపద్మములందు అచంచల భక్తి ప్రేమలను గలిగియుందును గాక! ప్రభూ! ఇదియే నా ప్రార్థన!'

ఇట్టి భగవదర్పిత చిత్తవృత్తి సుఖదుఃఖాతీతమగు స్థితప్రజ్ఞత్వమును ప్రసాదించును.

## 22. 'రాగము, భయము, క్రోధము' వీనిని విడనాడుట చేత స్థితప్రజ్ఞత్వము - ఉదాహరణములు.

**Who is free from attachment, fear and anger is a God-man — Examples.**

రాగ భయ క్రోధములు మృగలక్షణములు. సామాన్య మానవులు వీనివశులై పతనమును చెందుదురు. మహాపురుషులు వీనిని నిగ్రహించి దివ్యత్వమును బొందుదురు. నిత్యమును మన దైనందిన గృహజీవితములో వీనిసంఘటనలు మనకు కలుగుచుండును. సాధకుడు వీనిని నిగ్రహించవలెను. ఇం దొక్కొక్క గుణమును గురించి తెలిసి కొందము.

1. రాగము :- ఒకానొక వస్తువునందు గాని, స్థితియందు గాని, మనుష్యునందు గాని, గల విపరీతమగు కాంక్షయే 'రాగ' మనబడును. ఈ రాగమే స్వ, పర భేదములను చూపును. ఇదియే మోహము లేక మమకారము. దీనికి గురియైన కారణముచేతనే అర్జునుడు తన కర్తవ్యమగు యుద్ధమును నిరాకరించి, మోహపాశబద్ధుడై, అబలుడై, కన్నీరు మున్నీరుగా ఏడ్చినాడు. ధూర్జటి మహాకవి ఇట్లు పలుకుచున్నాడు.

'అంతా మిథ్య తలంచిచూచిన నరుం డట్లౌ టెరింగిన్ సదా
కాంతల్ పుత్త్రులు నర్థమున్ తనువు నిక్కం బంచు మోహార్ణవ
భ్రాంతిం జెంది చరించుగాని పరమార్థంబైన నీయందుఁ దా
చింతాకంత తలంపు నిల్పడు గదా శ్రీకాళహస్తీశ్వరా!'

'ఓ కాళహస్తీశ్వరా ! ఈ విశాలప్రపంచ మంతయు మిథ్య యని తెలియనివాడొక్కడును లేడు. సర్వమును నశించిపోవునదియే యని కొంచె మాలోచించినచో స్పష్టముగా తెలియును. స్థిరముగా నుండున దేదియును లేదు. ఈ విషయము నెరింగియు మానవుడు వెంటనే మోహములో పడిపోవుచున్నాడు. నా భార్య యని, నాబిడ్డ యని, నాశరీర మని, నాగృహ మని, నాధన మని, నాఆస్తి యని బాధపడుచున్నాడు. ఇది ఎంత బుద్ధిహీనత. ఓ దేవా! కరుణామయుడవును, శాశ్వతుండవు నైన నీయందుమాత్రము మనుష్యుడు కొంచెము నైనను మనస్సును నిలుపుట లేదు గదా ?'

రాగము మానవుని బంధించును. విరాగము మానవుని ముక్తుని చేయును.

ఒకనా డొక మహర్షి ఒక గృహస్థుని యింటికి వచ్చెను. గృహస్థు డాఋషీశ్వరుని గౌరవించి బహువిధాల స్తోత్రముచేసినాడు. ఆ మునీశ్వరు డిట్లనెను. 'ఓ గృహస్థుడా! నిన్ను చూస్తే చాలా జాలి వేస్తుంది. సంసారంలో అనేక బాధలకు గురియగుచున్నావు. ఇదిగో! విమానము తీసికొనివచ్చాను. ఇందులో నిన్ను స్వర్గానికి తీసుకొని పోతాను. వస్తావా ?' గృహస్థు డంత 'నాకూ ఈ సంసా కూపంలో నుంచి రావలెననియే యున్నది. కాని మా పెద్దాబ్బాయికి పెండ్లి కాలేదు. పదివేలవరకు కట్నాలు వస్తున్నాయి. మరి పదివేలవరకు రాబట్టాలని ఉంది. నేను లేకపోతే అంతకట్నం రాదు. ఆపెళ్ళిఅయ్యే వరకు నాకు గడువు ఇప్పించండి. తర్వాత నేను మీతో కలిసి స్వర్గానికి వస్తాను' అన్నాడు. 'సరే! లే, నేను మళ్ళీవస్తాను' అని చెప్పి ముని వెళ్ళిపోయినాడు.

ఒక సంవత్సరం గడిచింది. గృహస్థుడు పెద్దబ్బాయికి పెండ్లి చేశాడు. పిమ్మట మళ్ళీ వచ్చాడు ఋషి విమానంలో. 'ఏమయ్యా ! సిద్ధంగా ఉన్నావా? స్వర్గానికి పోదాము' అన్నాడు.

గృహస్థుడు 'అయ్యా ! నమస్కారము. వివాహ ముగిశే అయింది. ఇంకా నేను చేయవలసిన పనులు మిగిలిపోయాయి. పెద్దమ్మాయిని పురిటికి తీసుకువస్తాను. నేను లేకపోతే పిల్లకు సరిగా దాని పురుడు, పుణ్యము చూస్తారా? పైగా నువుమల్లి ముద్దెట్టుకోవాలని ఉంది. ఈపనులు పూర్తిచేసుకున్నాక నేను తప్పక మీతో వస్తాను అన్నాడు. సరేలే, ఆపనులన్నీ చక్కబెట్టుకో. నేను మళ్లీవస్తానులే అన్నాడు ఋషీశ్వరుడు. కొన్నిదినాలకు మళ్లీ విమానంలో మునిశ్వరుడు వచ్చి, ఏమయ్యా ! సిద్ధంగా వున్నావా ? స్వర్గానికి పోదాము, అన్నాడు. ఋషీశ్వరా!నమస్కారము. ఇంకోపని మిగిలిపోయిఉన్నది. మాయిల్లు ఇరుకుగా నున్నది. నలుగురుపిల్లలు వుండటానికే విశాలము కానిది. కాబట్టి ఒకచక్కని బంగళా కట్టాలని ఉన్నది. ఇటుక తీయించి కాల్పించాలి ఈ ఏడాది. వచ్చేయేడు కలపపని చూడాలి. పై సంవత్సరము ప్రారంభించాలిపని. ఈపనులు పూర్తిఅయినతర్వాత వస్తాను బాబూ! అని బతిమాలుకున్నాడు. సరేలే, యని మునీశ్వరుడు వెడలిపోయినాడు. 'సంసారము-బంధహేతువు' అని తెలిసికూడా మానవుడు దానినుండి తప్పించుకొనుటకు ప్రయత్నింపడు. అనేక వాంఛలతో కూడికొని ఉంటాడు మానవుడు. కాని ఆకోరికలన్నియు నెరవేరుతాయా ? పాపము గృహస్థుడు గృహము కట్టకపూర్వమే చనిపోయినాడు. ప్రారబ్ధకర్మానుసారంగా ఆతడు కుక్కయై జన్మించి ఆ యింటి చుట్టూ తిరుగుచున్నాడు.

కొంతకాలానికి ఆ ఋషీశ్వరుడు ఆ గృహస్థుని యింటికి వచ్చినాడు. యజమాని చనిపోయిన సంగతి విని ఆతని కుమారులను ఓదార్చాడు మునీశ్వరుడు. కుక్కజన్మలోనున్న ఆ యజమానివద్దకు పోయి పూర్వజన్మస్మృతి కలిగించి యిట్లనెను. 'ఏమయ్యా! స్వర్గానికి రమ్మని లోగడ అనేకసారులు రమ్మంటే రానన్నావు. చూచావా! నీచమైన కుక్కజన్మ వచ్చింది. ఇప్పుడైనా స్వర్గానికి వస్తావా?తీసికొనిపోతాను.'

బాబూ! వందనము. నా కుమారులు తెలివితక్కువవాళ్ళు. చూడండి ఇంటిచుట్టూ సామానులు ఎట్లు పారవేసుకున్నారో ? వెండిగ్లాసులు పెరటిలో వదలివేశారు. నేనెంతో కష్టపడి తాకట్టువడ్డీలమీద సంపాదించాను వీటిని దొంగ లెవరూ ముట్టకుండా రాత్రింబగళ్ళు యింటి చుట్టు తిరుగుతాను. వాళ్ళకు శాస్త్ర జ్ఞానోదయం కలిగినతర్వాత వస్తానులే బాబూ అన్నాడు.

ముని ఆతని మమకారానికి నవ్వుకొని, 'మళ్లీవస్తానులే' అని వెడలిపోయినాడు. పాపము కొన్నిదినాలకు శునకము చనిపోయింది. ఈసారి ఒక ఎద్దు జన్మనెత్తి పొలములో పనిచేస్తున్నది. మునీశ్వరుడు ఆ యెద్దువద్దకు పోయినాడు. పూర్వజన్మస్మృతిని కలిగించి యిట్లనెను. 'ఏమయ్యా! ఇప్పుడన్నా వస్తావా, స్వర్గానికి?' 'బాబూ! క్షమించాలి. ఇంకా పదియెకరాలు దున్నవలసియున్నది. ఇది నేనెంతో కష్టపడి సంపాదించిన పొలం. ఇది పండితేనే నాబిడ్డలకు నిండా తిండి. ఇది పూర్తియైనపిదప వస్తానులే' అన్నాడు. ముని వెళ్ళిపోయినాడు. కొన్ని దినాలకు ఎద్దు చనిపోయింది. అది భయంకరమయిన పాము జన్మనెత్తినది.

ఋషీశ్వరుడు ఏదోవిధముగా ఆ గృహస్థునకు మోక్షము గలిగించాలని నిశ్చయించాడు. మరల ఆయన ఆయజమానివద్దకు పోకుండ అతని పిల్లలవద్దకుపోయి, 'బిడ్డలారా! మీకొక శుభసందేశము చెప్పాలని వచ్చాను. మీతండ్రికి నాకు చాల స్నేహము. నాతో ఒక రహస్యము చెప్పాడు. మీపొలంలో ఆగ్నేయభాగంలో ఒక ధనపు గంగాళము పాతుచేసి వుంచినాడు. మీరు వెళ్ళి తెచ్చుకోండి అన్నాడు. బిడ్డలందరును సంతోషముతో బయలుదేరినారు. వెంటనే ఋషి యిట్లు పలికెను. 'నాయనలారా! అచ్చట ఒకభయంకరమైన పాము వున్నది. జాగ్రత్త అన్నాడు. ఆ యజమాని సర్పరూపియై ఆధనాన్ని కాపలా కాస్తున్నాడు గదా పాపము !

పిల్లలు వెంటనే పదిమందిని ప్రోగుచేసి బల్లెములు, కర్రలు పుచ్చుకొని వెళ్ళారు. ఈజనమును చూడగానే పాము బుస్సుమన్నది. తోడనే వారు బల్లెములతో దానిని చావమోది ధనమును తోడ్కొని పోయినారు.

అప్పటికి పామురూపంలో వున్న గృహస్థునకు బుద్ధి వచ్చింది. రాగము విరాగముగా మారింది. సారాంశ మిది. మమకార మావిధముగా మానవుని గాఢంగా బంధిస్తుంది. దానిని 'అసంగ శస్త్రము' చేత ఛేదించుమని గీత గానము చేయుచున్నది. రాగరహితుడే స్థితప్రజ్ఞుడు.

భయము :- గీతలోని 16 వ అధ్యాయములో దేవతా లక్షణములను గురించి చెప్పుచు, అందు 'నిర్భయత్వము' మొట్టమొదటి సుగుణముగా గానముచేసినాడు. అన్ని సుగుణములకు 'నిర్భయత్వము' నాయకమణి. అన్ని తావులలోను భగవానుని దర్శించు భక్తునకు భయ మెక్కడిది? భయము రాక్షసగుణమును, మృగలక్షణమును నై యున్నది. 'నాకేమి భయమురా! నీవుండగా రామ!' అని రామదాసు పలుకును. వైరాగ్యము సర్వ భయహరము.

'భోగే రోగభయం, కులే చ్యుతి భయం
మానే దైన్యభయం, బలే రిపు భయం
రూపే జరాయా భయం, శాస్త్రే వాద భయం
గుణే ఖలభయం, కాయే కృతాన్తాత్ భయం
సర్వం వస్తు భయాన్వితం, భువి నృణాంవైరాగ్య మేవా భయం'

'భోగాలు అనుభవిస్తే రోగాలు వస్తవనే భయ మున్నది. ఉత్తమకులంలో జన్మించినవానికి పతనభయ మున్నది. ధనము గలవానికి మహారాజు తీసుకొనునేమో యను భయము గలదు. మానవంతునకు దైన్యదశ గలదను భయ ముండును. బలవంతునకు నిరంతరమును శత్రుభయమే. మన్మథునివంటి రూపము గలవానికి ముసలితనమువలన భయము గలదు. శాస్త్రవేత్తను తనకంటె పండితుని

వాదమువలన ఓటమి కలుగునను భయము. గుణశాలికి ఖలులవలన భయ మున్నది. శరీరమునకు మృత్యుభయ మున్నది. లోకములో సకలమును భయముతో కూడినవే. వైరాగ్యమే భయరహితమయి నది.' భయరహితుడే స్థితప్రజ్ఞుడు. సామాన్య విషయాలకే మనము భయమును పొందుచుందుము. అధికారి యంటే భయము. భార్య కోపగిస్తే భయము. పుత్రుడు తన్ను చూడడేమో యని భయము. తలనొప్పివస్తే భయము. గట్టిగా ఎవరన్నా మాట్లాడితే భయము. ఇట్టి సామాన్య విషయాలలోనే ధైర్యమును వహించలేనివాడు మహా భయంకరమైన సంసారసాగరాన్ని ఎట్లు దాటగలడు ?

భయపడేవానిని చూస్తే కుక్కలుకూడా భయపెట్టును. నిర్భ యుని చూస్తే సింహశార్దూలాలు కూడా పారిపోతాయి. ఒకనాడు రామతీర్థస్వామి హిమాలయ పర్వతాలలో విహరిస్తున్నారు. ఎచ్చట నుండియో మృగరాజు గర్జిస్తూ వస్తున్నాడు. ఏ పరంజ్యోతి తనలో వెలుగుచున్నదో ఆ జ్యోతినే సింహమునందును దర్శిస్తున్న రామతీర్థు నకు భయము కలుగునా ? ఆతడు చలింపక తదేకదృష్టితో సింహ మును తిలకింపసాగినాడు. సింహ మా యోగీశ్వరుని సమీపించి ఆయన పాదములను తాకి, ప్రదక్షిణముచేసి వెడలిపోయినది. ఏమి ఆ నిర్భయత్వము. భయరహితుని గాంచి లోకమే గజగజలాడును.

అదిగో ! ప్రహ్లాదుని నిర్భయత్వమును చూడుడు. పోతనా మాత్యులు భాగవతములో –

'తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికిన్
పన్నగశాయి, ఓ దనుజభంజన ఓ జగదీశ ఓ మహా
పన్న శరణ్య ఓ నిఖిలపావన యంచు నుతించుగాని తా
కన్నుల నీరు తేడు భయకంప సమేతుడు గాడు భూవరా!

ప్రహ్లాద కుమారుని తండ్రి యగు హిరణ్యకశిపుడు శూలము లచే పొడిపించినాడు. మహాసాగరములలో త్రోయించినాడు. ఏనుగు

లచే త్రొక్కించినాడు. కాని ప్రహ్లాదుని కన్నులనుండి నీరు రాదు. అతడు పరుగెత్తిపోవుటలేదు. తండ్రి కాళ్ళపై బడుటలేదు. తల్లివద్దకు పరుగెత్తుటలేదు. అతడు నిరంతరమును ఆ పన్నగశాయినే తలంచును. ఆ దనుజహంతకునే స్మరించును. ఆ నిర్మలపావనునే పాడును. ఆ పురుషోత్తమునే నుతించును. ఆ జగద్రక్షకునే భావించును. ఆయన చింతాహరుడు. సకలభయహరుడు. అదిగో! మహాభక్తుడగు కులశేఖరులు భయరహితమగు గొప్ప రసాయనమును ఇచ్చుచున్నారు. దానిని త్రాగి భయరహితులు గండు.

'హేలోకా శ్శృణుత ప్రసూతి మరణవ్యాధేః చికిత్సా మిమాం
యోగజ్ఞా స్సముదాహరంతి మునయోయాం యాజ్ఞవల్క్యాదయః
అంతర్జ్యోతి రమేయ మేకమమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యంతికం ॥'

ఓ మానవులారా! జనన మరణ మహాభయవ్యాధి నివారించు పరమౌషధ మిదిగో. దీనిని యాజ్ఞవల్క్యాది మహామునులు సేవించి ధన్యులైరి. ఆ పరమ రసాయనాన్ని మీకు తెలిజేయుచున్నాను. ఆలకించండి. మీ హృదయాకాశంలో ప్రకాశించే దివ్యజ్యోతి కలదు. అది పరమ మంగళకర మైనది. అదియే శ్రీకృష్ణ దివ్యామృతము. దీని సేవించినవారికి భవభీతి లేనేలేదు. సకలరోగహారము, సకలభయహార మీ శ్రీకృష్ణ నామామృతము.

3. క్రోధము :- 'క్రోధ మూలాని పాపాని' సమస్త పాపములును కోపమువలననే కలుగుచున్నవి. కోపమువలన సమ్మోహము, దానివలన స్మృతినాశనము, దానివలన బుద్ధిహీనత. అందువలన మానవుడు నశించుచున్నా డని గీత చెప్పను. క్రోధము నరకద్వారమని 17 వ అధ్యాయములో భగవంతుడు పలుకును. కోపము అసుర స్వభావమని 16 వ అధ్యాయము చెప్పును. కోపము గలవాని ముఖమును చూడుడు! రాక్షసుని ముఖమువలె ఎఱ్ఱని నేత్రాలతో భయం

కరమై యుండును, శాంతము గలవాని ముఖము ప్రసన్నతను బొంది యుండును.

ఒక స్త్రీ ప్రక్కయింటి యువతితో కయ్యము పెట్టుకొన్నది. రోజంతయు మహాయుద్ధమే. ఆమె కేకలు రాక్షసి కేకలవలె భయంకరములు. ఆమె తిట్లు చెవులతోవినలేము.ఆకోపోద్రేకముచేత ఆమెకు భోజనమే చేయవలెనను తలంపు లేదు. ఇంతలో చంటిపిల్ల యేడ్చు చుండుటచేత ఎవరో ఆబిడ్డను తీసుకొనివచ్చి ఆమె ఒడిలో నుంచిరి. ఆ చంటిబిడ్డ రాక్షసిరూపమును దాల్చి భయంకరముగా నున్న తల్లి స్తనములను బట్టి పాలు త్రాగసాగినది. కడుపార త్రాగి త్రాగి ఆ చంటికూన అట్టే ప్రాణమును విడచినది. అందరును ఏడ్వసాగిరి. పాలు త్రాగుచున్న బిడ్డ తటాలున ఏల మరణించెనో కదా యని అందరును ఆశ్చర్య మందిరి. వెంటనే వైద్యులు వచ్చిరి. చంటిబిడ్డను పరీక్షించిరి. విషపానమువలన బిడ్డ మరణించెనని వైద్యులు నిర్ణయించిరి. ఆ చంటి బిడ్డకు విషము ఎవరు పెట్టిరి? విపరీతమగు కోపమునల్ల ఆతల్లి రక్తమంతయు విషపూరితమైనది. ఆమెపాలు విషపూరిత మయ్యెను. విషపూరితమగు పాలు త్రాగుటచేత బిడ్డ మరణించినాడు. చూచితిరా! ఎంత ప్రమాదమును కలుగచేసినదో కోపము.

భారవి మహాకవియొక్క చరిత్ర మీకు తెలిసినదే. కోపముచేత ఆకవి తన తండ్రినే చంపుటకు సమకట్టినాడు. కోపావేశపూరితుడు మాతృ పితృద్రోహమునకు కూడ వెనుదీయడు.

'కోపము కలిగినప్పుడు ఏమిచేయవలెను ?' అని ఒక బుద్ధిమంతుడు గురువును ప్రశ్నించాడు. రామనామమును గానము చేయుము. రామగీతము నీకు శాంతిని ప్రసాదించును అని ఆయన చెప్పెను. భగవన్నామస్మరణము సకలదోష హరణము.

'శత్రుచ్ఛేదైక మంత్రం సకల ముపనిషద్వాక్య సంపూజ్య మంత్రం
సంసారోత్తార మంత్రం సముచిత తమ స్సంగ నిర్యాణమంత్రం

సద్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగ సందష్టసంత్రాణమంత్రం
జిహ్వే శ్రీకృష్ణమంత్రం జపజపసతతం జన్మసాఫల్య మంత్రం'

శ్రీకృష్ణమంత్రము పరమపవిత్ర మైనది. అంతఃశత్రువులగు కామక్రోధాదులను నాశనముచేయు మంత్ర మిది. బహిశ్శత్రువులను పోగొట్టును. ఆ మహామంత్రము సంసారసాగరమును తరింపచేయును. అజ్ఞానమును పోగొట్టి జ్ఞానమహదైశ్వర్యమును ప్రసాదించును. దుష్ట వ్యసనము లన్నియు కృష్ణనామ గానముచేత నశించును. ఆ మంత్రము సకలవేదసారము. జన్మసార్థక్యమును కలిగించు దివ్యమంత్ర మిది. ఓ నాలుకా ! పవిత్రమగు శ్రీకృష్ణనామమును నిరంతరమును గానము చేయుము.

---

## 23. బాహ్యవస్తు నిరాకరణమే ఇంద్రియనిగ్రహము కాదు

**Sense control is not merely separation from externel object.**

ఇంద్రియ నిగ్రహము లేక మోక్షము లేదు. జ్ఞానమార్గములో గాని, భక్తిమార్గములో గాని ఇంద్రియనిగ్రహము ముఖ్యమైనది. నిగ్రహము లేనివాని జీవితము సాగరములో విడువబడిన చుక్కాని లేని పడవ వంటిది. అందువలననే గీతలో పలు అధ్యాయాలలో ఇంద్రియ నిగ్రహమును గూర్చి విశేషముగా వివరింపబడినది. మనస్సులో విషయవాంఛారాహిత్యమే ఇంద్రియనిగ్రహ మని కేవల విషయ వస్తునిరాకరణము నిగ్రహము కాదని గీత చెప్పును. కర్మేంద్రియాలను నిగ్రహించి మనస్సుతో ఆయా ఇంద్రియ విషయాలను భావన చేయువాడు మిథ్యాచారి.

ఒక మిత్రునకు అనారోగ్యము కలిగినది. ఆయనకు మామిడి పండ్లనిన చాలఇష్టము. వైద్యుడువచ్చి రోగిని పరీక్షించి నీవు మామిడి పండ్లను తినరాదు. తింటివా రోగము ముదిరి ప్రమాదపరిస్థితివచ్చును.

అని చెప్పిపోయెను. నామిత్రునకుమాత్రము మామిడిపండు తినవలయు ననియే యున్నది. దానిని తలంచుచున్నాడు. కాని తిన్నచో రోగము వచ్చు నను భయముచేత దానిని ముట్టకున్నాడు. అది రసనేంద్రియ నిగ్రహ మగునా? బాహ్యమునకా పండును ముట్టుటలేదు. కాని మన స్సులో మాత్రము దాని ధ్యానమే చేయుచున్నాడు. ఇది నిగ్రహము కాదు.

నామిత్రు డొకడు మిక్కిలి కురూపి. విద్యయా సున్న. ఆస్తియా లేదు. ధనమా కానుపించదు. ఆతనికి అందమైన యువతిని వివాహ మాడవలయునని యున్నది. కాని కన్యను ఎవరిచ్చెదరు? ఏకన్య అత డిని వాంఛించును? అందువలన నాతడు అవివాహితుడుగానే యుండి పోవలసి వచ్చినది. వివాహము కానంతమాత్రముచేత అతడు బ్రహ్మ చారి యగునా ?

ఒక స్నేహితునకు జ్వరమువచ్చి రెండు లంఘనములు చేసి నాడు. ఒకడు రసనేంద్రియ నిగ్రహముకొరకు ఏకాదశినా డుపవాస మున్నాడు. ఇరువురును ఆహారమును త్యజించినారు. కాని మొదటి వాడు రోగకారణముచేతను, రెండవవాడు ఇంద్రియ నిగ్రహము కొరకును ఆహారమును త్యజించినారు. రెండవవానిది మాత్రమే నిగ్రహ మనిపించుకొనును.

ఒక గురువుగా రున్నారు. ఆయనకు ప్రతి ఆదివారము మౌన వ్రతము. నోటితో మాత్రము మాటలాడరు. కాని కాళ్ళతోను, చేతులతోను, కళ్ళతోను సైగలుచేసి సమస్తకార్యాలు నెరవేరు స్తారు. ఆ ప్రయత్నాలు చాలక కాగితాలమీద, పలకలమీద వ్రాసి చూపిస్తూ ఉంటారు. చిటికెలు వేయడం, చప్పట్లు కొట్టడం, తన భావ ప్రకటనకు ఎన్నో విధాలుగా అన్వేషణ చేస్తూ ఉంటారు. ఆయన పడే భావప్రకటనా బాధకు మా కందరకు నవ్వు వస్తూఉండేది. ఇదిఅంతా మౌనములోగల ప్రశాంతతయేనా? అని గీత ప్రశ్నిస్తున్నది.

మనస్సులోగల వివిధ భావనాపరంపరలను నిగ్రహించలేక కేవలము బాహ్యేంద్రియములను నిగ్రహిస్తే ప్రయోజనమేమున్నది. మరియొక ముఖ్యవిషయము. ఇంద్రియాలను బలాత్కారముగా నిగ్రహిస్తే అవి తాత్కాలికముగా అణగియున్నట్లే కనబడుతవి. అవి అనుకూల వాతావరణము రాగానే అంతకు పూర్వంకన్నా పదిరెట్లు ఉద్రేకంతో విజృంభిస్తవి.

నామిత్రుడొకడు మాంసాహారాన్ని గురువుగారి బాధపడలేక ఆయన ఆశ్రమంలోవున్న కొద్దిరోజులును తినడం మానివేసినాడు. కాని మనస్సులో మాత్రం దానియందే దృష్టి. అదియే ధ్యానము. నాలుగువారాల అనంతరం గురువుగారిని ఆశ్రమ వాతావరణాన్ని వదలిపెట్టి బయటపడ్డాడు. ఇక ఆయన మాంసభక్షణకు మితియే లేదు. రసనేంద్రియాన్ని బలాత్కారంగా నిర్బంధించటంవల్ల కలిగిన దుష్ఫలితము కదా యిది. ఒకరోజుకు ఇరువది సిగరెట్లు కాల్చేడివాడు. అట్లు కాల్చుట బలవంతంగా ఆయన తండ్రి ఆపుజేసినాడు. అతని చేతికి డబ్బు దొరకకుండా కట్టడిచేశాడు. కొద్దిరోజులు విధిలేక ఆ వ్యసనము మానివేసినాడు అతడు. కాని ఆ వ్యసనాన్ని నిగ్రహించలేక దొంగతనముగా డబ్బు సంపాదించి మరింత తీవ్రంగా ఆ వ్యసనానికి గురియైనాడు.

ఇంద్రియనిగ్రహానికి చక్కని చిత్తసంస్కారం కావాలి. సత్‌గ్రంథ పఠనము, సజ్జన సాంగత్యము, పవిత్ర మంత్రోచ్చారణము, ఉత్తమ తీర్థయాత్రలు, పరమేశ్వర ధ్యానము ఆవశ్యకములు. నీలో నీచభావాలు పొడసూపినపుడు వెంటనే భగవానుని దివ్యపాదాలపై వ్రాలి ప్రార్థనచేయుము. ఇంద్రియముల ఉద్వేగాలు చల్లారిపోతవి.

'సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచ గిరౌ
నటత్యాగీ శాఖాస్వటతి ఝుటతి స్వైర మభితః

కపాలిన్ భిక్షో మే హృదయ కపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవదధీనం కురుసదా ॥'

ఓ శివదేవా! నా మనస్సనెడి కోతి మిక్కిలి చంచలస్వభావము కలది. నిరంతరము మోహామనెడి మహారణ్యములలో తిరుగుచున్నది. స్త్రీలను గాంచి వారి కుచగిరులపై ఊమునకగోరుచున్నది. రకరకము లగు ఆశ లను కొమ్మలమీద గంతులువేయుచున్నది. ఇట్లీ కోతి నీతి నియమములు లేక స్వేచ్ఛగా విహరించుచున్నది. ఓ దేవా! భక్తి యను త్రాటిచేత దీనిని గట్టిగా బంధించి నీ స్వాధీనమునం దుంచు కొనుము.

ఏమి ఈమధుర ప్రార్థన. భగవంతుని కరుణచేతగాని ఇంద్రి యములు స్వాధీనమును బొందవు. కన్నీటితో భగవానుని ప్రార్థిం చుము. నీ కామాది భయంకర వ్యసనము లన్నియు తొలగిపోవును. శంకరు డిట్లు గానము చేయును.

'సంసార ఘోరగహనే చరతో మురారే
మారోగ్ర భీకర మృగ ప్రవరార్దితస్య
ఆర్తస్య మత్సర నిదాఘుని పీడితస్య
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం'

'ఓ లక్ష్మీనృసింహస్వామీ! సంసారమనే భయంకరమగు అడ విలో తిరుగుచున్నాను. మన్మథరూపములగు ఘోరమృగములు నన్ను బాధించుచున్నవి. అసూయ యను తాపముచేత విపరీతబాధకు లోనగుచున్నాను. ప్రభూ! నీ చేయూత నిచ్చి నన్ను రక్షింపుము.' ఇట్లు కన్నీరుగార్చి దేవదేవుని శరణు వేడుకొనుము. అప్పుడే నీలో నున్న కామవికారములు నశించి శాంతిని బొందగలవు.

'రసవర్జం రసోప్యస్య, పరందృష్ట్వా నివర్తతే'

అని గీత పలుకును. అహంకారము గలవానిని ఇంద్రియములు బంధించును.

ఒకనాడు వ్యాసుడు జైమినికి వేదాంతప్రబోధమును చేయుచు 'బలవా నింద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి' అని చెప్పినాడు. అనగా; నాయనా! ఇంద్రియములు మహావిద్వాంసునికూడా పతనము చేయునుజుమా! అని అర్థము. ఈమాటలను విని పండితుడగు జైమిని నవ్వినాడు. గురుదేవా! మీరు చెప్పినవిషయము సామాన్యుల విషయమున యథార్థము గానచ్చును. కాని నాబోటి పండితుల విషయమున ఈమాటలు సరిపడవు. విద్వాంసుని ఇంద్రియము లేమి చేయగలవు? అన్నాడు జైమిని.

కొన్నిదినము లయినది. ఒకనాడు వ్యాసుడు జైమినిని గాంచి, 'కార్యార్థమై నేను గ్రామాంతరము పోవలసియున్నది. ఆశ్రమములో జాగ్రత్తగా నుండుము' అని చెప్పి వెళ్లెను.

ఒకనాడు రాత్రిసమయము. చినుకులు పడుచున్నవి. చలిగాలి వీవసాగినది. ఆసమయంలో ఎవరో ఆశ్రమంవద్ద నిలిచి 'బాబూ! వర్షము కురుస్తున్నది. ఆడదాన్ని. ఈరాత్రికి మీ ఆశ్రమంలో తల దాచుకుంటాను. ఉదయాన్నే లేచి వెళ్ళిపోతాను అన్నది ఒకయువతి. ఆమె సుందరాంగి. నవయౌవనశోభలు ప్రతి అంగములోను తొణికిసలాడుచున్నవి. జైమిని ఆమెతో 'ఏమమ్మా ఈ ఆశ్రమంలో స్త్రీలకు తావులేదు. వెళ్ళిపో' అన్నాడు నిష్కర్షగా. ఆమె పాపము గద్గద స్వరంతో 'ఈరాత్రికి నన్ను రక్షించండి. ఏకాకిని' ఈనిశీధంలో - ఈ చలిగాలిలో - వర్షములో ఎక్కడకు పోగలను?' అని వేడుకుంది. ముని హృదయము ఆర్ద్రమయినది. 'సరేలే! నిన్ను చూస్తే జాలివేస్తుంది. ఈరాత్రికి ఈగదిలో శయనించి తెల్లవారగనే లేచి వెళ్ళిపో' అన్నాడు జైమిని.

లోన ప్రవేశించి గదిలో పరున్నది యువతి. జైమిని యథాస్థానానికి పోయి పరున్నాడు. కాని నిద్రపట్టలేదు. ఈమె ఎవరు? ఇచ్చటకు ఏల రావలయును? నేనేల ఆశ్రయ మిచ్చితిని? ఇట్టి తలంపులు రాగా, అతడు లేచి ఆమెతో సంభాషించగోరి, దగ్గరకు చేరి,

మాటలాడ ప్రారంభించినాడు. కామప్రయుక్త వచనసరళిగా క్రమముగా మారినవి. ఆ సుందరాంగి సిగ్గు నభినయించి తొలగసాగినది. మహామునియైన జైమిని చలితమానసుడై ఆమెను బిగియార కౌగలించుకొన్నాడు. ఆశ్చర్యము! ఆమె స్త్రీ కాదు. గడ్డముతో గురుదేవుడు సన్యాసిశిష్యుని కౌగిటిలో నున్నాడు. జైమిని సిగ్గుపడిపోయినాడు. గురుదేవునికి ప్రణమిల్లి క్షమింప వేడుకొన్నాడు. 'బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి' అన్నాడు జైమిని.

'ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః' అని గీత తెలుపుచున్నది. సమస్తేంద్రియములను భగవానునికి సమర్పింపుము. నీవు ఇంద్రియ నిగ్రహమును బడయగలవు.

కాంతా విజయుడే మోక్షగామి. 'ఎంతవారలైన కాంతా దాసులే' అన్నాడు త్యాగరాజు.

'ఇనుప కచ్చడాల్ గట్టు మునిముచ్చు లెల్ల తామరస నేత్రలిండ్ల బందాలుగారె' అన్నాడు అల్లసాని పెద్దన.

శంకరుని దివ్యవాణి నాలింపుడు –

'నారీ స్తనభర నాభీ దేశం దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంస వసాది వికారం మనసి విచింతయ వారం వారం'

భజగోవిందం...

ఓ మూఢమానవుడా! స్త్రీని చూచి నీవేల మోహమును బొందెదవు. పుసులతో నిండియుండు ఆమె కన్నులను కమలపత్రములని భ్రమించుచున్నావా? ఆమె స్తనమును చూచి పయోధరములని, తామర మొగ్గలని, చక్రవాకములని పసిడికుంభములని పిచ్చివానివలె వర్ణింతువేమి? ఆమె నాభీదేశమును గాంచి యెందుల కామోహము. స్త్రీయొక్క అవయవములలోనున్నదేమో నీకు తెలియదా? ఆలోచించి చూడుు. రక్తము, మాంసము, పురీషము, మూత్రము, దుర్వాసనలు, మాలిన్యములు, వీనిని తలచినపుడు నీకు అసహ్యముకలుగుట

లేదా ? నోత పుష్టిపేదా ? ఆమాలిన్యముల కొంపయే ఆనంద నిధాన మనుచున్నావా? ఎంత మోహము! ఎంత భ్రాంతి! గోవిందుని భజించుము, నీలోనున్న కామవికారములు నశించిపోవును.

'యుక్త ఆసీత మత్పరః' యుక్తుడవై నా పరుడవు కమ్మని గీతాచార్యుని వాక్యము. సకల మోహములకును అదియే దివ్యౌషధము.

---

## 24. ఇదియే మోక్షము - బ్రాహ్మీస్థితి.

### This only is the Supreme Bless.

ప్రతి మానవునకు కాంక్షించునది సుఖము. శాంతము లేక ఆ పరమసుఖము లభించదు. ఆ పరమసుఖము ఎట్లు లభించును ? గీతాశాస్త్ర మిట్లు చెప్పుచున్నది.

విహాయ కామా న్య స్సర్వాన్ పుమాం శ్చరతి నిస్స్పృహః
నిర్మమో నిరహంకార స్స శాన్తి మధిగచ్ఛతి.　　(అ. 2 శ్లో. 71)

ఓ మానవుడా! నీకు పరమసుఖము లభించవలయునన్న నాల్గు సూత్రములను పాటింపవలయును.

అందు మొదటిది కామరాహిత్యము. కోరికల నన్నిటిని సంపూర్ణముగా త్యాగముచేసిన వానికే శాంతి లభించును. ఏ యొక్క కోరిక నీలోనున్నను నీకు శాంతిరాదు.

కోరికలు రెండురకములు. చెడ్డకోరికలు. మంచికోరికలు. ఇతరుల ధనముల నపహరించుట, పరస్త్రీలను వాంఛించుట, ఇతరులను నిందించుట, శాస్త్రవిరుద్ధములగు కర్మల నాచరించుట మున్నగునవి చెడ్డవాంఛలు. దానము, ధర్మము, మున్నగు శాస్త్రవిహితకర్మలు.

మంచికోరికలు. ఆరంభములో సాధకుడు చెడ్డకోరికలను క్రమక్రమ ముగా విడిచిపెట్టుచు, వాని స్థానమున మంచి కోరికలను ప్రవేశపెట్ట వలయును. పిమ్మట ఆ మంచికోరికలను కూడ విడనాడవలయు నని శాస్త్రము చెప్పును. సర్వవాంఛా పరిత్యాగమే మోక్షము. ఒక ఉదాహరణము. నా కాలిలో ఒక ముల్లు గ్రుచ్చుకొన్నది. ఆముల్లును కాలినుండి తీసివేయుటకు మరియొక ముల్లును తీసికొనివచ్చి దీనిసహా యమున కాలిలోని ముల్లును తీసివేసితిని. ఇప్పుడు నావద్ద రెండు ముల్లులు గలవు. ఒకటి నాకు ఉపకారము చేసినది. మరియొకటి బాధను కలిగించినది. కాని నేనుమాత్రము ఈ రెండుముండ్లను కూడ దూర ముగా పారవేసితిని. సారాంశము. ప్రారంభమున దుష్టవాంఛలను సద్వాంఛల సహాయమున పారద్రోలి పిదప వీటినిగూడ తొలగింపుము.

మనస్సును సంపూర్ణముగా వాంఛారహితము చేయుమని గీత చెప్పును. ఒకచిన్న ఉదాహరణము:- మన మనస్సు ఒక వస్త్రము వంటిది. దీనిలో నూలుపోగులు పడుగుపేకలుగా వ్యాపించియున్నవి. ప్రయత్నముతో నొక్కొక్క దారమును తీసివేసినచో ఇక వస్త్ర మనునదియే లేదు.

మనస్సు అనగా కోరికలు పుట్టి కోరికలు పడుగుపేకలుగా వ్యాపించి జీవుడే మనస్సు అను పేరుతో పిలువబడుచున్నది. ఒక్కొక్క కోరికను ప్రయత్నపూర్వకముగా తొలగించినచో ఇక మనస్సే లేదు. వాంఛారాహిత్యమేగాక నిస్పృహత్వమును బొందు మని గీత చెప్పును. ఒకప్పుడు అనుభవించిన భోగముల యందలి యభి మానమే స్పృహా యనబడును. గాన నట్టి స్పృహలను గూడా సంపూర్ణముగా విడిచిపెట్టవలయును.

మూడవది మమకార త్యాగము. ఆ రామాయణములో నుండు ఒకమధురమగు ఘట్టమును మనవి చేయుచున్నాను. రాముడు రాజ్య పాలనము చేయుచున్న కాలమున. కైకమ్మ రాముని సమీపించి, రామా! నీవు సాక్షాత్తు భగవంతుడవు. నాకేదైనా జ్ఞానోపదేశము చేయుము అని కోరెను.

'తల్లీ! రేపు ప్రభాతముననే నీవు సరయూనదీ తీరమునకు పొమ్ము. అచ్చట కొన్ని మేకలు, గొర్రెలు, గలవు. అవి ఏమిచెప్పునో విని రమ్ము' అని రాముడు చెప్పెను. కైక సరయూ నదీ తీరమునకు పోయెను. అచ్చట మేకలును, గొర్రెలును, పచ్చికను మేయుచుండెను. కైకమ్మను చూచిన వెంటనే అవి 'మే' యని యరచెను. కైక అచ్చట కొంచెము సేపుండి అంతఃపురమునకు వచ్చెను. జరిగిన సంగతి యంతయు రామునకు చెప్పెను.

'తల్లీ! వేదాంతసార మంతయును సంతియే సుమా. 'మే' అనగా నాది అని అర్థము. నాది అనునది ప్రపంచములో నెచ్చట గలదు. సర్వమును పరమేశ్వరునిది సుమా. కావున మమకార రాహిత్యమే మోక్షమార్గము.

నాల్గవసూత్రము అహంకార రాహిత్యము. ఒకప్పుడు శివాజీ గొప్ప అన్నదానమును గావించెను. వేలకొలది ప్రజలు సుఖించి ఆనందముతో శివాజీ చక్రవర్తిని స్తుతింపసాగిరి. శివాజీకి తానింత ఘనకార్యము చేసినా నని అహంకారము గలిగినది. గురువగు సమర్థ రామదాసు శివాజీ మనస్సులో బయలుదేరిన అహంకారమును పోగొట్టగోరెను. నాయనా శివాజీ నాతోరమ్ము అని అతనిని వెంట బెట్టుకొని కొండప్రాంతములకు బోయి ఒక పెద్ద బాతిని శివాజీకి చూపెను. 'శివాజీ! యిది ఎంతటి పెద్ద బాయియో చూచితివా ?' అనెను. ఆ చిత్తముస్వామి! ఇది మిక్కిలి పెద్ద బండయే యని శివాజీ పలికెను.

నీవు సైనికులను రప్పించి యీశిలను పగులు గొట్టించుము. అని సమర్థుడు పలికెను.

శివాజీ ఆ పెద్ద బండను బగుల గొట్టించెను. అందులో నుండి పెద్ద పెద్ద కప్పలు బయటికి రావొడంగెను.

చూచితివా శివాజీ! ఈకప్పలు ఎంత పెద్దవిగాను, ఆరోగ్యము గాను, బలముగాను నున్నవో. ఈ పాషాణములో నున్న ఈ కప్పలకు ఆహారమును ఎవరు పెట్టుచున్నారో గ్రహించితివా? సర్వలోక నియంతయగు పరమేశ్వరుడే పాషాణాంతర్గతము లగు నీకప్పలకు ఆహారము నిచ్చి పోషించుచున్నాడు సుమా. నీవు అహంకారమును బొందకుము. నీ అన్నదానమువలననే ప్రజలు బ్రతుకుచున్నా రని అహంకరింపకుము. మానవునకు మాధవునకు మధ్య అహంకారమను తెర అడ్డముగానున్నది. ఆ తెరను తొలగించితివా మానవుడే మాధవుడు. నరుడే నారాయణుడు. జీవుడే శివుడు.

ఈ నాలుగు సుగుణములను అలవాటు పరచుకొమ్ము. నీవు ముక్తిని బొందగలవు. ఇదియే మోక్షము.

...—...

# గీతా కల్పవృక్షము



3 వ అధ్యాయము - భగవద్గీతా కల్పవృక్షము.

## కర్మ యోగము.

## 25. రెండు ప్రధాన మార్గములు

The two ma n paths.

భారతీయ వేదాంత శాస్త్రము భగవత్ప్రాప్తికి మార్గములను తెలిపినది. అనాది సిద్ధములగు మార్గములు. గీతలయం దును. ఈ రెండు మార్గముల యొక్క వివరణమును గలదు. ఇందొకటి నివృత్తిమార్గము. రెండవది ప్రవృత్తిమార్గము. నివృత్తిమార్గమునకే సన్యాసమార్గ మనియు జ్ఞానమార్గమనియు పేర్లు. ఇంక రెండవదియగు ప్రవృత్తి మార్గమునకు కర్మమార్గమనియు గార్హస్థ్యమనియు నామాంతరములు. ఈ రెండును శ్రేష్ఠములే. రెండిటి ఫలితములును సమానములే. శుకుడు, సనకుడు మున్నగువారు సర్వసంగ పరిత్యాగులైరి. ఆత్మా నాత్మ వివేకము దీనికి సాధనము. ప్రకృతిని పరిశోధించి త్రిగుణముల శక్తులను లక్షణములను పరిశోధనముచేసి ప్రకృతికన్న భిన్నమగు తాను పరమాత్మ అను అనుభవమునుబొందుట మిక్కిలి కష్టముతో గూడిన మార్గము. అయితే అట్టిజ్ఞానమును బొందుటకు మార్గము నిష్కామ కర్మ. జ్ఞానసిద్ధిని బొందిన పిమ్మట ఇక తాము ఎట్టి కర్మలను చేయ నవసరము లేదని సన్యాస మార్గీయుల మతము. కాని గీతాశాస్త్రము దీని నంగీకరించుట లేదు. కర్మలతో తనకు నిమిత్తము లేకున్నను జ్ఞాన యోగి నిష్కాముడై నియమిత కర్మలను ఆచరించవలయు ననియే చెప్పును. సంస్కృతములో విద్యాపరీక్ష ప్యాసు అయిన మహాపండితు

నకు మరల బాలబోధిని మున్నగు పుస్తకాలు నిరంతరము చదువ వలసిన అవసరము లేనట్లు జ్ఞానము గలిగిన తమకు ఇక కర్మలతో నిమిత్తము లేదని వారి వాదము. పాఠశాలలో నున్నంతవరకే పాఠశాల నియమాలు కాని విద్యార్థి దశదాటి ఉత్తీర్ణుడైన తరువాత పాఠశాలా నియమాలు తమకు అవసరము లేదని వారి యుద్దేశము. కాని నియమ పాలనవల్లనే ఆరోగ్యమును పొందినవ్యక్తి స్వాస్థ్యమును పొందితినిగదా యని పొంగి పోయి నియమోల్లంఘనము చేస్తేలోగడ వచ్చిన ఆరోగ్యభాగ్యము నిలుస్తుందా? కాబట్టి కర్మాచరణ వలన జ్ఞానసిద్ధిని బొందినా, ఆసిద్ధినుండి జారకుండా యుండునిమిత్తము కర్మలను చేయవలసియే యుండును. జ్ఞాని కర్మలను చేయనియెడల ఆయనను చూచి అజ్ఞానులు కూడా కర్మ భ్రష్టులగుదురు గదా. కావున నిష్కామ కర్మానుష్ఠానమును జ్ఞాని కూడ చేయవలయు నని, అది ఆతనిని నిత్య పవిత్రునిగా చేయు ననియు గీత చెప్పను. సానపెట్టిన కత్తి తళతళ మెరయును. కాని దానిని మూల పారవేసినచో మరల త్రుప్పుపట్టు ప్రమాదము గలదు. కావున జ్ఞానికూడా ప్రమాదములు రాకుండా చూచుకొనుటకు కర్మలచేత జ్ఞానమును సానపెట్టి చూడ వలెను.

ఈ నాడు సంఘములో జ్ఞానసిద్ధి పొందనివారు కూడా కర్మ భ్రష్టులై సోమరులగు చున్నారు. ఈ రకము వేలకొలది రైలు పెట్టెలలో, సంతబజారులలో, సోమరులై, తిరుగుచుండుట చూచుచున్నాము. ఈసోమరు లందరును యోగీశ్వరులేనా? ఈకాషాయాంబరధారు లందరును ఆత్మద్రష్టలేనా! వీరికి కర్మ లేవియు అక్కరలే దందురు. వేళకు మాత్రము భోజనము కావలయును. క్షణ మాలస్య మయిన కాఫీకి తాళలేరు. గంజాయిలేక రోజు వెళ్ళదు. గడ్డముచూస్తే పొడుగు. లోపల కాంక్షలు అంతకంటె పొడుగు. 'ఏమిటయ్యా! పద్ధతి! అంటే ముక్కు మీదకోపము! ఎంత అహంకారము?

గంగాతీరంలో ఒక ఆశ్రమము ఉన్నది. అందొక సాధుపురుషుడు శిష్యులకు శాస్త్రోపదేశం చేస్తూ ప్రత్యక్షాత్మానుష్ఠానపరుడై వున్నాడు. తెల్లవారుజామున లేచి తాను శిష్యులు గంగలో స్నానం చేసి నియమిత కర్మలు చేస్తూ వుంటారు. ఒక రోజు ఒక సాధువు ఆ ఆశ్రమమునకు అతిథిగా వచ్చెను. ఆశ్రమవాసు లాయనకు అతిథి సత్కారములు చేసిరి. మరునాడు తెల్లవారుజామున అందరితో పాటు ఆయననుకూడ స్నానార్థము లేపిరి. కాని యిట్లనియెను. 'నాకు స్నాన సంధ్యాదులతో నిమిత్తములేదు. నేను జ్ఞానిని. నాలోనే గంగ యున్నది. యమునయు నాలోనే యున్నది.

ఈ సరస్వతియు నాలోనే విలసిల్లుచున్నది. నాలో విలసిల్లు త్రివేణీ సంగమతీర్థంలో నేను నిరంతరము స్నానము చేయుచుందును. ఇక బాహ్యస్నానములతో నాకు నిమిత్తములేదు. అన్నాడు. ఆయనకు నీతిని బోధించాలని నిశ్చయించాడు ఆశ్రమాధిపతి.

ఆనాడు ఆయనకు బొబ్బట్లు, పులిహోర, నేయి మున్నగు వస్తువులతో చక్కగా విందుచేశాడు ఆయన భుక్తాయాసంతో రాత్రి తన గదిలో పరుండగా ఆగదిలో మంచినీటి చెంబు తీసివేసి గదిని గొళ్ళెము వేశాడు. ఒక రాత్రివేళ అతిథి మేల్కొని మంచినీటి కోసం అరచినాడు. కాని యెవ్వరును మాటాడలేదు. విపరీతమయిన దాహంచేత అతడు కేకలు వేయటం మొదలు పెట్టాడు. ఆసమయంలో శిష్యులిట్లు పలికినారు. ఏమండీ యతీశ్వరా! గంగ మీలో నున్నదన్నారు. యమున మీలో నున్నదిగదా. మంచినీటి కేమి కొదువ. అతిథి చాలా సిగ్గుపడి క్షమాపణ వేడుకొన్నాడు.

బాహ్యకర్మలను వదలివేస్తే శరీరయాత్ర సాగదని గీత తెలుపును.



## 26. 'కర్మ యోగో విశిష్యతే'

**Selfless action is superior.**

పరమేశ్వర సాక్షాత్కారానికి జ్ఞానమార్గము, కర్మమార్గము, రెండును సమానములే. అయినను కర్మయోగము శ్రేష్ఠమని గీత చెప్పును.

కర్మ అనగా పనియని యర్థము కదా. భోజనము చేయుట, కాఫీ త్రాగుట, తిరుగుట, పరుండుట మున్నగునవి అన్నియు కర్మలే. కర్మలను చేయకుండ మానవుడు, క్షణకాలమైనను ఉండడు. అట్టి సందర్భములో కర్మ సన్యాసమని చెప్పుటలో అర్థ మేమి? ఊపిరి తీసికొనుటకూడ కర్మయే అయినపుడు కర్మలను మానుట అసంభవము.

జ్ఞానికి లభించుచున్న మోక్షము ఆయనయొక్క జ్ఞానఫలమే కాని కర్మ సన్యాస ఫలముకాదు. కర్మయోగములో జ్ఞానమును కర్మయును కలసియున్నవి. గనుక జ్ఞానయోగముకన్న కర్మయోగము శ్రేష్ఠ మగుచున్నది. గీతాచార్యుడైన శ్రీకృష్ణుడే తన యుదాహరణమును చెప్పుచున్నాడు.

ఓ అర్జునా! నా కీమూడు లోకాలలోను పొందదగిన దేదియును లేకపోయినను నేను కర్మను చేయుచున్నాడను. జనకుడు మున్నగు మహాజ్ఞానులు కూడా తమ విధ్యుక్త ధర్మపాలనాది కర్మలను చేసిరి. శ్రేష్ఠుడైన మానవుడు ఏకర్మను చేస్తే దానినే అనుసరిస్తారు లోకులంతా. కావున అతడు లోకసంగ్రహార్థమై ఆయా నియమిత కర్మలను చేయుచుండవలయును. అట్లు చేయనియెడల లోకము కర్మ భ్రష్టమగును.

భగవానుడగు శ్రీకృష్ణుడు రథసారథియైనాడు. రాయబారియైనాడు. గోపాలుడైనాడు. మానవసంరక్షకుడైనాడు. ఇన్ని కర్మలు తాను చేయుచున్నను ఆకర్మలు తన్ను బంధించవని భగవానుడు పలుకును.

ఆయన పదునారువేల యెనిమిదిమంది యువతులకు భర్తయయ్యును అఖండ బ్రహ్మచారి. మానస సంకల్పము ప్రధానమునది. సంకల్పరహితునకు కర్మబంధనము లేదు.

అహంకార మమకార రహితుడై లోకముల నన్నిటిని చిత్రవధ చేసినా, అతడు హంతకుడు కాడని కర్మబంధము లాతని బంధింపవని గీత చెప్పెను. అయితే మమకారాహంకారాలను త్యజించడం ఎంత కష్టం! ఎన్ని వేల జన్మలకో కాని అది సాధ్యం కాని సంగతి. పరమేశ్వర శరణాగతివల్లనే అది సాధ్యమవుతుంది. పరమేశ్వరార్పిత చిత్తవృత్తి గలవానిని భగవానుడే రక్షిస్తూ వుంటాడు.

మహాభక్తుడైన సూరదాసు కృష్ణభజన చేసుకుంటూ అంధుడైన కారణంచేత ఒకానొక పాడునూతిలో పడిపోయినాడు. అనేక దినములు ఆ నూతిలోనే కృష్ణస్మరణచేస్తూ వుండిపోయాడు. ఒకనాడు ఆ మురళీమోహనుడే వచ్చి, 'బాబూ! నూతిలో పడిపోయినావా! ఇదిగో నాచేయి పట్టుకొని పైకి రమ్ము' అని తన చేతితో అతనిని నూతిలోనుండి పైకి లాగినాడు. తన్ను నమ్మినవారిని భగవానుడు సంసారకూపంలోనుంచి పైకి చేయూతనిచ్చి లాగుతాడు. అంధుడైన సూరదాసుని పైకితీసి చేయి విదలించుకుని కృష్ణుడు వెడలిపోతున్నాడు. అప్పుడు సూరదాసు ఇట్లనెను. 'కృష్ణా! నాచేయి వదలించుకొని పోవుచున్నావు. కాని నీవు నా హృదయమునుండి పారిపోలేవు సుమా!' ఆహా! ఏమి ఆ భక్తి!

నిష్కామ కర్మ అనంత ఫలితాలను సమకూరుస్తుంది. కోరికలను విడుచుటవలన అవి తమంతటతామే వచ్చి ఆశ్రయిస్తవి. ఇది నిష్కామములో పరమరహస్యము. గుప్పెడు బియ్యము పెట్టుమని అరచుచున్న బిచ్చగానిని అందరును గెంటివేసెదరు. అసహ్యించుకొందురు. పైగా దూషింతురు. 'నాకేమియు వలదు. అని సన్యసించిన విరాగిని పూజింతురు. స్తవము చేయుదురు. కనకరాసులతో ఆతిథ్య

మిత్తురు. వైరాగ్యములోనున్న శక్తి అది. నిరాకరణము సమస్తమును ఆకర్షించును.

కర్మయోగికి కర్మలోనున్న యానందము దానిఫలితమునందు పొడసూపదు. పోతనామాత్యునకు తన భాగవత రచనలోగల యానందము దాని ఫలితముగా తనకు సాక్షాత్కరించిన రాజ సన్మానములో కానుపించలేదు. త్యాగయ్యకు రామసంకీర్తనలోగల యానందము తత్ఫలితముగా లభింపనున్న ధనరాశిలో కానుపించలేదు. కబీరునకు భగవదారాధనలోగల నిరతిశయానందము, రాజసత్కారములో కనుపించలేదు. కర్మయే ఆనందసంధాయి. తత్ఫలితము కాదు.

'కర్మయోగము విశిష్టమయినది.'

—...—

## 27. యజ్ఞములు - సేవాకార్యములు.

**Sacrifices - Selfless actions.**

యజ్ఞములను గురించి మనము కొంచెము ముచ్చటించుకొందము. వీనినిగూర్చి గీతలోని మూడు నాలుగు అధ్యాయములలో చెప్పబడినది. యజ్ఞమనగానే మీరెవ్వరును కంగారు పడవలసిన అవసరము లేదు. ప్రతియొక్కరును యజ్ఞములను చేసియే తీరవలయునని గీత చెప్పును. యజ్ఞములు చేయనివారికి ఈలోకములోనే సుఖము లేదు. ఇక పరమెక్కడిది! అని గీతాచార్యుడు పలుకును. యజ్ఞమునకు పందిళ్ళు, పాకలు, హారతి ద్రవ్యములు, ఋత్విక్కులు, ధనము, ఆహారపదార్థములు మున్నగునవి కావలయునని భయపడుచున్నారేమో వానితో నిమిత్తమేమియును లేదు. జ్యోతిష్టోమాది యజ్ఞములను గూర్చి యిచ్చట చెప్పబడుటలేదు. భగవద్గీత ప్రతిమానవునకును అందుబాటులోనున్న యజ్ఞమును గూర్చియే చెప్పుచున్నది.

'యజ్ఞ' మనగా విష్ణుదేవుని ప్రీతికొరకు చేయబడు 'పవిత్ర కర్మ' అని అర్థము. నీవు సత్యదేవవ్రతము చేయుచున్నావు. దానిని

నీవు స్వార్థమగు కోరికతో గాక పరమేశ్వర ప్రీతిని కోరి చేసినచో అది యజ్ఞ మగును. మీరు గీతాపారాయణము చేయుచున్నారు. దానిని మీరు నిష్కామముగా చేయుచున్నచో నదియు మహాయజ్ఞమే. ఈశ్వర ప్రీతిని గోరుచు చేయు చిన్న కార్యమేనియు అది యజ్ఞమే. పూజ, అభిషేకము, గ్రంథ పారాయణము, సేవ, ప్రవచనము, దానము, ఇవన్నియును యజ్ఞములే. అహంకార రహితుడవై నీవు వానిని ఆచరించుము. అది యజ్ఞత్వమును బొందును. కోట్లకొలది ధనము వెచ్చించి నీవు పటాటోపముకొరకు కీర్తి ప్రతిష్ఠలకొరకు చేయు మహాసంతర్పణాల కన్న ఆకలిగొన్నవానికి ఈశ్వరార్పిత బుద్ధితో ప్రేమపురస్సరముగా పెట్టెడు గుప్పెడు అన్నపుముద్ద అనంత యజ్ఞ స్వరూప మగును. ఈసందర్భములో ఒక ఇతిహాసాన్ని మనవిచేస్తాను.

ధర్మరాజు రాజసూయాన్ని చేస్తూవుండగా ఒక ముంగిస వచ్చి వంటశాలలోనున్న బూడిదపై పొరలసాగింది. ధర్మరాజు దానిని చూచి, 'ఓ ముంగిసా! రకరకాలయిన భోజనపదార్థము లున్నవి. నేను కోట్లకొలది ప్రజలకు అన్నదానము చేయుచున్నాను. సకల భూత కోటికి సంతర్పణ చేయుచున్నాను. అటుచూడు. ఎన్నెన్ని వంటకముల రాసులను నేను చేయించినానో. పోయి కావలసినవి తిను' అన్నాడు. అంతట ముంగిస 'ధర్మరాజా! భోజనమునకు కరువెత్తి ఇచ్చటకు రాలేదు. ఇటుచూడు. నాశరీర మొకవైపు బంగారుమయమై ఉన్నది. ఒకానొక బ్రాహ్మణుడు యజ్ఞముచేసిన పుణ్యభూమిలో పొరలిన కారణంచేత నా దేహములో అర్థభాగ మిట్లు బంగారముగా మారి నది. ఇచ్చట ధర్మరాజు మహాయజ్ఞమును చేయుచున్నా డని విని నా శరీరమందలి రెండవభాగము కూడ బంగారుమయము కావలయునను కోరికతో ఆ యజ్ఞభూమిలో కొన్ని గంటలనుండి పొరలుచున్నాను. శరీరముపై బూడిద యంటుకొనుచున్నదేగాని బంగార మగుటలేదు.

ఓ ధర్మరాజా ! ఇదియును ఒక యజ్ఞమనియే చెప్పుచున్నావా అన్నది.

ధర్మరాజు నివ్వెరపోయినాడు. 'ఓ ముంగిసా! ఆ యజ్ఞమును ఎవరు ఎట్లుచేసిరో నాకు చెప్పెదవా?' అని వేడుకొన్నాడు ధర్మరాజు. అట్లయిన విను. 'ఒకానొక ధర్మపరాయణుడైన బ్రాహ్మణుడు ఉన్నాడు. పాప మాతడు బీదవాడు. ఆయనకు ఒక వారమురోజుల నుండి తినుట కాహార మేమియు దొరక లేదు. భార్యాబిడ్డలు హరి నామస్మరణ చేస్తూ కాలక్షేపం చేస్తున్నారు. అదృష్టవశాత్తు ఆయనకు ఆరోజున కొద్దిగా నూకలు దొరికినవి. వానిని ఆతని భార్య జావగాచి సిద్ధముచేసినది. భార్య, బిడ్డలు, తాను ఆగంజిని త్రాగుటకు సిద్ధముగా నున్నారు. ఇంతలో ఒక బ్రాహ్మణుడు 'బాబూ ! ప్రాణము పోవుచున్నది. కాస్తగంజి పోస్తారా?'అని దీనముగా పలుకుచు వచ్చినాడు. ఆ గృహమేధి హృదయము కరగిపోయినది. తనవంతువచ్చిన గంజిని ఆ బ్రాహ్మణునకు సంతోషముతో ఇచ్చినాడు. దానిని త్రాగి ఆతడు వెడలిపోయెను. శేషించిన గంజిని వారు త్రాగుచుండగా మరొక అన్నాతురు డరుదెంచెను. బ్రహ్మ ప్రీతమ్మని దానిని వారాతని కొసంగిరి. పాప మా కుటుంబము ఆకలిచే అస్తమించినది. గంజిచుక్కలు పడినవి. వానిపై నేను పొరలినాను. దాని ఫలితమే ఈ స్వర్ణమయ శరీరము. రాజా ! అదియా యజ్ఞము ? లేక నీవు చేయునదియా యజ్ఞము? అన్నది ముంగిస.

సారాంశ మిది. అహంకార రహితముగా - స్వార్థమును పూర్తిగా త్యజించి చేయునదియే మహాయజ్ఞము. దానివిలువ రూపాయలలో లెక్కింప లేము, అది ఎంతస్వల్పమైనా మహాఫలప్రదము.

ఒకడు పదివేలరూపాయలు ఖర్చుచేసి తనపట్టణానికి గవర్నరుగారిని తీసుకొనివచ్చి గొప్ప విందుభోజనము ఏర్పాటుచేసెను. మరియొకడు ఆకలితో అల్లాడుచున్న ఒక పేదవానిని గౌరవించి ఆప్యాయ

ముగా పచ్చడితో భోజనము పెట్టెను. ఈ రెండు కర్మలలో ఏది యజ్ఞ కర్మ. మొదటిది కామ్యము. అహంకార పూరితము. రెండవది నిష్కామ్యము. ఈశ్వరార్పితము. కావున రెండవది యజ్ఞస్వరూపము.

దేవతా యజ్ఞమునుగూర్చి గీత చెప్పును. సృష్టికర్త ప్రజలను సృష్టించి- పరిపాలన పోషణార్థమై యజ్ఞకర్మలను సృష్టించినాడు. స్వధర్మానుసారముగా వారువారు చేయుకర్మలే యజ్ఞములు. అట్టి యజ్ఞముల చేత దేవతలు తృప్తిని బొంది మానవులకు ఇష్టార్థముల నొసంగెదరు. యజ్ఞముద్వారా మానవులకును, దేవతలకును సంబంధము కలుగుచున్నది. భగవానుడు మనకు ప్రసాదించిన వివిధ వస్తుసముదాయమును తిరిగి భగవంతుని ప్రీతికొరకే అర్పింపుము. నీవు దానికి ధర్మకర్తృత్వమును వహింపుము' అని పలుకును.

అట్లు ఈశ్వరార్పణము చేయనివాడు పాపమునే భుజించుచున్నాడు.

---

## 28. అయిదు మహాయజ్ఞములు.

### The five fold Sacrifices.

మానవజీవితము ధన్యత్వమును బొందుటకు యజ్ఞములను చేసియే తీరవలయును. యజ్ఞాచరణమే జీవితకర్తవ్యము. యజ్ఞములు చేయనివాడు సోమరి. వాడు పొందునది అధోగతియే. ఈ యజ్ఞములకు జాతి, మత, వర్ణ వివక్షతలు లేవు. కావలసినది శ్రద్ధ - ఆసక్తి - యజ్ఞములవలననే చిత్తశుద్ధి కలుగును. చిత్తశుద్ధియే జ్ఞానమునకు మూలహేతువు. పవిత్రాంతఃకరణమునందే భగవానుడు ప్రకాశించునని గీత చెప్పును. ప్రతివానికిని అందుబాటులోనున్న ఐదు యజ్ఞములను గూర్చి మనము ముచ్చటించుకొందము. వీనినే పంచమహాయజ్ఞములు అని చెప్పుదురు. వీనిని ఆచరించుటవలన సకలపాపములును

తోలగును. ఇవియే 1) దేవయజ్ఞము, 2) ఋషియజ్ఞము, 3) పితృ యజ్ఞము, 4) అతిథియజ్ఞము, 5) భూతయజ్ఞము.

1) దేవయజ్ఞము (**Worship of Gods**) :- ప్రతిదినము దేవతాపూజ చేయవలయును. ఇది ప్రతి స్త్రీయొక్కయు విధ్యుక్త ధర్మము. భగవానుని అనుగ్రహముచేతనే మన కీ మానవజన్మ లభించినది. భగవానుని పూజింపనివారివి 'రిక్తవ్యర్థ సంసారము'లని పోతన పేర్కొనినాడు. ప్రతిదినము నిద్రనుండి మేల్కొని చేయవలసిన ముఖ్యధర్మము - 'దేవతారాధన'. శుచిభూతుడవై నీ సంప్రదాయానుసారంగా దైవపూజ చేయుము. సహస్రనామార్చన- అష్టోత్తర శతనామపూజ - రుద్రాభిషేకము. ఇవన్నియు దేవతార్చనా విధానములే. ప్రతిఇంటిలోను దేవతారాధనకు ఒకగదిని ప్రత్యేకించవలెను. గృహస్థుడు తన సుఖములకొరకు గృహమును నిర్మించుకొని అందులో వంటగది, పడకగది, నీళ్ళగది, మలమూత్రముల గది - ఇట్లు అన్ని గదులును ఏర్పరచుకొనును. గాని దేవునిగదిమాత్ర ముండదు. పడక గదిని అలంకరించుకొనుట మన స్త్రీలకు ఎంతో ముఖ్యముగా నుండును. గాని దేవుని గదియొక్క అలంకరణ ముండదు. ఎంత అవివేకము. చిత్తశాంతిని కలిగించుటకు ప్రత్యేకముగా నొక గదిని ప్రతి గృహస్థుడును ఏర్పాటు చేసికొనవలయును. అందు సంప్రదాయానుసారంగా దేవతావిగ్రహములను గాని పటములను గాని యుంచవలయును. స్నానముచేసి శుచిగా నుండువారు మాత్రమే అందు ప్రవేశింప నర్హులు. అందు హారతికర్పూరము, సాంబ్రాణి మున్నగువానిని వెలిగింపుము. ప్రతిదినమును నియమితకాలములో దానిలో ప్రవేశించి పూలతో, అక్షతలతో, గంధాదులతో దేవుని అర్చింపుము. ఇట్లు చేయుటచే ఆగది యంతయు ఆధ్యాత్మిక వాతావరణముతో నిండిపోవును. నీమనస్సు చీకాకుగా నున్నపుడు, అందు ప్రవేశించి మౌనముగా కూర్చుంటివా - వెంటనే శాంతికలుగును. అనుభవము

వలన ఈ పరమరహస్యమును గ్రహించవలెను. స్త్రీలు పార్వతి, లక్ష్మి మున్నగు స్త్రీమూర్తు లను పురుషులు రామకృష్ణాది పురుష మూర్తులను పూజించుటే లెస్స యని పెద్దలు చెప్పుదురు. ఇదియే దేవయజ్ఞము. ఈ మహాయజ్ఞమును ప్రతిదినమును చేయుము. దాని వలన కలుగు పరమానంద శాంతిని అనుభవపూర్వకముగా గ్రహింపుము.

2) ఋషియజ్ఞము (Worship of the Saints) :- దీనినే స్వాధ్యాయ యజ్ఞ మనికూడ భగవద్గీత పలుకును. ప్రతిదినమును శుచివంతుడవై నియమిత కాలమునందు పవిత్ర గ్రంథ పారాయణము చేయుము. ఇదియే ఋషియజ్ఞము. వేదపారాయణము, ఉపనిషత్తులు చదువుట, గీతాపారాయణము, రామాయణ భాగవతాదులను చదువుట, ఇవన్నియును స్వాధ్యాయ మహాయజ్ఞములే యగును.

విశేష భాషాజ్ఞానము లేనివారు ఏదైనను ఆధ్యాత్మిక గ్రంథమును చదువవచ్చును. కృష్ణశతకము, నృసింహశతకము, దాశరథీ శతకము లేక వచన భాగవతాదులు చదువుము.

ఈరోజులలో స్త్రీపురుషులయొక్క మనస్సులు నీచసారస్వతము పైకి పోవునట్లు ఉత్తమ సారస్వతముపైకి పోవుటలేదు. కామోద్రేకమును కలిగించు సినిమాతారల అర్ధదిగంబర శరీరాలు ముద్రింపబడిన పత్రికలు, కథలు, నవలలు, నాటికలు - ఇవియే వారి నాకర్షించును. నీచశృంగారము తప్ప వానిలో మరియొకటి గానరాదు. ఈ కథలు చదివి బాలబాలికలు శీలమును గోల్పోయి భ్రష్టు లగుచున్నారు. ఇంద్రియనిగ్రహములో విశేష మున్నది గాని - ఇంద్రియలోలత్వములో పతనమేగదా! ఇట్టి నీచసారస్వతమును తాకకుందురు గాక !

పవిత్ర గ్రంథపారాయణము వలన మానవునకు సచ్ఛీలత గలుగును. సదాచారము గలుగును. మానసికశక్తి పెంపొందును. చిత్త

శాంతి లభించును. సర్వశాస్త్రమయ మగు గీతాశాస్త్రమును ప్రతి దినమును నియమితకాలములో పఠించుము. అది నీకెట్టి మహాశక్తిని గలిగించునో అనుభవమువలన గ్రహింపుము.

గాంధీమహాత్ము డిట్లు పలుకును. 'నామనస్సు చీకాకుగా నున్న ప్పుడు, నాచుట్టును అంధకారము వ్యాపించినపుడు, దారి తెలియని అయోమయస్థితిలో నేనున్న సమయమున, కష్టములు నన్ను చుట్టు కొన్నపుడు, నేను భగవద్గీతను తెరచి చదువుదును. ఏదియో యొక శ్లోకము నా కన్నులయెదుట మెరపుతీగవలె మెరయుచు నాకు జ్ఞానో దయ మొసగును. నా చీకటి పటాపంచ లగును. నా నిరాశ ఆశగా మారును. నా దుఃఖము నశించి శాంతి లభించును. గీత నాకు మాత. అట్టి అనుభవమునే నీవును పొందగలవు.'

3. పితృయజ్ఞము (Worship of fathers) :- మాతా పిత రుల సేవయే ఈ యజ్ఞమును సూచించును. ఈ భౌతిక దేహమును నీ కిచ్చిన పుణ్యరూపులే నీ తల్లిదండ్రులు. తల్లిదండ్రులను మించిన దైవ ములు లేరని మన శాస్త్రములు చెప్పును. 'మాతృదేవోభవ! పితృ దేవోభవ!' అని మన వేదములు మనకు చెప్పుచున్నవి.

ఒకప్పుడు పరమశివున కొక సందేహము కలిగినది. తన కుమారులగు గణపతి, కుమారస్వాములలో ఎవరికి సర్వసేనాధ్యక్షత ఇవ్వవలెనని ఆయన ఆలోచించెను.

ఎవరు భూప్రదక్షిణముచేసి ముందుగా వత్తురో వారికే గణాధి పత్యము లభించగల దని శివుడు పల్కెను.

గణపతి స్థూలకాయము గలవాడు. పైగా వాహన మోఎలుక. 'ఇత డెట్లు వేగముగా భూప్రదక్షిణము చేయగలడు.' అని కుమార స్వామి తలంచెను. నా వాహనమో నెమలి. నేనా చురుకుగా పోగల వాడను. కనుక నాకే ఆధిపత్యము లభించునని కుమారస్వామి తల

పోసి, వెంటనే నెమలి వాహనారూఢుడై భూప్రదక్షిణమునకు బయలుదేరినాడు అహంకారముతో.

గణపతి బాగుగా యోచించినాడు. శాస్త్రవేత్తలతోను మహర్షులతోను సంప్రదించినాడు. తన తల్లిదండ్రులగు పార్వతీ పరమేశ్వరులను పీఠముపై కూర్చుండబెట్టి వారి పాదాంబుజములను భక్తి శ్రద్ధలతో అర్చించి, ముమ్మారు ప్రదక్షిణములును చేసినాడు.

అంతే ఆయన చేసినపని. ఇక నిశ్చింతగా కూర్చున్నాడు. మహావేగముగా భూప్రదక్షిణము చేయుచున్న కుమారస్వామి తనకు ముందుగానే గణపతిని ప్రతిక్షేత్రములోను చూచి ఆశ్చర్య చకితుడైనాడు. భూప్రదక్షిణముచేసి కుమారస్వామి రాగా ఆయనకు పూర్వమే వచ్చి కూర్చున్న గణపతినే విజయునిగా చెప్పినారు పెద్దలు.

సారాంశమిది: తల్లిదండ్రులకు ప్రదక్షిణముచేస్తే భూప్రదక్షిణము చేసిన మహాఫలితం లభిస్తుందని శాస్త్రం చెప్పుతుంది. చూచితిరా! మాతాపితరుల సేవలోని గొప్పతనం. తల్లితండ్రులను సేవింపక తపస్సుకుపోయిన కౌశికునిగతి ఏమయినది. తల్లితండ్రుల ఆశీర్వాదములు అమోఘములు. వారు జీవించియున్నంతకాలము వారికే సేవనుచేస్తూ వారియనంతరము శాస్త్రానుసారం కర్మకాండలను నిర్వర్తించుటే పితృయజ్ఞము.

4. అతిథి యజ్ఞము (**Worship of the Guests**) :- గృహస్థుడు కనీసము ఒక్క అతిథిని పంక్తిలో కూర్చుండ బెట్టుకొని భోజనము చేయవలెనని హిందూధర్మము చెప్పను. 'స్వార్థముకంటె పరార్థముకొఱకే నీవుజీవింపుము.'అని శాస్త్రము మనకు బోధించును. అన్నాతురుడై వేళకువచ్చినవానికి భోజనముపెట్టుట యజ్ఞము. అది ఇహపర సుఖములకు మూలము. ఇంటికి వచ్చినవారికి పెట్టక వేలకొలది రూపాయలు వెచ్చించి, గొప్పకొరకు, డాంబికముగా మహాసంతర్పణము చేస్తే అది 'యజ్ఞము' అగునా? వీనిని రాజసిక

తానుసిక కార్యములని గీత నిషేధించును.'అభ్యాగతః స్వయం విష్ణుః' వానిని విష్ణు స్వరూపునిగా భావించి ఆదరించి భోజనము పెట్టుము. కాశీ రామేశ్వరాది మహాతీర్థసేవనము కన్నా ఇయ్యది మహా పుణ్యప్రదము కావున అన్నాతురులను ఆదరింపుము. అన్నదానము అన్ని దానముల కంటెను మేలని పెద్దలు చెప్పుదురు. పేదలకు నీకు గలిగినది పెట్టుము. దీనినే నరయజ్ఞమని కూడ పిలుతురు. మానవసేవయే మాధవసేవయను మహాసూత్రము ఈయజ్ఞములో నున్నది. 'కలడందురు దీనులయెడ' అని భాగవతము పలుకును... 'దరిద్రనారాయణులను సేవింపుము' అని గాంధీ పలుకును.

రంతి దేవుడు తన సర్వమును యాచకులకు ధారపోసినాడు. ప్రేమపూర్వకముగా దారిద్ర్యమును స్వీకరించినాడు. ఆహారపానీయములు లేక కారడవులలో సతీసుతులతో కాపుర మున్నాడు. ఆయన హృదయము దీనజన సేవాపరాయణతలోనే లీనమయ్యెను. నలుబది దినములు ఆహారము లేక కొంచె మాహారము దొరకినది. ఇంతలో ఒక అన్నార్తుడు-వానికి దానిలో సగమిచ్చినాడు. ఇంతలో మరొక క్షుధార్తుడు. శేషించినది ఆతనికి ధారపోసినాడు. ఇక కొలది మంచి నీరుమాత్రమే యున్నది. దానిని త్రాగుదమని రంతిదేవుడు భార్యాపుత్రులతో సిద్ధముగా నున్నాడు. ఇంతలో దీనాలాప మాతని వీనులను సోకినది. 'దాహము బాబూ దాహము, నోరెండిపోవుచున్నది.' అని ఒక చండాలుడు వచ్చెను. రంతిదేవుని హృదయము ద్రవించినది. రా బాబూ! రా!-

అన్నములేదు; కొన్ని మధురాంబువు లున్నవి త్రాగుమన్న, రా
వన్న శరీరధారులకు నాపద గల్గినవారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబు లొసంగుట కన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పరమేశ్వరు డొక్కడె సుమ్ము పుల్కసా'

ఓహో! ఏమి ఆ హృదయార్ద్రత! ప్రేమ భావసంజనిత మధుర పద జాలము. ఏమి ఆ ఆతిథిపూజ! ఆ చండాలునిలో అతనికి పరమేశ్వరుడే గోచరించినాడు. ఆతనికి స్వదేహబాధయే కానుపించలేదు. ఆ మధురాంబువులను ప్రేమతో సమర్పించినాడు ఆ చండాలునకు.

ఆ మహాత్యాగమునకు లోకమంతయు దద్దరిల్లి పోయినది. ఆ మహాయజ్ఞమునకు పరమేశ్వరుడే నిశ్చేష్టితుడైనాడు. స్వస్వరూపంలో సాక్షాత్కరించి, 'నాయనా! రంతిదేవా! నీ మహాత్యాగశీలత లోకమున కాదర్శము. నీకు వరము నిచ్చెదను కోరుకొమ్ము' అని పలికినాడు.

రంతిదేవుని పవిత్ర వదనమునుండి బయలు దేరిన పలుకు లివి.

'న త్వహం కామయే రాజ్యం న స్వర్గం న పునర్భవం
కామయే దుఃఖతప్తానాం ప్రాణినా మార్తినాశనం' (భాగవతము)

'ఓ దేవా! నాకు రాజ్య మక్కరలేదు. రాజ్యభాగములతో నాకు పనిలేదు. పరలోకసుఖములును నాకు వలదు. ఉత్తమ మయిన పునర్జన్మయు నాకు వలదు. దుఃఖాగ్నితప్తులగు జీవులయొక్క ఆర్తిని పోగొట్టుము. ఇది నా ఆకాంక్ష!'

ఏమి ఆ ప్రార్థనము! శరీరమును పులకింపజేయుటలేదా! సకల ప్రాణుల సుఖమును కాక్షించువాడే మహాభక్తుడు. అతడే జ్ఞాని. లోకాస్సమస్తా స్సుఖినో భవంతు. ఇదియే అతిథి యజ్ఞములోని మూల సూత్రము.

5. భూతయజ్ఞము (**Worship of the beings**) :- గృహస్థుని ఆశ్రయించుకొని అనేక జీవజంతువు లుండును. ఆవులు, గేదెలు, మేకలు, కోళ్లు, కుక్కలు మున్నగునవి. వీనినన్నిటిని దయతో చూడుమని ఈ యజ్ఞముయొక్క భావము. తన యింటిలోనున్న పశువులకు తగినరీతిని ఆహారాదుల నిచ్చిన పిమ్మటనే గృహస్థుడు భుజింపవలయునని శాస్త్రము చెప్పును ఏయింటిలో ఆవులు మున్నగు పశువులు

కంటతడి పెట్టుచుండునో, ఆయిల్లు దారిద్ర్య దేవతకు నిలయ మగును. లక్ష్మి ఆఇంటినుండి పారిపోవును. గోపూజ అనగా గోవును ఒక పుణ్య దినమునందు పసుపుకుంకుమలు రాసి గంధము, అక్షతలతో పూజిం చుట మాత్రమే కాదు. దానికి పుష్టికరమగు ఆహారాదులనిచ్చి వాస యోగ్యమగు తావులలో నుంచవలెను. పశుసంపదమీదనే మానవ సంపద ఆధారపడియుండును. ఆవుపాలు మనకు జీవనకారి యగు ఆహా రము. దాని మలమూత్రములు మనకు సర్వరోగహరములు. భూము లకు ఎరువులు, పంటలకు మూలాధారములు. అట్టిగోవు మనకు పూజ నీయము కదా. హిందూధర్మము పశుపోషణమును ఒక మహాయజ్ఞ ముగా పలికినది. ఏమి ఋషీశ్వరుల మహదాశయము!

సమీక్ష : ఈ అయిదు యజ్ఞములను ప్రతివారును చేయవల యును. దీనివలన సుఖమంతయు వికాసవంత మగును. దేశమంతయు సుభిక్షమగును. మానవ హృదయాలలో శాంతి వర్ధిల్లును. ఈ పంచ మహాయజ్ఞములును కర్మయోగ రహస్యములే! ఇవి మానవుని శారీ రక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులను పెంపొందించును. మానవుడు పూర్ణత్వమును బొందుటకు ఈపంచమహాయజ్ఞములును సాధనములు, మోక్షప్రాప్తికి వీనికంటె మించినవి లేవు. ప్రపంచమంతయు యజ్ఞ కర్మలచేతనే ప్రతిష్ఠితమై యున్నది.

'అయం జన్మ కృత స్సుఖం'

---

## 29 విశ్వసృష్టి - స్వధర్మము

### Creation of the world - self duty.

'భగవంతుడు జీవులను ఎట్లు సృష్టించెను?' అని చాలమంది ప్రశ్నిస్తారు. ఉపనిషత్తు లిట్లు చెప్పాను. పరమాత్మ తొలుత ఆకాశ మును సృష్టించినాడు. అందుండి వాయువు పుట్టినది. వాయువునుండి

అగ్ని కలిగినది. అగ్నినుండి నీరు, నీటినుండి భూమియును కలిగినవి. భూమినుండి ఓషధులు కలిగినవి. ఓషధులను తినుటచేత పురుషుల యందు శుక్లమును, స్త్రీలయందు శోణితమును కలుగును. స్త్రీపురుషులయందు గల సహజాకర్షణములచే భూతకోటి జనించుచున్నది. 'అన్నాద్భవంతి భూతాని' అని గీత పలుకును. అట్లయిన అన్నాదులు ఎట్లుకలుగును? 'పర్జన్యాదన్న సంభవః'అని గీత జవాబిచ్చును.' మేఘములు సస్యానుకూలముగా వర్షించుటచేత పంటలు పండును. సరియే ఆ మేఘు డెట్లు వర్షించుచున్నాడు? 'యజ్ఞాద్భవతి పర్జన్యః' అనగా యజ్ఞముల వలన వర్షములు కలుగుచున్నవి.

'ప్రజలు తమస్వధర్మానుసారముగా శాస్త్రచోదిత మగు కర్మలను చేయుటే యజ్ఞము' లనబడును.

ఈనాడు దేశములో కరువుబాధలు, అతివృష్టి, అనావృష్టి బాధలు, రోగములు, యుద్ధములు, వరదలు, ఉప్పెనలు కలుగుటకు కారణము ఏమి? మానవులు తమస్వధర్మములను పాటింపకుండుటయే! ధర్మమార్గములను త్యజించి స్త్రీ పురుషులు స్వేచ్ఛావిహారములు చేయుట, వ్యభిచారాది నీచకర్మలయందు ప్రవర్తించుట, దయాసత్యసేవాది శాస్త్రధర్మములు జారిపోవుట, ఇవియే లోకక్షోభకుకారణములు. దీనినే 'యజ్ఞాద్భవతి పర్జన్యః' అని గీత పలుకును.

ఇంకను పతివ్రతలగు స్త్రీలు, ధర్మబుద్ధిగల పురుషులును అక్కడక్కడ నుండుటచేతనే విశ్వ మిట్లయినను నున్నది. మహాపురుషు డెక్కడో పర్వత కందరములో నున్నను చాలును. ఆయన శక్తిచేత పరిసరప్రాంతమంతయు పవిత్ర మగును. సుఖావహాముగా కనుపించినను పరధర్మము భయంకరము. మానవులందరు తమ తమ స్వధర్మము లాచరించినపుడు లోకము శాంతియుతమై ప్రకాశించును.

—○○✿○○—

# 30. కామ క్రోధములు

**Desire and anger.**

ఈ విషయములను గూర్చి లోగడ ఒక ప్రవచనము జరిగియే యున్నది. గీతలో వీని నిరోధావశ్యకతను గూర్చి మరల మరల గీతాచార్యుడు చెప్పెను. అత్యంత ముఖ్యవిషయ మగుటచేత మరల మరల చెప్పుట తటస్థించినది.

'కామము వేరు – క్రోధము వేరు' అని చెప్పుట తగదు. కామముయొక్క రూపాంతరమే క్రోధము. కామముయొక్క వికార స్వరూపమే క్రోధ మగుచున్నది. ఈ కామము మహాభయంకరము ... లౌకిక జీవయాత్రలోనే కామము మానవునకు బహు దుఃఖమును కలుగచేయుచుండగా, ఆధ్యాత్మిక పథగామికి దీని నష్టమును గూర్చి వేరుగా చెప్పవలెనా? కామ మనగా ధర్మవిరుద్ధమగు కోరిక. మానవుని బంధించు బహువిధ వాంఛలలో కాంతావాంఛ బలీయమును, మహా పతన కారణమును నగుటచేత స్త్రీ వాంఛనే కామముగా తరచు చెప్పుట గలదు.

కబీరు ఇట్లు పలుకును.

'నారీకో ఛాయా పరత అంధహూాత భుజంగ
కబిరాతి తినకీ కౌన గతి నిత నారీ కేసంగ'

'స్త్రీయొక్క నీడ సోకిన మాత్రముచేతనే భయంకరమగు పాముకూడ గ్రుడ్డితనమును బొందును. నిరంతరము స్త్రీల సంగమమున మెలగు పురుషుని గతి చెప్పవలెనా!

కావున స్త్రీ విషయమున కడు జాగ్రత్తగా నుండు మని శాస్త్రము హెచ్చరించుచున్నది.

'ఇనుపకచ్చడాల్ గల మునిముచ్చు లెల్ల, తామరసనేత్ర లిండ్ల బందాలు గారె' అని మనుచరిత్రలో వరూధిని పలుకును.

'పరాశరాది మహామునులే స్త్రీని జయింపలేకపోయిరి. మునిశేఖరుడైన విశ్వామిత్రుడే మేనక వాలుచూపులకు బందీయైనాడు. మనమొక లెక్కా?' అని తరచు చాలమంది పలుకుదురు.

అట్టి కథలను పురాణములలో ఏల వ్రాసినారో మీరు గమనింపుడు. మీరును వారివలె స్త్రీలకు వశులు కండని హెచ్చరించుటకా? కాదు కాదు. 'ఇంద్రియ నిగ్రహము కష్టసాధ్యము. కావున దృఢ నిశ్చయముతో కామమును త్యజింపుము' అని హెచ్చరించుటకే. కామనిగ్రహములో అపజయమును బొందినవారి కథలు మనకు చెప్పబడినవి. వానిప్రక్కనే కామినీ విజయమును గాంచిన మహాపురుషుల గాథలు కూడా చెప్పబడినవి.

'అది హిమాలయ పర్వతప్రాంత భూమి. సుందరమగు దృశ్యము. గంగానదీతీరపు చక్కని ఇసుక తిన్నెలు! ఊహా మనోహరమగు ఉద్యానవనము. అల్లిబిల్లిగా తీగ లల్లుకొని పూలగుబాళింపులతో – మధుకరముల తీపి పాటలతో – అంతయు శృంగారమయము. ఆ లతాగృహాలలో కస్తూరి ఘుమఘుమలుమధ్య కుసుమ కోమలి వరూధిని. ఆమె వాలుచూపులు, వక్షోజవిస్ఫురణము, ముద్దుమోము బండరాతికి గూడ వలపు కలిగించుచున్నది. తరుణవయస్కుడగు ప్రవరు డడుగో – భావవయోరూపబల తేజోవిలసితుడు. ఆమె తనంతట తాను వజ్రప్రవరుని వలచినది. సిగ్గువీడి వలపు ప్రస్ఫుటముగా జిగురాకుమోవి విప్పి చెప్పినది. ఓహో! ఏమి ఆవైరాగ్యము. భువనమోహిని ఏకాంతప్రదేశమున – ప్రేమభిక్షకు అర్థింపగా నిరాకరించు జితేంద్రియు లెంతమంది కలరు? లేకపోలేదు – ఉన్నారు. అట్టివారే బ్రహ్మవేత్తలు.

'ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ పాలిండ్లు పొంగారఁ, బై
యాంచల్ మోవఁగ కౌఁగిలించి యధరం బాసింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి తదీయాంస ద్వయం బంటి
పొమ్మంచున్ ద్రోచె కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్'

ఓహో! ఏమి ఆవైరాగ్య మహాగాంభీర్యము. ఆ జగన్మోహిని వలపు పారవశ్యముచే, పాలిండ్లు పొంగారగా - ఆతనిని బిగియార కౌగలించి అధరామృతమును గ్రోలగోరినది. ఆ వైరాగ్యమూర్తి 'హా శ్రీహరీ' యని ముఖమును ప్రక్కగా త్రిప్పుకొని ఆమె భుజ ద్వయము బట్టి 'ఛీఛీ' పొమ్మని గెంటివేసినాడు. అట్టివాడే 'ధీరు' డని గీత పలుకును.

కామినీ విజయమును గాంచినవాడే సన్యాసి, స్థితప్రజ్ఞుడు, జ్ఞాని, త్రిగుణాతీతుడు. ఇది రజోగుణ సముద్భవ మని గీత చెప్పును. ఇది ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని ఆవరించి యుండును.

'జడమైన శరీరముకంటె ఇంద్రియములు శక్తివంతములు. అన్ని ఇంద్రియములకంటె మనస్సు మిక్కిలి శక్తివంతమైనది. మనస్సు కంటె బుద్ధిగొప్పది. బుద్ధికంటె ఆత్మ శ్రేష్ఠమైనదికదా! కావున ఆత్మ జ్ఞానముచేత 'కామము' అనే మహాశత్రువును జయించును. అని గీతాచార్యుని వచనము. ఉపనిషత్తునందు ఈ విషయము మనోహరమగు ఉపమానముతో చెప్పబడినది.

ఈ శరీరమే రథము. రథమునకు గట్టబడిన గుఱ్ఱములే ఇంద్రియములు. గుఱ్ఱములు పోవు బాటయే ఇంద్రియ విషయము. గుఱ్ఱమునకు తగిలింపబడిన కళ్ళెమే మనస్సు. కళ్ళెమును బిగించి పట్టిన సారథియే బుద్ధి. రథమునం దాసీనుడైన యజమానియే 'ఆత్మ'. వీని యన్నిటియందును యజమానియే శ్రేష్ఠుడు. యజమాని యిచ్చనుబట్టియే సారథి నడుచును. సారథి బిగించిన కళ్ళె

మునుబట్టియే గుఱ్ఱము నడుచును. గుఱ్ఱముల ననుసరించియే రథము సాగిపోవును.

యజమాని యిష్టము ననుసరించియే యింటిలోని సేవకులు నడువవలయును. అంతియే కాని సేవకులనుబట్టి యజమాని నడువ రాదు కదా! ఆత్మయే యజమాని. ఇంద్రియములే సేవకులు.

'ఆఫీసు' లో మేనేజరు చెప్పినట్లే ఉద్యోగులందరును నడువ వలెను. అప్పుడే ఆఫీసు క్రమశిక్షణాలో నుండును. అట్లుకాక ఉద్యోగుల యిష్టప్రకారమే నడక ప్రారంభమయినచో ఆ యాఫీసు దుర్గతిని బట్టి పోవును.

ఓ పార్థా! ధూమము అగ్నిని కప్పివేయునట్లు; మాలిన్యము అద్దముపై జేరినట్లు, గర్భ శిశువును మాయ మూతవేసినట్లు ఆత్మ జ్ఞానము 'కామము' అను పొరచే కప్పబడి యున్నది.

ఓ పార్థా! ఆ కామ మను పొరను తొలగించుము. విశ్వనాథుని దివ్యప్రకాశము నీకు కలుగును.

•••——•••

# గీతా కల్పవృక్షము

నాల్గవ అధ్యాయము - జ్ఞానయోగము

## 31. గీత అనాది

### Geeta - the ancient

కరుణాసముద్రుడైన భగవానుని యనుగ్రహముచేత మూడు అధ్యాయముల గీతను గూర్చి ముచ్చటించుకొంటిమి. గీతాశ్రవణ ప్రవచనాలు "సంసార జీమూత సంఘాలకు ఝంఝామారుతములు. "తాపత్రయాభీల దావాగ్నులకు అమృతవర్షములు. విపద్గాఢాంధకారాలకు రవిప్రభలు. గీతామృతపానము సర్వరోగహరము. గీతామాతృపాదారవిందదర్శనము సుఖశాంతిప్రదము. గీతామృతమును గ్రోలి అమరత్వమును బొందుదుము గాక!

ఒక మిత్రుడిట్లు ప్రశ్నించెను. "గీత ఎప్పుడు జన్మించినది ? చారిత్రక దృష్టితో ఈవిషయాన్ని చెప్పెదరా ?"

కురుక్షేత్ర మహాయుద్ధంలో గీతోదయమైనదని సాధారణముగా మీలో చాలమంది తలంచెదరు. యుద్ధములో తనవారిని చంపజాలక దుఃఖిస్తూవున్న అర్జునునకు శ్రీకృష్ణుడు గీతను బోధించినాడు కదా. కురుక్షేత్ర యుద్ధము ద్వాపరయుగాంతములో, కలిగియుగము 98 సంవత్సరములకు ప్రారంభమగు ననగా గీత జన్మించినది. అప్పటికి శ్రీకృష్ణునకు వయస్సు 87 సంవత్సరములని చెప్పుదురు. ఇదియే గీతోత్పత్తి యని మీరుభావింపవచ్చును. కాని గీత అనాది. గీతయొక్క జన్మస్థానము కురుక్షేత్ర యుద్ధరంగస్థలము గాదు. గీతను సృష్టియొక్క ఆరంభమునందే ప్రవచనము చేసితి నని భగవానుడు పలుకును. "అవ్యయమైన

ఈ యోగమును నేను మొదట సూర్యునకు బోధించితిని." అని భగవానుని వాక్యము.

భగవానునితో నున్నదే భగవద్గీత. భగవద్గీతకును భగవానునకును తారతమ్యమే లేదు. రెండును ఒకే స్వరూపముయొక్క భిన్న స్వరూపములు. భగవానుని వాచకరూపమే భగవద్గీత. గీతారాధనమే భగవదారాధనము. గీతాసేవయే భగవత్సేవ. గీతాదర్శనమే భగవద్దర్శనము. భగవానునకు ఆది లేదు. అట్లే భగవద్గీతకును ఆది లేదు.

ఈ విషయములో అర్జునకు సందేహము కలిగినది. "కృష్ణా! నీవును నేనును సమకాలికులముగదా. నీవు గీతను సృష్ట్యారంభములో నున్న సూర్యునకు బోధించినా నని చెప్పుట వింతగా నున్నదే" అని మోమాటము లేక ప్రశ్నించినాడు.

. జీవాత్మ పరమాత్మలకుగల తారతమ్యాలనుగూర్చి భగవానుడు తెలియచేసినాడు. జీవుడు కిచిజ్ఞుడు. భగవానుడు సర్వజ్ఞుడు. భూత భవిష్యత్ వర్తమానముల నెరిగించినవాడు భగవానుడు. జీవునకు భూత భవిష్యత్తులు తెలియవు. గతజన్మలజ్ఞాన మాతడెరుంగడు. భగవానుడు అనేక జన్మములను బొందెను. కాని అవి కర్మసంజనితములు గావు. జీవునిజన్మలు కర్మబద్ధములు. ఇట్లు పలుకుచు భగవానుడు గీతయొక్క అనాదిత్వమును సువ్యక్తము చేయును. కురుక్షేత్ర యుద్ధభూమిలో మరియొకమారు లుప్తమయిన గీతాసూత్రమును అర్జునునిద్వారా ప్రపంచమునకు చాటినాడు భగవానుడు.

భగవద్గీత విశ్వమత గ్రంధరాజము. ఇది అతి సనాతనమైనది. బైబిలు గ్రంథము క్రీస్తుప్రవక్తతో బయలుదేరిన దేకదా. అనగా రెండువేల సంవత్సరముల క్రిందటనే ప్రవక్తజననము. ఇక మహమ్మదీయ మతమో! పదమూడువందల సంవత్సరముల క్రితమే బయలుదేరినది. మహమ్మదు ప్రవక్తజనన మప్పుడేగదా. ఇక గీతయో! సృష్టియొక్క ఆరంభములో–భారతీయపంచాంగానుసారము సృష్టిజరిగి నేటికి

195½ కోట్ల సంవత్సరములు. భూగర్భ శాస్త్రవేత్తల పరిశోధనలను బట్టి సృష్టియొక్క ఆరంభము 200 కోట్ల సంవత్సరములు. దీనిని బట్టి భగవద్గీత రెండువందల కోట్ల సంవత్సరములు క్రిందట సృష్టియొక్క ఆరంభములో బయలుదేరిన దివ్యవాణి.



## 32. భగవానుడు నిరాకారుడు - సాకారుడు

### God with and without form.

'భగవంతుడు నిరాకారుడు కాడా' అని ఒక శిష్యుడు గురువుగారిని ప్రశ్నించెను. 'అవును. అయన నిరాకారుడు – నిరంజనుడు – నిర్గుణుడు – 'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ' అని శ్రుతి చెప్పను. 'మనస్సుచేత గాని మాటలచేత గాని నూహింపజాలనివాడు పరమాత్మ' అని గురువు చెప్పెను. మరొకనాడు మరొకశిష్యుడు వచ్చి ఇట్లడిగెను. 'గురుజీ భగవానుడు సగుణమూర్తియే కదా! శ్రీకృష్ణుడే ఆ భగవంతుడుకదా.' అవును. సగుణుడు – సాకారుడు మనోహరమగు ఫాలభాగము కస్తూరీతిలకము ప్రకాశించుచుండగా, సుందరమగు వక్షస్థలమందు కౌస్తుభ మాణిక్యము మెరయుచుండగా – చక్కని వనమాల ధరించి, పీతాంబరధారియై వెలుగొందు జగన్మోహనమూర్తి శ్రీకృష్ణుడు భగవంతుడే సందేహమేమి! అని పలికెను.

ఒక రోజున శిష్యులిరువురును ఒకచోట కలసికొని వేదాంత చర్చలు చేయుచు భగవంతుడు నిర్గుణుడని యొకరు సగుణుడని వేరొకరు వాదులాడసాగిరి. వారిరువురును గురువుగారి వాక్యములనే ప్రమాణములుగా పల్కిరి. వారు ఒక నిశ్చయమునకు రాలేక తుదకు గురువుగారి వద్దకే వచ్చి చేరిరి.

ఎవరి భావము లెట్లుండునో వారికి అట్టి సమాధానమే లభించును. ఎవరి అర్హత యెట్టిదో వారి ఫలితమును నట్టిదియే! జ్ఞానికి ఆయన నిర్గుణుడు. భక్తుని కాయన సగుణుడు అని గురువు పలికెను.

భగవంతుడు సగుణుడు, నిర్గుణుడు కూడా- ఆయనకు రూపము కలదు. రూపములేదు. సకల గుణాభిరాముడు కనుకనే ఆయన సకల రూపధారి కనుకనే, రూప రహితుడు.

ప్రవహించు గోదావరి జలములకు రూపములేదు. ఆ జలములే పలకల గాజుసీసాలో బోసినపుడు ఆరూపమునే ధరించును. బంగారము నిరాకారము. కాని అది కంఠహారముగా, చేతికి గాజులుగా- నడుమున ఒడ్డాణముగా రూపమును ధరించును. రూపరహితమగు ప్రత్తి రకరకములగు వస్త్రములుగా రూపమును ధరించును. సగుణములో నిర్గుణము - నిర్గుణములో సగుణము రెండును పరస్పరాశ్రయములు. ఒకే నాణెమునకు గల రెండు ప్రక్కలు 'భగవానుడ'ని పరమహంస పలుకును. భగవానుని సగుణరూపములే అవతారములు.

'నేను పుట్టుకలేని వాడనయ్యును, అవ్యయుడ నయ్యును భూత మహేశ్వరుడ నయ్యును నాసంబంధమగు ప్రకృతిని ఆశ్రయించి మాయతోగూడి నే నవతరింతును. అధర్మ మెప్పుడెప్పుడు తల యెత్తునో అప్పుడు నేను ధర్మసంస్థాప నార్థమును, సాధు రక్షణకును దుర్మార్గులను శిక్షించుకొరకును జన్మింతును. అని గీతలలో భగవానుని పలుకులు. నిర్గుణముకన్న సగుణము ఆహ్లాదకరము. ఉపాసనా సాధ్యము. అద్వైత మతప్రబోధకుడైన శంకరుడు తల్లికి అవసానసమయములో నుపదేశించినది కూడ, సగుణమైన సుందరమైన శ్రీకృష్ణ స్వరూపుని కదా!

శ్రీకృష్ణుడు బృందావనమును వీడి మధురకు పోయినాడు. శ్రీకృష్ణ విరహములో బాధపడుచున్న గోపికల కుపదేశించుటకు కృష్ణుని పంపున ఉద్ధవుడు బృందావనమునకు పోయి గోపికల నూర

డించుటకు ప్రయత్నించును. ఉద్ధవుడు నిర్గుణోపాసకుడు. నిర్గుణతత్త్వోప దేశము గోపికలకు శాంతిని కలిగించలేదు. మరింతగా వారిని వ్యాకుల పరిచినది. గోపికల ప్రేమతత్త్వాన్ని గమనించి ఉద్ధవుడు విహ్వలుడై తానుగూడా సగుణుడైనాడు. సూరదాసు ఈ మధురభావాన్ని చక్కగా చిత్రించి తన్మయుడైనాడు.



## 33. కృష్ణావతార తత్త్వము. రాసలీలా విశేషములు.

**The supreme truth in the incordination of Krishna - message of Rasaleela.**

కృష్ణలీలలు అద్భుతములు – ప్రతిలీలలోను తానుభగవంతుడ నని సువ్యక్తముచేసికొన్నాడు. దేవకీ నందనుడు. బుధులు దానిని గ్రహించినారు. మందబుద్ధులు గ్రహింపలేక కృష్ణుని జారుడని, చోరు డని నిందించారు.

అందువలననే 'నా జననవిషయము – నేనాచరించు కర్మలును దివ్యములు. వానిని గ్రంహించినవారు పునరావృత్తిరహితమయిన మోక్షమును బొందుదురు.' అని గీతలలో ఈ అధ్యాయమునందు భగ వానుడు పలుకును. కృష్ణలీలావిశేషములను కొన్నిటిని మనము ముచ్చ టించుకొని ఆనందింతము.

భగవానుడు చెరసాలలో జన్మించెను. ఈ ప్రపంచమే ఒక పెద్ద చెరసాల. మానవులందరును ఖైదీలే. మానవుల నుద్ధరించుటకే భగవానుడు మానవరూపమున జన్మించెను. అర్ధరాత్రమున అంధకార ములో మెరుపు తీగవలె మానవలోకము నందలి అంధకారమును బాపుటకు ప్రభు వవతరించెను. చతుర్బాహువులతో – శంఖ చక్ర ములు ధరించి, కౌస్తుభ మాణిక్య కాంతులతో – పీతాంబర ధారియై వనమాలను దాల్చి – మకరకుండల మయూరాది వివిధభూషణాలతో

శ్రీకృష్ణుడు జన్మించెను. ఏమి ఆ అపూర్వ జననము! భగవంతుని దివ్యరూపమును గాంచి దేవకీదేవులు దిగ్భ్రమ నొందినారు. ఆయన జననము అపూర్వము – ఆయన లీలలు మహాద్భుతములు.

పురిటిలోనే పూతనా సంహారము. పూతన స్తనములను బట్టి పీడించి జీవసత్త్వమునే పీల్చి రాక్షస సంహారము చేసినాడు బాలకృష్ణుడు. రామావతారమునగూడ తొలుత స్త్రీ సంహారము జరిగెను. కృష్ణావతారమున గూడ మొట్టమొదట స్త్రీ సంహారమే. అదియే మహానాశనమునకు చిహ్నము. శకటాసుర భంజనము – వృత్రాసుర నాశనము, తృణావర్త హరణము – దావాగ్ని మ్రింగుట – అర్జున వృక్షపాతము – మరెన్నెన్నో అద్భుత క్రియాకలాపములు ఆయన భగవంతుడని తెలుపుచునే యున్నవి.

బ్రహ్మదేవుడు గోవులను గోపబాలురను దాచివేయగా తానే గోవులయి – గోపబాలికా సహస్రములై గోపీ గోపజనముల మధ్య సంచరించిన అద్భుత మాయారూప నటనాకౌశలవిశేషము శ్రీకృష్ణుని భగవత్స్వరూపమును విస్పష్టము చేయుటలేదా!

అదిగో భయంకరమగు రాళ్ళవర్షము – దేవేంద్రుడు కోపముతో వర్షింప చేయుచున్నాడు. గోవులు, గోపబాలకులు తల్లడిల్లుచున్నారు. అదిగో మోహనమూర్తి! బాలగోపాలుడు! మహా పర్వతమును అవలీలగా పైకినెత్తి ఏమని పలుకుచున్నాడో వినుడు.

'బాలుం డీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
చాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపగా బోలదీ
శైలాంభోనిధి జంతు సంయుత మహీ చక్రంబుపై బడ్డ నా
వ్రేలల్లాడదు బంధులార, నిలుడీ క్రిందన్ ప్రమోదంబుగన్'

ఆహా! ఏమి ఆశ్చర్యము! భగవత్తత్త్వమును తానెట్లు ప్రదర్శించు చున్నాడో!

వ్యాసదేవుడీ బాల్య లీల లన్నింటిని చిత్రించి చిత్రించి తన్మయుడైనాడు. మహాకవి పోతనామాత్యుడు కృష్ణదేవుని బాల్య లీలా విశేషాలు అతి మధురముగా వర్ణించి మురిసి పోయినాడు.

తల్లి యశోద ఒకనాడు 'నాయనా' మన్నేటికి తిందువు – రకరకములగు రుచిరాన్నములుండగా మన్ను తినుచుంటివా! నీ సోదరుడును సఖులును చెప్పుచున్నారు.' అని బాలకృష్ణుని మందలించును.

మాయా మోహనమూర్తి బిక్క మొహముతో కాటుక కన్నులను నులుము కొనుచు 'అమ్మా నేను మన్నుతినుట లేదమ్మా – మన్ను తినుటకు నేను వెర్రివాడనా, పసిపాపనా. నీచే నన్ను కొట్టించవలయునని యెంచి బలరాముడును, స్నేహితులును చెప్పుచున్నారమ్మ! నామాటలు నమ్మవమ్మా, కాదేని, నానోరు వాసన చూడమ్మా' అని ఆ బాలగోపాలుడు తన నోరు నొక్కమాటు తెరచెను. ఆశ్చర్యము!

'ఆబాలుని ముఖమందు జలజాక్షి సాగరములు – సర్పములు వనములు – దుర్గములు – చంద్రసూర్యులు – అగ్ని, దిక్కులు సర్వ లోకములు గాంచినది! ఆ పరమేశ్వర తత్వమును వీక్షించి చేతులు మోడ్చి బాలకృష్ణునికి నమస్కరించును.

లీలాశుకు డిట్లుపలుకును.ఒకమారు యశోదబాలకృష్ణుని తొడపై కూర్చుండబెట్టుకొని పుత్రమోహముచే గాఢముగా కౌగలించుకొని ముద్దు పెట్టుకొనుచున్నది. ఆ బాలమోహను డొక్కసారి నోరు తెరచును. అందులో తెల్లనగు కైలాసశిఖరము, అందు పార్వతీ పరమేశ్వరులు సాక్షాత్కరించినారు. యశోద ఆశ్చర్యమును పొంది, బాలుండు కాడితడు పరమాత్మ' యని నమస్కరించును. ఇంతలో భగవానుడు మాయ తెరను వేయుచున్నాడు.

'కాదు కాదు నాబిడ్డ వెన్నవిశేషముగా తినుటచే నది జీర్ణింపలేదు. ఆముద్దలే తెల్లగా గోచరించుచున్నవి. ఏదైనా జీర్ణకరమగు ఔషధము వేయవలయును' అని ఆమె పుత్ర వ్యామోహముచే తలం

చును. బాలకృష్ణుడు మరల తననోటిని తెరచును. ఈ పర్యాయము ఆతని వదనమునందు విశాలమగు క్షీరసాగరము గోచరించును. ఆ పాలకడలి తరగలపై ఫణిరాజశయ్యపై లక్ష్మితో గూడి మహావిష్ణువు గోచరించును. యశోద ముగ్ధురాలగు చున్నది.

'బాలుండు కాడితడు పరమాత్మ సుమ్మ' అని భావించి ఆ బాల మోహనునకు నమస్కరించును. ఇంతలో మరల మాయను గప్పుచున్నాడు పరమాత్మ. పుత్రవ్యామోహము ఆమెలో మరల నావహించినది. 'అయ్యో! నా ముద్దు గోపాలుడు పాలు త్రాగుచుండగా ఏదుష్టురాలో చూచినది. దృష్టి దోషముచేత పాపడు త్రాగిన క్షీరములు జీర్ణముకాలేదు. ఏదైనను, దృష్టిదోషమును తీయించవలెను.' అని భావించును.

ఇంతలో మరల ముద్దుల కృష్ణుడు నోరు విప్పును. ఈ తడవ విశాలమగు వసుంధరా తలము కానుపించినది. యశోద చకితురాలయినది. 'బాలుడు కా డితడు పరమాత్మ సుమ్మా!' అని నిశ్చయముగా భావించినది. రెండు చేతులను జోడించి ఆబాలస్వామికి మ్రొక్కుచున్నది. ఇంతలో మరల మాయ తెర – పుత్రవ్యామోహమును పొడసూపినది. 'కాదు కాదు. నాతండ్రి మంబెడ్డలు తినుచున్నాడు. అవి జీర్ణింపక నోటిలో కనబడుచున్నవి' అని ఆమె పలుకును. ఏమి ఆ లీలా రూపధారి లీలలు!' ఈ లీలల యథార్థమును గ్రహించినవాడే మోక్షమును బొందును. అని గీత పలుకును.

## రాసలీలలు

అది శరత్కాలము. పండువెన్నెలలు పిండి యారబోసినరీతి భాసిల్లుచున్నది. వేలకొలది గోపికామణులతో రాసకేళినృత్యము చేయుచున్నాడు మాధవుడు. ఒక్కకృష్ణుడు లక్షలకొలది కృష్ణులయినారు. ప్రతిభామ చెంతను భాసురవదనముతో శ్రీకృష్ణుడు ఒకరితో నృత్యము, మరియొకరితో గానము, ఇంకొకరితో హాస్యము, వేరొక

రితో కోపము. ఏమి అద్భుత నటన మిది? దేవలోకమునుండి దేవతలీ మహాద్భుత నృత్యలీలను గాంచుచున్నారు. ఇది మానవుడు చేయగలిగిన కార్యమా!

'నర్తకుని భంగి పెక్కగు మూర్తులతో నెవ్వడాడు! మునులు దివిజులున్ కీర్తింపనేర రెవ్వని వర్తన మొరు లెఱుగ రట్టి వాని నుతింతు' అని గజరాజు స్తవములో పోతన్న పలుకును.

ఆ రాసకేళీ నృత్యదృశ్యము లీలాశుకమహాకవికి దివ్యదృష్టిలో గోచరించినది గాబోలు! ఆకవి యిట్లు నుతించును.

తన కిరువైపులను తరుణులు, తరుణుల కిరువైపులను రమారమణుడు, ఆ మహావలయమునకు మధ్యలో మన్మథమన్మథుడు వేణుగానము చేయుచున్నాడు. ఆ మేఘశ్యాముని గాంచి నెమళ్ళు పురివిప్పి యాడును. మయూరిముల మధురాగములకు మురిసి హంసలు వికసిత పద్మాకరిములనుండి పరుగు పరుగున వర్ష భ్రాంతిని వచ్చుచుండ ఆ మధుర మోహనమూర్తి వేణుగానము చేయును. ఒకచో గానము. వేరొకచో తాళము. మరొకచో నృత్యము ఇట్లు కోట్లకొలది రమణులతో మురళీమోహనుడు రాసకేళి సల్పును.

ఆ మనోహర దివ్యగానముతో యమునాతరంగిణీ సైకత వీథులన్నియు పులకించినవి. మోడులు చిగుర్చును. పుష్పములు జల జల రాలును. తరంగిణీ తరంగములు గానరాగములతో నృత్యము చేయును.

ఓ సర్వలోకనియంతా! గీతాసార్వభౌమా! నీలీల లెవ్వ రెరుంగుదురు. 'జలజాత ప్రభవాదులైనను మనములో నూహించి భాషావళిని నీ మహామహిమా విశేషములు పలుకలేరు. దేవాదిదేవా! నీవు మమ్ముల నాశీర్వదింపుము. మమ్ములను శుభపథములయందు నడుపుము. ఈర్ష్య అసూయ ద్వేషము మున్నగు నీచభావములు మమ్మంటకుండునుగాక! నిరంతరము నీ దివ్యనామమే మాజిహ్వేంద్రియము

లపై మెరయుచుండును గాక ! గీతావాణియే మాశ్రవణేంద్రియము లలో సతతమును ప్రవేశించునుగాక. మనోహరమగు నీ దివ్యరూప మే మా కన్నులయెదుట సతతము సాక్షాత్కరించును గాక.

'వంశీభూషితకరాత్ నవనీరదాభాత్
పీతాంబరాత్ అరుణబింబఫలాధరోష్ఠాత్
పూర్ణేందు సుందరముఖాత్ అరవిందనేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్వం అహం న జానే'

మనోహరమగు వేణువు చేతులయందు మెరయ మేఘశ్యాముడై, పీతాంబరమును ధరించి, ఎఱ్ఱని పెదవులతో శోభిల్లి పరిపూర్ణ పూర్ణిమా సుందరముఖముతో, అరవింద నేత్రాలతో, సర్వలోక మోహనుడై వెలసిల్లు ఆ శ్రీకృష్ణ దేవుని దివ్యతత్వ మొకించుకైనను నే నెరుంగఁగలనా ?

## 34. నాలుగు వర్ణములు

### The four Castes.

'బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రు లను నాలుగు వర్ణములును అనాదిసిద్ధములు. ఇవి గుణకర్మములను బట్టి విభజింప బడినవి.' అని గీతాచార్యు డీయధ్యాయమున బలుకును. వేదములయందుకూడా ఈ విషయము స్పష్టముగా చెప్పబడియున్నది.

ఒక వ్యక్తియొక్క సంపూర్ణ వికాసమునకు నాలుగువిధములగు శక్తులు అవసరములు. ఈ నాల్గు శక్తులును గలవానికే సుఖములు సిద్ధించును.

(1) మంచి ఆలోచనాశక్తి లేక బుద్ధిబలము (2) శరీరబలముతో కూడిన శ్రమము (3) ఆర్థిక సౌష్ఠవము (4) క్రియాశక్తి. ఈ నాల్గింటిలో నేది లోపించినను అతనికి సుఖశాంతు లుండవు. ఇట్లే ఒక కుటుంబముయొక్క సుఖశాంతులకును ఈనాల్గును అవసరములు. అట్లే

ఒక దేశముయొక్క సౌభాగ్యమునకును ఈనాలుగు అవసరములు. అట్లే విశ్వముయొక్క సుఖశాంతులకును ఇవియే అవసరము. ఇదియే చాతుర్వర్ణ్యవ్యవస్థలోని మూలసూత్రము. కొందరు సహజముగా సత్వ గుణము కలిగియుందురు. అట్టివారు మానసిక శక్తులను పెంపొందించు కొని వానిఫలమును సుఖమునకు సమర్పింతురు. వారినే బ్రాహ్మణ వర్గ మందుము.

కొందరిలో రజోగుణము విశేషముగా నుండును. వారిలో తేజస్సు, పరాక్రమము మెండుగా నుండును. వారిశక్తి దేశరక్షణకు ఆలవాలము. వీరినే క్షత్రియ వర్గ మందురు. కొందరిలో రజస్సుతో గూడిన తమోగుణముండును. వీరు వాణిజ్యాది వ్యాపారములందును, కృషిగోరక్షణమందును ప్రత్యేకముగా దక్షత యుందురు. వారే వైశ్యవర్గము. కొందరికి తమోగుణము హెచ్చుగను రజోగుణము స్వల్పముగ నుండును. వారు కార్మిక కృత్యములు జనుపుటలో నేర్పరి తనము సహజముగా గలిగియుందురు. వారు శూద్రవర్గము. దేశము యొక్క సంపూర్ణసక్రమ వికాసమునకు ఈ నాలుగు వ్యవస్థలును అవసరములే! ఏది లోపించినను సుఖము కుంటుపడిపోవును.

ఒక కుటుంబమునందే నలుగురును ఒకేతీరున నుండరు. ఒకడు చక్కగా చదువును. మరొకడు వ్యాపారమందభిరుచిని చూపును. వేరొకడు సాహసకార్యము ఆచరించును. ఇంకొకడు చక్కగా వ్యవసాయ కార్యము చూచును. కుటుంబాభివృద్ధికి నలుగురు అవసర మగునట్లే విశ్వశ్రేయస్సుకు నాలుగు వర్ణవ్యవస్థలును అవసరములే.

'అట్లయిన అమెరికా మున్నగుదేశములలో ఈవర్ణవ్యవస్థ లేదేమి' అని ఒకమిత్రుడు ప్రశ్నించు చున్నాడు. 'ఉన్నదనియే' నా జవాబు. చాతుర్వర్ణ్య వ్యవస్థ, లేని దేశమేలేదు. ప్రతిదేశములోను ఏదియో యొకరీతిని ఈ నాలుగు వర్ణములును వెలసియేయున్నవి. బ్రాహ్మణులని వారిని మనము పిలువక పోవచ్చును. కాని పాశ్చాత్య

దేశము లోగల బిషప్పులు, మిషనరీలు, మతబోధకులు, వీరందరును మన దేశమందలి బ్రాహ్మణ వర్ణముతో పోల్చతగినవారే. గొప్పగొప్ప సైన్యములు, నావికాదళము, విమానదళము, సోల్జర్లు, సిపాయీలూ, ఈవర్ణమంతయు, క్షత్రియవర్గమునకు సమానమే. బ్యాంకర్లు వ్యాపారస్థులు వైశ్యవర్గముతో పోల్చదగును. మిల్లులలో పని చేయు కార్మికులు, కృషీవలులు మన దేశమందలి శూద్రవర్గమునకు పోలికయే.

కాని భారత దేశమున ఈవర్ణవ్యవస్థ నేడు గుణకర్మములనుబట్టి గాక జన్మమాత్రము చేతనే సిద్ధించుచున్నది. సుమతీశతకము చదవ లేకున్నను బ్రాహ్మణకులములో జన్మించిన మాత్రముననే బ్రాహ్మణుడగుచున్నాడు. అట్లే ఇతరవర్ణములలో గుణకర్మములు లేకున్నను వారా కులముననే వ్యవహరింపబడుచున్నారు. అట్లయిన వర్ణములు గుణకర్మజనితములా? లేక జన్మతః సిద్ధించునవియా? యనునది గొప్ప ప్రశ్న. నేటివర్ణవ్యవస్థ దేశపురోభివృద్ధికి కంటకముగానున్నదని పలువురువిమర్శింతురు. ఇందు చాలవరకు సత్యము లేకపోలేదు. బ్రాహ్మణులయందు శూద్రులును గలరు. శూద్రులయందు బ్రాహ్మణులు గలరు. ఇట్లే ఇతర వర్ణములు.

దీని సారాంశమిది. లోప మున్న మాత్రముచేత వర్ణవ్యవస్థను నిర్మూలనము చేయుట యుచితముగాదు. దానిని సంస్కరించుట యుచితము. వర్ణద్వేషములు దేశారిష్టసూచకములు. కులమునుబట్టి గాక గుణమును బట్టియు మానవుడు పూజనీయుడు.

## 35. నిష్కామ కర్మకు మరికొన్ని ఉదాహరణములు

### Selfless action - some more examples :

గాంధీని ఒక మిత్రు డిట్లు ప్రశ్నించెను. 'అయ్యా! గీత చెప్పుచున్న నిష్కామ కర్మనుగూర్చి మీ అభిప్రాయ మేమి?'

నాయనా! ఈ ఆశ్రమము ప్రక్కన ఇటుకముక్కలు చిందర వందరగా పడియున్నవి. వీని నన్నిటిని లెక్కపెట్టి గుట్టగాపేర్చి రమ్ము.

అని గాంధీజీ చెప్పెను. ఆమిత్రు డట్లు చేసివచ్చెను. ఇదిగో నిష్కామ కర్మకు ఉదాహరణము అని బాపూజీ పలికెను. సారాంశ మిది. ఆయనకు ఇటికె ముక్కలను లెక్కపెట్టుట వలన కలుగు ప్రయోజనమేమియును లేదు. అయినను అత డాపనిని చాల జాగ్రత్తగాను, భక్తి శ్రద్ధలతోను చేసినాడు. ఇట్లే ఫలాకాంక్షారహితముగా స్వధర్మపాలనము నిష్కామకర్మ యగును.

పుండరీకుడు శ్రద్ధాభక్తులతో తన తల్లిదండ్రులను సేవించును. భగవాను డాతని గుమ్మమునద్దకు వచ్చి నిలచెను. కాని పుండరీకుడు తన సహజ కర్మానుష్ఠానము నందే శ్రద్ధకలిగి యుండెను. పండరీ నాథుని ఆయన చూడనేలేదు. తుకారాము వచ్చి 'పుండరీకా! భగవాను డిదుగో. ఆయనను అర్చించవేమి?' అన్నాడు. నా స్వధర్మానుష్ఠానానంతరము వచ్చి చూతును. 'ఇదిగో! ఈ ఇటుకరాతిపై భగవానుని నిలువుమనుము' అని పుండరీకుడు పలుకును. ఏమి ఆశ్చర్యము! స్వధర్మానుష్ఠానపరుడు భగవంతుని కూడ లక్ష్యపెట్టడు.

శంకరాచార్యుల ప్రతిభావిశేషాలను విని రాజశేఖర మహారాజు ఆయనను తన దర్బారునకు ఆహ్వానించెను. 'భిక్షాటనము, వేద విహిత కర్మాచరణము మాలక్ష్యములు. వర్ణాశ్రమాచార రక్షణము మావిధి' అని శంకరుడు జవాబు పంపెను. రాజశేఖరుడు స్వయముగా శంకరునివద్దకు వచ్చి నమస్కరించెను. తనకు పుత్రభిక్ష నొసగుమని రాజు శంకరుని ప్రార్థించెను. శంకరు డనుగ్రహించెను. ధనకనక వస్తు విశేషము లెన్నియో తీసికొనివచ్చి, రాజు శంకరుని సమ్ముఖమున గుమ్మరించెను. 'రాజా! సన్యాసికి ధనములతో నిమిత్తము లేదు. నిష్కామ కర్మాచరణమే సన్యాసి లక్షణము. వీనిని పేదలకు, ఉత్తమ గృహస్థులకును పంచియిమ్ము' అని రాజునకే వానిని తిరిగి యిచ్చెను.

## 36. సేవాకార్యములే యజ్ఞములు

### Actions of selfless service sacrifices·

యజ్ఞములను గురించి మూడవ అధ్యాయమునందు కొంత వరకు తెలిసికొంటిమి. ఈ అధ్యాయములో భగవానుడు ద్వాదశ యజ్ఞములను గురించి పలుకును.

'పాపమనగా నేమి? పుణ్యమనగా నేమి?' అని ఒక మహాపండితుని శిష్యుడు ప్రశ్నించెను. 'పరుల కుపకారము చేయుటే పుణ్యము. పరులకు హానిచేయుటే పాపము. ఇదియే శతాధిక గ్రంథసారము' అని ఆయన పలికెను.

'నీకు కలిగినది యితరులకు ప్రేమపూర్వకముగా పంచియిమ్ము' ఇదియే యజ్ఞము. నీవు ధనవంతుడవైనచో నీధనమును ప్రజోపయోగమునకు వెచ్చించుము. 'ధనమును కూడబెట్టుట ధనముకొరకు కాదు దానముకొరకు'అని శాస్త్రము చెప్పును.'నీవుప్రపంచములోనికి ఏకాకిగా వచ్చితివి సుమా! తిరిగి ఏకాకిగానే పోవుదువు. ధర్మమే నీవెంట వచ్చును' అని శాస్త్రకారుడు వచించును.

అలెగ్జాండరు మహాచక్రవర్తి అనేక రాజ్యభాగములను జయించి ధనకనకరాసులతో తన స్వదేశమగు గ్రీకు దేశమునకు పోవుచుండెను. మార్గమధ్యమున ఆయనకు తీవ్రమగుజ్వరము వచ్చెను. జ్వర మధికమై మరణకాల మాతనికి ఆసన్న మయ్యెను. అప్పుడు మహాచక్రవర్తి తన మంత్రులను పిలిచి ఇట్లు పలికెను. 'మంత్రులారా! నాకు మరణ మాసన్న మయినది. నాకొక కోరిక గలదు. దానిని మీరు మన్నింపవలయును. నేను మరణించిన వెనుక నా శరీరమును స్మశానమునకు తీసికొని పోవునపుడు నాచేతులను మాత్రము వస్త్రముచే కప్పివేయక మిగిలిన శరీరము నంతయును కప్పివేయుడు. ఇదియే నా తుదికోరిక'

మంత్రులు చక్రవర్తియొక్క గంభీరవాణిలోని భావము నర్థము జేసికొన లేదు. అంత చక్రవర్తి, 'మంత్రులారా! నేను విశాలసామ్రాజ్యమునకు అధిపతిని. నాచుట్టును ధనపురంచులు పడియున్నవి. నాకు కాపలాగా లక్షలకొలది మహాసైన్యములు చుట్టును గలవు. కాని ఇవి యేవియును నన్ను మృత్యువునుండి రక్షింప జాలకున్నవి. ఇన్ని యున్నను నేనుమాత్రము ఏమియును తీసికొని పోలేకున్నాను. అలెగ్జాండరు మహాచక్రవర్తి రిక్తహస్తములతోనే పోవుచున్నా'డను విషయము లోకముగుర్తించు నిమిత్తము నాచేతులను వస్త్రముతో కప్పి పుచ్చకయే స్మశానమునకు తీసికొనిపొమ్మని కోరినాను' అని పలికెను.

మానవుడు ధర్మకార్యములకే తన ధనవిద్యాదులను వినియోగింప వలయునని శాస్త్రములు పలుకును. ఓధనవంతుడా! ఈ ధనము నీది కాదు, భగవంతునిది. నీవు ధర్మకర్తవు మాత్రమే సుమా! భగవంతుని ధనము భగవంతునకే సమర్పింపుము. నీ ధనముతో విద్యాసంస్థలను నిర్మింపుము. పేదవిద్యార్థులను పోషింపుము. ఉత్తమ సాహిత్య వేదాంత నైతికగ్రంథములను ముద్రణసేయుము. వైద్యశాలను నిర్మింపుము. ఇట్టి పుణ్యకార్యములకే నీధనము వినియోగపడునుగాక! ఇది ద్రవ్యయజ్ఞము. నీవు విద్యావంతుడవైనచో ఆ విద్యాధనమును ఇతరులకు పంచిపెట్టుము. ప్రతిఫలమును కాంక్షింపక పదిమందికి విద్య నేర్పుము. ఇది విద్యాయజ్ఞము. శరీరమును వాణిని నియమబద్ధముగా చేయుటయు తపోయజ్ఞమగును. గీతాపారాయణము మహాయజ్ఞము. ఈశ్వరార్పణ బుద్ధితో చేయబడు వ్రతములు – స్త్రీలనోములును– స్నానజపములు, ఇవన్నియును యజ్ఞములే.

భగవంతుడు సర్వభూత హృదయాంతరవర్తి. గావున ఆయనను సేవించుటకు యజ్ఞములు పరమసాధనములు.

# 37. సాధుసంగంబు సకలార్థ సాధనంబు.

**Company of good people gives all benifits.**

ఈ పై శీర్షిక మహాకవియగు భర్తృహరి యొక్క మధుర వాక్యము. సజ్జన సహవాసమువలన సకలసుఖములును సిద్ధించును. పురాకృతపుణ్య విశేషమువలననే సజ్జన సేవాభాగ్యము లభించు నని వివేకచూడామణిలో శంకారాచార్యులు వచించును.

"తపఃఫలము గొప్పదా, లేక సజ్జన సాంగత్యఫలము గొప్పదా? అను విషయమై విశ్వామిత్రునకును వశిష్ఠునకును తగాదా కలిగెను. విశ్వామిత్రుడు తపోబలమే సర్వశ్రేష్ఠ మని వాదించెను. మహాపురుషుల సేవాభాగ్యమే అధికమని వశిష్ఠుని వాదము. ఇరువురును ఈ తగాదా పరిష్కారమునకై ఆదిశేషుని వద్దకు పోయిరి. ఆ ఆదిశేషుడు "మహాశయులారా! నా శిరస్సుపై విశేషమగు భార మున్నదిగదా! అందుచే నా మెడడు సరిగా పనిచేయుటలేదు. దయయుంచి మీలో నెవ్వరైనను నాతలపై నున్న ఈ బరువును దింపుడు. నేను చక్కగా, ఆలోచించి సత్యమును వచించెదను" అని పలికెను. విశ్వామిత్రుడు తన తపోబలము నంతను పణముగా బెట్టి ఆదిశేషువు శిరోభారమును దించుటకు ప్రయత్నించెను. కాని దింపలేక పోయెను. సజ్జన సాంగత్య మహాఫలమును పణముగా బెట్టి వశిష్ఠమహర్షి ఆదిశేషువు భారమును క్షణములో దింపివైచెను.

సజ్జనసంగతి తపోబలముకంటెను శక్తివంతమైనది. అది బుద్ధిమాంద్యమును పోగొట్టును. సకలకలుషములును హరించును.

"వేయి సూర్యులేకపర్యాయముగా ప్రకాశించినను లక్షల కొలది చంద్రబింబము లొక్కసారిగా వెలిగినను సజ్జన సాంగత్యము లేక హృదయాంతర్గత మగు మహాంధకారము పో దని మహాకవి పలుకును.

'నీటిబిందువు ఎఱ్ఱగా కాలిన ఇనుపకడ్డీపై బడి క్షణములో నశించును. ఆ జలబిందువే తామరాకుపై బడి మిలమిల మెరయును. ఆ జలకణమే ముత్యపుచిప్పలో బడి ముత్యమగుచున్నది.' సాంగత్య ఫలితము లిట్టివే యని భర్తృహరి చెప్పెను.

'సంసార వృక్షమునకు కావ్యామృత రసపానమును. సజ్జన సాంగత్యమును అమృతఫలము' లని నీతిచంద్రికలో కవి వక్కాణించును. వీనినే భగవద్గీత స్వాధ్యాయ యజ్ఞ మనియు, మహాపురుషుల సేవ యనియును తెలుపుచున్నది.

'సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః'

అని శంకరులు చెప్పుచున్నారు.

జీవన్ముక్తి సిద్ధించుటకు సాధుసమాగమముకన్న వేరొకమార్గమే లేదు. కేవల గ్రంథపఠనము సంపూర్ణజ్ఞానము నొసగజాలదు. ఆదర్శవంతులగు మహాపురుషులను సేవింపుము. వారికి ప్రణిపాతమును చేయుము. జిజ్ఞాసుడవై ప్రశ్నింపుము. ఇదియే జ్ఞానసాధన మని గీత చెప్పెను. నేడు పాఠశాలల సంఖ్య పెరిగినది. విశ్వవిద్యాలయము లనేకములు కట్టబడినవి. విద్యార్థుల సంఖ్యయు విపరీతముగా వృద్ధిపొందినది. కాని విద్యాప్రయోజనము మాత్రము సిద్ధింపలేదు. కళాశాలలలోనే సమ్మెలు. విద్యాలయములలోనే కొట్లాటలు. విశ్వవిద్యాలయములందే అవినీతి కార్యకలాపములు.

'విద్య నొసగును వినయంబు'-'వినయమునను'

అని భారతము పలుకును. కాని నేటి విద్యార్థులలో దురహంకారము, పెద్దలయెడల అగౌరవమును, అవినీతియు పెరుగుచున్నవి.

'పెద్దల పొడగన్న భృత్యునికైవడి చేరి నమస్కృతుల్ సేయువాడు'

అని భాగవతము భక్తుడగు ప్రహ్లాదుని సుగుణసంపత్తిని గూర్చి పలుకును.

హిందీనవలాచక్రవర్తియైన ప్రేమచందు భార్యయగు స్వరూప రాణితో గూడి రైలులో ప్రయాణముచేయుచుండెను. ఆయన ఇద్దరు కుమారులు అల్హాబాదులో కాలేజీలో చదువుచుండిరి. రైలులో తన్ను ప్లాటుఫారమువద్ద కలుసుకొనవలసిన దని ప్రేమచందు లోగ డనే తన కుమారులకు లేఖ వ్రాసెను. కుమారు లట్లే నిర్ణీతదినమున నిర్ణీతకాలమునకు స్టేషనువద్దకు వచ్చిరి. రైలువచ్చి ప్లాటుఫారమువద్ద ఆగినది. చిన్నకుమారుడు తల్లిదండ్రులను గాంచి వంగి నమస్కరిం చెను. ప్రేమచందు తనబిడ్డ లిరువురతోను మాట్లాడినాడు. ఇంతలో రైలు కదిలి వెడలిపోయినది.

రైలులో ప్రేమచందు భార్యనుచూచి 'చూచితివా! స్వరూపా చిన్నవాడు. నాకు వంగి నమస్కరించెను. పెద్దవాడు నాకు నమస్క రించనేలేదు' అనెను. 'పోనీలెండి! మరచిపోయినాడేమో. దానికి పెద్ద పట్టింపు ఏమి?' అన్నది భార్య నవ్వుతో. రైలు వేగముగా పరుగెత్తు చున్నది. మరల నవలాచక్రవర్తి యగు ప్రేమచందు ఇట్లనెను. 'స్వరూపా! చూచావా, పెద్దవాడు నాకు నమస్కరింపనేలేదు.'

'మీకు చాదస్తము ఎక్కువగుచున్నది. దానికొరకు మీరింతగా బాధ పొందనేల? పదిమందిలో నమస్కరించడం చిన్నతనంగా భావించినాడేమో?' అన్నది భార్య. రైలు వేగంగా నడుస్తోంది. మరల కవిలోకసమ్రాట్టు ఇట్లు పలుకును. 'స్వరూపా! పెద్దవాడు నాకు నమస్కరింపలేదు'. భార్య విసుగుతో ఇట్లన్నది. కవులకు చాదస్త మెక్కువ. దీనికోసము మీరింతగా బాధపడడం చాలా ఆశ్చర్యంగా వుందండీ అన్నది.

ప్రేమచందు ఇట్లనెను. 'అదికాదు స్వరూపా! వాడు నాకు నమస్కరింపని మాత్రంచేత నాకే గౌరవభంగం లేదు. కాని అది వాడి పురోభివృద్ధికి భంగకర మని నాపితృహృదయం క్షోభిస్తున్నది.'

ఓహో! ఆ కవి శేఖరుని గంభీరవాణి. 'వినయరహితమైన విద్య ప్రమాదకరమైనది, అది జ్ఞాన లక్షణముగాదు,' జ్ఞానలక్షణములలో మొట్ట మొదటిది 'అమానిత్వ' మని గీత పలుకును. పత్రికలవల్ల, రేడియో ఉపన్యాసాలవల్ల, గ్రంథాలవలన, విద్యాప్రయోజనాలు చేకూరవు. సత్పురుషుల సేవాభాగ్యము వలన సర్వార్థములును సిద్ధించును.

---

## 38. శ్రద్ధావంతునకే జ్ఞానము లభించును.

**Knowledge is possible only for a man of firm faith.**

'మావంటలక్క చక్కగా వంటచేయును. ఆమె తయారుచేసిన పదార్థములయందలి రుచిచేత సోలెడుబియ్యమును తినెడువాడు తవ్వెడు తినును. పాకశాస్త్రము నంబామె చూపిన శ్రద్ధయే అట్టి పాకశాస్త్రములకు కారణము. నాస్నేహితుడగు హోటలు యజమాని కాఫీ తయారుచేయుటలో మిక్కిలి నిపుణుడు. ప్రతిదినమును వందలకొలది జనము ఉదయముననే ఆయన కాఫీకొరకు ఆ హోటలునకే పోవుదురు. కాఫీతయారుచేయుటలో ఆతడు పెంపొందించిన శ్రద్ధయే అట్టిప్రతిభకు కారణము. ఈ మధ్య ఒకమిత్రుడు మాగ్రామమువచ్చి మూడు అహోరాత్రములు సైకిలునుతొక్కి ప్రజల మన్ననలనుపొందెను. అతడు సాధించిన ఫలితమునకు శ్రద్ధయే కారణము. శ్రద్ధవలన జ్ఞానము కలుగునని గీత చెప్పెను. దొంగతనమునకు కూడ శ్రద్ధయే కావలయును. అయితేయిట్టి లౌకిక క్రియలందలి ప్రజ్ఞయే 'జ్ఞాన'మని తలంచరాదు. జ్ఞానమనగా మోక్షప్రాప్తిని కలిగించు ఆత్మజ్ఞాన మని అర్థము. నిరతిశయానందమును కలిగించు స్వస్వరూపజ్ఞాన మని అర్థము. ప్రాపంచిక విషయజ్ఞానములనుగూర్చి యిందు ప్రసక్తి లేదు. ప్రాంపచిక విషయములందు ప్రజ్ఞను ప్రతిభను సంపాదించుటకే ఎంతయో శ్రద్ధ అవస

రమయినపుడు ఆత్మజ్ఞాన ప్రాప్తి కెంతటి నిరతిశయ శ్రద్ధ కావల యునో వేరుగా చెప్పవలయునా?

శ్రద్ధారహితునకు లౌకిక కార్యములందే విజయము లేదు. మోక్ష మెట్లు లభించును? ఆత్మజ్ఞానము వలన నరుడు నారాయణు డగును. కావుననే ఆత్మజ్ఞానముతో సమానమయినది ప్రపంచములో మరి యొకటి లేదని గీత తెలుపును. అది పరమశాంతి సుఖమును కలి గించును.

ఎంతటి మహా పాపాత్ముడైనను ఆత్మజ్ఞాన ప్రాప్తిచే భయంకర సంసార సాగరమును తరించి పోగలడు. అగ్నిహోత్రముచేత సమిధలు భస్మమయినట్లు సకలపాపములును జ్ఞానాగ్నిచేత భస్మమగును. ఇట్టి మహాజ్ఞానము శ్రద్ధావంతు డగు సంయమేంద్రియునకే సిద్ధించును. ఆత్మవిశ్వాసవంతుడే దానిని పొందగలుగును. సంశయాత్మునకు అది సిద్ధించదు. ఈ సందర్భములో నా మిత్రుడు చెప్పిన యొక చిన్నకథను మీకు తెలుపుదును.

అది పవిత్ర గంగానదీ పుష్కరసమయము. లక్షలకొలది స్త్రీ పురుషులు క్షేత్రరాజమగు ప్రయాగలో త్రివేణీ సంగమమునందు స్నానము చేయుచున్నారు. ఆ సమయమున పార్వతీ పరమేశ్వరులు ఆకాశ మార్గమున విహరించుచుండిరి. పార్వతి పరమశివుని చూచి, నాథా! అటుచూడండి. ఎన్ని లక్షలమంది పవిత్ర గంగానదిలో స్నానము చేయుచున్నారో! వీరందరును మహా పుణ్యాత్ములే కదా! వీరందరును కైలాసమును పొందవలసియే యున్నది! అని పలుక సాగెను.

పరమశివుడు చిరునవ్వు నవ్వెను. 'పార్వతీ! ఈ లక్షలకొలది ప్రజానీకములో ఎందరు మహాభక్తులుండిరో నీకు చూపెదనుగాక!' అని ఆమె చెవిలో నేదియో పలికెను. ఇచ్ఛామాత్రము చేత పరమశివుడు వృద్ధబ్రాహ్మణ రూపమును ధరించెను. పార్వతీదేవి నవయౌవనవతి

యగు స్త్రీ రూపమును దాల్చెను. ఆ గంగానదీ తీరమున ఆమె కూర్చుండి వృద్ధుని శిరమును తన ఒడిలో నిడుకొని ఏడ్చుచున్నది. ఓ పుణ్యాత్ములారా! నా భర్త మరణించినాడు. మీలో ఎవరైనను పుణ్యాత్ములువచ్చి నా భర్త శరీరమును తాకినచో అతడు సజీవుడు కాగలడు. నాకు పతిభిక్ష పెట్టుడు. ఎందరెందరో పుణ్యాత్ములగు స్త్రీ పురుషులు గంగా తరంగిణిలో స్నానముచేసి పోవుచున్నారు. దయయుంచి ఒక్కసారి నా భర్త శరీరమును తాకుడు అని ఆమె కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్నది.

వందలకొలది స్త్రీపురుషు లామెచుట్టును చేరిరి. అయ్యో పాప మని కొందరు పలుకుచున్నారు. కన్నుల నీరు పెట్టుకొని పోవువారు కొందరు. ప్రారబ్ధకర్మ తప్పదు అని పలుకువారు కొందరు. మన మేమి చేయగలము అని పోవువారు కొందరు. ఒక్కరును సాహసించి ఆ వృద్ధునిశరీరమును తాకువారు లేరు.సాయంకాల మగుచున్నది. వేలాది ప్రజలు గంగలో స్నానము చేయుచున్నారు. పవిత్ర పుష్కర సమయ మగుటచే పూజలు, దానములు, ధర్మములు, జపములు, తపములు చేయుచున్నారు. ఆ యువతి గోలుగోలున నేడ్చుచున్నది. ఆమె భర్త శరీరమును తాకువారే లేరు.అందరకును సందేహమే. తాము పవిత్రు లము కామేమో యను సంశయమే- సాహసించి అతనిని ముట్టుకొన్న చో అతడు సజీవుడు కాకున్న యెడల తాను పాపాత్ముడని అందరకును వెల్లడియగు నని మరికొందరి భయము.

అది పవిత్ర సంధ్యాకాలము. గంగావాహినిలో ఒక చండా లుడు స్నానము చేయుచున్నాడు. అదిగో ఇటువైపునకే వచ్చు చున్నాడు. ఆయువతి దుఃఖ మాతనిహృదయాన్ని కరిగించివైచినది. ఆత డిట్లు తలపోసినాడు. 'గంగామాత మహాపవిత్రురాలు. అందరి పాతకములను తనలో లీనము గావించుకొని భక్తులకు పవిత్రతను చేకూర్చు జగజ్జనని ఆమె. గంగాస్నానము సకలపాపహరము. విష్ణు

దేవుని పాదతీర్థములయందు నేను స్నానము చేసినాను. నా సకల పాపములును నశించినవి. పైగా ఈనాడు ఏకాదశీ మహాపర్వము - పవిత్ర గంగోదకములో పుష్కర పుణ్యసమయమున క్షేత్రరాజను యిన ప్రయాగలో స్నానముచేసితిని. నేను పుణ్యాత్ముడనైతిని. నేను ఇప్పుడే ఈమొభర్త శరీరమును తాకుదును గాక' ఇట్లు దృఢ సంకల్పంతో ఆత్మవిశ్వాసంతో - శ్రద్ధాన్విత చిత్తంతో ఆవృద్ధుని శరీరమును తాకినాడు. పరమాశ్చర్యము. వృద్ధుడు సజీవుడై లేచి కూర్చున్నాడు. పార్వతీపరమేశ్వరులు స్వస్వరూపములలో విలసిల్లినారు. పరమేశ్వరుడు 'పార్వతీ! చూచావా, ఈ కోట్లకొలది మానవులలో ఇతడొక్కడే భక్తుడు. ఇతడే మోక్షమున కర్హుడు' అనినాడు. సారాంశ మిది. ఆత్మవిశ్వాసము లేని కర్మ నిష్ప్రయోజనము. మన మందరమును పూజలు - పునస్కారములు చేయుదుము. కాని శ్రద్ధా శూన్యులము. ఇంద్రియ నిగ్రహముతోకూడిన శ్రద్ధయే జ్ఞానప్రాప్తికి సాధనము.

అజ్ఞానము:- శ్రద్ధారాహిత్యము - సంశయము, ఈమూడును నాశనహేతువులు. శాస్త్రజ్ఞానము తెలియదని చెప్పినమాత్రాన ఆతడు శిక్షనుండి తప్పించుకొనజాలడు. కరెంటు తీగలయొక్క గుణము నీకు తెలియకపోయినను దానిని తాకినవారి ప్రాణములను అది తీసి కొనును. అజ్ఞానము రక్షణకు చిహ్నముగాదు. నీవు మానవుడవుకనుక జ్ఞానాన్వేషణము నీ కర్తవ్యము. కర్తవ్యతామూఢత్వము పాపమును శిక్షార్హతను గలిగించును. సైకిలుపై ఇద్దరుకలసి ప్రయాణము చేయు టగాని, దీపములేక రాత్రి సైకిలు త్రొక్కుటగాని నగరములో నేరముకదా! ఒక పల్లెటూరివాడు అట్లు పోవుచుండగా పోలీసు పట్టుకొని కోర్టుకు తీసికొనిపోవును. న్యాయాధికారి నేరమును విచారించి శిక్షించునేగాని, నాకు తెలియదని చెప్పిన నేరము నుండి తప్పించు కొనగలుగునా! తెలిసికొన్నను శ్రద్ధగా ఆచరించకపోవుటయు నేరమే.

సాధన చేసినచో అజ్ఞానిని, సోమరిని దారిలో పెట్టనచ్చును. కాని సంశయశీలుని మాత్రము దారిలో పెట్టుట మనతరము గాదు. ప్రతి విషయములోను ఆతనికి సందేహమే! కూర్చుంటే సందేహము. మాట్లాడితే సందేహము. సందేహశీలునకు నిత్యనరకము. కావున ఓ అర్జునా! హృదయగతమైన సందేహాన్ని జ్ఞాన మనే ఖడ్గముచేత నాశనముచేసి, లెమ్ము కర్తవ్యపాలనము చేయుము' అని గీతాచార్యుడు హెచ్చరించు చున్నాడు.

## 39. పవిత్రమగు భక్తిచే సాధింపజాలని దేదియును లేదు.

**There is nothing to be un-achived by Pure Devotion.**

భగవానుని బంధించునది భక్తిపాశమే. భక్తి అనగా ప్రేమ యని అర్థము. ప్రేమలేని జీవి ప్రపంచములో లేదు. రాక్షసులకు కూడా తన బిడ్డలపై అపారమగు ప్రేమ యుండును. మృగములు తన బిడ్డలను ప్రేమించును. భయంకర జంతువులుకూడా తన సంతానము పట్ల ప్రేమవర్షమును కురిపించుచున్నవి. ఇక మానవుల విషయమై చెప్పనలయునా? ప్రేమభాగమును మానవునిలో అంతర్వాహినియై ప్రవహించుచున్నది.

కాని మానవుడు తన ప్రేమను అశాశ్వతములగు బాహ్యావస్తువులపై చూపుచున్నాడు. స్త్రీలపై, కీర్తిపై మానవుడు తన ప్రేమను ప్రసరింపజేయుచు ప్రేమనిధియగు పరమేశ్వరునిపై అతని ప్రేమవాహిని ప్రవహింప జేయుటలేదు. జడపదార్థములపై మాత్రమే ఆతని ప్రేమ– కాని చైతన్యస్వరూపు డగు పరమేశ్వరునిపై గాదు. ఇదియే దుఃఖమునకు, బాధకు, వ్యాకులత్వమునకు, అశాంతికి కారణ మని గీత వచించును.

అశాశ్వతములగు జడమృత్యు పదార్థములయందుగల నీ ప్రేమ వాహినిని మరలించి కరుణానిధియగు పరమేశ్వరునిపై నిలుపు మని భగ

వానుడు పలుకుచున్నాడు. దీనినే 'భక్తి'యని పిలుతుము. ఇట్టి భక్తి గలవాడే ధన్యుడు. ఆతడే చరితార్థుడు.

ఒక తత్వవేత్త యిట్లు పలుకుచున్నాడు. ఈ ప్రపంచమంతయు పిచ్చివాండ్ర వైద్యశాలయే సుమా! మానవు లందరూ పిచ్చివాండ్రే. అయితే కొందరకు ధన సంపాదనమునందు పిచ్చి. మరికొందరకు జూదమునందు పిచ్చి. ఇంకను కొందరకు సినిమాలయందు, సినిమా తారలయందు, మరికొందరకి రాజకీయములయందు. కాని భగవంతుని యందు పిచ్చిగలవా రెందరున్నారు? అట్లు భగవంతునియందు పిచ్చి గలవాడే ధన్యుడు.

**Some are mad after woman. Some are mad after old. Some are mad after politics. But blessed is he who is mad after God.**

అట్టి పిచ్చిగలవాడే కావలయు నని గీత వాంఛించుచున్నది.

అట్టి ప్రేమమయునకు అసాధ్యము ప్రపంచమున లేదు. విశ్వ మంతయు భక్తునకు భగవన్మయము.

'అదిగో! ప్రేమతపస్విని, భక్తమీరా' ఓహో! ఏమి ఆజగ న్మోహనమైన రూపము. ప్రేమరసముతో తళతళలాడు దివ్యనయన ములతో, ఒకచేత సితారును బూని 'గిరిధర గోపాలుని' మధురనామ మునుగానముచేయుచు రాజపుటానారాజవీథులలో పరుగెత్తుచున్నది. ఆమెవెంట ఎందరెందరో సాధువులు, సత్పురుషులు, భక్తసందోహ ములును పరుగులెత్తుచున్నారు. ఆమె పవిత్ర భక్తిగీతములతో భారత భూమి యంతయూ పవిత్రమైనది.

ఆమె దివ్యజీవితములోని ఒకటి రెండు మధురఘట్టములను స్మరించి, చింతించి, ధ్యానించి,పరిపూతుల మగుదుము గాక! దివ్యము లగు ఆ మనోహరగాథలు మనకును భక్త్యావేశములను గలిగించు

గాక ! ఇవి పుక్కిటి పురాణగాథలు గావు. వాస్తవములగు చరిత్రాత్మక దృశ్యములు. సత్యములును, యథార్థములును నగు కథానికా ఘట్టములు.

భక్త మీరాయొక్క భక్తిజీవితము మఱది యగు రాణాకు రుచింపలేదు. మీరాబాయి రాజమర్యాదల నతిక్రమించి సాధుసమావేశములలో పాల్గొనుట రాజవంశ కళంకముగా నాతడు భావించినాడు. అంతఃపురములో పరదాలమధ్య మెలగవలసిన క్షత్రియకాంత బయటచరించుట చాల ద్రోహ మని అతడు తలంచెను.

సర్వభూతముల యందును శ్రీకృష్ణ సందర్శనమును చేసిన ఆమహాతపస్విని యొక్క మానసిక మహోన్నతస్థాయి, క్షుద్రుడగు రాణాకు ఏమి తెలియును ?

కులశీలగౌరవములను మంటగలుపుచున్న దను మనసుతో ఆమెను చంపివేయవలయును అని రాణా కృతనిశ్చయు డైనాడు.

ఒక భయంకరమగు కాలసర్పమును ఒక పేటిలో బంధించి భక్తమీరాకు కానుకగా పంపినాడు రాణా.

'ఇదిగో దీనిలో ఘుమఘుమలాడు పూలహార మున్నది. దీనిని కృష్ణకైంకర్యము చేయుము అని రాణా పరిచారికచే పేటికను మీరా వద్దకు పంపినాడు. భక్తులకు తెలియని రహస్యము లే ముండును.

గిరిధర గోపాలుని మధురనామమును స్మరించుచు ఆ పవిత్ర నారీమణి పేటికను తెరచినది. ఏమి ఆశ్చర్యము! దీనిలో ఘుమఘుమలాడు మల్లెపూవుల మనోహర హారమే యున్నది. మీరా దానిని భక్తితో కృష్ణకైంకర్యము చేసినది.

పేటికను తెరచినంతనే కాలసర్పము మీరాను కరచి చంపు నని భావించిన రాణాకు ఆశాభంగ మయ్యెను.

భక్తులను గాపాడువాడు భగవంతుడే గదా!

రాణా మరియొక పర్యాయ మా భక్తురాలిని కంటకశయ్యపై పరుండునట్లు చేసెను. కంటకశయ్య ఆభక్తురాలికి పూలశయ్య యైనది. ఏమి ఆభక్తిమహిమ!

రాణా కాలకూట విషము తెచ్చి మీరాను త్రాగమని నిర్బంధించినాడు. విషధరఫణాగ్రములపై వర్తించిన మధుర గోపాలుని స్మరించినవారిని విష మేమి చేయగలదు?

కృష్ణనామము స్మరించుచు ఆభక్తురాలా విషమును త్రాగినది. ఆశ్చర్యము - పరమాశ్చర్యము! విష మామెను ఏమియు చేయజాలక పోయినది. పైగా ఆమె మరింత శక్తిమంతురాలై భక్తిగీతముల నాలపించినది.

ఈవిషయములు హేతువాదముల కతీతములు. విమర్శల కతీతములు. నీ హృదయపాత్రను భక్తిపీయూషముతో నింపుము. నీవును ఇట్టి అద్భుతములగు అనుభూతులు పొందగలవని 'గీత' చెప్పుచున్నది.

ఈ కలియుగములో కలిపురుషుడు వికటాట్టహాసము జేయుచున్న సినిమాయుగములో కూడా మహాభక్తులు చేయు అద్భుతకార్యములు మనము చూచుచున్నాము.

శ్రీ సిరిడీ సాయిబాబా గావించిన కార్యములు, హృషీకేశమున శ్రీ శివానంద మహర్షి చూపించిన మహాశ్చర్య సంఘటనలు, తిరువణ్ణామలైలో రమణమహర్షి దివ్యతపో ఘట్టములు పరమనాస్తిక హృదయములను కూడా భక్తి జ్ఞాన ప్రపూరితములను గావించినవి గదా!

వర్తమానకాలమున ఆంధ్రదేశమున వెలసిన శ్రీపుట్టపర్తీశ్వరుడగు శ్రీభగవాన్ సత్యసాయి మహామహిమావిశేషములు కరడుగట్టిన నాస్తిక పాషాణహృదయములను గూడ ద్రవీభూతముల నొనరించుచున్నవి. కన్ను లుండియూ మనము వానిని గానజాలకున్నాము. బుద్ధి ఉండియూ యోచింపజాలకున్నాము. చేతు లుండియూ నమస్కరింప

జాలకున్నాము. పాదము లుండియూ దరిజేరజాలకున్నాము. సందేహము, సంశయము, అవిశ్వాసము- ఇవియే మిమ్ములను పీడించి జ్ఞానజ్యోతిర్దర్శనభాగ్యమును మీకు కలుగకుండ జేయుచున్నవి. వీనిని విడిచి ఆత్మవిశ్వాసముతో చరింపు మని భగవాను డీ అధ్యాయములో తీవ్రముగా హెచ్చరించుచున్నాడు.

'సంశయాత్మా వినశ్యతి' యని గీతావాక్యము జ్ఞప్తియందుంచుడు. శ్రీ సత్యసాయీ భగవానుని పవిత్ర హస్తస్పర్శ మాత్రాననే భయంకర మహావ్యాధులు క్షణములో పోవుచున్నవి. దీనికి నీ వ్యాఖ్యాన మేమి? ఆ దివ్యహస్తమునుండి పుణ్యవిభూతి వర్షించురు. దీనికి నీ హేతువాద మేమైనా చెప్పగలవా ? ఆ పూజ్యహస్తమునుండి అపరంజి జాలువారును. దీనికి నీ వేమందువు ?

నీ పరిమితజ్ఞానమును, నీమాలిన్యచిత్తమును, నీ సంశయాత్మక బుద్ధిని విడనాడి భగవానుని శరణు పొందుము. సర్వమును నీకు విశదమగును. నీలోనున్న జ్ఞానపుష్పము వికసించును.

ఈ గ్రామములో జరిగిన అద్భుత సంఘటననే యీ రచయిత పేర్కొనుచున్నాడు. భక్తజనులు సాయీశ్వరుని పూజించుచుండగా ఆయన పాదమునుండి, మోకాళ్ళనుండి అభయహస్తమునుండి పవిత్రమగు విభూతి రాలినది.

మరియొక యథార్థమును, సత్యమును నగు నొక సంఘటనము నీ గ్రామములోనే నా మిత్రుని గృహమున జరిగినదానిని విన్నవింతును.

ఆయన మహాభక్తుడు.భగవానుని శరణాగతిని పొందినవాడు. ఆ మహామహుని చిత్రపటములో నుండి సంతతధారగా విభూతిధార నిరంతరాయముగా కురియుచున్నది.

ఆ భక్తుని చిన్నకుమారుడు నాలుగేండ్ల లేబ్రాయమువాడు - ముప్పదియడుగుల ఎత్తుగల డాబా పైభాగమునుండి క్రింద పడిపోయినాడు. ఆశ్చర్యము ! ఆ బాలభక్తుని శరీరమునకు రవ్వంతయైనను గాయములేదు. ఒకించుకైనను అలసటగాని, బాధగాని కలుగలేదు. దీనికి నీవేమందువు? పరమేశ్వరుడు తన అమృతహస్తములతో పట్టికొన్నాడు. ఇక గాయమెక్కడ !

ఆనాడు ప్రహ్లాదబాలకుని ఎత్తయిన కొండలనుండి క్రిందికి త్రోయించిననూ అతని దేహమునకు గాయములే తగులలేదని మహాకవి పోతనామాత్యుడు భాగవతమున వర్ణించెను గదా! ఇది కవియొక్క అతిశయోక్తి యని నీ మాలిన్యచిత్తము పలికినది. ఈ సన్నివేశము కన్నులారగాంచిన భక్తజనుల కానాటి పోతన వాక్యములోని యథార్థము గోచరించినది. నమ్ముము! విశ్వసింపుము! సంశయ రహితుడవు గమ్ము! అని గీత ప్రబోధించును.

...—...

# గీతా కల్పవృక్షము

అయిదవ అధ్యాయము - కర్మసన్యాస యోగము

## 40. గృహస్థుడు - సన్యాసి, ఎవరు గొప్పవారు ?

**A home hodler - or a saint, who is superior.**

మిత్రులారా, గీతాచార్యుని ఆశీర్వాదంతో మనము అయిదవ అధ్యాయాన్ని ప్రారంభింప నున్నాము. భగవద్గీత మహారత్నాకరము వంటిది. శంకరు లారత్నాకరములో మునిగి ఎన్నో రత్నములను పైకి తీసినారు. రామానుజ మధ్వాచార్యు లెంద రెందరో ఆ జలధిలో మునిగి వారికి దొరికిన రత్నములను వారు తెచ్చినారు. తిలకు, గాంధీ, భావే, అరవిందాది మహాపురుషు లెందరో మరల దానిలో మునిగి మరల రత్నరాసులను తెచ్చి గ్రుమ్మరించినారు. ఎందరు మునిగినను రత్నాకరములో రత్నముల కేమి కొదవ ! ఇంకను ఎందరో మునుగుదురు. వారి వారి సామర్థ్యములను బట్టి వారికిని రత్నములు లభించును !!

ఈ అధ్యాయారంభములో 'కర్మసన్యాసము - కర్మయోగము' ఈ రెంటిలో ఏది శ్రేష్ఠ మని అర్జునుడు ప్రశ్నించు చున్నాడు. కర్మయోగమునకు గృహస్థాశ్రమమును, కర్మ సన్యాసమునకు సన్యాసాశ్రమము' ఉదాహరణముగా కొందరు వ్యాఖ్యాన కారులు రచించిరి. ఈ ఉదాహరణము చాలవరకు యుక్తియుక్తముగానే యున్న దని చాలమంది పేర్కొనిరి! గృహస్థుడు - సన్యాసి- వీరిలో ఎవరు గొప్పవారు ? వివేకానందస్వామి చెప్పిన ఒకానొక కథ జ్ఞప్తికి వస్తోంది.

ఒక రాజు ఒక మహానగరాన్ని పరిపాలిస్తున్నాడు. ఆయన మహావిద్వాంసుడు. ఒకనాడు ఒకగొప్ప పండితసభ చేసి 'గృహస్థుడు, సన్యాసి వీరిలో ఎవరు గొప్పవారో చెప్పండి ?' అని ప్రశ్నించాడు.

కొందరు గృహస్థుడు గొప్పవాడని మరికొందరు సన్యాసియే గొప్ప వాడని చెప్పసాగినారు. రాజుకు తృప్తికలుగ లేదు. ఉదాహరణ పూర్వకంగా ఈవిషయాన్ని స్పష్టము చేయాలని రాజు పట్టు పట్టినాడు. ఒక వృద్ధసన్యాసి లేచి యిట్లు పలికెను. 'సోదాహరణంగా ఎవరు గొప్పవారో చూపిస్తాను, నాతో దయచేయండి మహారాజా !!'

జిజ్ఞాసువైన రాజు అందుకు అంగీకరించాడు. రాజును, వృద్ధ సన్యాసియు సత్యాన్వేషణార్థమై బయలు దేరినారు. వారనేక-పల్లెలు పట్టణాలు నడచి పోగా పోగా ఒక మహానగరాన్ని చేరారు. ఆ నగరమంతా శోభాయమానంగా అలంకరింపబడి యున్నది, ఎక్కడ చూచినా మంగళధ్వనులే. 'ఏమిటి కారణ' మని రాజు ఆపట్టణవాసులను ప్రశ్నించినాడు. 'మీకు తెలియదా! ఈనాడు మా రాజకన్య స్వయంవరము. మారాజుకుమార్తె జగన్మోహిని. ఈమెకు తగిన వరుని వెదకు నిమిత్తం ఈ స్వయంవరం ఏర్పాటయింది' అన్నారు పురవాసులు. మనము కూడా ఆస్వయంవర విశేషాలు చూద్దా మని వృద్ధ సన్యాసి, రాజుగారు బయలు దేరినారు. వరలక్ష్మివలె విలసిల్లే రాజకుమారి స్వయంవరంమంటపంలో పూదండను చేతబూని ప్రవేశించింది. చెలికత్తెలు ప్రతి రాజకుమారుని చూపుచు వారి గుణగణాలను వర్ణిస్తున్నారు. కాని రాజకన్యకు మాత్రము ఎవ్వరును నచ్చలేదు. స్వయంవరము విఫలమయి పోయినది. నాకుమార్తెకు తగిన సుందరాంగుడు లభించ లేదే' అని తండ్రి విచారించుచున్నాడు.

ఇంతలో ఎవరో ఒక యువకసన్యాసి-తొంగిచూచుచున్నాడు. ఆసందడిలో - కాషాయాంబరము ధరించాడు. పరిపూర్ణ పూర్ణిమా చంద్రబింబముతో సరితూగే ముఖము, బ్రహ్మ తేజస్సుతో తళతళలాడే కన్నుగవ. ఆశ్చర్యము ! ఆ రాజకన్య ఆ బాలసన్యాసి మెడలో పూలహారము వేసినది. ఆతనినే తన హృదయేశ్వరునిగా వరించినది. అందరును ఆశ్చర్యచకితులైరి. ఆ బాలసన్యాసి వెంటనే

తన మెడలోని పూలహారమును తీసి ముక్కలు ముక్కలుగా త్రెంపి పారవైచినాడు. 'నేను సన్యాసిని. స్త్రీస్పర్శ నాకుతగదు. ఛీపొమ్ము' అన్నాడు' ఆ బాలసన్యాసి. ఇంతలో ఆ జగన్మోహిని తండ్రి అచటకు వచ్చి 'బాలసన్యాసీ! నీవీమెను తప్పక వివాహమాడవలెను. ధనము లేదని విచారించుచున్నావా ? ఇదిగో నా కుమారీరత్నముతో పాటు నా అర్ధరాజ్యమును నీకిచ్చుచున్నాను' అని పలికెను.

నవయౌవన వతియైన సుందరాంగి వరించి నిలచినది. సామ్రాజ్యలక్ష్మియు అయాచితముగా వచ్చి పాదములపై బడినది.

కాని బాలసన్యాసి ఇట్లనును. 'ఛీ! ఈ తుచ్ఛసుఖములు నాకు వలదు. నేను సన్యాసిని. కాంతాకాంచనములను త్యజించిన వాడను' అని పలుకుచు పరుగెత్తుకొని పోవుచున్నాడు బాలసన్యాసి. పాప మా సుకుమార సుందరి 'నీవే నా భర్త వనుచు ఆతనిని వెన్నంటి పోవు చున్నది. మన కథానాయకులగు వృద్ధసన్యాసియు,రాజును, ఏమి జరు గునో చూతమని ఆమెను వెంబడించిరి. అది అరణ్య మధ్యభాగము- ఆ బాలసన్యాసి వెనుదిరిగియైన చూడడయ్యెను. ఆ యడవి మార్గము గుండా పోయి పోయి ఆ బాలసన్యాసి కానరాడయ్యెను. ఆ కన్య వలవల యేడ్చుచు కూలబడిపోయెను. మన వృద్ధసన్యాసియు, రాజును ఆమె నూరడించిరి. 'తల్లీ! దుఃఖింపకుము. నిన్నతడు వివాహమాడ నిరాకరించి యెందో పోయెను. ఆతనికొరకు వెదకిన ఏమి లాభము ? రాత్రి అయినది. మన మందరమును ఈ చెట్టుక్రింద విశ్రమింతము. తెల్లవారగనే మేము నిన్ను నీ తండ్రిగారి యింటికి చేర్పగలము' అని పలికిరి.

రాజకన్యతోగూడి వా రిపురును ఆరాత్రికి ఆవృక్షచ్ఛాయలో గడుపుచున్నారు. ఆ చెట్టుపైన ఒక కపోతముల జంట నివసించు చున్నది. మగపక్షి ఇట్లు పలుకును. 'అతివా! చూడుము; మనయింటికి అతిథులు వచ్చినారు. వారు చలిచే వణకుచున్నారు. అతిథి మర్యాద

గృహస్థధర్మము. నేనిదేపోయి యెండిన సమిధలను తీసికొని వత్తును. నీవుపోయి సమీపగ్రామమున నుండి నిప్పు తెమ్ము' అనెను. మగపక్షి ఎండుసమిధలను ముక్కునపట్టి తెచ్చి చెట్టుక్రింద గుమ్మరించినది. ఆడుపక్షి మండుచున్న కర్రను అందువైచినది. అగ్నిహోత్రము ప్రజ్వరిల్లినది. చెట్టుకింద ముగ్గురును చలికాచికొని పక్షుల ఔదార్యమునకు సంతసించిరి.

చెట్టుపైనున్న మగపక్షి ఇట్లనెను. 'అతివా చూడు. అతిథులకు శీతబాధ తగ్గించినాము. వారికి ఆకలి యగుచున్నది. నేనేవారికి ఆహారమయ్యెదను గాక' అనిపలుకుచు చటుక్కున నిప్పులలోనరికి ఆత్మార్పణము చేసినది. చెట్టుక్రిందనున్న ముగ్గురును ఆ మహాత్యాగములకు చకితులగు చున్నారు. ఇంతలో చెట్టుపైనున్న ఆడుపక్షి యిట్లనెను. నాథుర్త ధన్యజీవి. అతిథిసేవలో ఆత్మార్పణము చేసినాడు. నేనును ఆయనను అనుసరింతునుగాక. ముగ్గురు అతిథులున్నారు. ఒక్కపక్షి ఆహారముగా సరిపోవునా!అని తలంచుచు ఆ ఆడుపక్షియు అగ్నిహోత్రములో తటాలున పడిపోయినది. చెట్టు క్రిందనున్న ముగ్గురును సంభ్రమాశ్చర్యములను బొందిరి. ఆ మహాయజ్ఞము వారిని దిగ్భ్రాంతులనుగా నొనర్చినది.

ఓ రాజా! ఇక మన మిచట నుండవద్దు రమ్ము పోదము అని వృద్ధసన్యాసి రాజును రాజకుమార్తెను తోడ్కొని పోవుచున్నాడు.

దీని సారాంశ మిది. సన్యాసాశ్రమమున సన్యాసి తనధర్మమును చక్కగా నిర్వహించినచో నాతడు ధన్యుడే. ఈకథలో సన్యాసిని నవయౌవనాంగి వలచి, కామించి, ప్రేమించి, వరించినది. కానిఆతడు మెత్తపడలేదు.

కాంతామణి క్రీగంటి చూపుల కాతడు వశము కాలేదు. విశాలమగు సామ్రాజ్యము చేకూరినది. 'ఛీ' యని దానిని తృణీకరించినాడు. అతడే నిజమగు సన్యాసి. అతడు గొప్పవాడు.

కపోతముల జంట అతిథిసేవలో ఆత్మార్పణమును గావించినది. అది గృహస్థాశ్రమ ధర్మము, పరమకర్తవ్యము. అట్టి గృహస్థుడును గొప్పవాడే.

ఎవరి స్థానములో వారు గొప్పవారు. రెండు ఆశ్రమములును మోక్షమునకు దారి చూపునవే. ఉత్తమ గృహస్థుడే ఉత్తమ సన్యాసి.

'సాంఖ్యయోగౌ పృథగ్బాలాః' సాంఖ్యమును, యోగమును వేరువేరని అజ్ఞానులు చెప్పుదురు. జ్ఞానులట్లు పలుకరు. ఏవిధానములో నైనను సరిగా వర్తించినవారు మోక్షమును పొందుదురు' అని గీత చెప్పెను.

సన్యాసమును, కర్మయోగమును రెండును శ్రేయస్కరములే.

బాహ్యసన్యాసము. ఆంతరంగిక సన్యాసము- అని సన్యాసమును రెండువిధములుగా పెద్దలు చెప్పుదురు. భార్యా-బిడ్డలను వదలుట - గృహమును త్యజించుట- శిఖాయజ్ఞోపవీతాలను వదలిపెట్టుట-నిత్య నైమిత్తికకర్మలను వదలిపెట్టుట-ఇది బాహ్యసన్యాసము. ఇది నికృష్ట మయినది. ఆశాపాశాలను వదలిపెట్టటం, అహంకారాన్ని త్యజించటం-కామక్రోధాలను వదలుకొనుట- కాంతాకాంచనాలను చూడకుండుట - ఈర్ష్యాసూయలను సంపూర్ణంగా త్యజించుట - ఇవి ఆంతరంగిక సన్యాసముయొక్క- విశిష్టలక్షణాలు. ఇదియే సన్యాసముయొక్క- సత్యస్వరూపము.

మొదటిరకమువారు కాషాయాంబరాలు ధరిస్తారు. గడ్డములు మీసములు పెంచుతారు. తులసిమాలలో, రుద్రాక్షలో మెడలో వేస్తారు. ఊర్ధ్వపుండ్రములో, విభూతిరేఖలో దిద్దుతారు. ఇక రెండవ శ్రేణివారికి ఈ బాహ్యాడంబరములతో నిమిత్తము లేదు. వారికి ఆంతరంగిక లక్షణములే ప్రధానములు. గీతాశాస్త్రములో ఈ ఆంతరంగిక లక్షణములకే ప్రాధాన్య మీయబడినది. ఈ బాహ్యవేషమునుగూర్చి ఏ అధ్యాయములోను గానరాదు.

బాహ్యవేషధారులగు సన్యాసులే ఈనాడు మెండు. వీరు సంఘమునకు చీడపురుగులు. అమాయికులగు ప్రజలను వీరి పటాటోపముతో మోసగింతురు.

భర్యలేనివారందరును బ్రహ్మచారులా? కారు. ధనము లేకయో-ఉద్యోగము లేకయో - అంగవైకల్యమో - కులశీల లోపములవల్లనో -వివాహము కానివా రుండవచ్చును.వారందరును బ్రహ్మచారులని సన్యాసులని తలంచుట ఎంతఘోరము. ఇండ్లులేని వారందరును సన్యాసులా ? భారతదేశములో కొంపలు లేనివారు చెట్టుక్రిందనే కుటుంబముతో జీవించు తెగలవా రనేకు లున్నారు. వారందరును సాధువులేనా ? సన్యాసము ఆంతరంగికమైనది. అది మహత్తర మానసిక లక్షణము. శారీరక లక్షణము గాదు.

చక్రపొంగలి దధ్యోదనాదుల కొరకు చక్రాంకితములను పొందువారందరును వైష్ణవులా ? విభూతి పూసినవా రందరును వీర శైవులా ? సిలువధరించిన వారందరును క్రైస్తవు లగుదురా? కాలసినది ఆంతరంగిక శుభలక్షణము. వీనిని గురించియే భగవానుడు మరల పదే పదే హెచ్చరిస్తూ గానము చేసినాడు.

అహంకారము నశింపనివానికి ఎన్ని సుగుణము లున్నను వ్యర్థమే. భగీరథుడు ఇక్ష్వాకుకులములో గొప్పవాడు. ఆయన వసిష్ఠుని సమక్షాన సన్యాసదీక్షను స్వీకరించినాడు. 'నాయనా! నీకు బ్రహ్మవిద్యను బోధించెదను. ఏ సామ్రాజ్యమును నీవు పాలించితివో ఆ సామ్రాజ్య రాజధానీ నగరములో పట్టపుటేనుగుల అంబారీలపై మంగళహారతులు గొనుచు నూరేగిన రాజవీథులగుండా భిక్షాపాత్రను ధరించి పోయి బిచ్చము నడిగితెమ్ము' అని పలికెను. ఏమి ఈ కఠోర అగ్నిపరీక్ష. నేను మహారాజు నను అహంకారము నశించుటకొరకే వసిష్ఠు డిట్లు ఆజ్ఞాపించినాడు. బుద్ధుడు కపిలవస్తు రాజవీథులలోనే బిచ్చ మెత్తినాడు. అట్టివాడే సాధువు.

'జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ, యో న ద్వేష్టి న కాంక్షతి' (అ 5-శ్లో 3)

విపరీత పరిస్థితులు కలిగినవా డెవ్వడు ద్వేషమును బొందడో, అనుకూల వాతావరణము కాంక్షింపడో అతడు నిత్యసన్న్యాసి యని గీత పలుకును.

వ్యాసకుమారు డగు శుకుడు సన్న్యాసమును స్వీకరించి పోవు చున్నాడు. పుత్రవ్యామోహముతో వ్యాసుడు వృక్షములు ప్రతిధ్వ వించునట్లు 'కుమారా! కుమారా! పోకుము' అనుచు అరచుచు వెంబ డించి పరుగెత్తుచున్నాడు. వెనుదిరిగి చూడకయే దిగంబరుడై శుకుడు పోవుచున్నాడు.

మార్గమధ్యమున కొందరు జవరాండ్రు వలువలను విడిచి జల కేళి సలుపుచుండిరి. వా రందరును వలువలు ధరింపకయే యెదురుగా వచ్చి శుకునికి నమస్కరించుచున్నారు. కొంతసేపటిలో వ్యాసుడే పరు గెత్తుకొని వచ్చుచున్నాడు. తోడనే సిగ్గుతోడ నా జవరాండ్రందరును తొందర తొందరగా తమ తమ వలువలు కట్టుకొనసాగిరి. వ్యాసు డాశ్చర్యచకితు డయ్యెను. 'ఓ జనులారా! ఇది ఏమివింత? గడ్డములు మీసములు నెరసిన ముదుసలి నగు నన్ను చూచి మీరు వలువలు గట్టుచున్నారా? మంచి నడివయస్సులోనుండి దిగంబరుడై పోవుచున్న నాకుమారుని చూచి వలువలు లేక దిగంబరలై ఎదురుగా వచ్చితిరా? ఏమిది? అనెను. ఆకాంత లిట్లనిరి. 'ఓవ్యాసా! మీసములు, గడ్డములు తెల్లబడినా, శరీరము ముడుతలుపడినా, వయస్సుమళ్ళినా నీకుమాత్రం వలపు చావలేదు. నిన్నుచూచి మాకు సిగ్గుకలిగి వలువలు ధరించి తిమి. నీ కుమారుడు వయసులోనున్నా వలపు చచ్చినవాడు. కావున మాకు సిగ్గు కలుగలేదు.

సారాంశ మిది. కాంతాపేక్ష సంపూర్ణముగా నశించుట సన్న్యా సము. భార్యపై కోపగించియో, సంసారము భార మనియో వదలుట సన్న్యాసము కాదు.

'ద్వంద్వాతీతుడు' సన్యాసి యని గీత పలుకును. మిథిలానగరము దగ్ధమగుచున్నను జనకుడు నిర్వికారమును బొందెను. తమ చిన్న పాకలు కాలుచున్నవని యాజ్ఞవల్క్యునిశిష్యులు తొందరతొందరగా పరుగెత్తినారు. సన్యాస మెవరిలో నున్నది.

'ధీరోదాత్తుడగు సన్యాసిని తిలకించి సూర్యుడుకూడ వైదొలగి పోవును.'



## 42. లోకములో సమానత్వ మెక్కడ ?

### Where is equality in the world ?

నే నీమధ్య ఒక గొప్పరాజకీయనాయకుని ఉపన్యాసము వింటిని. ఆయన చాలపేరుగాంచిన మహానాయకుడే. 'మానవులందరును సమానులే. ఒకరిని కోసిన పాలు వచ్చునా ? మరొకరిని కోసిన రక్తము వచ్చునా? అందరూ ఒక్కటే. తరతమభేదములు లేవు. గీత ఆవిధముగా చెప్పుచున్నది. సమానత్వము సాధించవలె నని ముందడుగు వేయండి' అని. ఇట్లు ఉపన్యాసము సాగుచున్నది. ఆ ఉపన్యాసము వినుసరికి నాకు చాల నవ్వును, విచారమును కలిగినవి. గీతను గూర్చి కూడ ఆవక్త ఉదాహరించుట నాకు మరింత ఆశ్చర్యమును కలుగ చేసినది.

సమానత్వ మన నేమియో ఆ వక్తకు తెలియనే తెలియదు. గీత తెలిపిన సమానత్వము అర్థము కానివాడు గీత నుదహరించి చెప్పుట ఎంతపొరపాటు! ఈ అధ్యాయములో ఈవిషయమునుగురించి భగవానుడు స్పష్టీకరించి యున్నాడు. మానవులలోనేగాదు సృష్టిలో ఎచ్చటను సమానత్వము లే దని ప్రతిజ్ఞాపూర్వకముగా పలుకుచున్నాను. ఉండినచో నిరూపించుడు. చెట్లలో సమానత్వ మున్నదా ? అబ్బ! ఎన్నిరకముల చెట్లను భగవానుడు సృష్టించెను. పోనీ ఒక తెగకుచెందిన చెట్లలోనైనను సమానత్వ మున్నదా?మామిడిచెట్లను

చూడుడు! ఎన్ని రకములు! తియ్యనివి, పుల్లనివి-ఊరుగాయలవి,పండ్లవి, రసాలు, అంట్లు, ఇంకెన్నో ! జంతువులలో సమానత్వ మున్నదా ? లేదు. సింహములు, పులులు, గాడిదలు, ఆవులు, మేకలు, గొర్రెలు ఇంకెన్నెన్నో! పోనీ ఒక్క తెగకు చెందిన జంతువులలో నైనను సమానత్వము మచ్చునకైనను గలదా ? జలచరములలో కోట్లకొలది రకములు. గగనచరములలో వేలకొలది రకములు. వింతవింతలతో శోభిల్లును. క్రిములలో, కీటకములలో, సరీసృపములలో ఒకదానిపోలిక మరొకదానికి లేదే! ఎక్కడ సమానత్వము ?'

ఒక జర్మను శాస్త్రవేత్త దుర్భిణీయంత్రముతో ఒక పెద్దదగు చింతచెట్టు ఆకులను పరీక్షించి-పరీక్షించి 'ఒక ఆకునుబోలిన యాకు మరియొకటి లే' దని స్పష్టముగా చెప్పినాడు. విభిన్నత్వమే సృష్టిరహస్యము. ఇక మానవులలో సమానత్వ మెక్కడ నున్నది? మనుష్యుని పోలిన మనుష్యుడు లేడు. ఆకారములో, రూపములో, బలములో, తేజస్సులో, బుద్ధిలో, మానసిక సంపత్తిలో, గుణగణములలో, ప్రతిభలో, చాకచక్యములో, వాసనలలో, సంస్కారములలో, అంతయు వేరు. సమానత్వ మెక్కడ! సృష్టి యంతయు త్రిగుణములతో కదా చేయబడినది. ఆ త్రిగుణ భేదములే సృష్టి. సమానత్వ మెక్కడ? ఈ మూడు గుణములను సమములయినపుడే అది సాధ్యము. అది ప్రళయ కాలమునందు మాత్రమే సమాన మగును.

నీవు బలవంతముగనో, నిర్బంధముగనో, సమానత్వమును తలపెట్టితివా ? దాని ఫలితము మహాప్రళయము. రక్తపాతము. మహాఘోర పరిణామము మాత్రమే కలుగును. భిన్నత్వమే సృష్టికి అలంకారము. భిన్నత్వములో ఏకత్వమును చూడు మని శాస్త్రము చెప్పును. భౌతికదృష్టిలో అంతయు భిన్నత్వమే.

ఒక గృహస్థు డున్నాడు. ఆ యింటిలో అయిదుగురు స్త్రీలు ఉన్నారు. ఒకస్త్రీ ఆ యజమాని తల్లి, రెండవది భార్య, మూడవ

యూమె కుమార్తె, నాల్గవది కోడలు, అయిదవది వంటమనిషి. ఆ గృహయజమాని అ ఐదుగురు స్త్రీలతోను, ఒకేరీతిని వ్యవహరింపగలడా ? సమానత్వమును భౌతికముగా చూపగలడా ?

తల్లిని చూడవలసిన దృష్టి వేరు. ఆమె పాదములను ప్రతిదినము పూజించును. భార్యనుచూచు దృష్టి వేరు. కుమార్తెను భార్యను చూచిన దృష్టితో చూడకూడదుకదా! ఆ వాత్సల్యభావము వేరు. కూతురును చూచినరీతిగా కోడలితో వ్యవహరింపడు. వంటమనిషిని చూచు పద్ధతి వేరు. అయిదుగురియందును భౌతికముగా భిన్న భిన్న భావములనే గృహయజమాని చూపును. భార్యను చూచినట్లు కోడలినిగాని, వంటమనిషినిగాని, ఇతరులనుగాని చూడరాదు గదా!

అట్టి సమానత్వమునే చూపిన ఏమి ? రక్తపాత మగును. ప్రళయ మగును. గృహము నరకద్వార మగును. ఆధ్యాత్మికదృష్టిలో మాత్రమే అందరును సమానము. భౌతికముగా కాదు.

గీత ఇట్లు చెప్పును -

'విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకే చ, పండితా స్సమ దర్శినః' (65శ్లో - 13)

---

## 43. ఆనందాన్వేషణము The search for Bless.

ప్రపంచములోని ప్రతి ప్రాణియు ఆనందముకొరకే ఆరాటపడును. ప్రతి పక్షియు, మృగమును, ఆనందముకొరకే పరితపించును. ఆనందముకొరకే మానవుడు సుందరాంగిని వివాహమాడును. ఆనందముకొరకే ధనము. సుఖముకొరకే ఉద్యోగము. దానికొరకే వ్యాపారము. విషయ మిట్లుండ ఏ మానవుడైనను స్థిరముగా ఆనందమును పొందగలుగుచున్నాడా ? గుండెపై చేయివైచుకొని నేను సుఖవంతుడను అని చెప్పగలుగువా డెవడైన కానబడుచున్నాడా? ప్రతివాడికిని ఏదియో బాధ, తీరనిదుఃఖము, వచింపరాని ఆవేదన, ధనమువలననే

ఆనందము లభించునని తలంచువా రెందరో గలరు. ఈ సందర్భములో నేను చిన్నప్పుడు ఇంగ్లీషు పాఠ్యగ్రంథములో చదువుకొన్న కథ జ్ఞాపకమునకు వచ్చుచున్నది.

'మైదాసు' అను పేరుగల లోభి కలడు. అతనికి బంగారమునందపారమగు ప్రేమ. ప్రతిరోజు తనవద్దనున్న ధనరాసులను చూచుకొనుచు, లెక్కించుకొనుచు మహదానందమును బొందుచుండును. అతనికి ధనమందలి కాంక్ష నానాటికి పెరిగిపోయెను. ఒక దేవదూతను ప్రార్థించినాడు. ఆ ప్రార్థనా ఫలితముగా దేవదూత ప్రత్యక్షమై 'నీకేమి కావలయునో కోరుకొమ్ము?' అని పలికెను. వెంటనే మైదాసు 'నేను ముట్టినదెల్ల బంగారము కావలయును. అట్టివరము నాకు దయచేయుము' అని కోరెను. 'రేపు సూర్యోదయమునుండి నీకోరిక ఫలించును' అని దేవదూత పలికెను. మైదాసు ఆనందమునకు మేర లేదు. అతనికి రాత్రియే నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారునా? ఎప్పుడు వర ప్రభావము లభించునా? యని ఎదురు చూచుచుండెను. తెల్లవారినది. బాలభానుని తొలికిరణరాగము మైదాసు పడకగదిలో పొడసూపినది. తోడనే అతడు తన మంచముపై గల దుప్పటిని తాకెను. ఆశ్చర్యము! అది బంగారపు దుప్పటిగామారినది. కుర్చీని ముట్టుకొనినాడు అది బంగారుకుర్చీ యయ్యెను. తరువాత బల్లలు, పాత్రలు ఆగదిలోని పరికరము లన్నిటిని తాకినాడు. అన్నియును స్వర్ణమయము లే. అతనికి ఆశ మరింతగా పెరిగినది. ఆయనకు పెద్దపూలతోట గలదు. అందులోనికి పరుగెత్తినాడు. గులాబులు, చామంతులు, మల్లెలు, మొల్లలు, మందారములు, కనకాంబరములు, ఎన్నియో పూలమొక్క లందు గలవు. మైదాసు పరుగుపరుగున పోయి ప్రతిచెట్టును తాకుచున్నాడు. బంగారుపూలు, బంగారుకొమ్మలు, బంగారు ఆకులు, తోటయంతయు స్వర్ణోద్యానమయినది. మైదాసు ఆనందమునకు మేర లేదు. పన్రెండు గంటలయినది. చండభానుడు తీవ్రముగా ప్రకాశించుచున్నాడు. చాల

అలసిపోయినాడు పాపము మైదాసు. కొద్దిగా ఆహారము తీసుకొని కాఫీ త్రాగి మరలివచ్చెదనుగాక యని తలంచి మైదాసు ఇంటికి పోయి నాడు. ఇంటివద్ద అతనికి ఏకైక పుత్రిక యగు 'మేరీ' ఉన్నది. మైదా సుకు కుమార్తె యన్న పంచప్రాణములు. తండ్రి అలసిపోయి వచ్చు టను చూచి కుమార్తె ఒక కప్పుతో కాఫీని, ఫలహారమును అందిం చినది మిక్కిలి ఆకలిగానున్న మైదాసు తొందరతొందరగా పళ్లెము లోని ఫలహారమును నోటిలో పెట్టుకొనుచున్నాడు. ఆశ్చర్యము! ఆ ఫలహారమంతయు ఆతని స్పర్శచే బంగార మయినది. కాఫీ గ్లాసును పైకిఎత్తినాడు. అంది బంగారు ద్రవముగా మారిపోయినది. ఆకలి విప రీతముగా వేయుచున్నది. ఏమి తినగలడు? ఆకలి చల్లారుటఎట్లు? విప రీతమగు దాహము వేయుచున్నది. మంచినీరైనను త్రాగ లేడే? ఆకలి దప్పికలతో చనిపోవవలసిన దేనా? కుమార్తె చాల కంగారుపడి తం డ్రిని కౌగలించుకొన్నది. ఆమె బంగారు బొమ్మగా మారిపోయెను.

మైదాసు ఏమిచేయగలడు? బోరున ఏడ్చుచు అతడు దేవదూ తను మరల ప్రార్థించెను. ఆతడు ప్రత్యక్షమైనాడు. 'ప్రభూ! నేను బుద్ధిహీనుడను. పొరపాటుచే ఇట్టి తుచ్ఛవరమును కోరినాను. నా కుమార్తెను దూరమైనాను. ఆకలిదప్పికలతో మృతినొందుచున్నాను. దీనదయాళో! కరుణానిధే! బుద్ధివచ్చినది. ఈ తుచ్ఛవరమును నా నుండి తత్ క్షణమే తొలగింపచేయుము' అని దేవదూత పాదములపై బడి ఏడ్చుచు ప్రార్థించినాడు. 'నాయనా! ఇట్టి పిచ్చివరములను కోర కుము. బుద్ధివచ్చినదా?' అని పలికి ఇట్లనెను. 'నీవుపోయి ఈ ప్రక్కనే ప్రవహించుచున్న నదిలో స్నానముచేసి రమ్ము. నన్ను స్మరించుచు ఆనదీజలములను తెచ్చి నీవు బంగారముగా మార్పుచేసిన వస్తువులపై చల్లుము. అన్నియు పూర్వస్థితిని బొందును' అని పలికెను. మైదాసు అట్లే కావించి స్వస్థచిత్తుడైనాడు. దీని సారాంశ మిది.

భౌతికవస్తువులు మానవునకు ఆనందమును కలిగింపలేవు. అవి

సుఖభ్రాంతినిమాత్రమే కల్గించును. బాహ్యవస్తువు లన్నియును దుఃఖమునే కలిగించును. బుధులు వానిదరికి పోరు అని గీత పలుకును.

మానవుడు బాహ్యవస్తువులచే పొందు ఆనందము స్థిరముగా నుండదు. శిశువు జన్మించినా డనుకొనుడు. ఆబిడ్డ కిప్పుడు ఆనందము సుఖమును ఎక్కడ గలదు? తల్లి స్తనములను పట్టుకొని తీయనిపాలను గుటకలువేయుచు త్రాగును. దానిలోనే ఆబిడ్డకు ఆనందము. కొన్ని సంవత్సరము లయినది బిడ్డకు. ఆత డిప్పుడు ఆటలలో మునిగి తేలును. ఇంటికి భోజనమునకుకూడ వచ్చుటలేదు. ఆతని కానందము ఆటలలో నున్నది. ఇప్పు డాతనికి ఇరువది వత్సరముల వయస్సు. ఆతనికి ఆనందము ఎచ్చట లభించునో చెప్పగలవా? తల్లి స్తన్యపానములోనా? బిడ్డల ఆటపాటలలోనా? కాదు-కాదు! సుందర యువతీ సంగమము లందే ఆతనికి ఆనందము. మరికొన్ని దినము లయినది. సంసారము పెరిగినది. ఇప్పు డాతనకి ఆనందము ధనసంపాదనములో మాత్రమే గలదు. మరికొన్ని దినములకో కీర్తిప్రతిష్ఠలలో. ఈవిధముగా ఆనంద స్థానములు మార్పుచెందుచున్నవి. దీని సారాంశ మిది. బాహ్యవస్తువులలో స్థిరమగు ఆనందము లేదు. కావుననే జ్ఞానులు వానియందు మక్కువ చూపరు.

ఆనందము నీలోనే యున్నది. నీలోనున్న ఆనందస్వరూపమును గుర్తింపుము. బయటనుండికాదు ఆనందము లభించునది. అంతరంగమునుండి. ఆనందసామ్రాజ్యము నీలోనుండగా పైవస్తువులలో ఆనందమున్నదని తలంచుచున్నావా ?

ఎంత మోసపోవుచున్నావు? నీవు ఆనందజ్యోతివి. సచ్చిదానంద స్వరూపుడవు. నీయందున్న అంతర్జ్యోతిలో రమింపుము. బ్రహ్మనిర్వాణము లభించును.

'యోఽంతస్సుఖోఽన్తరారామ, స్తథాఽన్తర్జ్యోతిరేవ యః
సయోగీ బ్రహ్మనిర్వాణం, బ్రహ్మభూతోఽధిగచ్ఛతి' (అ 5-శ్లో 24)

# 44. కామక్రోధముల వేగమును నిరోధింపుము.

## Control the forces of lust and anger.

కామక్రోధముల వేగమును నిగ్రహించినవాడే 'యుక్తు' డని, ఆతడే సుఖవంతు డనియు, వానికే బ్రహ్మనిర్వాణము కలుగు ననియు గీత పలుకును. ఇష్టవస్తువు కంటికి కనబడినపుడును, ఇష్టమగు శబ్దములు చెవికి వినబడినపుడును, ఇష్టమగు విషయములు మనసులో చొరబడినపుడును కలుగునట్టి తృష్ణయే కామ మనబడును. ప్రతికూలములగు పదార్థములను చూచినపుడును, తలపునకు వచ్చినపుడును, వినినపుడును కలుగునట్టి ద్వేషభావమే క్రోధ మనబడుచున్నది. శరీరము గగుర్పాటు చెందుట, నయనములు విప్పారుట, ముఖమువందు ప్రసన్నభావములు గోచరించుట ఇవి కామవేగము లని చెప్పబడును. శరీరము అదురుట, చెమటపట్టుట, పెదవులు కొరకుట, కన్ను లెఱ్ఱబడుట, మున్నగునవి క్రోధవేగము లనబడును.

నిరంతర సాధనమువలననే కామక్రోధముల నిరోధము సాధ్యమగును. సజ్జన సహవాసము, సద్గ్రంథ పఠనము, సదాచార సంపత్తి, మంత్రజపము, భజన, ధ్యానాదుల మూలముననే ఇవి సిద్ధించును.

రామకృష్ణ పరమహంస యొక్క జీవితములోని ఒక యుదాహరణమును తిలకింపుడు. అది కలకత్తా నగరములోని ఉన్నత సౌధాగ్రము. నిశీథ సమయము. పరమహంస ఒంటరిగా మేడ పై అంతస్థులో నున్నాడు. మరెవ్వరును చుట్టుప్రక్కల లేరు. ఆనిశీథములో-ఆ ఏకాంత ప్రదేశమందు నలుగురు సుందరాంగులు హావభావ విహాసములతో ప్రవేశించినారు. వలపుపాటలు పాడుచు, నేత్రాంచలములను త్రిప్పుచు, అంగసౌష్ఠవములను చూపుచు, ఆ అందగత్తెలగు వెలయాండ్రు పరమహంస ముందు కామబాణప్రయోగములను చేయుచున్నారు. ఆ స్థితప్రజ్ఞునిలో కామవేగచిహ్నము లేమియు గోచరించవు. ఆ మహాపురుషుడు తన రెండుచేతులను జోడించి నమస్కరించుచు, కాళీమాతా!

జగజ్జననీ! నీవీరూపములో ఇచ్చట సాక్షాత్కరించినావా? తల్లీ! నా నమస్కారము లివిగో! అని పలుకును. వెలయాంగ్రుడు పరమహంస పాదములకు నమస్కరించి క్షమాభిక్షను కోరిరి. 'కన్నుదోయికి అన్య కాంత లడ్డంబైన మాతృభావన చేసి మరలువాడు' అని పోతన్నగారి పలుకులు గదా! మాతృమూర్తిని ప్రతి స్త్రీయందును జూచుటవలన కామవేగములు నశించును.

మరియొక ఉదాహరణము : శివాజీ చక్రవర్తి మహమ్మదీయులతో పోరాడి విజయపరంపరలను బొందుచున్నాడు. ఒక విజయసన్నివేశము నందు సైనికులు అందమగు నొక ముస్లిము సుందరాంగిని తీసుకొనివచ్చి శివాజీముందు నిలిపినారు. చిదిమిన పాల్గారు చెక్కుటద్దాలతో ఆ ముద్దుబాల శివాజీ సమక్షములో నిలిచినది.

'ఈమె మన బందీ మహాప్రభూ! ఈజవ్వనిని మన యంతఃపురములో నుంచుడు. ఈమె దేవరవారి భాగ్యవస్తువు'అని సేనాధ్యక్షుడు పలికెను. శివాజీ యిట్లు పలికెను. 'సైనికులారా! ఎంతపొరపాటు చేసినారు. శివాజీ అన్యకాంతలను కన్నెత్తిచూడ డను విషయమును మీరెఱుంగరా? ఓ తల్లీ! నీగర్భమునందు జన్మించినయెడల నేను ఇకను అందమైనవాడనుగా జన్మించియుందును గదా! సేనానీ! ఈమెకు చీని చీనాంబరముల నిచ్చి, పసుపుకుంకుమలతో ఆమె స్వగృహమునకు గౌరవపురస్సరముగా పంపుడు' అని పలికెను. ఏమి ఆ మాతృభావన!

కామముయొక్క వికారమే క్రోధముకూడా.కోపము కాపురుష లక్షణ మని భారతము చెప్పును. క్రోధావేశపరునకు మంచిచెడ్డల యోచనాశక్తియే యుండదు. క్రోధావేశ కారణముగా ఎన్నియో హత్యలు జరుగుచున్నవి.

నా స్నేహితు డొకడు గలడు. అతనికి తన కుమారునిపై తాత్కాలికముగా కోపమువచ్చినది. మాటపై మాటలలో ఆకోపము మరింతగా ప్రజ్వరిల్లినది. ఆతడు కోపముచేత పిల్లవానిని చంపబోయినాడు. తల్లి పుత్ర ప్రేమచే ఆ బిడ్డకు అడ్డముగా నిలచినది.

తండ్రి కోపము మరింతగా పెరిగి ఆబాకుతో భార్యను పొడిచినాడు. ఆమె పడిపోయినది. ఆకత్తితో ఆబిడ్డను తన కన్నబిడ్డను పదిమార్లు పొడిచినాడు. రెండు నిండుప్రాణములు కోపాగ్నికి ఎరయై పోయినవి.

రెండుగంటలు దాటినది. తండ్రికి కోపము శాంతించి స్వస్థచిత్తుడైనాడు. రెండు శవములను కంటితో చూచినాడు. పాపమా దురదృష్టవంతుడు భోరుభోరున ఏడ్వసాగినాడు. తల బాదుకొనినాడు. రోడ్డుపై దొర్లినాడు. ఏమి లాభము? పోలీసులువచ్చి అతనిని బంధించినారు. న్యాయమూర్తి ఆ హంతకునికి శిక్ష విధించినాడు. కోప మెంత మహాభయంకరమైనదో చిత్తగింపుడు. అది రాక్షస లక్షణము. క్రోధ కారణముగా భారవి మహాకవి పితృవధకే సిద్ధపడినాడు గదా! నీకు కోపావేశము కలిగినపుడు భగవన్నామస్మరణము చేయుము. లేదా గీతను చదువుము. కోపము పటాపంచలై పోవును. భగవానుని పాదములపై వ్రాలి శరణాగతిని పొందుము. సమస్త వికారములును నశించును. 'క్రోధ మూలాని పాపాని' సమస్త పాపములును కోపము వలననే కలుగునని పెద్దలు చెప్పుదురు.

క్రోధమునకు వ్యతిరేకమయిన శాంతభావమును అలవాటు చేసికొనుము. శాంతము సర్వసుఖదాయకము.

కామ క్రోధముల నిరోధమే మోక్షమునకు అర్హత.



## 45. కఠోపనిషత్తులోని పుణ్యకథ.

మిత్రులారా! మనోహరమైన ఈ అయిదవ అధ్యాయమును ముగిస్తూ కఠోపనిషత్తులోని పుణ్యకథను గురించి ముచ్చటించుకొందము గాక! ఉపనిషత్తులు వేదమాతయొక్క శిఖలు. భారతీయ సంస్కృతి, భారతీయ మహావిజ్ఞానము,ఉపనిషత్తులలో మూర్తీభవించి యున్నవి ఉపనిషత్సుధబోధ భారత దేశమును పవిత్రము గావించినది.

'నాకు పునర్జన్మయే యున్న యెడల ఉపనిషత్తులు జన్మించిన పుణ్య భారత దేశములోనే నేను పుట్టగోరెదను' అని మాక్సు ముల్లరు పండితుడు పలికెను. ఉపనిషత్తుల మహారాణి నాలకించి మహావిదుషీమణి అని బిసెంటు రోమహర్షమును జెందినది. ప్రపంచములోని ఉత్తమోత్తమ మహాసాహిత్యము 'ఉపనిషత్తులు' అని జర్మనుపండితు లనేకులు ప్రశంసించిరి. ఉపనిషత్తు శ్రుతిస్థానము. భగవద్గీత స్మృతిప్రస్థానము. ఉపనిషత్తులకును, గీతకును అవినాభావ సంబంధము. ఉపనిషత్సారమే గీత. 'భగవద్గీతా-ఉపనిషత్తు' అని ప్రతి అధ్యాయాంతము నందును మనము పలుకుదుము. ఉపనిషత్తులలోని శ్లోకము లెన్నియో గీతల యందు యథాతథముగాను, మరికొన్ని కొద్దిమార్పులతోను గోచరించును. వివేకానందు డిట్లు పలుకును.

Bhagavadgeeta is a basket of flowers collectｕd from the Upanishads

'ఉపనిషత్తు లనే పూదోటలోని మధుర పుష్పాల గంపయే భగవద్గీత.'

కఠోపనిషత్తులలోని శ్లోకము లెన్నియో గీత యందు కలవు. ఇందలి కథ బహురమ్యమైనది. ఇది యజుర్వేదాంతర్గత మగు ఉపనిషత్తు. ఈ అధ్యాయములోని విశేషములకు ఈ ఉపనిషద్గాథ చక్కని రసపుష్టిని చేకూర్చును.

స్వర్గ ఫలములను కోరినవాడై వాజశ్రవసుని కుమారుడైన ఉద్దాలకుడు విశ్వజిత్ యాగమును చేసినాడు. కామ్యములను గోరి యజ్ఞములను చేయరాదని గీత చెప్పును. ఉద్దాలకుడు కామ్యముతో యజ్ఞము నాచరించి బ్రాహ్మణులకు దక్షిణాల నీయసాగెను. నిరింద్రియములను, శక్తివిహీనములును, క్షీరముల నొసగనట్టియు, పనికిమాలిన గోవులను బ్రాహ్మణులకు దాన మీయసాగెను. ఉద్దాలకుని కుమారుడగు నచికేతున కిది చాల అసహ్యముగ తోచెను. తండ్రివద్దకు పోయి

'పితాజీ! మీరు నన్నెవరికి దానమిచ్చెదరు?' అని ప్రశ్నించెను. కుమారుని ఈ ప్రశ్న తండ్రికి క్రోధకారణ మాయెను. తోడనే 'నిన్ను యముని కొసంగెదను' అని తండ్రి కోపముతో పలికెను. తండ్రియొక్క ఈ యకారణ కోపమునకు నచికేతుడు చాల విచారించెను. క్రోధము పాపహేతువు గదా ? ఏమయినను తండ్రియొక్క వాక్యమును సత్యబద్ధము చేయవలయు నని నచికేతుడు స్థిరసంకల్పుడయ్యెను. వెంటనే ఆతడు యముని మందిరమునకు పోయెను. కాని యముడు తనఇంటిలో లేడు. ఆతని గృహద్వారమువద్దనే బ్రాహ్మణ కుమారు డుపవాసముతో మూడురాత్రులు పడియుండెను. మూడుదినముల యనంతరం యముడు వచ్చి జరిగిన విషయమును గ్రహించి చాల విచారించెను. 'అయ్యో! మూడు రాత్రులనుండి బ్రాహ్మణకుమారుడు నాయింటి ముంగిట నిరాహారియై యున్నాడు. ఎవరియింట ఈరీతిగా అతిథి ఆహారము లేక పడియుండునో ఆతని సర్వసుఖభోగములును నశించును. అతిథిని పూజింపనివానిగతి అధోగతి. ఇట్లు చింతించి యముడు నచికేతునితో 'బ్రాహ్మణకుమారా! నా అపరాధమును క్షమింపుము. నాయింట నిరాహారివై మూడుదినము లుంటివి గాన నీకు మూడు వరంబు లొసగుచున్నాను. కోరుకొనుము?' అనెను.

నచికేతు డిట్లనెను. 'ఓ వైవస్వతుడా! నా తండ్రి కోపమును బోగొట్టి, ఆయన నాయందు తొల్లిటివలె కృపాంతరంగిత హృదయుడగునట్లు వర మిమ్ము?' అనెను.

'అట్లే అగునుగాక!' అని యముడు పలికెను. ఇక రెండవవరం. నచికేతు డిట్లు పలికెను. 'ఓ యమధర్మరాజా! స్వర్గము సకలభోగములకును నిలయముగదా? అట్టి స్వర్గమునకు హేతుభూతమయినది అగ్ని కార్యము కదా! ఆ యగ్ని కార్యవిశేషములను సంపూర్తిగా నాకెరిగింపుము. యముడు చాల సంతసించి దానిని సంపూర్ణముగా నెరిగించెను. ఇక మూడవ వరము.

త్రమును గురించి విశేషించి ఉపవ్యాసించుచుందురు. అది కొంతవరకు మంచి ప్రబోధమే గావచ్చును. కాని సోదరులుకూడ కలహించుకొనుచు,హత్యలుగావించుకొను సన్నివేశములనుకూడ మనం చూచుచునే యున్నాముగదా ? కనుక సోదరత్వమే పరమాదర్శము కాదు. ఆత్మజ్ఞానమే పరమాదర్శమగు నని గీతాశాస్త్రము బోధించును. ఒకే శరీరములో కన్ను, ముక్కు, చెవి నాలుక, కాళ్లు, చేతులు మున్నగు అవయవములు వేరువేరుగా నున్నట్లు కానవచ్చుచున్నవి. వానిలో ఏ ప్రత్యేకావయవమునకు బాధకలిగినను దేహ మంతయును క్షోభించును,అదియేరీతిని విశ్వమందుగల ఏప్రాణికి బాధగలిగినను జ్ఞాని సంక్షోభమునుచెంది ఆప్రాణికి సేవచేయును. అన్నిటియందును ఆత్మనే దర్శించు జ్ఞాని యెవ్వరిని దూషించగలడు ? ఎవ్వరిని నిందించగలడు ? ఎవ్వరికి అపకారము చేయగలడు? ఎవ్వరికి అపకారముచేసినను తనకు తానే అపకారము చేసికొన్నవాఁ డగునుగదా ? కనుకనే గీత యిట్లు వచించును.

'ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః'(అ.6 శ్లో.32)

సమస్త ప్రాణుల యందును కలుగుచున్న సుఖదుఃఖములను తనవివలె భావించువాడే పరమయోగి యని తాత్పర్యము. సారాంశమేమన సమస్తభూతకోటియందును దయ ప్రేమ కరుణ కలిగి వారికి సేవ చేయువాడే పురుషుడు.

'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ' (అ. 12-శ్లో.13)
అని గీత బోధించును.

ఇట్టి ఉత్తమలక్షణములు గలిగినవాడే పండితు డని గీత వచించును. కావున ప్రతివాడును ఆత్మస్వరూప జ్ఞానము కలిగి దయ కరుణ మున్నగు దివ్యగుణములతో శోభిల్లుచు పండితు డగుటకు ప్రయత్నించవలెను. ఇదియే జీవిత పరమార్థము.

## 47. అభితో బ్రహ్మ నిర్వాణమ్.

**The infinite bles is everywhere.**

మోక్ష మెల్లెడలను వెలయుచున్నది. మానవ జీవితము యొక్క పరమలక్ష్యము ఆత్మసాక్షాత్కారము. దానిని కైవల్యము, మోక్షము, బ్రాహ్మీస్థితి; యను వివిధనామములతో పిలుతురు. మోక్షము ఎచ్చటనున్నది? మోక్షముకొరకు ఎచ్చటకు పోవలయును? మోక్షప్రాప్తికి హిమాలయ శిఖరములకు పోనక్కరలేదు. బదరీ క్షేత్రమునకు పోనవసరము లేదు. కాశీక్షేత్రమునకే వెళ్ళ నవసరముండదు. పుణ్యాశ్రమములో ప్రవేశింప నక్కరలేదు. మోక్షసామ్రాజ్యము ప్రతిస్థలమునందును గలదు. ప్రత్యేక స్థలమునందే కైవల్యము లేదు. ప్రతిగృహమును మోక్షమందిరమే. ప్రతివాడును, తన గృహమందే నివసించుచు మోక్షమును బొందవచ్చును. గృహలక్ష్మి తన వంటయింటిలోనే తన గృహకృత్యములను నిర్వహించుకొనుచు భగవత్సాక్షాత్కారమును బొందవచ్చును. ఎవ్వరే కర్మ నాచరించుచున్నను ఆ కర్మ ద్వారమున నీ మోక్షము నందగలడు.

మోక్షము బొందుటకు కొన్ని ప్రత్యేక అర్హతలు గావలయునే కాని గృహపరిత్యాగముగాదు. ఎవరెస్టుశిఖర మెక్కినంతమాత్రమున బ్రహ్మ సాక్షాత్కారము కలుగదు. అర్హతలు లేనివా డెచ్చటకు పోయినను బ్రాహ్మీస్థితి చేకూరదు. కాని మానవుడు ఆధ్యాత్మిక సాధనలు చేయక, తేలికగా తనకు మోక్షసిద్ధి కావలయు నని కోరును.

ఒక గ్రామములో ఒక మల్లయుద్ధ విశారదుడు గలడు. తాను గొప్ప బలశాలి యనియు గొప్ప మల్లయుద్ధవీరు డనియు లోకమంతయును తన్ను కీర్తింపవలయు ననియు ఆతని ఆకాంక్ష. అందులకుగాను తన శరీరముపై పలుతావులలో సింహముయొక్క బొమ్మను చిత్రించుకొనవలె నని భావించెను. ఆ బొమ్మలను చూచి తాను 'సింహపరాక్రము'డని లోకమంతయును కీర్తించునని అతడు భావించెను. పూర్వ

కాలములో శరీరముపై 'పచ్చబొట్లు' వేయించుకొను నలవాటు గలదు. ఒకమంగలిని పిలిచి తనశరీరముపై (రెండు భుజములపైనను, రెండు కాళ్ళపైనను, వక్షస్థలము - వీపుపైనను) సింహము యొక్క ప్రతిమలను చిత్రింపగోరెను. ఆమంగలి బొమ్మలను గీయుటకు కావలసిన రంగులను సూదులను తెచ్చెను. ముందుగా దక్షిణభుజముపై సింహముయొక్క బొమ్మనుగీయుటకు రంగులలో సూదులను ముంచి అతని భుజముపై గ్రుచ్చెను. ఆబాధను మల్లుడు సహించజాలక పోయెను. తాను బాధపడునట్లు పైకి చెప్పినచో తన బలపరాక్రమ శక్తులకు భంగము కలుగునని ఆతని తలంపు. కాని సూదిపోటులను భరింప జాల డాయెను. సూదిపోటులేక బొమ్మ రాదుగదా? ఒక ఉపాయ మాలోచించి మల్లుడు మంగలితో, 'ఏమయ్యా! సింహము బొమ్మ ఎచ్చటనుండి ప్రారంభించినావు?' అని అడిగెను.

'చెవినుండి ప్రారంభించినా' నని మంగలి చెప్పెను. 'అయ్యో! చెవిదగ్గర ప్రారంభించినావా? అసలు సింహములకు చెవు లుండవు. కనుక చెవిని వదలివేయుము!' అని మల్లుడు పలికెను.

మరల మంగలి సూదిపోటును ప్రారంభించి బొమ్మను గీయ సాగెను. బాధను భరించలేక 'ఇప్పు డెచ్చటనుండి ప్రారంభించి నావు?' అని మల్లు డడిగెను. 'తోకభాగమునుండి ప్రారంభించినాను!' అని మంగలి తెలిపెను.

ఓ మంగలి! తోకలేని సింహమే మంచి పరాక్రమము గల సింహము. కనుక తోకను వదలివేయుము అని మల్లుడు పలికెను. మంగలి తోకను వదలి, మరల సూదిని గ్రుచ్చి బొమ్మను గీయసాగెను. ఇప్పుడు ఎచ్చటనుండి మొదలుపెట్టితివి? అని మల్లుడు మరల ప్రశ్నించెను. 'నడుమునుండి మొదలుపెట్టినాను?' అని మంగలి బదులు చెప్పెను.

'నాయనా ! నీవు సింహముయొక్క బొమ్మను గీయుట చేత కానుసుమా! సింహమునకు నడుము కానరాదు. ప్రబంధములు నీవు చదివియుండవు. స్త్రీలను 'సింహమధ్య' లని పిలుతురు. మంగలి విసిగి వేసారి నేనిక బొమ్మను గీయలే నని చెప్పి వెడలిపోయెను.

ఆధ్యాత్మిక సాధకుల స్థితికూడా ఈరీతిగానే యున్నది. నిత్య నిరంతర నిర్విరామసాధనలు చేయకయే మానవుడు ఆధ్యాత్మిక మహా ఫలసంపదలను బొందవలయు నని వాంఛించును.

ఈక్రింది శ్లోకములో భగవానుడు ప్రధానములగు మూడు ఆధ్యాత్మిక సాధనలను తెలుపుచున్నాడు. ఈ సాధన త్రయము నాచరించువాడు ఎచ్చోటనున్నను ఆతడు మోక్షసామ్రాజ్య పదమును బొందును. సాధనారహితుడు ఎచ్చోట నున్నను వ్యర్థుడే ?

'కామక్రోధ వియుక్తానాం, యతీనాం యత చేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం, వర్తతే విదితాత్మనాం' (అ 5-శ్లో 26)

1) కామక్రోధములను విడనాడుట, 2) మనోనిగ్రహము, 3) ఆత్మతత్వము నెరుంగుట. ఈ మూడు సాధనములందును కృతార్థుడైనవాడు శరీర ముండగనే సిద్ధిని బొందినవా డగును. ఆతడే జీవన్ముక్తుడు, యోగీశ్వరుడు, భక్తశిఖామణి, బ్రహ్మభూతుడు.

1) కామక్రోధముల విడనాడుట:- ఈవిషయము గురించి భగవానుడు గీతయందు మరల మరల గానముచేసినాడు. కామమే మానవుని బంధించును. ఐహికభోగవాంఛలే కామము లనబడును. కామము నెరవేరనిచో కలుగు భయంకర వికారరూపమే క్రోధము. మహాపండితులును, తపశ్శీలురును గూడ కామక్రోధ పిశాచములకు వశులైన విధమునుగూర్చి మన పురాణములు తెలుపుచున్నవి.

మేనకయొక్క సాన్నిధ్యమున విశ్వామిత్రుడు పతనమైనాడు. మహాపండితుడైన భారవి కవీంద్రుడు క్రోధావేశమునకు లోనై తన తండ్రిని చంపుటకు ప్రయత్నించినాడు. క్రోధ మెంత భయంకరమైనది?

'క్రోధమువలన సమ్మోహము గలుగును. దానివలన స్మృతి నశించును. తత్ఫలితముగ బుద్ధి విఫలమై మానవుడు పతనావస్థను బొందుచున్నా' డని సాంఖ్యయోగమున భగవానుడు వచించి యున్నాడు గదా!

ఉదాహరణము :- విశ్వామిత్రుడు సుదీర్ఘ కాలము తపస్సు చేసి వసిష్ఠునివద్దకు వచ్చి నిలబడెను. 'ఓ రాజర్షీ! సుఖమా ?' యని వసిష్ఠుడు భాషించెను. విశ్వామిత్రుడు మరల వనమునకుపోయి సుదీర్ఘ కాలము తప మాచరించి మరల వసిష్ఠునివద్దకు వచ్చెను. మరల వసిష్ఠుడాయనను ఓ రాజర్షీ ! అనియే సంబోధించెను. విశ్వామిత్రునకు తృప్తి కలుగలేదు. మరల సుదీర్ఘ కాలము తప మాచరించి, వసిష్ఠుని అభిప్రాయము కొరకు వచ్చి నిలచెను. ఈపర్యాయమును 'రాజర్షి' యనియే వసిష్ఠు డాయనను సంబోధించెను. విశ్వామిత్రునకు వసిష్ఠునిపై విపరీతమగు క్రోధము కలిగినది. తపస్సువలన అరిషడ్వర్గములను జయింపవలసిన విశ్వామిత్రునకు తద్విరుద్ధమగు మహాక్రోధము జనించినది. కారణమేమి? తాను బ్రహ్మర్షి కావలయునని యాతని వాంఛ. వసిష్ఠు డందులకు తన ఆమోదముద్ర నీయవలయునని ఆతని ఆరాటము. ఎన్నిసారులు తప మాచరించి తిరిగి వచ్చుచున్నను వసిష్ఠుడు తన్ను బ్రహ్మర్షి యని పిలువకుండుటచే ఆతనిలో తపస్సాధనకు విరుద్ధమగు రజోగుణము ప్రకోపించినది.తనవాంఛ నెరవేరనందున క్రోధము గలిగి బుద్ధి వికలత్వము చెందగా బ్రహ్మవేత్త యగు వసిష్ఠుని చంపుటకు ఖడ్గమును చేతబూని ఒకనాటిరాత్రి వసిష్ఠుని కుటీరసమీపమున గల పొదలమాటున దాగియుండి సమయమునకై నిరీక్షించుచుండెను.

ఆనాడు పున్నమ. షోడశ కళాపరిపూర్ణుడై శశాంకుడు గగన వీధిలో విహరించుచు, తన మనోజ్ఞ మధుర మంజుల చంద్రికలను భూమియం దెల్లెడల ప్రసరింప చేయుచుండెను.

వసిష్ఠుడు అరుంధతితో కూడి ఆ వెన్నెల రేయిని తన కుటీరసమీపమున గల రాతిబండపై కూర్చుండి 'ఓ అరుంధతీ! ఈ వెన్నెల యెంత మనోహరముగా నున్నదో, అట్లనే మన విశ్వామిత్రునియొక్క కీర్తి చంద్రికయు విశ్వము నంతయును వికసించి విస్తరించుచు విరాజిల్లుచున్నది కదా!' యని ప్రశంసించుచుండెను. సమీపమున ఖడ్గపాణియై దాగి యున్న విశ్వామిత్రు డీవాక్యముల నాలకించి ఆశ్చర్యచకితు డయ్యెను. నన్ను గురించి యింతగా ప్రశంసించుచున్న గురుదేవుడగు వసిష్ఠముని చంద్రుని హత్యచేయుటకు ప్రయత్నించుచున్న నేనెంతటి మూర్ఖుడను? ఎంతటి ద్రోహమును తలపెట్టినాను? అని వగచి కన్నీరు గార్చుచు ఖడ్గము నావల పారవైచి, పొదలచాటుననుండి లేచి వచ్చి, కన్నీరు గార్చుచు గురుదేవుని పాదములకు సాష్టాంగ నమస్కారములు చేసి తన్ను క్షమింపు? మని ప్రార్థింపసాగెను.

వసిష్ఠు డాతని తన మృదుహస్తములతో లేవనెత్తి 'ఓ బ్రహ్మ ఋషిగారూ! ఇప్పుడు మీరు వాస్తవముగా బ్రహ్మఋషులైతి' రని ప్రశంసించెను.

'నేను తపశ్శాలిని' అను దురహంకారము గల విశ్వామిత్రు డిప్పుడు ప్రపత్తిని బొందిన కారణముచేత 'బ్రహ్మర్షి' యయ్యె నని సారాంశము.

2) మనోనిగ్రహము :- 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' మనస్సే బంధహేతువు. మనస్సే మోక్షహేతువు. నిగ్రహించబడిన మనస్సు మోక్షము నిచ్చును. ప్రాపంచిక విషయాసక్తమగు మనస్సు బంధనమును గలిగించును. కనుక ఇంద్రియములను, మనస్సును నిగ్రహించవలయునని తెలుపబడినది. ఈవిషయము 6 వ అధ్యాయమున మరింత విశదముగా గ్రహింపగలము.

3) ఆత్మతత్త్వము నెరుంగుట :- 'జీవో దేవ స్సనాతనః' జీవుడు సనాతను డగు పరబ్రహ్మము. తాను శరీరము గాదు – ఇంద్రియము

లును గాదు. నిత్యశుద్ధముక్తసత్యస్వరూపు డగు పరబ్రహ్మ యని యనుభవపూర్వకముగా గ్రహించవలయును.

'మనో బుధ్యహంకార చిత్తాని నాహం
న శ్రోత్రం న జిహ్వా న చ ఘ్రాణనేత్రం
నచ వ్యోమ భూమి ర్న తేజో న వాయుః
చిదానందరూప శ్శివోహం శివోహం ॥'

నేను మనస్సును గాను? చిత్తమును గాను? అంతఃకరణ చతుష్టయమున కతీతుడను. శ్రోత్రాది జ్ఞానేంద్రియపంచకమును గాను? భూమ్యాకాశాది పంచభూతములను గాను? నిత్యుడను, నిర్వికారుడను, శుద్ధుడను, చింతానందరూపుడగు పరమశివుడనే నేను, అని నిరంతరమును స్మరణ చింతనధ్యానమును చేయవలయును.

'తద్బుద్ధయః తదాత్మానః తన్నిష్ఠాః తత్పరాయణాః' (అ 5-17)

ఆ పరమాత్మయందే బుద్ధి గలవాడును, ఆ పరబ్రహ్మమందే మనస్సును నెలకొల్పినవాడును, ఆపరంజ్యోతియందే నిష్ఠగలవాడును, ఆ పరమాత్మనే పరమగతిగా గలిగినవాడును, శాశ్వత మోక్షపదమును బొందుచున్నాడు.

ఇందు మొదటి సాధన వాసనాక్షయమును, రెండవది మనోనాశనమును, మూడవది ఆత్మజ్ఞానమును సూచించును. ఇట్టిసాధనలు చేయువారు ఎచ్చట నున్నను ముక్తులే యగుదురు. వీరే యతులు. యతు లనగా కౌపీనధారులని గాని, భార్యాసుతులను వదలినవారని గాని తలంపరాదు. 'యతి' యనగా యత్నశీలుడు అని అర్థము. ఆత్మజ్ఞానము కొరకు తీవ్రయత్నము చేయువా రందరును యతులే. అట్టి యతులే కావలయు నని గీతాచార్యుడు బోధించుచున్నాడు.

# గీతా కల్పవృక్షము

ఆరవ అధ్యాయము - ఆత్మసంయమ యోగము

## 48. అనుష్ఠాన వేదాంతము The practical philo:ophy.

కరుణాసముద్రు డగు గీతాసార్వభౌముని అనుగ్రహముచేత పదునెనిమిది అంతస్థులుగల మనోహరమగు గీతా మహాసౌధములో ఆరవ అంతస్థులో ప్రవేశిస్తున్నాము.

ఒక్కొక్క అంతస్థులో ఒక్కొక్క ప్రత్యేకత, ఒక్కొక్క విశిష్టతయు శోభిల్లును. ఒక్కొక్క అధ్యాయంలో ఒక్కొక్క మనోహరత్వము తాండవిస్తుంది. ఈ అధ్యాయంలో ఒక రసవత్తరమయిన మహావిశిష్టత వున్నది "క్షీరసాగరాన్ని మథించగా బయలు వెడలిన అమృతము వంటి" దీ అధ్యాయ మని జ్ఞానేశ్వరుడు పలుకును. "మనోహరమగు గీతాలతాంకుర మే" ఈఅధ్యాయ మని ఆవ్యాఖ్యాత పలుకును. "ఆత్మ" అనగా యిచ్చట "మనస్సు" అని అర్థము. "సంయమము" అనగా "నిగ్రహము" అని అర్థము. మనో నిగ్రహాన్ని అనుసరించిన విధాన విశేషము లెన్నియో ఈఅధ్యాయములో వివరింపబడిన కారణముచేత దీనికి 'ఆత్మసంయమయోగ' మని పేరు కలిగినది. ఏకాగ్ర చిత్తములేనిదే భక్తికాని, జ్ఞానము గాని, నిష్కామకర్మ గాని సిద్ధింపదు. అందువలననే జ్ఞానదేవుడు ఈ అధ్యాయము గీతకు మూలము వంటిదని పలికినాడు.

చిత్తముయొక్క ఏకాగ్రత లేనిదే ఏ వ్యవహారము నందును, పరమార్థమునందును గూడ విజయము సిద్ధింపదు. ఏకాగ్రచిత్తముతో చేసిన వర్తకమే విశేషముగా లాభించును. యుద్ధక్షేత్రంలో సైనికునకు, పాఠశాలలో ఉపాధ్యాయునకు - రాతినిచెక్కు శిల్పికి - చిత్తరువు వ్రాయు చిత్రకారునకు - మహాకావ్యమును రచించు కవికుమా

కనుక - ఏకాగ్రతచిత్తము లేనిదే విజయసిద్ధి లేదు. నాట్యకత్తె తన శిరముపై కుంభమును పెట్టుకొని నాట్యము చేయును - దొమ్మరిసాని తీగపై చక్కగా నడచును - వేటగాడు గురిచూచి పక్షిపై బాణము వేయును - ఇవి యన్నియును ఏకాగ్రతగల మానవులకే సాధ్యము. ఆ మధ్య ఒక యువకుడు నాలుగు అహోరాత్రులు విడువక నిరంతరాయంగా సైకిలుయానం ప్రదర్శనం చేసినాడు. ఇది ఆతని ఏకాగ్ర చిత్తానికి ఉదాహరణమేకదా! చక్కగా వంటచేయడానికి ఇల్లాలికి కావలసినది ఏకాగ్రచిత్తము. అది లేనివానికి ఈ లౌకిక ప్రపంచము లోనే స్థానంలేదు. ఇక పరమార్థ జీవితములో దాని విశేషమును గూర్చి చెప్పనలెనా!

వేదాంత మనగా ఉపన్యాసములు చెప్పుట గాదు. శ్లోకాలను కంఠస్థము చేయుటగాదు. చక్రాంకితాది ముద్రలను ధరించుటయును గాదు. అది ఋజుప్రవర్తనతో గూడిన విశిష్టజీవిత విధానము. ఆటలో - పాటలో - మాటలో - చదువులో - సంధ్యలో - తిండిలో - సకల జీవిత వ్యవహార రంగాలలో ఒక ఆధ్యాత్మికాచరణ విధానమే కావలసి యున్నది. దానిని ఈ అధ్యాయం తెలియచేయును. దానికి కావలసిన ప్రత్యేక సాధనాక్రమములను భగవాను డిం దుదాహరించుచున్నాడు. ఈ అధ్యాయమును చక్కగా గ్రహించినవారు ఇహపరములు రెంటియందును విజయపరంపరలను బొందుదురు. ఫలాశను వదలి విధ్యుక్తమైన కర్మలను చేయువాడే 'యోగి' యని 'సన్యాసి' యనియు చెప్పబడునేగాని, అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మలను వదలిపెట్టినట్టి జ్ఞానహీనుడైన సోమరి 'యోగి' కా డనియు హెచ్చరించుచు - కర్మయోగ విశిష్టతను మరల జాటుచు భగవాను డీ యధ్యాయమును ప్రారంభించు చున్నాడు.

# 49 మనస్సుయొక్క ప్రభావము.

## The power of the mind.

మానసిక శక్తికి ఒక గొప్ప ఉదాహరణముగా మీకొక చక్కని కథను చెప్పెదను. ఈ కథను మీరు విని "ఇది నమ్మతగినది కాదు. అతిశయోక్తి" అని మీరు పలుకనచ్చును. మీరు నమ్మినను నమ్మకపోయినను నాకును, నావలె మనశ్శక్తియందు విశ్వాసము గలవారికిని యిది యథార్థముగనే పొడసూపును. ఇది స్వకపోల కల్పితముగాదు. వ్యాసదేవుడు మహాభారతంలో దీని నుదహరించినాడు.

"వ్యుషితాశ్వుడనే మహారాజు ధర్మప్రపాలనము చేస్తూ అశ్వమేధాది యాగములు చేయుచు విశేష కీర్తి గడించాడు. ఆయన భార్య సుందరీదేవి – ఆమె వాస్తవంగా సౌందర్య రాశియే. ఆమెయందు వ్యుషితాశ్వుడు విషయకామోప భోగములను పొందుచు క్రమంగా పాండురోగపీడితుడయినాడు. రోగ మంతకంతకు ముదిరి చివరకాతడు మరణించినాడు. సుందరీదేవి మహాపతివ్రత. భర్తృమరణానికి విశేషంగా దుఃఖించుచు కన్నీరు కార్చుచు భర్త శవంపై బడి, నాథా! నిన్ను విడిచి నేనెట్లు జీవింతును? నీ ప్రతిబింబము లయిన పుత్రులను గూడ ప్రసాదింపకయే విగత జీవుడ వయితివా? నాగతి యేమి?యని యేడ్వసాగింది.

పతివ్రతయొక్క వేడికన్నీటి బిందువులు భూమిపై పడినంతనే భూమి గజగజ వణకసాగింది. ఆ మహాపతివ్రత యొక్క రోదన ధ్వనితో ప్రకృతియే క్షోభించిపోయినది. అశరీరవాణి యిట్లు పలికెను. "ఓ పతివ్రతాశిరోమణీ. శోకింపకుము. మరణించిన పతికొరకు విచారించిన ఫల ముండునా! నీవు పుత్రులను కాంక్షించుచుంటివి గదా. నీవు ఋతుమతివైన పదునాల్గవ దినమునగాని పదునాఱవ దినమున గాని శుచిభూతురాలవై సకలాలంకార సమన్వితురాలవై నీ భర్త శయనాగారములో భర్తను స్మరించుచు పుత్రార్థినివై ఏకాగ్రచిత్త

ముతో శయనింపుము. నీవు గర్భవతివి కాగలవు. పుత్రులు నీకు జన్మింప గలరు.''

ఆ పలుకుల నాలకించి సుందరీదేవి కొలదిగా ఊరడిల్లినది. ఆకాశవాణి పలికినరీతిగా ఋతుమతి యైనపిమ్మట పదునాల్గవదినమున శుచిభూతురాలై భర్తను ధ్యానించుచు పుత్రార్థినియై పర్యంకముపై శయనించినది. పరమాశ్చర్యము! వ్యాసదేవు డిట్లు పలుకుచున్నాడు. 'సుందరీదేవి గర్భవతి యైనది. నవమాసములు నిండగా సుఖప్రసవమున పుత్రులను గాంచినది. పురుషసంయోగము లేకయే స్త్రీ గర్భవతి యగునా? అని సందేహించువా రుండవచ్చును. కాని మానసికశక్తి అన్నిటికంటెను గొప్పది. ఆయుర్వేదశాస్త్రముగూడా పురుషసంయోగము లేకయే భావనాశక్తివలన గర్భోత్పత్తి గలుగు విషయములను తెలియజేసినది. మనశ్శక్తిచేతనే గదా సుమతి సూర్యగమనమును బంధించినది. అనసూయాదేవి ఇనుపగుగ్గిళ్ళను మెత్తబరచినది. ఇవి కట్టుకథలు గావు. విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టిని చేసినాడు. సముద్రము నంతను ఇంకింపచేసినాడు అగస్త్యుడు. మనోనిగ్రహము గలవాడు ప్రపంచమునే ఉజ్జ్వాత లూగించగలడు. అట్టి మానసికశక్తి ఎట్లు కలుగునని ప్రశ్నించుచున్నావా? భగవాను డీ అధ్యాయములో అట్టి సాధనములను గూర్చి విశదీకరించును.

'ఉద్ధరే దాత్మ నాత్మానం ఆత్మాన మవసాదయేత్'

ఓ మిత్రుడా! నీవు నీ శక్తివలననే, నీ స్వప్రయత్నముచేతనే, నీ మనోబలముచేతనే అభివృద్ధిని బొందవలెను. నిన్ను నీవే ఉద్ధరించుకొనుము. పరు లెవ్వరో నిన్ను ఉద్ధరించెదరని తలంపకుము. పురుషకారమే విజయసాధనము. ప్రయత్నశీలునకే భగవాను డనుకూలించును. హోరుగాలిలో దీపముపెట్టి, 'దేవుడా! నీ మాహాత్మ్యము' అని పలుకుచున్న మెట్టవేదాంతికి దైవ మెన్నడును అనుకూలింపడు. ప్రయత్నశీలుడే గమ్యస్థానమును చేరును.

నిన్ను నీవు నిందించుకొనకుము. అది పతన హేతువు. నీభావనా శక్తిని పెంపొందించుకొనుము. నేను పనికిమాలినవాడ నని, నేనేమి చేయగలను ? నన్ను చూచువా రెవరు ? అని తలంచుచు దిగజారి పోకుము.

'హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరం తప'

'ఓ అర్జునా! నీ హృదయ దౌర్బల్యమును విడిచిపెట్టి కర్తవ్య పథమున ప్రవేశింపుము! కర్మయోగివై లెమ్ము!' ఇది గీతాచార్యుని సందేశము.

ఓ మానవుడా! రక్తమాంస భూయిష్ఠమయిన శరీర మే నీవని తలంపకుము. ఇతరులు చేసిన ఘనకార్యములను నీవును తప్పక సాధించ గలవు. సందేహింపకుము. కర్తవ్యపథములో అపజయము లేదుసుమా! దృఢనిశ్చయత్వము విజయసింహాసనముపై నిన్ను కూర్చుండపెట్టును.

'అది ఒక టిట్టిభపక్షి. సముద్రతీరమున గ్రుడ్లను పెట్టుకొన్నది. సముద్రుడు తన తరంగహస్తాలతో ఆ గ్రుడ్లను తీసికొని తన గర్భములో దాచుకొన్నాడు. టిట్టిభము గ్రుడ్లను గాంచక శోకించినది. ఆశోకము సముద్రునిపై క్రోధముగా మారినది. తన గ్రుడ్లను అపహరించిన సముద్రునిపై పగసాధింప నిశ్చయించినది. ఆ చిన్న టిట్టిభము. 'ఈసముద్రుని ఇంకింపచేసెదను' అని పలికి ఆ చిన్నపక్షి ఒక దర్భను తన ముక్కునబట్టి సముద్రజలములలో దానిని ముంచి గట్టుపై ఆ జలకణమును విడుచుచున్నది. ఈరీతిగాచేసినచో సముద్రజలములు ఎన్ని యుగములకయినను ఎండిపోవునా అను నిరాశాపూరితమగు ఆలోచనయే ఆ పక్షి హృదయములో లేదు. మహాదీక్షతో నిశ్చిత కార్యమును కొనసాగించు టే దీక్షాకంకణుని కర్తవ్యముకదా!ఇట్లుండ ఒకదినమున నారదమహాముని అచ్చటకు వచ్చి టిట్టిభము చేయు ఆ వ్యర్థప్రయత్నమును చూచి నవ్వసాగెను. 'ఓపక్షీ! ఈ దర్భముల్లుతో సముద్రజలములను తోడుచున్నచో సాగర మెప్పటికైనను ఇంకిపో

గలదా?' అని మునిరాజు ప్రశ్నించెను. టిట్టిభము ఇట్లు పలికెను. 'ఓ మునిరాజా! తప్పక ఎండిపోగలదు. ఈజన్మలో కాకున్నను ఎన్ని వేల జన్మము లెత్తినైనను ఈ సాగరుని ఎండింప చేసెదను. విజయమును సాధించువరకును నా ప్రయత్నమును మానను.'

ఆ టిట్టిభముయొక్క దృఢసంకల్పమునకు నారదుడు మహాశ్చర్యమును బొందెను. ఆయన చాల విచారించి, గరుత్మంతుని వద్దకు పోయి, ఓ గరుడా! సాగరుడు టిట్టిభుని గ్రుడ్లను హరించినాడు. పాపమాపక్షి చింతిల్లుచు,ఆసాగరుని ఎండించుటకై ప్రతినబూని కార్యము సాధించుచున్నది. నీవుపోయి కొంచెము సహాయపడుము. అంత గరుడుడు జాత్యభిమానమును పాటించి రయముగా సాగరునివద్దకు పోయి తన గంభీరమగు రెక్కలవేగముతో సాగరమును క్షోభింపచేసినాడు. సాగరుడు భయకంపితుడై వచ్చి టిట్టిభము గ్రుడ్లను దానికి సమర్పించి గరుడుని క్షమాపణ కోరుకున్నాడు.

ఈ కథాసారాంశము గ్రహింపుము. అల్పజంతువగు టిట్టిభమెక్కడ? మహాసాగరమును క్షోభింపచేయుట ఎక్కడ ? ప్రయత్నశీలునకు ప్రకృతియే సహకరించును. భగవానుడే తోడ్పడును. విచారము, దుఃఖము, నిస్పృహా, దౌర్బల్యము, భయము, ఇవి తమోగుణ లక్షణములు.

'నీ మనస్సే నీకు శత్రువు, నీమనస్సే నీకు బంధువు' అని గీత పలుకును. నిగ్రహింపబడిన మనస్సు నీకు మిత్రుడు. నిగ్రహములేని చిత్తము నీకు శత్రువు. కావున చిత్తమును నిగ్రహింపుము. ప్రశాంతమగు చిత్తమే ఆత్మసాక్షాత్కారమునకు అర్హమై యుండును.

## 50. మితాహార విహారములు యోగసాధనములు.

**Modaration in diet and actions are yogic practies.**

'ఆహారము ఎటువంటిదైతే ఏమి ? ఏరీతిగా, ఎక్కడ తింటే ఏమి ?' దీనికిని అధ్యాత్మజీవితానికిని సంబంధము లేదు. ఆహారము

శరీరమునకు సంబంధించిన విషయం' అంటూ చాలమంది వేదాంతుల మనుకొనువారు చెప్పుచుండగా నేను విన్నాను. వారి అర్థవిహీనమైన మాటలు వినగా నాకు చాలా ఆశ్చర్యము, విచారమును కూడా కలిగినవి. ఈవిధముగా పలుకు యోగులు కాషాయాంబరాలు ధరించి తెల్లవారకమునుపే కాఫీహోటళ్ళలో మనకు కనబడతారు. గీతోపదేశాలు చేస్తూ ఒకచేతిలో సిగరెట్టుపీల్చే వేదాంతులు కొందరు. ఉపనిషత్తులు చెప్పుతూ మిలటరీహోటళ్ళలోను, రిఫ్రెష్‌మెంటు రూములలోను హాజరగుతూ టేబిలుమీల్సు తీసికొనేవారు మరికొందరు. ఆహారము శరీరానికే గాని ఆత్మకు కాదనుచు రోజుకు ముప్పదిమార్లు కాఫీలు, నలుబదిసార్లు కిళ్ళీలు, ఇరువదిసార్లు టిఫినులు, చుట్టలు, బీడీలు మరియు నిషేధపానీయాహారములు పుచ్చుకొను సాధువులు, సన్యాసులు, గురువులు, మంత్రోపదేశకులు మనకు కనబడుచున్నారు. 'ఆహార స్వీకారము' మహాయజ్ఞముగా గీత చెప్పును. భగవానుడు 17 వ అధ్యాయములో ఈ ఆహారవిషయాన్ని గురించి మరింత విస్తరింపచేసినాడు. ఇది అతిముఖ్యవిషయ మగుటచేతనే 18 వ అధ్యాయములోకూడా 'లఘ్వాశీ' అని సమీక్ష చేసినాడు.

ఆహారనియమము లేనివాడు యోగికాడు—వాడు కేవలం రోగి. వాడు వేదాంతికాడు, రోగాంతి, వాడు గురువుకాడు, బరువు. వాడు స్థితప్రజ్ఞుడుకాడు—అప్రాజ్ఞుడు, వాడు జ్ఞాని కాడు, పూర్తిగా అజ్ఞాని. ఆహారశుద్ధిద్వారా చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి ఆత్మసాక్షాత్కారమును కలిగిస్తుంది. నీవు దేనిని తింటే నీచిత్తము దాని వికారమును పొందుతుంది. రజోగుణ భూయిష్ఠమయిన ఆహారములను తినుచూ 'నేను యోగీశ్వరుడను. గంటలకొలది ధ్యానము చేస్తాను.' అని చెప్పెడివాడు బూటకపు సన్యాసి. నిషావస్తువులను తినేవానికి ఏకాగ్రచిత్తము ఎలా వస్తుంది!

రసపుష్టిగల మామిడి, నారింజ, బత్తాయి, అరటి మున్నగు ఫలములు, ఆవుపాలు మజ్జిగ, వెన్న, బీర, పొట్ల మున్నగు తాజా కూరగాయలు, పెసరకంది మున్నగు పప్పుదినుసులు, దంపుడు బియ్యము మున్నగునవి సాత్వికాహారములు. ఇట్టి ఆహారములే మానసిక శక్తిని పెంపొందింపచేయును. ఎక్కువ కారము, పులుపు, చేదు, ఉప్పు గల పదార్థాలు రజోగుణ హేతువులు. కాయగూరలలో గూడ తామసిక రాజసిక పదార్థా లున్నవి. వాటిని దొలగించి సాత్వికములనే భుజింప వలెను. ఆహార స్వీకారంలో రెండవ నియమము 'మితిము.'

సాత్వికములేగదా యని మితిమీరి భుజించుట రోగ హేతువు. 'అధికముగా భుజించువానికి యోగము సిద్ధింపదు' అని గీత చెప్పెను. పాలు సాత్వికములే గదా యని శేర్లకొలది త్రాగిన ఏమిచేయును ? బత్తాయిరసము మంచిది కదా అని శేర్లకొలది త్రాగుచుండిన ఏమి చేయును ? శరీరస్థితిని తారుమారు చేయును. 'ని గర్భాశయమును నాలుగుభాగములుగా చేసి రెండుభాగములుమాత్రమే ఆహారముతో నింపి ఒకభాగము జలములోనింపి శేషించినభాగము వాయుప్రసారమునకు ఖాళీగా నుంచు' మని శాస్త్రము చెప్పెను. అట్టివాడు నీరోగియై పరిపూర్ణారోగ్యము గలవాడై యోగసాధనకు అర్హుడగును.

నేనొక మిత్రుని యింటికిపోయితిని. అతడొక పట్టభద్రుడు. ఆఫీసులో ఉద్యోగి. చదువుకున్న భార్య. సుమారు ఎనిమిది గంటలకు లేచింది. 'ఆఫీసువేళ అగుచున్నది వెంటనే వంటకావలె' అంటున్నాడు భర్త. ఆమె తోడనే పొయ్యిఅంటించి బియ్యము నీళ్ళు గిన్నెలోపోసి పొయ్యిపై పెట్టినది. రెండవపోయిపై కూరపోపులు పోపుపెట్టినది. పిదప బ్రష్ చేతితో పట్టుకొని దంతధావనం చేస్తోంది.పిమ్మట ప్రక్కనే వున్న పాయిఖానాకు పోయివచ్చినది. ఇంతలో అన్నము పొంగు వస్తోంది. చరచరా ఆమె అన్నమువార్చి ఉడికినకూరలో పోపెట్టి భర్తను భోజనానికి పిల్చింది. ఆయన కోటు, బూటు, ఆఫీసు వేషంతో

వచ్చి ఇనుపకంచం (మెటలుకంచము)లో వడ్డించగా భార్యతో పాటు త్వరత్వరగా భుజించి ఆఫీసుకు పోతున్నారు. దంతధావన చేయకనే వంటచేయడం పాయిఖానా గుడ్డలతోనే భోజనం చెయ్యడం ఎంత దౌర్భాగ్యము? ఈవిధంగా నూటికి తొంబది యిండ్లలో జరిగే కృత్యము. శుచిఅంటే వీరిదృష్టిలో చలువచేసిన బట్టలు, ఫేసుపౌడరు ముఖము మాత్రమే! ఎంత దౌర్భాగ్యము!

ఇట్టి వారిని మానవులుగా పరిగణించదు శాస్త్రము.

ఇల్లాలు సుస్నాతయై ఉతికి ఆరవేసిన బట్టధరించి పరిశుద్ధమైన మనస్సుతో వంటచేయవలె. గోమయముతో చక్కగా అలికి ముగ్గులు పెట్టిన పరిశుద్ధ స్థలంలో అరటిఆకు వేసి సంతోషంతో పదార్థములను వడ్డించవలె. పురుషుడు స్నానంచేసి ఆరవేసిన శుభ్రవస్త్రాన్ని ధరించి-పరమేశ్వర ధ్యానంచేస్తూ భుజించవలెను. వంటచేసిన పదార్థము దేవునికి నివేదన చేయవలెను. భగవంతుని ప్రసాద సమర్పణ భావంతో ఆహారాన్ని తినవలెను. ఆవిధముగా తినునట్టి భోజనమే శరీరమునకు మనస్సునకు పుష్టిని, ఆరోగ్యమును, శౌచమును, ఆధ్యాత్మికశక్తిని కలిగించును. ఇట్టి ఆహారమువల్ల మానవుడు మాధవుడౌతాడు. ఎట్టి సందేహము లేదు.

మనకు ఎట్లు దంతధావనచేయవలెనో తెలియదు. మలమూత్ర విసర్జనములో గల విషయములు తెలియవు-స్నానము చేయుపద్ధతియే యెరుగము - 'ఇక భోజన విషయమంతకు ముందే తెలియదు. ఇవి అన్నియును స్వల్ప విషయములు. చాదస్తముగా చెప్పుచున్నాడు' అని మీరు భావించవచ్చును. కాని చాదస్తములు కావివి. స్వల్పవిషయములలోనే మహత్తర శక్తి యున్నది. చన్నీటిలో తెల్లవారుజామున స్నానముచేయలేని సోమరి ఇంద్రియములను నిగ్రహించి ధ్యాననిష్ఠుడు కాగలడా? కాఫీని త్రాగక ఒకగంటకాలము నిలువలేనివాడు భయంకరమగు కామమును, క్రోధమును నిగ్రహింప నేర్చునా? మడి

బట్టకట్టుకొని భోజనము చేయుటే చాలకష్టమని తలంచువాడు అరిష డ్వర్గములను జయించగలడా? వ్యక్తి యొక్క మానసిక స్థితికి వాని క్రియాకలాపములే చిహ్నములు, చిన్న చిన్న నియమములను పాటించుటలోనే ఎంతయో మానసిక శిక్షణ కలుగును. 'చిన్న చిన్న సాధారణ నియమములతో పనియేమి? మనకు కావలసినది ఆత్మ సాక్షాత్కారము అను పెద్ద పెద్ద కబుర్లు చెప్పకుము. 'ఉట్టికి ఎగరలేనమ్మ స్వర్గానికి ఎగురుటవంటి దగును.' ఇట్టి నియమములు ఎన్నియో యున్నవి' ఎన్నని చెప్పగలము. దీనినే సదాచార సంపత్తి అని పిలుతురు. 'మూత్రవిసర్జన' నియమమును కొలదిగా తప్పిన కారణముచేతనే కదా నలునిలో కలిపురుషుడు ప్రవేశించి ఎన్నోవిధములుగా బాధించె నని భారతము చెప్పుచున్నది. మనకు నియమములే లేవు. ఇక కలిపురుషుడు మనలను సర్వనాశనము చేయుచున్నాడనుటలో ఆశ్చర్యమేమున్నది.

సదాచార సంపత్తిని గూర్చి ఎంతగా వ్రాసినా, చెప్పినా తరుగదు. 'కావున మహాత్ములను ఆశ్రయించి వారినుండి జ్ఞానవిషయములను అనుభవ పూర్వకముగా గ్రహింపుము. మహాపురుషుల జీవితములే మహాగ్రంథములు' అని గీతలో భగవానుడు పలుకను.

'అతిసర్వత్ర వర్జయేత్'

---

# 51. బ్రహ్మచర్య దీక్ష గలవానికి అసాధ్యములేదు.

## There is impossibility for a man celibacy.

పరమాత్మ సాక్షాత్కారమునకు బ్రహ్మచర్య దీక్ష అవసరమని గీత పలుకును. ఈ అధ్యాయమునందేగాక ఎనిమిదవ అధ్యాయమునందును బ్రహ్మచర్య ప్రశంస చేయబడినది. ఒక్క ధ్యానయోగికి మాత్రమే కాదు. భక్తి - జ్ఞాన కర్మయోగులకును బ్రహ్మచర్యమవసరము. అసలు గీతలో భక్తి జ్ఞానము - కర్మ - ధ్యానము ఇవి

భిన్న భిన్నములని చెప్పబడనేలేదు. వీని కన్నిటికిని కావలసిన నియమము లొక్కటియే! పెండ్లికాని వారందరును బ్రహ్మచారులు కారు. ధనవిద్యాలోపముల చేతనో – సౌందర్య గుణశీల లోపాదుల వల్లనో వివాహములు కాని స్త్రీ పురుషు లందరును బ్రహ్మచర్య దీక్షితులని చెప్పరాదు. శారీరకముగా – మానసికముగా – వాచికముగా స్త్రీని పూర్తిగా త్యజించినవాడే బ్రహ్మచారి. బ్రహ్మచారికి తన తోబుట్టువులతో గూడా రహస్య ఏకాంత సంభాషణము తగదని, పురుషుడు స్త్రీ సాన్నిధ్యమున పతనమును పొందునని, శాస్త్రము చెప్పును.

మానసికంగా స్త్రీ చింతనము మానసిక వ్యభిచారము కాక మరియేమి? నోటితో స్త్రీసౌందర్యాన్ని వర్ణించరాదు. వినోద నృత్యగానాదులు వినరాదు. చూడరాదు. కాని ఈనాడు బ్రహ్మచారులమని చెప్పుకొనే గురువులు సినిమాహాలులలోను నృత్యమందిరాలలోను కళారాధకుల మనే పేరుతో కానవత్తురు 'అంగార సదృశీ నారీ ఘృతకుంభ సమః పుమాన్' స్త్రీ అగ్నిహోత్రము వంటిది. పురుషుడు నేతిపాత్ర వంటివాడు. నిప్పుసెగ సోకిన మాత్రము చేతనే నేయి కరిగి పోవునట్లు స్త్రీ స్పర్శమాత్రమున పురుషుడు కరగిపోవు నని శాస్త్రము చెప్పును.

ప్రజ్ఞాశ్రీశ్చ మహద్యశః 'ఆయుస్తేజో బలం వీర్యం
లభ్యతే బ్రహ్మచర్యేణ' పుణ్యాం చ మత్ప్రియం చ.

బ్రహ్మచర్యం వల్ల దీర్ఘాయువు కలుగును. మానసిక శారీరక శక్తులు పెంపొందును. వీర్యము ఊర్ధ్వగతిని చెంది మహాప్రజ్ఞను గలిగించును. సర్వశ్రేయస్సులకు బ్రహ్మచర్యము హేతువు, కీర్తిని, మహాపుణ్యమును, భగవత్ప్రాప్తిని కలిగించును. బ్రహ్మచర్య దీక్షితుడైన హనుమంతుడు శతయోజన విస్తీర్ణమైన మహాసాగరాన్ని లంఘించినాడు. వివేకానందుడు, రామకృష్ణ పరమహంస మున్నగు మహానుభావులు బ్రహ్మచర్య దీక్షచేతనే గదా విశ్వజ్ఞానమూర్తులైనారు.

నేటి సినిమాలు శృంగారభావగీతాలు. యువతుల అంగసౌష్ఠవంతో కూడిన నృత్యప్రదర్శనాలు సంఘమును నిర్వీర్యము చేయుచున్నవి. పట్టుమని పదపద్యాలు ధారాళంగా కంఠస్థము చేయలేడు విద్యార్థి. పదిమందికి దీక్షతో వంటచేసి పెట్టలేదు గృహిణి. రెండు మైళ్ళు వేగముగా నడువలేడు యువకుడు, లోతుకుపోయిన కండ్లు, ముడతలుబారిన ముఖము, దించుకొనిపోయిన దవుడలు, దీనికి ముఖ్య కారణము సంఘములో ప్రబలియున్న వ్యభిచార ప్రోత్సాహకర వాతావరణమే? కళారాధన మనే దొంగపేరుతో ప్రభుత్వము-పెద్దల మనుకొనువారు ఈవ్యభిచార వాతావరణము ప్రోత్సహించుట విచారకరము గృహస్థ బ్రహ్మచర్యాన్ని గురించి కొలదిగా వివరిస్తా! జీవితంలో ఒక్క-పర్యాయమైనను స్త్రీసాంగత్యము చేయనివాడు నైష్ఠిక బ్రహ్మచారి; అతడు ఆదర్శజ్యోతి - నిరంతర పూజనీయుడు. భగవత్స్వరూపుడే ఆతడు.

స్త్రీని వివాహమాడుట కేవలము భోగముకొరకు గాదు. జీవితపథంలో ఆమె నీకు సహచారిణి. భాగ్యవస్తువు. నీవామెను చూడకుము. ఋతుమతియైన భార్యతో సత్సంతానార్థమై శాస్త్రము నిర్ణయించిన 8, 12, 14 దినములయందు మాత్రమే కూటమి బొందుము. స్త్రీపురుష సాంగత్యమును గూర్చి గాంధీజీ యిట్లు పలికెను. జీవితములో ఒక్క పర్యాయముమాత్రమే భార్యతో కలియుము. నిగ్రహశక్తి లేకున్నచో సంవత్సరమున కొకసారి మాత్రము-అట్లు కాకున్న నెలకొకసారి, అంతకుమించి భార్య సాంగత్యమును బొందువాడు వ్యభిచారి. 'ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ' ధర్మవిరుద్ధము గాని కామము నావిభూతి అని గీతలో భగవానుని వాక్యము. ఇది గృహస్థ బ్రహ్మచర్యమని పెద్దలు చెప్పుదురు. ఇట్టివాడే గృహస్థాశ్రమములో బ్రహ్మసాక్షాత్కారమును బొందగలడు.

విప్రనారాయణుడు దేవదేవిని మోహించెను. ఆతనిలో మొదట కామవికారములు లేవు. క్రమక్రమముగా నానాటికి అతడెట్లు పతనము చెందెనో ఈక్రింది పద్యములో కవి తెలుపుచున్నాడు.

ఆ విప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బా లలనా నిగూఢ గుణసంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణ వృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరగిపోయెన్ నిశ్చయం బల్పమై.

బ్రహ్మచర్య దీక్షితుడైన విప్రనారాయణుని శీలమను వజ్రపంజరము క్రమముగా ఇనుప పంజరమై - పిదప రాయిగామారి - అనంతరము కొయ్యరూపమునంది, అటుపిమ్మట లేతకొమ్మనలనై, ఫలప్రాయమై, అందలిమకరంద రూపమై - నీరుగా మారిపోయినదని మానసికశక్తి క్రమముగా జారిపోయిన స్థితిని వర్ణించినాడు. కావుననే -

'కాయేన మనసా వాచా స్త్రీణాంతు పరివర్జనం.



## 52. ధ్యానమునకు ఒక ప్రణాళిక.

### A method for devotion.

ఈ అధ్యాయములో భగవానుడు ధ్యాన సాధనకు కొన్ని విధానాలతో కూడిన ఒక ప్రణాళికను తెలియచేసినాడు. ఇది బాహ్యక్రియలకంటె అతి ప్రధానమైనది. ధ్యానపరుడు కావలయు నను ఆకాంక్ష, దృఢనిశ్చయము, బుద్ధి, యున్నవాడు బాహ్యసన్నాహములు ఆంతరంగిక శక్తికి ఎంతయో ఉపయోగకరము లగును.

నామిత్రుడొకడు కలడు. అతడుదయము అయిదుగంటలు లగాయతు తొమ్మిది గంటలవరకు పూజయు ధ్యానమును చేయును. వంట యింటిప్రక్కనే ఆయన పూజగది. భార్యపోపు వేయుచుండును.

ఇదిగో చూడు పోపు మాడిపోతోంది. అని కేక వేయును. మరల పూజయు ధ్యానమును, ఇదిగో పులుసులో బెల్లంగడ్డ జాస్తీగా వెయ్యి అని పలుకును. మరల పూజ. 'అదిగో పాలేరునకు నిన్న రూపాయలు యిచ్చాను సంతఖర్చుపోగా మిగిలిన చిల్లరఇవ్వలేదు. అడిగి తీసుకో!' అని కేక వేయును. మరల ధ్యానముగాని పూజగాని. ఏమి ప్రయోజనము?

రహస్యస్థలములో ధ్యానము చేయుము. ఒంటరిగా నుండుము. పదిమందితో కలసి ధ్యానముచేయుట పనికిరాదు. 'అరతిర్జన సంసది' జన సమూహామునుండి దూరముగా నుండుము అని గీత పలుకును. ఏకాంతివాసము వలనను నిర్జనప్రదేశములలో తరచు విహరించుట వలనను ఎంతయో మానసిక శాంతియు, శక్తియు, ప్రసన్నతయు చేకూరును.

ధ్యానమునకు గోమయముతో అలికి ముగ్గులు పెట్టబడిన స్థలమును నిర్ణయించుకొమ్ము. అచ్చట ఒక పీటవేసి కొనుము. ఆపీటపై దర్భాసనము పరువుము. దానిపై కృష్ణాజినమును వేయుము. అటు మెత్తని వస్త్రమును దానిపై పరువుము. దానిపై నీవు పద్మాసనముపై కూర్చుండుము. శిరస్సు మెడ వెన్నెముక నిదానముగా ఒక లంబరేఖలో నుండునట్లు కూర్చుండుము. భ్రూమధ్యస్థానమునందు దృష్టిని నిలుపుము. అన్యచింతలు రానీయక నాయందే మనస్సును ఏకాగ్రము చేయుము. ఇది ధ్యానమునకు ఒక పద్ధతి. చంచల మగు మనస్సును క్రమక్రమముగా అభ్యాసమార్గమున వశపరచుకొమ్ము. లేదా వైరాగ్యమార్గముచేతనైనను దానిని స్వాధీనముచేసికొమ్ము. ఈసాధనకు పైనచెప్పిన ఆహార విహారములు బ్రహ్మచర్యము ఉపాంగములు. దర్భాసనము కృష్ణాజినము మానవునిలోని ఆధ్యాత్మిక శక్తులను పెంపొందించును.

వివేకానందుడు పాశ్చాత్యదేశములలోని తన శిష్యులకు దర్భాసనములను జింకచర్మములను హిందూదేశమునుండి పంపినాడు. శుభాశుభకర్మములయందు మనము వాడుటలో గల విశేష మిదియే. చంచలమగు మనస్సును స్వాధీనము చేసికొనుటకు ఇదియొక సాధనాక్రమము. అన్నిటికంటెను ముఖ్యమయినది భగవానుని యెడల శరణాగతి.

'లక్ష్మీపతే, కమలనాభ సురేశ విష్ణో
యజ్ఞేశ యజ్ఞ మధుసూదన విశ్వరూప
బ్రహ్మణ్య కేశవ జనార్దన వాసుదేవ
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం.'

---

## 53. మంచిపని చేయువానికి నాశనము లేదు

### There is no loss for the Good.

ప్రపంచములో అనేక ఆశ్చర్యములను మనము చూచుచుందుము. ఒకానొకడు చిన్నితనమునందే అద్భుతమగు మహాప్రజ్ఞలను ప్రదర్శించును. జ్ఞానదేవుడు 12 వ సంవత్సరముననే వేదవిజ్ఞాన మంతయు గ్రహించెను. 15 వ సంవత్సరములో గీతా భాష్యము వ్రాసెను. శంకరుడు 2 వ యేటనే అన్ని భాషలలోని యక్షరములను గ్రహించెను. నామిత్రు డొకడు కలడు. అతని వయస్సు 12 సంవత్సరములు. అతడు అత్యద్భుతముగా సంగీతమును పాడును. ఎన్నియో సంవత్సరములు కృషిచేసినను మహాపండితులు కూడా గ్రహింపలేని సంగీత శాస్త్రవిశేషము లెన్నియో ఆతడు గ్రహించెను. ఒకానొకడు చిన్నతనమునందే మహాకావ్యములను వ్రాయును. దీనికి కారణముల నూహించుము. అది వారి పూర్వపుణ్య సుకృత విశేష మని మనముందుము. అది యథార్థమే. ఒక జన్మమునందు ఏదేని మహాకృషి చేసి

సిద్ధిని పొందకపూర్వమే మరణించినవారు తరువాత జన్మలో ఆ విద్య కొరకు మరల కృషితో నిమిత్తములేక స్వల్పారంభముననే పొంది శేషించిన దానిని పూర్తిచేయుదురు. గత జన్మలోని సంస్కారము లెవ్వియును వ్యర్థములు గావు.

యోగభ్రష్టుని గూర్చి పార్థుడు ప్రశ్నవేయును. మాధవా! యోగానుష్ఠానమును ప్రారంభించి కొంతకాలము చేయుచు కారణాంతరములచే ఆపథమును విడిచిన వాడుగాని సిద్ధిని పొందక పూర్వము మరణించినగాని అట్టివాని స్థితియేమగును? ఇహపరములకు రెండిటికిని వాడు చెడునా? భగవాను డిట్లు పలుకును. నాయనా! కల్యాణకార్యము లాచరించువా డెన్నడును చెడిపోడు. స్వల్ప మాచరించినను అది మహాఫలమునే ప్రసాదించును. అట్టివాడు పుణ్యలోకములో చాలకాలము నివసించి పిమ్మట సదాచార సంపన్నులగు శ్రీమంతుల యిండ్లలో జన్మించును. లేక యోగీశ్వరుల కులమునందైనను జన్మించును. ఆతడు తన పూర్వజన్మ సంస్కారముచేత సత్కార్యాచరణశీలుడై - అనుష్ఠానపరుడై శేషించిన కార్యమును పూర్తిగావించును.

అరణ్యములకుపోయి తపస్సు చేయువానికంటెను సాంఖ్యమును గ్రహించిన జ్ఞానికన్నను - సకాముడై పుణ్యకార్యము లాచరించువాని కన్నను-నిష్కామ కర్మయోగి మిక్కిలి గొప్పవాడు - మరియు భక్తియుక్తు డగు కర్మయోగి ఎవరో వాడు నాకు ప్రియు డని భగవానుడు తెలుపుచు అధ్యాయమును ముగించుచున్నాడు. దీనితో మొదటి షట్కము పూర్తి అయినది.

•••—•••

# గీతా కల్పవృక్షము

ఏడవ అధ్యాయము - విజ్ఞాన యోగము.

## 54. మహాభక్తి తరంగిణి
## The ocean of supreme devotion.

కుటిలాలక సంయుక్తాం, పూర్ణచంద్ర నిభాననం
విలసత్కుండలధరం, కృష్ణం వందే జగద్గురుం॥

మీపవిత్ర హృదయాంతరాళములందు కోటి సూర్య దివ్య కాంతులతో ప్రకాశించు గీతా సార్వభౌమునకు నమోవాక సహస్రములు సమర్పిస్తూ ఈ సప్తమాధ్యాయమును ప్రారంభింతును. ఈ అధ్యాయముతో భక్తిషట్కము ప్రారంభమగుచున్నది. భక్తి మధురాతి మధురమైనది. అది సాధనము మరియు సాధ్యమును. లక్షణము-లక్ష్యమును గూడ నగునని పెద్దలు చెప్పుదురు. భగవానుని దివ్యశక్తి తెలిసికొనుటకు కరుణారసమూర్తి యగు భగవానుని దర్శించుటకు - ఆ రససాగరునిలో లీనమగుటకు భక్తియే సాధనమని గీత చెప్పును. జగద్గురువును ఆశ్రయించిన వారికి జ్ఞానమునకు కొరతయా! గురుకటాక్షమే సర్వస్వమును వర్షింపచేయును. ఒక ఉదాహరణము. శృంగేరిలో శంకరుడు తన శిష్యులకు ప్రతిదినమును ప్రస్థానత్రయమును గూర్చి చెప్పుచుండెడివాడు. ఆయన శిష్యులలో 'గిరి' అను శిష్యుడు మందబుద్ధి. అతనినిచూచి శిష్యులు పరిహాసము చేయుచుండువారు. కాని అతనికిగల గురుభక్తి అతీతము. మనోవాక్కాయములచేత గురుసేవ చేయుచుండును. ప్రతిదినమును గురువుగారి కావిబట్టలు తుంగభద్రానదిలో ఉతికి, ఆరవేసి, మహాభక్తితో సకాలములో సద్భక్తితో గురువులకు సమర్పించును. ఒకనాడు 'గిరి' తుంగభద్రకు

పోయెను. శిష్యులు శంకరుని ప్రస్థానత్రయ పాఠమును చెప్పుమని కోరిరి. 'గిరి' వచ్చువరకు ఆగు డని గురువుగారు పలికిరి. 'గిరి' మందబుద్ధికదా, ఆతనికి ప్రస్థానత్రయము గ్రహించుశక్తి లేదుగదా. అతని కొరకు ఆగుటయేల? గురువుగారికి శుశ్రూష చేయుచున్న కారణముచే ఆయనకు 'గిరి' పై అభిమానము అని శిష్యులు గుసగుస లాడసాగిరి. శంకరు డిది గ్రహించి తుంగభద్రలో బట్టల నుతుకు 'గిరి'కి చతుష్షష్టి కళలును కలుగు గాక' అని ఆశీర్వదించెను. తుంగభద్రలో బట్టల నుతుకు శిష్యుని నోటిగుండా మధురమహాకవితాశక్తి విజృంభించినది. చుట్టునున్న బ్రాహ్మణులు పండితులు నివ్వెరపోయిరి. 'గిరి' మధుర సంస్కృత భాషలో గురుస్తవము చేయుచు కావిబట్టలు భుజముపై వైచికొని ఆశ్రమమునకు వచ్చెను. శిష్యు లందరును పరమాశ్చర్యమును బొందిరి.

'అదియంతయును గురువుగారి ఆశీస్సు' అని శిష్యు లంత ఆయనకు మ్రొక్కిరి. ఆ 'గిరి' యే తోటకాచార్యుడై నాడు. గురుకటాక్షమపూర్వమైనది. భగవానుడు వాంఛించినచో మూగవానిచే వేదములు పలికించును. కుంటివానిచే మహాసాగరములను లంఘింపచేయును. ఫకీరును నవరత్నఖచిత మహాసింహాసనాసీనుని చేయును. భక్తియే మానవుని దేవునిగా చేయునది. ఏడవ అధ్యాయమునుండి 12 వ అధ్యాయమువరకును భగవానుడు భక్తియొక్క అనంత మహిమా విశేషములను గానము చేయును. తనభక్తులకు వివిధరూపములతో సాక్షాత్కరించును. అన్నిటికిని మూలము భగవద్విజ్ఞానము. దానిని గ్రహించిన వారికి మరియొక నూతన విషయముకొరకు ప్రయత్న మవసర మేలేదు. పంచదార తత్త్వము తెలిసిన వారికి పంచదారతో చేయబడిన చిలుకలు – ఎలుకలు – హంసలు – బొమ్మలు మున్నగు వానినిగూర్చి విడివిడిగా గ్రహింపవలయునా? మట్టియొక్క తత్త్వమును గ్రహించిన వారికి మట్టిలో తయారయిన బానలు, మూకుళ్ళు, కుండలు, ప్రమి

దలు మున్నగు వానిని గూర్చి వేరువేరుగా నేర్చుకొనవలయునా? అట్లే అన్నిటికిని ఆధారమైన భగవానుని తత్త్వమును గ్రహించినవానికి భగవంతునిచే నిండియున్న వివిధ నామరూప విశేషములతో గూడిన ప్రపంచ విధానములను గూర్చి విడివిడిగా గ్రహింపనక్కర లేదు.

'ఏది తెలిసికొన్నచో మరి తెలియదగిన దేదియును లేదో దానిని తెలిసికొంటివా! దేనిని వినిన మరల వినదగినదియును లేనో దాని నాలకించితివా? దేనిని సందర్శించిన మరి దేనినికూడ సందర్శింప నవసరము లేదో దానిని సందర్శించితివా ? ఏమూలమును గ్రహించిన సర్వమును గ్రహింపగలనో ఆమూలమును గ్రహించితివా?' అని వేద ఋషి ఉపనిషత్తులలో ప్రశ్నించుచున్నాడు. ఆ మూలతత్త్వమే భగవ త్తత్త్వము. ఓ మానవుడా! నీవు వినదగినది, చూడదగినది, ఆ మహా తత్త్వమే. ఆ 'తత్త్వము'లో పదార్థ పరిశోధనమే ఈషట్కములో గీత గానము చేయుచున్నది.

గీత త్రివేణీసంగమము వంటిది. కర్మ, భక్తి, జ్ఞానము లను, మూడు తరంగిణులతో గీత త్రివేణీ సంగమ మగుచున్నది. ఆ మహా సంగమస్థానములో జలకములాడి మనము పవిత్రుల మగుదుముగాత! మనమే పాపవిమోచనము పొందుదుము గాత!

మాలవ్యా పండితు డిట్లు పలుకును.

**I believe that in all living languages of the world, there is no book so full of true knowledge and yet so handy as the Bhagavadgeeta.**

'సంపూర్ణజ్ఞానస్వరూపమై విలసిల్లు భగవద్గీతవంటి కావ్యరాజము ప్రపంచ జీవనభాషా సమూహముల యందు మరియొకటి లేనే లేదని నా విశ్వాసము.'

'సంపూర్ణ భగవతత్త్వము కొరకు అన్వేషణము చేయువాడు కోట్లకొలది మానవులలో నొకానొకడు మాత్రమే యుండును. అట్టి సాధకులలో లక్ష్యసిద్ధిని బొందువాడు ఒకానొకడు మాత్రమే సుమా' అని గీతపలుకను. అందులకు కారణము లేమో విచారింతము గాక!

## 55. సృష్టి వేనితో చేయబడినది ?

### By which creation is made ?

శ్రీధరుడు మహాభక్తుడు. భాగవతమునకు వ్యాఖ్యను రచించిన పుణ్యమూర్తి. ఆయన భార్య ఒక చంటిబిడ్డను ప్రసవించి భూలోకయాత్రను ముగించినది. తల్లిలేని ఆబిడ్డను పెంచేభారము తనదే అని శ్రీధరుడు అపార పుత్రవాత్సల్యంతో పెంచుతున్నాడు. భగవద్ధ్యానము, చింతనము, ఆరాధనము మున్నగు ఆధ్యాత్మిక సాధనలకు ఈ చంటిబిడ్డపై గల వ్యామోహము అడ్డుగా నిలబడినది. ఒకనాడు శ్రీధరుడు భాగవతంలో ఏదోయొక ఘట్టమును చదువుకొనుచుండెను. ఇంతలో గోడపైనుండి ఒకానొక గర్భవతి యగు బల్లి నేలపై బడినది. పడుటయే తడవుగా గర్భస్రావమయినది. ఒక చిన్న బల్లిపిల్ల పైకివచ్చినది. తల్లి చనిపోయినది. ఆ బల్లిపిల్ల ప్రక్కనే కొన్ని పురుగులటునిటు దిరుగుచున్నవి. అప్పుడేపుట్టిన ఆ బల్లిపిల్ల నాలుకను సాచి పురుగులనుపట్టి మ్రింగుచున్నది. శ్రీధరు డాదృశ్యమును గాంచి పరమాశ్చర్యమును బొందినాడు. 'నే నెంత మూర్ఖుడను! ఎంత అవివేకిని! నా చంటిబిడ్డను నేనుతప్ప మరెవ్వరు పోషించువారు లేరనియు, నేను లేనిచో దాని గతి యేమగునో? అనియు బెంగపెట్టుకొని ఆత్మసాక్షాత్కారసాధనము లన్నియు విడనాడి, ఆపసికందుపోషణలో నిమగ్నుడనైతినిగదా? నేనెంత వెఱ్ఱివాడను. మాతృవియోగమును బొందిన బల్లికూన కెవడు ఆహారమును నోటబెట్టుచున్నాడు? అని చింతించుచు,

సంసారత్యాగమును చేసి మరల ఈశ్వరారాధనాతత్పరుడైనాడు. అహంకారమును వదలి భగవంతుని ఆశ్రయింపుము. భగవంతుని తత్వమును నీవు అహంకారముతో తెలిసికొనలేవు. నీ ప్రయత్నము విఫలము. చంద్రలోకమును గురించి తెలిసికొన్నచో సూర్యలోకము మరియొకటి యున్నది. అదియును తెలిసికొన్నచో అంగారకలోకము మరియొకటి యున్నది. ఇట్టి లోకములు అనంతములు. అసంఖ్యాకములు. నీతరముగాదు వీనినిగూర్చి వేరు వేరుగాగ్రహించుట. 'మాంతు వేద న కశ్చన' యనుగూర్చి యెవరును గ్రహించలేరు,అని గీతలో భగవంతుడు చెప్పెను. భగవానుడే తన అఖండస్వరూపమును గూర్చి యిట్లు పలుకును.

'ఓ అర్జునా! నాస్వరూపము రెండు విధములు. ఒకటి అపరా ప్రకృతి (జడప్రకృతి) రెండవది పరాప్రకృతి (చైతన్యప్రకృతి).అపరా ప్రకృతి ఎనిమిది వస్తువులతో కూడియున్నదిసుమా. 1. భూమి 2. నీరు 3 అగ్ని 4. వాయువు 5. ఆకాశము 6. మనస్సు 7. బుద్ధి 8. అహంకారము. ఇది నికృష్టమైన, జడమైన ప్రకృతి. దీనికంటె భిన్నమైనది అపరాప్రకృతి. ఇది జీవభూతమై సకలమును ధరించుచున్నది. ఈ రెంటి సంయోగమే చరాచరాత్మక మగు సకల ప్రపంచమునునై యున్నది. ఇది నా సృష్టిరహస్యము.'

ఈవిషయమే భగవానుడు పదమూడవ అధ్యాయమునందును తెలియచేసెను. అయితే అచ్చట ఇరువదినాలుగుతత్వములుగా తెలిపినాడు. అచ్చట ఈ అధ్యాయములో చెప్పబడిన 8 వస్తువులనే విపులీకరించి వాని అంతర్భాతములతో కలిపి తెలిపినాడు. అంతియేకాని రెండింటికిని భిన్నత్వము లేదు. ఒకచోట సూక్ష్మముగా చెప్పిన భావమును విపులీకరించి మరల చెప్పుట గీతయొక్క సంప్రదాయము.

పెద్దపులిని చూచినంతనే భయముకలుగును. ఆవును చూచినంతనే నిర్భయత్వముకలుగును.కోకిలగానము వినినంతనే ఆనందింతుము.

గాడిద స్వరముతో చెవులను మూసికొందుము. కాని ఈ అష్టవిధ ప్రకృతిని మించినది లేదని గీత చెప్పును. దీనికి దొన్ని ఉదాహరణము లను మనవి చేసెదను. భాషలో 52అక్షరములు మాత్రమే యున్నను వానిలో లక్షలకొలది వివిధరస భూయిష్ఠములగు పద్యములు తయా రగు చున్నవి. స్వరములు ఏడుమాత్రమైనను సంగీత శాస్త్రములో లక్షలకొలది రాగము లుదయించినవి. ఏడురంగులలోనే చిత్రకారుడు రకరకములగు బొమ్మలను చిత్రించును. గాయకుడు వీణను మీటుచు తన వ్రేళ్ళకొనల సవరింపులో శ్రోతలను నవ్వించును, మరొకమారు ఏడ్పించును. నగారాను మ్రోగించుచు రకరకములగు నాదములను పలికించును. అదియే రీతిని అష్టవిధ ప్రకృతిని ఆధారముగా చేసికొని భగవానుడు చరాచరాత్మకమగు అనంత విశ్వమును సృష్టించినాడు. సృష్టికర్తను గ్రహించినవాడే సృష్టిరహస్యము నీకు బోధపడును. అహంకారమును త్యజించి ఆ పరాత్పరుని దివ్య పాదాబ్జములపై వ్రాలుము. ఆ దయామయుడు తన విజ్ఞాన భాండమును నీకు జూపును. నీమోహము నశించును. భక్తిరసపూరితుడవు కమ్ము. కులశేఖరు లిట్లు గానము చేయును.

'చింతయామి హరిమేవ సంతతం, మంద మంద హసితానన నాంబుజం,
నందగోప తనయం పరాత్పరం, నారదాది మునిబృందం వందితం.'

నిరంతరమును చిరునవ్వు ముఖములో విలసిల్లు నందగోపకుమా రుడైన ఆ పరాత్పరుని, నారదాది మహామునులచే సేవింపబడు ఆ పుణ్యస్వరూపుని–సకలపాపహరుడైన ఆ కృష్ణదేవుని నేను నిరంతర మును స్మరింతును గాక!

'హరిమయము విశ్వమంతయు,
హరి విశ్వంబన్న సంశయము పనిలేదా
హరి మయము గాని వస్తువు
పరమాణువు లేదు వంశపావన వినవే.'

## 56. జలములో, కాంతిలో, శబ్దములో, వీర్యములో, భగవానుని దర్శనము.

### God's vision in water, light. sonund and energy.

భగవంతు డెక్కడ నున్నాడో చూపు మని రాక్షస ప్రభువైన హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని ప్రశ్నించెను. ప్రహ్లాదు డిట్లు పలుకను. 'తండ్రీ! భగవంతుడు గాలిలో, భూమిలో, అగ్నిలో, దిశలలో, ఆకాశములో, సాగరములో, ఓంకారములో, గ్రహములలో, తారకలలో, చంద్రునిలో, సూర్యునిలో, అన్ని తావులలోను గలడు' అని బదులు చెప్పెను. 'ఇందు కలడు అందు లేడు అనుసందేహమువలదు. చక్రి సర్వోపగతుండు, ఎందెందు వెదకి చూచినను అందందే ఆతడు సాక్షాత్కరించును.' ఈ రీతిగా భాగవతము చెప్పెను. భగవానుడు గీతయందును ఈవిషయమును సువ్యక్తము చేసినాడు.

'మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ' ఓ అర్జునా! నాకంటె భిన్నమయిన దేదియు ఈవిశ్వములో లేదు. పూలమాలలో దారమువలె, భగవానుడు సర్వత్రా నిండియున్నాడు. మిక్కిలి దగ్గరగా నున్నను అజ్ఞానికి ఆతడు కానరాడు. కప్ప నీటిలో నున్నను పుష్ప మకరందమును గ్రహింపలేదు. మధుకరమే ఆ మకరందము నాస్వాదించును. జోరీగ గోవు పొదుగు నాశ్రయించి దాని రక్తమునే చవిచూచును. కాని మధురములగు క్షీరములను గ్రోలలేదు. నిత్య దైనందిన వివిధ పదార్థములలో దేవుని చూడలేని నిర్భాగ్యులమే మనము,

నిత్యావసరములలో ముఖ్యమైనది జలము. మనకు త్రాగుటకు, వంటకు, కాఫీకి, స్నానమునకు, పొలములకు, పంటలకు, సర్వమునకు ఆధారము నీరు కదా. దినమునకు అనేకపర్యాయములు అనేకవిధములుగా దానిని వాడుదుము. అందులో రహస్యరూపముగా నే నున్నా

నని గీతాచార్యుడు పలుకును. ఏమి మనోహర భావతరంగము! ప్రాతః కాలముననే ముఖప్రక్షాళమునకు భగవంతుని రూపమునే వాడుచున్నాము. ఆ కరుణామయునే లోపలకు త్రాగుదుము. నీవీకర్మల నాచరించునపుడు దివ్యభావమును పొందుము. 'రసము' లేనిచో జలము జలము కానేరదు.

మామిడిపండులోని రసము, పనసతొనలోని మాధుర్యము, బత్తాయిఫలములోని తీపి, ద్రాక్షలోని మధురిమ, దానిమ్మలోని రుచి ఆ బ్రహ్మాండనాయకుని రసస్వరూపమునకు కొన్ని ఉదాహరణములే సుమీ. కావ్యములోని రసము, సంగీతములోని రాగవాహిని, ఆ రసజ్ఞుని రసావేశములే.

అదిగో! బాలసూర్యుని అరుణకిరణము. ఆ విశ్వమహాశిల్పి లోకమునంతను బంగారుపూతతో నింపివేయుచున్నాడు. ఏమి చంచలము! ఆమహాజ్యోతిర్మూర్తి సందర్శనముతో పక్షుల స్వాగతగీతము, పతివ్రతల నమోవాకములు, బ్రాహ్మణుల అర్ఘ్యప్రదానములు, సహస్రజీవసంతాన మహాచైతన్యము. అదిగో! సూర్యదేవునిలో వెలుగొందు విశ్వజ్యోతి. కాంతిపుంజము భగవంతుడు కనిపించుటలేదా నీకు. క్షణక్షణమును కనిపించుచున్నాడు. కొంచెము తలను పైకెత్తి చూడుము. ఆ దివ్యకాంతియే నీ నేత్రములలో ప్రవేశించి నీకు దారిచూపుచున్నది. లేనిచో నీవు గ్రుడ్డివాడ వగుదువు. ఆ కాంతియే నీకు శక్తి నిచ్చును. తినుటకు అన్నము నిచ్చుచున్నది. త్రాగుటకు నీరు నిచ్చుచున్నది. నిలబడుటకు చెట్టు నీడ నిచ్చును. ఆకాంతిలో దివ్యకాంతుని దివ్యదర్శనము చేయుమని గీత చెప్పినది.

అదిగో! పదునారుకళలతో భాసిల్లు సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబము. ఓహో! ఏమి ఆసౌందర్యము! ఏమి ఆకోమలత! ఏమి స్నిగ్ధత్వము! ఆ చిరునవ్వుల దొంతరలు. ఓ చందమామా! మబ్బుదొంతరలతో మేలమాడుచున్నావా? ఎక్కడనుంచి వచ్చినవోయి నీకీ

సొగసుతనము? ఎచ్చటినుంచి దొంగిలించినావోయి ఆ మార్దవము? ఎచ్చటినుంచి దొంగిలించినావోయి ఆ హా యాలు? లోకము లన్నియు నీ వెన్నెలల కౌగిళ్ళలో మైమరపు చెందుచున్నది. అదిగో! కవి కుమారుడు కలమెత్తి నీ అందచందములను వ్రాయలేక విసిగిపోవు చున్నాడు. అదిగో! ఆ మధురిగాయని గొంతెత్తి పాడుచున్నది. నీ సుందరతర దివ్యజ్యోత్స్నలు. అదిగో కలువకన్నియ నీకొరకెట్లు చూచుచున్నదో? నీవు ఓషధీశ్వరుడవోయీ దేవా! నీవు రసాత్మకుడవై ఓషధులను శక్తివంతము చేయుచున్నావా? వానిని భుజించియే గదా మేము బ్రతుకుచున్నది.

చంద్ర సూర్యుల దివ్యకాంతి పుంజస్వరూపములతో మా కన్నుల యెదుట తాండవించు ఓ భగవానుడా! మా నమస్కృతులను స్వీకరింపుము.

ఆకాశములో జనించిన ఆశబ్దమేమి? ఎవరు కల్పించినారా శబ్దమును. మహాసాగరము గానముచేయు ఆ మహాశబ్దమేమి? ప్రతి అణువునుండియు వినబడుచున్న ఆ మహారాగ మెద్ది? నీహృదయములో ధ్వనించిన నాద మేది? వేదోత్పత్తి నిలయనాట్య మేది? అదిగో ఓంకారము. అది నావిభూతి అని భగవానుడు పలుకుచున్నాడు. దానిని ఆలకింపుము. దానికే ఆలసింపుము.

వీర్యవంతులలో వీర్యము నాస్వరూపమని భగవానుడు చెప్పెను. వీర్యము ఉత్పత్తి శక్తిగలది. సృజనాత్మకమైనది. ఎవరియందది ఊర్ధ్వగతిని చెందునో అతడే వీర్యస్వరూపుడైన భగవానుని తెలిసికొనును. వీర్యవిహీనుడు పనికిమాలిన వాడు. వీర్యవంతుడు ప్రతిభావంతుడు.

నిత్యజీవితములో భగవానుని దర్శించుము. నీటిలో,సూర్యబింబములో, చంద్రకాంతిలో, ఆకాశనాదములో, వీర్యశాలులలో, ఆమహామహుని దర్శించుము.



## 57. సువాసనలో, తేజస్సులో, తపస్సులో పరమేశ్వరుని ఆరాధనము. Gods worship in Fragrance, Brilliance and Tapas.

ఓహో! ఏమి ఈసువాసన, ఎక్కడినుండి వచ్చుచున్నది? ఇక్కడకు ఎంతోదూరములోనున్న ఒకసుందరాంగికొప్పులో సంపెగపూవు. ఏమి తియ్యని తావి. ఆ రేకులను చించి చూడుము. ఏమియు కానవచ్చుట లేదే? ఆ సంపెంగ చెట్టుకు మంచిగంధము పొట్టునుగాని కస్తూరి పొడినిగాని ఎరువుగా వేసినావా? పన్నీరుపోసి పెంచినావా? కర్పూరముతో బోదెలుకట్టినావా? లేదు లేదు, ఎచ్చటి నుండి వచ్చినదీ తియ్యనిసువాసన? అది మధురమూర్తి అంశ మాత్రమే నోయీ భక్తుడా? అదిగో ఆ గులాబి కన్నె ఎంత సొగసుగా నవ్వుచున్నది? ఎవరు పోసినారోయి ఆ సౌకుమార్యము ఆ గులాబికి! అదిగో పల్లె పడుచు కిలకిల నవ్వుచున్నది. లోకమంతయు సువాసనల మయము. ఆ మందారభామ కడుపులో దూరి ఎవరు వేసినారోయి వింతవింతరంగులు! ఆ జాజి, విరజాజి, చామంతుల పరిమళములు ఎవరు యిచ్చినారు!! అవి యన్నియును పరమేశ్వరుని దివ్యశక్తికి ఉదాహరణములు. భగవానుని వానిలో దర్శించి ఆరాధించుము. ఓ కళారాధకుడా! వాస్తవమగు కళారాధన మిదియే సుమా! 'భూమియందు పుణ్యసుగంధమనై నేను వెలయుచున్నాను' అని భగవానుడు చెప్పుచున్నాడు.

ఓ చెల్లీ! గిన్నెలో బియ్యముపోసి, నీళ్ళుపోసి, కుంపటిపై పెట్టినావా? అన్నము ఉడుకునా? ఉడుకుటలేదు. నిప్పు వేయలేదే? బొగ్గులున్నవి-లాభమేమి? భగవత్ శక్తి అగ్నిరూపముగా నక్కడ లేనిచో అన్నము ఉడుకదుసుమా? కాఫీ కాగదు సుమా? ఇడ్లీ తయారుకాదు సుమా? ఆ భగవానుడే జఠరాగ్నిరూపములో నీ గర్భగోళములో నుండి నీవు తిన్న పదార్థములను పచనము చేయుచున్నాడు. నీస్వశక్తి

యని విజ్ఞప్తిగకుము. బయటను, లోపలను అతడు అగ్నిస్వరూపుడై నీకు సుఖమును కలుగచేయుచున్నాడు.

అతడు కవితాస్వరూపుడు. పోతన్నలో, నన్నయలో, తిక్కన సోమయాజిలో, కాళిదాసులో, భవభూతిలో, వాల్మీకిలో, షేక్స్పియరులో, మిల్టనులో, రవీంద్రునిలో కవితా మధురరూపముతో సాక్షాత్కరించునది యా పరమేశ్వరుడే. త్యాగయ్యలో, నారాయణతీర్థునిలో, జయదేవునిలో, మీరాలో, గానముచేసిన దా దివ్యనాయకుడే. అనసూయ పాతివ్రత్యములో, గార్గి మైత్రేయుల సంవాదములో సుమతీ సాధ్వి తేజస్సులో, సావిత్రీదేవి మహాదీక్షలో, దమయంతీ చిత్తసౌశీల్యములో నృత్యములు గావించిన దా మహాతేజస్వి తేజఃపుంజములే. తిలక్, గాంధీలలో, అరవిందరమణులలో తొంగిచూచుచున్న దా దివ్యజ్యోతివిలాసరేఖలే! భగవంతుడు లేడని చెప్పుచున్నావా నీవు ? సిగ్గులేదా నీకు? కన్నులుండియు గ్రుడ్డివాడవు నీవు. చెవులుండియు చెవిటివాడవు నీవు. నిత్యదర్శన మగుచున్న ఆ మహాస్వరూపమును దర్శింపుము. నిత్యమును వినిపించుచున్న ఆ వేణునాదమును ఆలకింపుము. ప్రకృతిలో భగవానుని దివ్యదర్శనమును గూర్చి వ్యాసదేవుడు పదియవ అధ్యాయమగు విభూతియోగములో మిక్కిలి విశదీకరించియున్నాడు. ఆ యధ్యాయమును గురించి చెప్పుకొను సందర్భమున మరికొన్ని మధుర వృత్తాంతములను తెలిసికొందము గాక !



# 58. మాయను తరించుట ఎట్లు ?

## How to cross the illusion ?

'మాయ అంటే ఏమిటి? అది ఎలాఉంటుంది? జ్ఞానినైన నన్ను గూడ మాయ మోసగించగలదా?' అని ఒకనాడు నారదుడు విష్ణుమూర్తిని ప్రార్థించినాడు. ఒకనాడు విష్ణువు, నారదుడు కలిసి షికారు బయలుదేరి వెళ్ళినారు. 'నారదా! నాకు దాహ మగుచున్నది. మంచి

నీకు తెచ్చిపెట్టగలవా?' అని విష్ణువు పలికినాడు. సరే యని మంచినీటి కొరకు నారదుడు బయలుదేరినాడు. 'తృష్ణార్తుడైన భగవానునకు తృష్ణ కలుగుట' యని తలంచుటే నారదుడు మాయకు వశుడైనాడని యర్థము గదా !

ఎంతదూరము పోయినను నారదునకు నీరు కానరాలేదు. ఎన్నో మైళ్ళు పోయినాడు. అక్కడ నొక సుందరమగు ఉద్యానవనము - అందులో అందాలబరిణి యగు సుందరాంగి ఒయ్యారపు చూపులతో నారదుని చూచినది. నారదు డామె మన్మథబాణములచే జయింపబడి బంధింపబడినాడు. ఆమెతో వివాహమై సంసారము చేయుచున్నాడు. చాలమంది పుత్రులు జన్మించారు. ఇట్లుండగా సమీపములో నున్న ఒకనది పొంగిపొరలుచు నారదుని ఇంటినే ముంచివేయ సాగినది. పాపము నారదుడు చింతాక్రాంతుడై భార్యను ఒకచేతితో పట్టుకొని, ఒక పిల్లవానిని ఒక భుజముపైన మరొక బాలకుని మరొక భుజముపైన, ఇంకొకనిని నెత్తిపైన నుంచికొని ఆ ప్రవాహమును దాటిపోవుటకు ప్రయత్నించినాడు. ప్రవాహవేగ మధికముగా నుండుటచేత భార్యను తీసికొనిపోలేక చేతిని వదలివేసినాడు. ప్రవాహము మరింత ఎక్కువగుచున్నది. ఏమి చేయగలడు ? తన ప్రాణమే పోవునట్లు గనబడుచుండెను. క్రమక్రమముగా తన ప్రాణరక్షణార్థము భుజములపై నున్నట్టియు, శిరస్సుపై నున్నట్టియు కుమారులను గంగపరము చేసినాడు. ఎట్లో అతికష్టముపై గట్టుచేరినాడు. ప్రవాహము కొంచెము తగ్గినది. గట్టుపైకూర్చుని చనిపోయిన భార్యాసుతులకొరకు గోలుగోలున ఏడ్వసాగినాడు. ఇంతలో విష్ణుమూర్తి అచ్చట ప్రత్యక్షమయినాడు. 'ఏమి నారదా! గొంతుక ఎండిపోవుచున్నది. మంచినీరు తెచ్చితివా?' అని పిలుచుచు భుజముతట్టినాడు. అదిరిపడి లేచినాడు నారదుడు. మోహనమూర్తి యగు విష్ణువును చూచి 'దేవా! నీ మాయను తెలిసికొన నాతరమా ?' అని పాదములపై వ్రాలినాడు.

'దైవమాయ బహువిచిత్రమైనది. మహాత్ములు, జితేంద్రియులు, మహాపండితులును గూడ మాయాదేవికి వశమైనవారే. 'గుణత్రయముతో గూడిన నామాయను దాటుటకు ఎవ్వరికిని శక్యము గాదు!' అని భగవానుడు పలుకును.

'మాయ' ఎచ్చటనుండి వచ్చినది? నీటిలోపుట్టిన నాచు నీటినే మూసివేసినట్లు, ఆకాశమునందు జనించిన మేఘములు ఆకాశము నంతను ఆవరించినట్లు భగవానునినుండి జనించిన ఈమాయ భగవానునే కప్పుచున్నది. యోగమాయాసమావృతుడైన ఆ భగవానుని అహంకారపూరితులు చూడలేరు. భగవానుడు మాయాతీతుడు. మాయకు వశుడుగాడు. కంటిఅద్దములు కంటిచూపుకు అడ్డముకానట్లు కంటికి పూయబడిన కర్పూరపు కాటుకవంటివి దృష్టికి ప్రతిబంధకము కానట్లు, మాయ భగవానుని ఏమియు చేయజాలదు. బురదలోనున్న కుమ్మరపురుగునకు బురద సోకనట్లు – జలములలోనున్న కప్పకు జలములు శైత్యబాధనుకలిగించనట్లు మాయాదేవి భగవానుని ఏమియు చేయజాలదు. ప్రపంచమంతయును 'మిథ్య' అని నీకు తెలియును. ధనధాన్యాలు, భోగభాగ్యములు నశించునవియే యని తెలియనివారు లేరు. 'జీవితములు క్షణభంగురములు' అని ఎరుగనివా రెవరు? అయినను మానవులు 'నాయిల్లు' 'నాభూమి' 'నాభార్య' అని మోహమును చెందుదురు. ఈర్ష్యాసూయలకు వశులై ఘోరపాతకములను చేయుచున్నారుకదా? ఇదియే మాయాప్రభావము. ఇదియే అవిద్యాప్రభావము. 'దేనికి ఇయ్యది కారణ' మని చెప్పలేమో అదియే 'మాయ' అని వివేకానందుడు నిర్వచనము చేసెను.

'తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయ సహజగ్రాహ చింతాకులే చ
సంసారాఖ్యే మహతి జలధౌ, మజ్జతాం న స్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ ॥'

ఓ మాధవా! సంసారమహాసాగరమును దాటుట ఎంతకష్టము! నిత్యమును కలుగుచుండు ఆశలే ఈ సాగరములోని జలములు. కామమనెడి మహావాయువుచేత మోహమను తరంగపంక్తులు ఎగురగొట్టబడుచు, మహాభీభత్సమును కలుగచేయుచున్నది. ఈమహాజలరాశిలో భార్యలు మహాసుడిగుండములు. పుత్రసోదరాదులు భయంకరములగు తిమింగలాది జలజంతువులు. మహాకల్లోలిత మగు సంసారజలధిని దాటుట నాతరమా? ఓ విశ్వనియంతా! నేనీ భీకరమహాసాగరములో మునిగిపోవుచున్నాను. ఓ దేవా! రక్షింపుము. నీ పాదభక్తిని నాకు ప్రసాదింపుము. నీ పాదభక్తి యను నావచేతనే, ఓకృష్ణా! ఈసంసార జలధిని దాటగలను. అన్యసాధనము లేదు, అని భక్తుడు దీనముగా అరచును.

ఓమానవుడా! ధనము గలవని గర్వించకుము. పరివార మున్నదని విఱ్ఱవీగకుము. బలమును యౌవనమును గలిగియున్నవని మురిసిపోకుము. నిమిషకాలములోనే ఇవి యన్నియును నన్ను వీడి పరుగెత్తిపోవును సుమా! అహంకరించకుము. ఈ చరాచర విశ్వమంతయును గ్రహించి పరమేశ్వరుని ధ్యానించుము. మాయను దాటుశక్తి భక్తునకే గలదు. 'నేనే తెలివైనవాడను, నేనే ఘనకార్యములను చేయుచున్నాను' అని పలుకకుము. శివాజీ చక్రవర్తి ఒక పర్యాయము లక్షలకొలది ప్రజలకు అన్నదానము చేసినాడు. 'నావల్లకదా ఇంత మందికి భోజనము లభించినది'అని శివాజీకి మనస్సులో అహంకారము గలిగినది. గురువగు సమర్థ రామదాసు దీనిని గ్రహించెను. శివాజీకి ఒక పెద్దబండను చూపి, ఇరువురు సైనికులను రప్పించి, ఆ బండను పగులకొట్టించెను. దానిని పగులకొట్టి చూడగా ఆ బండ మధ్యనుండి ఒక పెద్దకప్ప గంతులువేయుచు పైకివచ్చెను. దానిని శివాజీకి చూపి సమర్థుడు ఇట్లు పలుకును. 'నాయనా! ఈ బండరాతి గర్భములో నున్న ఈకప్పకు ఎవడు ఆహారమిచ్చి పోషించుచున్నాడో తెలియునా?

కరుణాసముద్రుడగు భగవానుడు పోషించుచున్నాడు. ఆయన దయవల్లనే ఈ చరాచరాత్మక విశ్వమంతయును పోషింపబడుచున్నది. నీలన్న దానము చేతకాదోయి ప్రజలందరును బ్రతుకుచుండుట – అహంకారమును వీడుము – భగవానుని శరణాగతిని బొందుము.

మానవుడు అనేక విధములుగా మాయకు వశుడగుచున్నాడు.

'మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే' అనిగీత చెప్పుచున్నది.

నన్ను శరణు జొచ్చినవాడే మాయను దాటి నన్ను పొంద గలడు అని భగవానుడు పెక్కుచోట్ల పెక్కువిధములు చెప్పినాడు.

## 59. భక్తులు నలుగురు Four kinds of devotees.

భగవానుడు దయాసముద్రుడు. ఏరూపముతో–ఏభావముతో తన్ను ఆరాధించినను ఆతడు వారిని ఆదరించును. పోతన్న యిట్లు పలుకును.

కలలోన్ తను మున్నెరుంగని మహాకష్టాత్ముఁడైనట్టి దు
ర్బలుఁడా పత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలప న్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైననిచ్చున్ సుని
శ్చలం భక్తిం భజియించు వారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్.

నాస్తికుడైన వాడైనను – కలలోగూడ భగవన్నామమును పలుకని వాడైనను – కష్టకాలములో ఆదయామూర్తియొక్క పాదపద్మాలను చింతన చేసిన మాత్రముననే భగవాను డానందించి ఆ కష్టములను బోగొట్టునుసుమా. నిశ్చలభక్తితో ధ్యానించు వారల కాయన సర్వమును ప్రసాదించును అనగా మోక్షలక్ష్మిని ప్రసాదించును.

తన మహాభక్తుడైన - ఏకనాథుని ఇంటిలో వంటవాడై నీళ్ళు మోయువాడై - జగన్నాథుడు పనిచేయలేదా? భక్తురాలికి చెప్పులను కట్టి యీయలేదా? ఎందరికి ప్రాణదానము చేసినాడు? అంగుష్ఠమాత్రరూపియై ఆ భగవానుడు ఉత్తరాగర్భములో ప్రవేశించి పరీక్షితుని అశ్వత్థామబాణాగ్నినుండి రక్షింపలేదా? కుబ్జను దివ్యసుందరిగా చేయలేదా? కుబేరునకు ధనకనక రాసులను వర్షింపచేయలేదా? ఆ పరమాత్మను ఆశ్రయించిన వారికి ఎన్నడును లోటు లేదు. నమ్మి చెడినవా డెవ్వడును లేడు.

'బాధానివారణార్థం నన్ను ఆశ్రయించువాడు నాభక్తుడే' అని భగవాను డనుచున్నాడు. ఓ ఏడుకొండలవాడా, వెంకటరమణా! నా బాధను తీర్పుము. నీకిదే ముడుపుకట్టుచున్నాను. నీ కొండ శిఖర మెక్కి నీ దర్శనము చేసికొందును. నాకష్టమును తీర్పుము' అన్న మాత్రముననే ఆ పద్మావతీ వల్లభుడు ఆభక్తునికష్టమును తొలగించుచున్నాడు. అభీష్టసిద్ధిని బొందిన ఎందరు భక్తులను మనము తిరుపతికొండపై చూచుటలేదు? 'నాకు పుత్రుని ప్రసాదింపుము' అని భక్తురాలు వెంకటాచలపతిని అర్థించును. మరుసంవత్సరమున కామె చిట్టిపాపను చంకనుబెట్టుకొని కొండయెక్కుచున్నది. 'నేను బీదవాడను నాకొక చిన్నఉద్యోగమునిమ్ము' అని ఒక నిరుద్యోగి వెంకటాచలపతిని అర్థించును. మరువత్సర మాఉద్యోగపు హోదాతో స్వామికి నమస్కరించును. 'తండ్రీ! నాకు చక్కని భర్తను ప్రసాదింపుము'అని కన్య వెంకట శైలాధిపతిని గోరును. మరుసంవత్సరమున కామె తనప్రాణనాథునితో గూడి స్వామికి భాగ్యము లర్పించును. ఇవి కట్టుకథలు కావు. కళ్లార చూచిన విశేషములు. ఇట్టి నిదర్శనములే లేనిచో ఈ కలికాలములో ఇన్నికోట్లమంది ఆ వెంకటాద్రికి పోవుదురా లక్షల కొలది ధనరాసులను ఆప్రభుని ముందర గుమ్మరింతురా! ఒకభక్తుడు

తన పేరును చెప్పకకయే పట్టుపుట్టములతో ఒక లక్షరూపాయలను మూటకట్టి వెంకటాచలపతి యొక్క ధనాగారములో వేసినా డని దేవయాలయాధికారులు ప్రకటించిరి. ఏమి ఆశ్చర్యము! ఏమి మహో త్యాగ మది. ఎందులకుచేసిన మహోత్యాగ మది. తన పేరునుగూడ ప్రక టించుకొనలేదు ఆభక్తుడు. డబ్బునకు ప్రాణమునకు లంకెవేయబడు ఈ పాపిష్ఠిరోజులలో వెంకటాద్రిపై భక్తజనములచే ధనరాసుల మ్రోతలు వినబడును. సర్వార్థములను ప్రసాదించు వేంకటవిభునకు భక్తుల కృతజ్ఞతా సూచనలే కానుకలు.

ఈమధ్యనే తిరుపతిని దర్శించి వచ్చిన నా మిత్రుడు అచ్చట జరిగిన విశేషమును తన కన్నులార వీక్షించి నాకు చెప్పెను. ఆభక్తి ప్రపత్తులను వినినంతనే నాశరీరము పులకరించినది. ఆ ఘట్టమును మీకు కూడ నివేదింతును.

ఒక కోటీశ్వరుని భార్య బంగారుచాయబోలు శరీరకాంతి శరీర మంతయు బంగారు ఆభరణములతో కప్పివేయబడి యున్నది. సూర్య కాంతి సోకిన కందిపోవునట్టి శరీరము. ఒక గొప్ప ఉద్యోగస్థుని భార్య పరివారముతో గూడ నమస్కరించినది. ధర్మ డిబ్బీవద్ద నిలిచినది. చెవులనుండి, ముక్కునుండి, చేతులనుండి, కంఠమునుండి, నడుము నుండి, కాళ్ళనుండి, తన సకలావయవములనుండి ఆభరణముల నెల్ల దీసి ఆ వెంకటాచలపతి ధనాగారములో వేయుచున్నది. నిలువుదోపిడిని తీసికొన్నాడు పరంధాముడు. ఆకుసుమకోమలాంగి దొర్లుచు ఆల యము చుట్టును ప్రదక్షిణము చేయుచున్నది. అహంకారము లేక వందలకొలది స్త్రీపురుషుల మధ్య ఆమె ఆలయప్రదక్షిణము చేయు చున్నది. ఒకగజము దూరము దొర్లినది. ఆమె కాళ్ళుకొట్టుకుపోయి నవి. మోకాళ్ళనుండి మోచేతులనుండి రక్తము కారుచున్నది. బం ధువు లామెను ఆ ప్రయత్నమునుండి వారింప యత్నించినారు. ఆభక్తు

రాలు వారిమాటలు వినదు. రెండునిమిషము లట్లే పరుండి మరలదొర్లి ప్రయాణము చేయుచున్నది. మరిపదినిమిషములలో ఆమెకు స్పృహ తప్పినది. మంచినీళ్ళుచల్లి శైత్యోపచారము చేసినారు. కొద్దిక్షణములలో ఆమె తెప్పరిల్లినది. మరలదొర్లుచు స్వామిచుట్టును ప్రదక్షిణము. శరీరాయవములన్నియు స్వాధీనము తప్పినవి. రక్తము కారసాగినది. ఆమె దీక్ష విడువలేదు. తుదకెట్లో ప్రదక్షిణము పూర్తి అయినది. బంధువు లామెకు - స్పృహతప్పి పడియున్న ఆ మహాభక్తురాలి గాయములకు కట్లనుకట్టుచు - చేతులపై తీసికొనిపోయి విశ్రాంతి స్థలములో చేర్చిరి. ఏమి ఈ మహాభక్తి. నామిత్రు డామె భర్తనద్దకు పోయి 'ఏమండీ ఎందుల కీమె యిట్లు చేయుచున్నది?' అని ప్రశ్నించెను.

'మాకువివాహమై పలుసంవత్సరములైనది. సంతానము లేదు. వైద్యులిక సంతానము కలుగదని చెప్పిరి. ఈలౌకిక వైద్యులను వదలి సంతాన కాంక్షిణియైన నాభార్య సర్వలోక వైద్యుడగు వెంకటాచల పతిని ఆశ్రయించినది. 'నిలువుదోపిడి నిచ్చెదను స్వామీ, నీఆలయము చుట్టును ఈశరీరముతో దొర్లుచు నీకుప్రదక్షిణము చేసెదను తండ్రీ, నా కోర్కెను తీర్పుమని వేడుకొన్నది. సంవత్సరమైనది ముద్దులు మూటగట్టు ఈబంగారు చిట్టికుమారునితో కొండ యెక్కినది. ఇచ్చట జరిగిన దంతయును మీరు చూచుచునేయున్నారుకదా!' అని ఆనందముతో చెప్పసాగెను.

నిండుహృదయములో ప్రార్థించిన భక్తున కాయన ఈప్సితార్థమును ప్రసాదించును. అడుగో భద్రగిరీశుడు - అడుగో శ్రీశైలమల్లికార్జునస్వామి - అడుగో శ్రీదక్షారామ భీమేశ్వరుడు. అడిగో అన్నవర సత్యదేవుడు - కాశీవిశ్వనాథుడు - బహురూపములలో విలసిల్లు దేవాది దేవుని దివ్యపాదముల నాశ్రయించుము. సకలార్థములును నీకు వర్షించును. ఆయన మనకు సారథి. సచివుడు, నేస్తము, సఖుండు,

బంధువు, ఫలదాత. తనయందు మనసు నిలిపిన భక్తుని ఆయన తప్పక రక్షించును.

సంఘమిత్ర అశోకుని సోదరి. ఆమె బ్రహ్మచర్యమును బూని కాషాయమునుధరించి బౌద్ధధర్మప్రచారమునకై సింహళము వెళ్ళినది. వందలకొలది స్త్రీపురుషులు మనోహర దివ్యవాణిని ఆలకించి భక్తులై బౌద్ధధర్మమును స్వీకరించిరి. సింహళ దేశపు రాజుమాత్రం మిత్రను విరాగిణియగు బౌద్ధభిక్షుకిగా చూడక. కామోపభోగయోగ్య యగు సుందరిగా మాత్రమే భావించి ఆమె వలపును కోరినాడు. తన వదిన గారిని పిలిచి తన నీచపు వాంఛను ఆమెకు తెలిపి, సంఘమిత్రను అందు కొడంబరుపు మని తెలిపెను. 'విరాగిణియగు స్త్రీని వలచుట అధర్మ మని' ఆమె రాజునకు బోధించినది. కాని కామాంధున కామె మాటలు రుచింపలేదు. సంఘమిత్ర నన్ను వివాహమాడి తీరవలెను. లేనిచో బౌద్ధధర్మమునే నేను నాశనము చేసెదను. అని రాజు గద్దించి నాడు. సంఘమిత్ర కీ విషయమంతయు తెలిసినది. ఆమె సింహళ దేశాధీశుని వదినగారితో నిట్లు పలికినది.

'సోదరీ! రాజా ఈ తుచ్ఛదేహమును వాంఛించు చున్నారా? కానిమ్ము. ఈమలమూత్రముల దుర్గంధమును అతడు కోరుచున్నాడా- అట్లేకానిమ్ము. బౌద్ధధర్మము మాత్రము సుస్థిరమై యుండునుగాక !! అమ్మా! రాజును రమ్మని చెప్పుము. ఈ శరీరమును అతని మన్మథ భోగములకై ఆహుతి చేసెదను' అని పలికినది.

రాజు కామాంధుడై మహాసౌందర్య రాశియగు సంఘమిత్రను సమీపించెను. పరమాశ్చర్యము! ఆమె మెడచుట్టును బుసలుకొట్టుచు పెద్దనాగుపాము చుట్టుకొనియున్నది. మహారాజు భయకంపితుడై నాడు. ఆ పాము రౌద్రముగా మీదకు వచ్చుచున్నది. మహారాజునకు సంఘ

మిత్రనేత్రాంచలములలో మహనీయ తపనీయ పరమశాంతి తేజస్సు గోచరించినది. వెంటనే అత డామెను పాదాక్రాంతు డయినాడు. క్షమింపవేడినాడు. వెంటనే బౌద్ధభిక్షువుగా మారినాడు. భక్తిలోనున్న మహనీయ శక్తి సామర్థ్యములను గుర్తించి బాధానివారణముకొరకు వైద్యుడగు పరంధాముని ఆశ్రయించినవాడు భక్తుడు. ధనముకొరకై ఈప్సితార్థసిద్ధులకై అహంకారముతో గూడిన నీచమానవుల నాశ్రయించక భగవానునే ఆశ్రయించినవాడు భక్తుడు.

జిజ్ఞాసాపరిపూర్తికి కుక్షింభరులగు గురువులను ఆశ్రయించక జ్ఞానస్వరూపుడగు భగవానుని ఆశ్రయించినవాడు భక్తుడు.

'ఏ కామము లేక భగవానుని శరణుజొచ్చినవాడు జ్ఞానిభక్తుడు. ఈతడు అందరికంటెను శ్రేష్ఠుడు. 'జ్ఞానియే నేను' అని భగవానుడు పలుకును. సకాములైనను భగవానుని ఆశ్రయించినవారు ధన్యులు. వారు భగవదారాధకులే యని గీతపలుకును. కోరికతో ప్రారంభమయినను ఆ భక్తి క్రమక్రమముగా నిష్కామ మగును.

కావున భగవానుని ఆశ్రయింపుము. ఆతడే రక్షకుడు.



# గీతాకల్పవృక్షము

ఎనిమిదవ అధ్యాయము - అక్షర పరబ్రహ్మ యోగము.

## 60 మరణకాలమున భగవన్నామ స్మరణము.

**The thought of God at the time of death.**

మిత్రులారా! ఈ అధ్యాయములో పరమేశ్వరుడు ఒక మహా రహస్య విషయమును తెలుపుచున్నాడు. శ్రద్ధతో ఆలకింపుడు. మానవుడు జన్మించినది మేడలు కట్టుకొరకు కాదు. రాజ్యము లేలుట కొరకు గాదు. యువతీమణులను భోగించుటకును గాదు. మానవుడు పుట్టినది చచ్చుటకొఱకు. ప్రతిమానవుని గమ్యస్థానమును మరణమే యని నీవు తలంతువు. కాని చచ్చుట మరల పుట్టుటకొరకు గాదని గీత చెప్పును. జననము జన్మరాహిత్యము కొరకు. మరణము మరణరాహిత్యము కొరకు. ఆత్మసాక్షాత్కారము జీవితలక్ష్య మని శాస్త్రము మనకు బోధించుచున్నది. అట్టి జీవిత మహాలక్ష్యమును నీవెట్లు పొందగలవో, మిక్కిలి తేలిక యగు ఉపాయమును భగవానుడు చెప్పుచున్నాడు. 'ఓ అర్జునా! మరణకాలమున నన్ను స్మరింపుము. నీవు నన్నే పొందెదవు.' ఎంత తేలికమార్గమును చెప్పినాడు భగవానుడు !

ఏపనికొరకైనను మన మెంతో ప్రయత్నముచేసి సిద్ధపడుచున్నాము. సినీమాకు పోవుటకు చక్కగా ముస్తాబగుదువు. రూపాయలు జేబులో వేసికొందువు. పౌడరు ముఖమునకు పూసికొందువు. కలకత్తా వెళ్ళవలయు నన్నచో పెట్టెడు బట్టలు, పర్సులో ధనము సిద్ధము చేసికొందువు. పొలమునకు పోవునపుడు నాగలిని, విత్తనములను, తదితర పరికరములను, దూడలను వెంట నిడుకొని పోవుదువు. అత్తవారింటికి పోదలచినచో నీ తయారీకి అంతేయుండదు. కాని ప్రాణ

ప్రయాణసమయమునకు నీవేలసిద్ధపడుట లేదు?అని శాస్త్రము ప్రశ్నించుచున్నది. మరణము అనివార్య మను సంగతి నీకు తెలియదా ? దాని నుండి తప్పించుకొన్న రాజకీయనాయకులను గాని, ధనవంతులను గాని, పండితులనుగాని, మరి యెవరినిగాని నీవు చూచినావా?అనివార్యమగు మరణమునకు సిద్ధపడుట బుద్ధిమంతుని లక్షణము.

పరీక్షితునకు వారమురోజులలో మరణము కలుగు గాక యని మునికుమారుడు శపించినాడు. బుద్ధిమంతు డగు ఆరాజు దర్భలను పరచుకొని పరుండి, ఆహారాదులను విసర్జించి, ప్రాణప్రయాణ కాలమునకు చక్కగా సిద్ధపడినాడు. శుకు డిట్లు పలుకును.

'నేను మృతుండ నౌదు నని యేల భయంబు మనంబు లోపలన్
మానుము సంభవమ్ముగల మానవకోటికి చావు నిక్కమౌ
గాన హరిం దలంపు మిక గల్గదు జన్మము వేఱు నీకు ఓ
మానవనాథ! పొందెదవు మాధవ లోకనివాస సౌఖ్యముల్.'

ఓ రాజా! మరణమునకై భీతి నొందకుము!విచారమును పొందకుము! జన్మించినవారికి మరణ మనివార్యము. ఇక జననముకాని మరణముకాని రాకుండ నీవు కోరెదవేని హరిని ధ్యానింపుము. నీవు శాశ్వతమగు పరమాత్మను పొందెదవు.

వీరునివలె, ధీరునివలె, ప్రశాంత చిత్తముతో మరణలక్ష్మికి స్వాగత మిమ్ము. ఆసమయము అతిపవిత్రమయినది. రాబోవుజన్మమునకు కారణభూతమయిన దీకాలమే సుమా! భగవానుని స్మరింపుము. ఈవిషయమై గీత రెండవ అధ్యాయములోని ఆఖరుశ్లోకములో సూత్రప్రాయముగా చెప్పినది. ఈ అధ్యాయములో ఆపుణ్యభాగము మరింత వ్యాఖ్యాన రూపములో చెప్పబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్తు (3- 4-1) లో 'యథాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్యభవతి' ఈ లోకములో మానవు డెట్టి క్రతువుతో, అనగా నెట్టి సంకల్పములతో గూడియుండునో మరణానంతర మాతడు అట్టి

గతినే పొందును.' అని తెలుపబడినది. ప్రశ్నోపనిషత్తు (3-10) మైత్రేయోపనిషత్తు (4-6) ఈవిషయమునుగూర్చి నొక్కి వక్కాణించును. ఉపనిషత్సారమగు గీత ఈవిషయమై మరల మరల హెచ్చరిక చేయును.

'మరణ కాలమందు భగవన్నామ స్మరణ చేయవచ్చునులే! ఇప్పుడేమి తొందర' అని పలుకుచున్నావా? ఓ మూఢుడా మరణ కాలమెప్పుడో నీవూహింపగలవా? మరియొక రహస్యమున్నది. జీవితములో ఏ సంస్కారము బలీయముగా నున్నదో అది మరణకాలమున జ్ఞాపకము వచ్చును. కావున జీవితములో నిరంతరమును ఉత్తమ సంస్కారముననే యలవాటు చేసికొమ్ము. ఒక వృద్ధునకు మరణకాల మాసన్నమయినది. బంధువు లాతనిచే 'నారాయణ' శబ్దము పలికించిన మంచిదని తలంచినారు. వారు 'నార' ను తీసికొనివచ్చి ఆముదుసలికి చూపిరి. 'నార' ను చూపగనే ఆ ముదుసలికి 'నారాయణ' శబ్దము జ్ఞాపకము వచ్చునేమో'యని వారి భావము. ఆశబ్దోచ్చారణమునకు లోగడ సంస్కారము ఉండవలెనుగదా. ఆమూఢుడు 'నార' నుచూచి 'పీచు పీచు' అని పలికి ప్రాణము వదలెను.
కుల శేఖరు డిట్లు పలుకును.

కృష్ణత్వదీయ పదపంకజ పంజరాంత
మద్యైవ మే విశతు మానస రాజ హంసః
ప్రాణప్రయాణ సమయే కఫవాతపిత్తైః
కంఠావరోధన విధౌ, స్మరణం కుతస్తే॥

ఓ కృష్ణా! నా మనస్సు అనెడి రాజహంసము ఇప్పుడే నీ పాద పద్మములనెడి పంజరములో ప్రవేశించును గాక. మరణకాలమున కఫవాతపిత్తముల ప్రకోపములచేత నీ దివ్యనామ స్మరణము చేయలేకుందునేమో కదా.

రామదాసు ఇట్లు గానము చేయుచున్నాడు.

ముప్పున కాలకింకరులు ముంగిట వచ్చినవేళ రోగముల్
దొప్పరమైనచో కఫము కుత్తుక నిండినవేళ బాంధవుల్
గప్పినవేళ నీ స్మరణ కల్గునొ కల్గదొ నాటి కిప్పుడే
తప్పక చేతు నీభజన దాశరథీ కరుణాపయోనిధీ.

'తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ' అని గీత చెప్పుచున్నది.

'సర్వకాల సర్వావస్థలయందును నీవు నన్ను స్మరింపుము. మరియును యుద్ధమునుకూడ చేయుము' ఇది గీతాచార్యుని సందేశము.

భగవద్ధ్యానమును చేయుచు క్రియారహితుఁడవై యుండుమని గీత చెప్పదు. నీ సర్వధర్మములను తప్పక నిర్వహించు మనియే భగవానుడు చెప్పుచున్నాడు. మరణకాలమున కలిగిన భావానుసారముగనే మరల జన్మ లభించును.

జడభరతునికథ మన కీ విషయమును తెలియచేయును. జడభరతుడు ధన కనకవస్తు వాహనాదులు విడనాడి గండకీ నదీతీరమున ఆశ్రమమును నిర్మించుకొని ధ్యాననిష్ఠలో నుండెను. ఒకనాడు నదీతోయములలో స్నానమాడు బాలురతో గర్భవతియగు లేడి, సింహగర్జనము విని భయమునుచెంది గర్భస్రావము కాగా వెంటనే మరణించెను. ఆ లేడిగర్భమునుండి జారిపడిన ఆచిన్న లేడిపిల్లను గాంచి కరుణార్ద్రచిత్తుడై భరతుడు దానిని చేరదీసి పాలన పోషణ చేయసాగెను. దానియందాయనకు మమకార ముదయించెను. మరణకాలమునందా లేడియే ఆ మునికి స్ఫురణకురాగా ఆయన లేడి జన్మమును ఎత్తినాడని భాగవతము మనకు చెప్పును.

ఒక మఠాధికారి చీపురుకట్టను చూచుచు ప్రాణత్యాగము చేయుటచే నాతని కట్టి జన్మమే కలిగిన దని చెప్పబడుచున్నది.

ఒకానొక బ్రాహ్మణ సన్యాసి చెప్పులయందు దృష్టిని నిల్పి మరణించుటచేత నాతడు రోహిదాసుగా జన్మించినట్లు కథ చెప్పును.

ఈ సందర్భములో నామిత్రుడు చెప్పిన కథ యొకటి జ్ఞప్తికి వచ్చుచున్నది.

నలుగురు కన్యలొకనాడు గంగాతీరమున నిలిచి రూపయౌవన సంపన్నుడును, బుద్ధిశాలియునగు మహారాజు తమకు భర్తకావలయు నని కోరుచు గంగలో దుమికి ప్రాణత్యాగము చేసిరి. ఆ సంఘటన మును చూచుచున్న ఒక బ్రాహ్మణుడు ఆనలుగురు కన్యలును తనకు భార్యలు కావలయునని కోరుచు అచ్చటనే అతడు గంగలో దుమికి ప్రాణత్యాగము చేసెను. ఆ బ్రాహ్మణుడే భోజుడుగను, ఆ నలుగురు కన్యలును ఆతనికి భార్యలుగను పుట్టినట్లు ఈ కథాక్రమము మనకు బోధించుచున్నది.

మానవుని భవిష్యత్తు ఆతనిచేతిలోనే యున్నది. నీవు ఏది వాంఛించిన అదియే లభించును. మరణకాల వాంఛలు మిగుల బల వత్తరములైనవి. జీవితమంతయు నే సంస్కారము సరవత్తరముగ నుండునో అదియే అవసానకాలమున జ్ఞప్తికి వచ్చును. కావున శుభ కరమగు సంస్కారమును అలవాటు చేసికొమ్ము.

కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః, కృష్ణం నమస్యామ్యహం,
కృష్ణేనామర శత్రవో వినిహతాః కృష్ణాయ తస్మైనమః
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోస్మ్యహం
కృష్ణేతిష్ఠతి విశ్వమేత దఖిలం హేకృష్ణ రక్షస్వమాం,

మూడులోకములకును గురువైన శ్రీకృష్ణభగవానుడు మమ్ము రక్షించుగాక! ఆనంద నందనునకే నేను నమస్కరింతును. నా అంత శ్శత్రువులను, బాహ్యశత్రువులను నాశనము సేయు నా కృష్ణపర మాత్మకు వందన మాచరింతును. ఈ విశాల విశ్వమంతయు కృష్ణుని చేతనే జనించినది. ఆ శ్రీకృష్ణమూర్తి నన్ను రక్షించునుగాక!

## 61. మరణస్మృతి వలన ఫలము.

### The benifits by the remembrance of death.

మహాభారతములో 'యక్షప్రశ్నలు' గూర్చి మీరు వినియే యుంటారు. ప్రతియొక్కరును వానిని తప్పక చదవవలసి యుండును. ఆప్రశ్నలలో మిక్కిలి ఆశ్చర్యకరమైన సంగతి ఏదియో చెప్పుము' అని యక్షుడు ప్రశ్నించెను. ధర్మరాజు ఇట్లు పలికెను.

అహన్యహని భూతాని, గచ్ఛంతి యమాలయం.
శేషాః స్థావర మిచ్ఛంతి, కి మాశ్చర్య మితః పరం ॥

'ఓయక్షుడా, ఈప్రపంచములో ప్రతిక్షణమును కోట్లకొలది జీవులు మరణించు చున్నారుగదా. అయినప్పటికిని మిగిలినవారు మాత్రము తాము శాశ్వతమని తలంచుచున్నారు. ఇంతకంటె పర మాశ్చర్య మేమున్నది?'

మరణము అనివార్యమని తెలిసియు మానవుడు అజ్ఞాని యగు చున్నాడు. మిత్రుడో - బంధువుడో మరణించినపుడు మాత్రము తాత్కాలికముగా అతడు దుఃఖమును పొందును. మరునాటినుండి అతడు యథాప్రకారంగా సాగిపోవును. నిరంతరమును మరణస్మృతిని కలిగియున్నచో మానవుడు పుణ్యాత్ముడగును.

ఒక గృహస్థుని యింటికి ఒక మునీశ్వరుడు వచ్చెను. గృహస్థు డామునిని గౌరవించి పూజించెను. 'ఓ గృహస్థుడా నీవిక అయిదురోజులు మాత్రము జీవింతువు. అని ఆ ముని పలికి వెడలిపోయెను. ఆ ముని మిక్కిలి గొప్పవాడగుటచేత ఆయన వచనము యథార్థముకాక తప్పదని ఆ గృహస్థుడు భావించెను. ఆ గృహస్థుడు మంచము పట్టెను. అయిదవరోజున మునీశ్వరుడు ఆయజమాని యింటికివచ్చెను. గృహస్థు డాతనికి నమస్కరించెను. 'ఈఅయిదురోజులలో నీవు ఎన్ని పాపములు చేసితివి?' అని మునీశ్వరుడు గృహస్థుని ప్రశ్నించెను. మహానుభావా నిరంతరమును మరణస్మృతి నన్ను వేధించుచుండగా

నేను పాపమేమి చేయగలను? శారీరకముగాగాని మానసికముగా గాని, వాచికముగాగాని, ఒక్క పాపకార్యమైనను నేను చేయలేదు. ఈ 120 గంటలలోను పాపమును గురించి ఆలోచించుటకే తీరిక లేదు. స్వామీ నాదీర్ఘ ప్రయాణమునకు నేను ఈ 120 గంటలను సంసిద్ధ పడుచుంటిని. అని గృహస్థుడు చెప్పెను. దీని సారాంశమును గమనింపుడు. మరణస్మృతి పాపమును చేయనీయదు. 'ధర్మ మాచరించుతరి మృత్యువుచే తలబట్టి ఈడ్వబడినవానివోలె' అని భారతము చెప్పును. మరణస్మృతివలన మానవుడు పాపదూరుడై పవిత్రుడగును. పరీక్షిత్తునకు ఏడుదినములలో మరణము కలుగునను వచన మాతనిని మహాభక్త శిఖామణిని చేసినది గదా.

'నిరంతరమును మరణస్మృతిగల్గి భగవానుని ధ్యానింపుము' అని గీత పలుకును. ఈసందర్భములో వసురాయ కవి వ్రాసిన మనోహరమగు పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది, ఆ పద్యముతో నేటి ప్రవచనమును ముగింతము.

'నీతో నవ్వులు నర్మగర్భితములున్ నీతోడి సల్లాపముల్
నీతో ముద్దులు ముచ్చటల్ మురిపెముల్ నీతోడివిజ్ఞానముల్
నీతో నాటలుపాట లేకతమునన్ నీతో జగంబంతయున్
నీతోనే సుమి నీదుభక్తులకు తండ్రీ భక్తచింతామణీ॥

సర్వకాలము లందును భగవానుని ధ్యానము.

'తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ '(అ.8-శ్లో.7)

ఓ అర్జునా, అన్ని కాలములందును, నీవు నన్ను స్మరించుచుండుము. మరియు నీకర్తవ్యమగు యుద్ధమును చేయుము' అని గీతాచార్యుడు పలుకును. గీత మెచ్చుటను కర్మాచరణ విరాగము భరింపదు. మరణ సమయమునందు కూడా స్వధర్మాచరణము నే నొక్కి వక్కాణించును. భగవన్నామస్మరణము కర్తవ్యపాలనము. ఈ రెండును ఒక్కసారిగా ఎట్లు జరుగును? అని నీవు ప్రశ్నింపకుము. అభ్యాసముచేత

నీవు దానిని సాధింపగలవు. అది నీకు సహజమే అగును. తల్లి తన బిడ్డను ఇంటిలో ఉయ్యాలలో పరుండబెట్టును. నదికిపోయి నీరు తెచ్చుటకు ప్రయాణ మగును. ఆ మెదృష్టి, ఆమె ధ్యానము, ఆమె తలంపు ఆమె ప్రాణము సర్వమును ఆ చంటిబిడ్డయందే యుండును. ఇంటిలో బిడ్డ ఏడ్చుచున్నాడేమో - ఆ ఉయ్యాలలోనుంచి పడిపోవునేమో - అనియే ఆమె తలంచుచు, వడివడిగా నదికిపోవును. బిందెను నీటిలో ముంచును. భుజముపై నుంచుకొనును. ఎన్నిపనులు చేయుచున్నను, ఆమెను ఉయ్యాలలోనున్న బిడ్డయందే మనస్సు లగ్న మగుచు. ఇదియే రీతిని నీ కర్తవ్యమగు 'ఏకర్మ చేయుచున్నను నీ మనస్సు భగవానిపైనే లగ్నము చేయుము.' అని గీత చెప్పుచున్నది.

యోగరతోవా భోగరతోవా, సంగరతోవా సంగ విహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం, నందతి నందతి నందత్యేవ.

నీవు యోగివై చరింతువుగాక! మహా భోగివై విలసిల్లుదువుగాక. సంగముతో కూడియుందువుగాక. సంగరహితుఁడవై యుందువుగాక. ఎవని చిత్తము భగవంతునియందు రమించుచున్నదో వాడే ఆనందమును పొందును సుమా, అని శంకరులు చెప్పుచున్నారు. కావలసినది భగవదర్పిత చిత్తవృత్తి లభ్యమగునపుడు మానవు డెచ్చటనున్న నేమి? కులశేఖరు లిట్లు గానము చేయుచున్నారు.

దివి వా భువి వా మమాస్తు వాసో, నరకే వా నరకాంతక ప్రకామం
అవధీరిత శారదారవిందౌ, చరణౌ తే మరణేపి చింతయామి.

ఓ కృష్ణప్రభూ! నేను స్వర్గలోకమునందున్నను, నరకలోకమునందున్నను నాకెట్టి యభ్యంతరమును లేదు. మరణకాలమునందైనను నాచిత్తము నీ దివ్యపాదారవిందములపై లగ్నమైయుండునుగాక. మరణకాలమునందే భగవానుని స్మరించవచ్చునులే. ఇప్పుడేమి తొందర అని భావించబోకుము. మృత్యువు క్షణక్షణమును మానవుని వెన్నంటి యుండును జీవితములోని ప్రబల సంస్కారములు మాత్రమే

నీకు మరణకాలమునందు స్మరణకువచ్చును. కావున నిరంతరము భగవానుని స్మరింపుము. అదియే నీకు ప్రయాణ సమయమున జ్ఞప్తికి వచ్చును. మరణకాలమందు గాంధీకి వచ్చినదేది? రాట్నచక్రమా, హరిజన సమస్యయా, హిందీ భాషయా, కుటీరపరిశ్రమలా, అపక్వాహార సిద్ధాంతమా, రాజకీయ సమస్యయా, నెహ్రూ పండితుడా, కస్తూరీదేవి రూపమా, ఏది జ్ఞప్తికి వచ్చినది? పైన చెప్పిన వన్నియును ఆయన తన జీవితములో విశేషముగా అనుసంధానము చేసినవియే గదా! కాని ఇవి ఏవియును ఆయనకు జ్ఞప్తికి రాలేదు. వీటి కన్నిటికిని మూలాధారమైన – నిత్యస్మరణీయమైన రామమంత్రమే జ్ఞప్తికి వచ్చినది. నిరంతరమును హృదయమున ఆ రామనామమే మారుమ్రోగుచున్న కారణమున నదియే స్మరించినాడు మహాత్ముడు.

## 60. భక్తిచేతనే భగవానుడు బంధింపబడును.

**God is bound by devotion.**

భగవద్గీత కర్మ, జ్ఞాన, భక్తిమార్గములను గూర్చి ప్రబోధము చేయును. కర్మానుష్ఠానము అనేక విధులతోడను నియమములతోడను కూడియుండును. ఫలముసిద్ధించువరకునను అనుష్ఠానము సక్రమముగా జరుగవలెను. విధినియమములయందెట్టి లోపమున్నను ఫలము సిద్ధింపదు. ఒకప్పుడు విపరీత ఫలితము రావచ్చును. జ్ఞానమార్గము అసిధారావ్రతము వంటిది. సంపూర్ణమగు ఇంద్రియనిగ్రహమున ధ్యానాదులయందేమాత్రము ఏమరుపాటుకలిగినను పతనభయ మున్నది. భక్తిమార్గము నిరపాయము. విధినిషేధముల కతీతము. ఒక్కసారి భగవానుని దివ్యపాదములను శరణాగతి తత్వములో పట్టుకొంటివా యిక భగవానుడు నీవాడే యగును. భక్తితత్వములో నున్న గొప్పతనమే యిది. భగవానునికి నిష్కల్మష భక్తులే పరమబాంధవులు. అహంకారములేని భక్తి భగవానుని ప్రసన్నుని చేస్తుంది. మహాభారతం

అరణ్యపర్వంలో ఒకచక్కని ఉదాహరణమును వ్యాసదేవుడు చిత్రించాడు.

పాండవులు ధర్మబద్ధులై అరణ్యవాసము చేస్తూవుండే రోజులు. ఎట్టి దుస్థితిలోనున్నను సజ్జనులకు సత్కారములందే ఆసక్తివుండును. ధర్మరాజునకు ఒక యజ్ఞము చేయవలయునని సంకల్పము కలిగినది. దానికి కావలసిన సంభారములన్నియును పూర్తిగావించుకొని, యజ్ఞేశ్వరునిగా శ్రీకృష్ణుని ఆహ్వానిస్తే బాగుటుందని నిర్ణయించాడు ధర్మరాజు. శ్రీకృష్ణుడు మనవాడేకదా ఎట్లా పిలిచినా రాకపోతాడా' అని ఆయన భావించినాడు. ఎల్లుండి యజ్ఞారంభ దినము. నకులుని కృష్ణాహ్వానార్థమై పంపినాడు. నకులుడు అన్నగారి యజ్ఞకార్యక్రమమును గూర్చి చెప్పి శ్రీకృష్ణుని రమ్మని పిలిచినాడు. శ్రీకృష్ణుడు 'సరేలే నేను వస్తానువెళ్ళు' అని చెప్పి నకులుని సాగనంపినాడు. యజ్ఞారంభకాలము సమీపిస్తున్నది. కాని వాసుదేవుడు రాలేదు. ధర్మరాజు మరల సహదేవుని పంపినాడు. శ్రీకృష్ణుడు సహదేవునితో 'తప్పక వస్తానులే నీవు వెళ్ళు అన్నాడు. పాపము సహదేవు డేమిచేయగలడు? ఎంతగా నిరీక్షించినా రుక్మిణీకాంతునిరాక గానరాదయ్యెను. యుధిష్ఠురునకు కంగారు ఎక్కువయినది. యజ్ఞకాలము సమీపిస్తున్నది. కాని శ్రీకృష్ణుడు రాడాయెను. యజ్ఞము ఆగిపోవలసినదేనా' అని ధర్మరాజునకు ఆందోళన హెచ్చయినది. అర్జునా! నీవు వేగముగాపోయి మాధవుని వెంటనే తోడ్కొని రమ్ము అని ధర్మజుడు పార్థుని పంపినాడు. అర్జునుడు శ్రీకృష్ణుని వద్దకుపోయి విషయమంతయు చెప్పినాడు. శ్రీకృష్ణుడు 'సరేఅని' ప్రయాణమైనాడు. ఒక రథములో తానును పార్థుడు గూర్చున్నారు. రథము బయలుదేరుచుండగా ఆకాశములో పెద్దధ్వని యయ్యెను. అంతట కృష్ణుడు, 'అర్జునా ఏదియో మహాధ్వని కలుగుచున్నది. స్వర్గములో దేవదానవయుద్ధము జరుగుచున్నదేమో నేనుపోయి చూచివచ్చెదను. నీవు వెళ్ళుము. సరియగు కాలమునకు

నేను వచ్చెద నని మీ అన్నగారితో చెప్పుము అని పలికెను. అర్జును డేమి చేయగలడు. ధర్మరాజుతో విషయమంతయు చెప్పినాడు పార్థుడు. కృష్ణుడురా లేదు. ఇక యజ్ఞమునకు ఆటంకము వాటిల్లునని ధర్మరాజు ఆందోళనపడసాగినాడు.

అన్నగారి ఆందోళనమును జూచి భీమసేను డిట్లు పలికెను. 'ధర్మరాజా మీరు నన్ను ఆజ్ఞాపించినచో శ్రీకృష్ణుని నేను క్షణములో తీసుకొనివచ్చెదను.' 'అంతకంటె కావలసిన దేమున్నది. తీసుకొనిరమ్ము' అని ధర్మరాజు పలికెను. భీమసేనుడు గదతోకూడిన తన హస్తమును పైకెత్తినాడు. 'మాధవా! నాఅన్నగారు యజ్ఞకార్యము తలపెట్టి నిన్ను యజ్ఞేశ్వరునిగా ఆహ్వానించినారు. నీవు వచ్చునంతకు నేను ఆహార పానీయములను ముట్టను. ఈ ఎత్తినచేయి యిట్లే యుండును గాక. అని ప్రతిజ్ఞాపూర్వకముగా భక్తిభావము లుట్టిపడునట్లు శరణాగతితో పలికినాడు. భగవానుడు శరణార్థులకు రక్షకుడు గదా! పరమాశ్చర్యము. నకులుడు సహదేవుడు, అర్జునుడు పిలిచినను రానట్టి శ్రీకృష్ణుడు క్షణములో అచ్చటకు ప్రత్యక్షమయినాడు. అందరును మహానందము నొందిరి. యజ్ఞము జయప్రదముగా ముగిసినది. ద్వారకానిలయుడు పాండవుల నుండి వీడ్కోలుపొంది ద్వారకకు పోయినాడు.

శ్రీకృష్ణుడు ద్వారకలో రుక్మిణీతో వినోదముగా పలుకుచుండగా రుక్మిణి యిట్లుపలికినది. నాథా! మీపనులు చాలవిచిత్రములుగా నుండును. మీకొరకు ధర్మరాజు ముగ్గురు సోదరులను పంపినాడు. వారు మిమ్మెంతయో బతిమాలినారు. 'సరేవచ్చెదనులే' అనుటయే గాని మీరు పోనేలేదుగదా. భీముడు గదనుపైకెత్తి 'కృష్ణారారమ్ము' అనగానే మీరు మహారయమున పరుగెత్తుకొని పోయినారే!

'రుక్మిణీ! ధర్మరాజు ఉత్తమపురుషుడేకాని ఆయనలో కూడా కొద్దిగా అహంకార మావహించినది. 'కృష్ణుడు మన వాడే కదా

రాక ఏమిచేస్తాడు' అన్న భావమాత్రనిలో పొడసూపినది. ఆ స్వల్ప మగు అహంభావముకూడనశించినగాని పూర్ణమగుశరణాగతి తత్వము రాదు. భీమునిలోగల విశేషమును నీకు చూపెదను. రాత్రి మనమిద్ద రమును పాండవులున్న వనమునకు పోదముగాక' అని మురళీమోహ నుడు పలికెను. ఆనాటిరాత్రి గరుడారూఢుడై శ్రీకృష్ణుడు రుక్మిణీ సహితుడై పాండవుల కుటీర ప్రదేశమునకు చేరెను.

భీముడు గాఢముగా నిద్రపోవుచుండెను. అంత కృష్ణుడు రుక్మి ణిని పిలిచి 'కాంతా, నీవు నీ చెవిని ఈతని పాదమువద్ద నుంచి ఆల కింపుము' అనెను. రుక్మిణి అట్లేచేసెను. ఆతని పాదమునుండి 'కృష్ణా కృష్ణా' యను శబ్దము వినవచ్చుచుండెను. రుక్మిణి భీమునియొక్క ప్రతి అవయవము వద్దను తన చెవిని పట్టి వినసాగెను. ఆయన ప్రతిరోమము నుండియు 'కృష్ణ'శబ్దము మహాగానమువలె వినవచ్చుచుండెను.రుక్మిణి మహాశ్చర్యము నొంది, 'నాథా! నా కీ జన్మములో గాకున్న ఏ జన్మము నందైనను ఇట్టిస్థితిని ప్రసాదింపుము' అని వేడు కొన్నది. సారాంశమిది, ఇట్టి అనన్యభక్తియే భగవానుని బంధించును.

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః (అ.8 – శ్లో.14)

అని ఈ అధ్యాయములో భగవానుడు పలికినాడుగదా.

శ్రీకృష్ణుని మోసముచేయ నెంచిన బ్రహ్మ తానే మోహి తుడై ఆభగవానుని ఇట్లు ప్రార్థించెను.

దేవా! నీచరణ ప్రసాదకణలబ్ధింగాక లేకున్న నొం
దే వెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్
నీ వారై చనువారిలో నొకడనై నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటిజన్మ మందయిన నొండెం డైన నో ఈశ్వరా.

—......—

## 61. శుక్ల మార్గము - కృష్ణ మార్గము

### The path of light and the path of the darkness.

'కలలన్ బోలెడు పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునన్
దలతున్ సత్యములంచు మూఢుడ వృథాతత్త్వజ్ఞుడన్ నాకు నీ
విలసత్ పాదయుగంబు జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ'

అని అక్రూరుడు కృష్ణభగవానుని ప్రార్థించినాడు. మానవుడు ప్రాపంచిక వస్తు విశేషములనుచూచి వానియందు ఆనందమును సుఖమును గలదని మోసము పోవుచున్నాడు. భగవానుని పాదపద్మ సందర్శనమునందే శాశ్వతానందము గలదని మూఢుడు గ్రహింపలేడు. శరణాగతినిపొందిన వారికే భగవానుడు శాశ్వతానందము చూపును.

భగవానుడీ యధ్యాయములో తన్నుశరణుజొచ్చిన పార్థునకు మరొక అద్భుతమగు రహస్యమును తెలుపుచున్నాడు. అది 24, 25, 26 శ్లోకములలో సువ్యక్తమగుచున్నది.

మరణానంతరము మానవు డేమగుచున్నాడు. మరణముతో సర్వమును నశించుచున్నదా? జీవుడెచ్చటకు పోవును? ఎచ్చట నివసించును? వెంటనే పునర్జన్మము పొందునా? ఎట్టి జన్మను పొందును? మున్నగు ప్రశ్నలు బుద్ధిమంతు లాలోచింప దగినవి. హిందూ తత్వశాస్త్రమొక్కటియే దీనికి సంపూర్ణమగు సమాధాన మిచ్చియున్నది. పాశ్చాత్య పండితులుగాని, ఇతర మతప్రవక్తలుగాని, మతసాహిత్యములుగాని, జన్మాంతర, లోకాంతర – మరణానంతర విశేషములను గూర్చి తెలుపలేదు. దివ్యజ్ఞాన శోభితులగు భారతీయ మహర్షులు మాత్రమే ఈవిషయములను పరిశోధించి గ్రహించగలిగిరి. మహాభారతము శాంతిపర్వములో భీష్ముడీ విషయములను పలికినాడు.

మనుధర్మ శాస్త్రము- ఋగ్వేదములయందీ విశేషము లనేక ములు గలవు. ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యోపనిషత్తు - ఆత్మ పురాణము ఆరవ అధ్యాయమునందును ఈవిషయము సంపూర్ణ స్వభావముతో తెలియచేయబడినది. జిజ్ఞాసువు లాగ్రంథములను చూడ వలయునని కోరుచున్నాను. సునిశిత బుద్ధిగల ఇంద్రియాతీతమగు విజ్ఞానము దీని కవసరము. మరణములో శరీరము మాత్రమే నశించును. ఆతడు చేసిన పుణ్యాపాప కర్మలను బట్టి అతనికి నీచయోనులలో పుట్టుకయో, లేక దేవతాజన్మయో, ఏ లోకములో నివాసమో, తిరిగి ఏలోకమున కేట్లు తిరిగి వచ్చునదియు మున్నగు అద్భుత విశేషములను భారతీయ మహర్షి పుంగవులు స్థిరపరచియే యున్నారు. ఈజన్మాంతర లోకాంతర విషయములనుగూర్చి చర్చ ప్రారంభించినచో కొన్నివందల పుటల మహాగ్రంథ మగును. ప్రస్తుతి మీాయధ్యాయములో గీతాచార్యుడు తెలిపిన శుక్ల కృష్ణగతులను గుఱించి సంగ్రహాముగా మనవిచేసెదను.

మానవులను వారి వారి జ్ఞానకర్మ విభాగములనుబట్టి నాలుగు తరగతులుగా విభజింపవచ్చును. మొదటివారు జ్ఞానసిద్ధినిపొందిన జీవన్ముక్తులు. వీరు నరరూపములతో వెలుగందు నారాయణ స్వరూపములు. రెండవ రకము నిష్కామ కర్మయోగులు. మూడవ వర్గము వారు సకామకర్మానుష్ఠానపరులు. ఈ ఇరువుర పరిస్థితులనుగూర్చియే ఈ అధ్యాయములో తెలుపబడినది. నాల్గవ రకమువారు కర్మభ్రష్టులగు పాపాత్ములు. వారు వారి దుష్టకర్మఫలితముగా నీచయోనులలో జన్మింతురు.

నిష్కామ కర్మయోగులు అర్చిరాది మార్గమునకు పోయి బ్రహ్మలోకమును పొందుదురు. వారికి పునర్జన్మము లేదు. ఈ మార్గమునకే శుక్లగతియని దేవయాన మనిపేర్లు. ఈమార్గముగుండా ప్రయాణముచేయునప్పుడు జీవుడు ముందుగా అగ్ని దేవతను పొందును. ఆ

దేవత ఈ పుణ్యజీవిని సత్కరించి పిమ్మట జ్యోతిర్దేవత వద్దకు పంపును. అచట సత్కారమును పొంది అహర్దేవతను చేరును. అచ్చట సత్కార సన్మానము లందుకొని శుక్లపక్షాధి దేవతను చేరును. అచట సత్కారసన్మానము లందుకొని శుక్లపక్షాధి దేవతలను చేరిన తర్వాత అటనుండి ఉత్తరాయణాభిమాన దేవతను చేరి, పిమ్మట శాశ్వత బ్రహ్మలోకమును చేరును. ఇది నిష్కామభక్తులు పోవు శాశ్వత బ్రహ్మలోక మార్గాభి వర్ణనము. ఇట్లుగాక కొందరు ఈ శ్లోకములోని శబ్దములు కాలములను సూచించునవి యని చెప్పుచు, పగటివేళను, శుక్లపక్షమునందును,ఉత్తరాయణ మందును మరణించువారు పునరావృత్తి రహితమగు శాశ్వత బ్రహ్మలోకమును చేరుదురని తెలుపుతారు. ఇదియెంతమాత్రమును సరిగాదు. అట్లే కృష్ణమార్గ విషయమును గూర్చియు నాలోచింపుడు. ఫలములను కాంక్షించి పుణ్యకర్మలు చేసిన వారి మరణాంతర యాత్రను గూర్చి 25వ శ్లోకము వర్ణించును.

మరణానంతర మా జీవుడు ధూమాభిమాన దేవతలను పొంది గౌరవసత్కారము లందుకొనును. అటనుండి రాత్ర్యాభిమాన దేవతను అటుపిమ్మట కృష్ణపక్షాభిమాన దేవతను చేరి పిమ్మట పితృలోకమును పొందును. ఈ పితృలోకమునే చంద్రలోకమని స్వర్గలోకమని చెప్పుకొనవచ్చును. ఆ లోకమునందు బహుకాలము తానుగావించిన పుణ్యకర్మలఫలితముగా సుఖభోగాదుల ననుభవించి, పుణ్యము క్షీణింపగా తిరిగి మానవలోకమున జన్మించును.

ఈ శ్లోకమునందలి పదములు కాలమును సూచించునవి యని తెలుపుచు రాత్రికాలమునందును కృష్ణపక్షమునందును దక్షిణాయమందును మరణించుచో చంద్రలోకమునకు పోయి వారలు జన్మించుచున్నారని తెలుపుతారు. అదియు సరియగు భావము కానేరదు. ఈ శ్లోకమునకు భావార్థమును తెలుపుచు వినోబాజీ యిట్లు పలికెను.

ఇందలి అగ్ని పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణ, శబ్దములు యజ్ఞ కార్యము - బుద్ధివికాసము - మానసిక ప్రసన్నత అసంగమగు హృదయాకాశమును సూచించును. మానవుడు అంత్యకాలమున యజ్ఞ కార్యమును (సేవాకార్యము-ఆరాధన, స్వాధ్యాయాది ద్వాదశ మహాయజ్ఞము) చేయుచు లక్షణము కలిగి సంగరహితమగు హృదయాకాశములో కూడియున్న శాశ్వత బ్రహ్మలోకమును పొందును. అట్లుగాక ఇహపరసుఖమును కాంక్షించుచు మరణించువాడు తిరిగి జన్మమును పొందును.

బ్రాహ్మీస్థితియందు మరణమును పొందువాడు, బ్రహ్మభావమునే పొందునని గీతలోపూర్వము చెప్పబడినది కదా! ఈశ్లోకములు రూపకాలంకారముతో వ్రాయబడిన వని తలచుట సమంజసముకాదు. మదరాసు నుండి బొంబాయిపోవు రైలుకొన్ని ముఖ్యస్టేషన్లలో ఆగు నట్లు, మర్త్యలోకమునుండి ప్రయాణమున పుణ్యజీవియొక్క మజిలీలను గూర్చియే పైశ్లోకములో గీత వివరించిన దని చెప్పుటయే యుక్తము.

...—...

# గీతా కల్పవృక్షము

తొమ్మిదవ అధ్యాయము - రాజవిద్యారాజగుహ్య యోగము.

## 64. భగవంతునికన్నను భగవన్నామమే మిక్కిలి గొప్పది.

**God's name is superior than God.**

ఆత్మీయులారా, గీతా సార్వభౌముని కరుణా కటాక్ష వీక్షణ ములచేత మనము నేడు గీతా సుధాసాగర మధ్యభాగమునకు చేరితిమి. వేదసారమయిన గీతామృత మాధుర్యమును గ్రోలి మనము తరింతము గాక! భగవానుని దయారస మీ యధ్యాయములో వరదలై పొంగి పొంగి పొరలి పొరలి ప్రవహించినది. దీనులను, దుఃఖితులను, అజ్ఞానులను భగవానుడు ప్రేమవాత్సల్య సుధా ధారలను వారిపై వర్షింపచేసి ఆలింగనము చేసికొన్నాడు. 'ఈ అధ్యాయమును పారాయణము చేయునపుడు నా కనుగవనుండి బాష్పధారలు వడి వడిగా వర్షించును' అని వినోబాజీ పలుకను. జ్ఞానదేవు డీయధ్యాయ మునే పఠించుచు ప్రాణత్యాగముచేసెను. వేదవాఙ్మయములలో గల కఠిన కాంతార కర్మపథములకన్న మృధుమధుర మనోహర భక్తి మార్గము ఇందు దుపదేశ మైనది. వేదసారమగు హరినామ విశేషమును గూర్చి వ్యాసదేవుడు గానముచేసినాడు. ఇది సుగమము-శ్రేష్ఠమునగుట చేతనే రాజవిద్య అయినది. అపవిత్ర పదార్థములను పవిత్రము గావించునది హరినామమే. అమంగళములను మంగళములను గావించునది హరినామము. చదువు సంధ్యలతోను పాండిత్య ప్రభావముతోను నిమిత్తము లేనిదీ హరినామ గానము. అమాయికులయిన గొల్లభామలు ఈ మార్గముననే తరించిరి. త్యాగరాజు రామగానముచే రామసాన్నిధ్యమును బొందినాడు. భగవంతునికన్నను భగవన్నామమే సర్వ శ్రేష్ఠము - శక్తిమంతము. ఫలప్రదము. ఒక కథ.

శ్రీరామచంద్ర ప్రభువు దర్బారులో విశ్వామిత్ర, వసిష్ఠ, వాల్మీకి, నారదాది మహనీయు లందరును కూడియుండగా నారదుడొక ప్రశ్న వేసెను. 'మహనీయులారా, భగవంతుడు గొప్పవాడా, లేక భగవన్నామము గొప్పదా?' నాకు సోదాహరణముగా తెలుపుడు. కొందరు భగవంతుడు గొప్పవా డనిరి. మరికొందరు భగవన్నామము గొప్పదనిరి. కాని అందొక్కరును తమ సిద్ధాంతమును ఋజువు చేయ జాలకపోయిరి. ఇంతలో బుద్ధిమంతుడగు నారద మహాముని హనుమంతుని పిలిచి, హనుమా, నీవు పెద్దలయందు గౌరవముచూపు మహాభక్తుడవు. సభాంతమునందు పెద్దల కందరకును వంగి నమస్కరించుట నీకు అలవాటే కదా. అదియే ఆవంక విశ్వామిత్రుడు కూర్చుని యున్నాడు చూచితివా. ఆయన రాజర్షి మాత్రమేగదా. బ్రహ్మర్షి గాదు. అందుచే నీవు ఆయనకు నమస్కరించ వలసిన పనిలేదులే. అన్నాడు. సభాంతములో హనుమంతుడు విశ్వామిత్రుడు మినహా మిగిలిన ఋషీశ్వరులందరకు నమస్కరించినాడు. నాటిసభ పూర్తి అయినది. ఇంతలో కలహప్రియుడైన నారదుడు విశ్వామిత్రుని పిలిచి, ముని పుంగవా చూచితివా, రామదూత అయిన ఆ హనుమంతుడు మీ కెంత అవమానమును గలిగించినాడో? మీరు బ్రహ్మర్షులు గారట. కేవలం రాజర్షి మాత్రులట. అందుచే మీరు నమస్కార యోగ్యులు కారని మహాసభలో మీకవమానమును గలిగించినాడు' అని పలికెను. అసలే కోపనుడయిన విశ్వామిత్రునకు నారదుని వాక్యములు మరింత కోపమును కలిగించినవి. ఆయన చరచర రామునివద్దకు పరుగెత్తిపోయి. 'రామా' నీసేవకుడు నాకు అవమానము కలిగించినాడు. అతనిని శిక్షించవలెను.' అని విషయమును వినిపించెను. 'గురుదేవా,' మీరెట్టి శిక్షను విధించిన దానిని నేను అమలుపరచెదను. అని రామచంద్రుడు పలికెను. విశ్వామిత్రు డాగ్రహముతో 'అట్లయిన అతడు వధార్హుడు. రేపే ఆతని కా శిక్షవిధింప వలెను' అనెను.

ఈవార్త అయోధ్యా నగరమంతయు కార్చిచ్చువలె వ్యాపించినది. 'రాముడు హనుమంతుని వధించునట! ఏ యుపద్రవములు రానున్నవో?' యని ప్రజలు భయమందసాగిరి. ఈ విషయము హనుమంతునికి కూడ తెలిసినది. హనుమంతుడు తక్షణం నారదులవద్దకు పోయి ఈవిషాదచరిత్ర నంతా తెలిపినాడు. 'నీ కేమియు భయము లేదు. ఒకానొక ధర్మనిర్ణయం కొరకే పన్నాగము చేయవలసి వచ్చినది. నీవు తెల్లవారుజామున నే లేచి సరయూనదిలో స్నానసంధ్యా వందనాది అనుష్ఠానములను పూర్తిచేసికొని, సిద్ధముగా నుండుము. నేనా సమయమునకు అచ్చటకు వచ్చెదను' అని నారదుడు పలికెను. నారదుడు చెప్పినట్లుగా హనుమంతుడు సరయూనదీతీరమున వేచియుండెను. సకాలములోనే మహర్షి యచటకు వచ్చి హనుమంతునకు 'శ్రీరామ జయరామ జయజయరామ' అను త్రయోదశాక్షర రామమంత్రమును ఓంకారముతో సంపుటీకరణము చేసి ఉపదేశించెను. పవిత్ర కాలములో పవిత్రప్రదేశములో రామభక్తుడగు హనుమంతునకు రామమంత్రి ముపదేశింప బడినది. అయన మహాభక్తితో శరీరమునే మరచి రామ మంత్రము గానము చేయుచుండెను.

తెల్లవారుసరికి శ్రీరాముడు ధనుర్బాణములను ధరించి తన ప్రతిజ్ఞా పరిపాలనార్థము సరయూనదీ తీరమునకు విచ్చేసెను. ఏమి జరుగునో యని మహర్షులు, మంత్రులు, పౌరులు సంభ్రమాశ్చర్యములతో చూచుచుండిరి. రాముడు వింటిలో బాణమును సంధించి హనుమంతునిపై బాణపుతున్నాడు. మహాశ్చర్యము. రామబాణము మంటలు గక్కుచు పోయి పోయి మహాభక్తుడగు హనుమంతుని పాదసన్నిధిలో చల్లపడిపోవుచున్నది. రాముడెన్నియో బాణములను ప్రయోగించెను. కాని అవి రామభక్తునిపైకి పోజాలక పాదాక్రాంతము లగుచున్నవి. వందలు, వేలు, లక్షలకొలది రామ బాణములట్లు వ్యర్థములైనవి.

సాయంకాల మగుచున్నది. రాముడు విసిగిపోయినాడు. ఇక ఆఖరు ప్రయత్నము బ్రహ్మాస్త్రము సంధింప నున్నాడు.

ఇంతలో నారదుడు విశ్వామిత్రుని వద్దకు పరుగెత్తి అయన చేయిపట్టుకొని, మహర్షీ చూచుచున్నావా? రాము డలసిపోవుచు న్నాడు. రామబాణము రామభక్తునిపైకి పోవుట లేదు. రాముడు గొప్పవాడో రామనామము గొప్పదో చూడుము. నిన్నటి మహాపరి షత్తులో ఇదియే కదా ప్రశ్న? దీని సమాధానముకొరకే నేనీ పన్నా గము పన్నితిని. రాముడు బ్రహ్మాస్త్రమును ప్రయోగింప నున్నాడు. అదికూడ విఫలమయి తీరును. కాన రాముని వారింపు మని పలికెను. మహర్షు లందరును భగవంతుని కన్న భగవన్నామమే గొప్పది అని పలికిరి.

రామదాసు ఇట్లు పలుకును.

'నీరజనాభమూర్తివగు నిన్ను కనుంగొనగోరి వేడినన్
జాలముచేసి డాగెదవు సంస్తుతి కెక్కిన రామనామమే
మూలను దాచుకోగలవు ముక్తికి ప్రాపది పాపజాల కు
ద్దాలము గాదె మాయెడల దాశరథీ కరుణాపయోనిధీ.

భాగవత మిట్లు పలుకును.

కూలినచోట కొట్టుపడి క్రుంగినచోట మహాజ్వరాదులన్
వ్రేలినచోట, సర్పముఖపీడన లందినచోట నార్తులై
తూలినచోట, విష్ణు భవదూరుని పేర్కొని రేని మీద న
క్కాలుని యాతనా వితతి గానరు నూనరు దుఃఖభావముల్.

'ఏది జపియింప నమృతమై యెసగుచుండు
నేది సద్ధర్మ పద మని యెరుగదగిన
దట్టి సద్భక్తి యోగంబు నావహించు
మూర్తిమతంబు నా హరి కీర్తనంబు.



## 65. నా భక్తుని రక్షణ బాధ్యత నాదే.

**It is supreme responsibility to save my devotees.**

ఒకమారెన్వానిని పేరు కర్ణములలో నొయ్యారమై సోకినన్
సకలాఘంబులు పల్లటిల్లి తొలగున్ సంభ్రాంతితో నట్టిస
త్సుకరున్ మంగళతీర్థపాదు హరివిష్ణున్ దేవదేవేశునిన్
అకలకస్థితి గొల్చు భక్తులకు లేదడ్డంబు రాజాగ్రణీ.

మహాభాగవతంలో అంబరీషోపాఖ్యానంలోని దుర్వాసుని వాక్యము లవి. అంబరీష భక్తునిపై కుపితుడైన దుర్వాసుని శిక్షించుటకు హరి తన చక్రమును పంపించినాడు. బ్రహ్మ శివాదు లెవ్వరును తన్ను రక్షింపజాలని కారణముచే దుర్వాసుడు అంబరీషునే శరణు జొచ్చి స్వస్థచిత్తు డయ్యెను. భగవద్భక్తులను సదా భగవానుడే రక్షించును.

ఈ అధ్యాయములో భగవానుడు తన భక్తులతో ప్రమాణ పూర్వకముగా నిస్సందేహముగా భక్త రక్షణము తన ముఖ్యకర్తవ్య మని యెలుగెత్తి చాటుచున్నాడు. ఒక్కచోట గాదు. పలుతావు లలో.

'సకల లోకములకును అధిపతిని నేను. తల్లియును తండ్రియును, తాతయును, వేదములును ప్రణవమును, గతియును పతియును, సాక్షి యును, సర్వమును నేనే. అమృతస్వరూపుడను నేను. ఎవరు నన్ను నిరంతరమును అనన్యచిత్తముతో నుపాసింతురో వారి యోగ క్షేమ ములను నేను వహింతును.' అని భగవానుడు గంభీరముగా పలుకు చున్నాడు. 'నాభక్తునకు నాశనము లేదు' అని భగవానుడు మరల పలుకును. ఎంత ప్రియమైన వాక్యము లివి!! భీమా కంపెనీల హామి వాగ్దానముల యందు మనకు నమ్మక ముండునే గాని సర్వలోక నియంతయైన భగవానుని వాక్యములందు మాత్రము మీకు విశ్వా సము లేకపోవుట మీ దౌర్భాగ్యము.

ఈ అధ్యాయములోని భగవానుని ప్రతిజ్ఞావాక్యముల కుదాహరణముగా వందలకొలది మహత్తర గాథలను నేను మీకు ప్రతిదినమును చెప్పుచునే యున్నాను. ఇప్పుడు కబీరు జీవితములోని మహత్తర ఘట్టము నాకు స్ఫురణకు వచ్చుచున్నది.

భక్తకబీరు దుర్భర దారిద్ర్యము ననుభవించుచున్న దినములవి. ఒకరోజున కబీరు దంపతులు భోజనము చేయలేదు. రాత్రి సమయము. ఎవరిదో గుమ్మమువద్ద చప్పుడు. వెంటనే కబీరు తలుపులు తీయగా ఇరువదిమంది శిష్యులతో ఒక సాధుమహాశయుడు ప్రత్యక్షమయినాడు.'

'కబీరూ, నేను శిష్యసమేతుండనై కాశీయాత్ర చేసి వచ్చుచున్నాను. నీవు మహాభక్తుడనని నేటిరాత్రి మీ యింటికి అతిథులమై వచ్చినాము' అని సాధు మహాశయుడు పలికెను.

'ధన్యుడను. మీవంటిపుణ్యమూర్తుల ఆగమనముచే నేను పవిత్రుడ నయితిని'అని కబీరు పలుకుచు వారలకు నమస్కరించి కూర్చుండ నియోగించి, ఇంటిలోనికి పోయి, భార్యతో సంగతి తెలిపెను. సుందరీదేవి భక్తుల ఆగమనమునకు చాల సంతసించితిని. కాని వారి కాతిథ్యమిచ్చుటకు ఇంటిలో నేమున్నది ? అనెను. మంగళసూత్రమయినను అమ్మి వస్తువులను తీసికొని రమ్మని భార్యతో కబీరు చెప్పెను.

'నాథా, మంగళసూత్రము మొన్నటి దినమున అమ్మి భక్త సమారాధనము చేసితిమిగదా! నా మెడలో ఇప్పుడున్నది. పసుపు కొమ్ముమాత్రమే! ఏమి చేయుమందురు?' అన్నది సుందరీదేవి.

'శ్రీరామచంద్రుడీ యతిథుల రూపమున మనయింటికి విచ్చేసినాడు. వీరికి ఆతిథ్య మిచ్చి తీరవలయును. ఎట్లో ఆలోచింపుము' అని కబీరు భార్యతో పలికెను.

'నాథా! నాకొక ఆలోచన తట్టుచున్నది. మీరు దాని కంగీకరించినచో అతిథి సమారాధనము మనము చేయగలము' అని ఆమె పలికెను.

కబీరునకు ముఖము వికసించినది. 'దేవీ, నీవేమి చేసినను సరియే రామునకు ఆతిథ్యమిచ్చుట మన కర్తవ్యము. భగవదారాధనము మానుటకు వీలులేదు. ఉపాయ మేదియో చెప్పుము' అని కబీరు భార్యను తొందర పెట్టెను.

'నాథా! ఈవీథి చివర పెద్ద మేడలో షావుకారు నాపై తరచు మోహదృష్టితో చూచుచుండును. ఆతనిచూపులను బట్టి, చేష్టలను బట్టి నా శరీరముతో కామసుఖములను పొందగోరునట్లు తెలియు చున్నది. నాథా, మీరు నాలో తుచ్ఛశరీరమును ఈరాత్రికి ఆ షావు కారునకు విక్రయింపుడు. ఆత డిచ్చిన వస్తుసంభారములతో శ్రీరామ స్వరూపులగు అతిథి మహాశయులకు సమారాధనము గావింతము. ఈ శరీరము రోగముల కొంప - దుర్వాసనల గంప - మలినముల రొంప పురుగుల కంప - నిప్పులలో కాలిపోవు దుంప - రామకైంకర్యము నకై - అతిథిసేవకై - అన్నార్తుల ఆరాధనకై - ఈరాత్రి విక్రయిం పుడు' అన్నది రామభక్తి పారాయణ యగు మహాపతివ్రత సుందరీ దేవి.

'హరిశ్చంద్రుడు సత్య స్వరూపమగు భగవదారాధనకై తన భార్యాసుతులను విక్రయించినాడు. ఈనాడు రామసేవకుడైన కబీరు రామకైంకర్యమునకై షావుకారునకు పతివ్రతయగు తన భార్యను విక్రయించునుగాక - సత్కీర్తియో అది నాకు నిమిత్తములేదు. నాకు కావలసినది రామపూజ - రఘురామ కైంకర్యము - అతిథి రూప ములతో సాక్షాత్కారించిన నా రామస్వామి ఆరాధనము - సుందరీ అట్లే నీవు చెప్పిన చొప్పున చేసెదను. త్వరగా రమ్ము. షావుకారు ఇంటికి పోదము' అని కబీరు గంభీర స్వరముతో పలికెను.

కబీరు భార్యను వెంటపెట్టుకొని షావుకారు మేడకు పోయెను. షావుకారు చీకటిలో సుందరిని పోల్చుకొని ఆనందించెను. ప్రక్కనే

నిలబడియున్న కబీరును చూచి చాలకంగారుపడెను. ఆతని ఆందోళన మును, భయమును మాన్పి మెల్లని స్వరముతో షావుకారును బతి మాలెను. 'బాబూ నా యింటికి ఇరువదిమంది అతిథులు వచ్చినారు. వారికి నేను సమారాధనము చేయవలయును. అందుకు కావలసిన బియ్యము, పప్పుదినుసులు, ఇతర సంబారములను నాకిచ్చినచో; యిదిగో నా భార్యను ఈరాత్రి సరిగా 10½ గంటలకు నీ యింటికి తీసికొనివచ్చి అప్పగింతును. నీ వామెతో కామసుఖములను పొంద వచ్చును. రామునితోడుగా ఒట్టుపెట్టుకొనుచున్నాను.' అని పలికెను. కామాంధుడగు షావుకారు కబీరు కోరిన వస్తువులకు రెట్టింపునిచ్చి పంపెను.

కబీరు దంపతులు ఇంటికిపోయిరి. రకరకములగు పిండి వంట లతో కబీరుదంపతులు అతిథులకు సమారాధనము గావించిరి. వారంద రును తృప్తులై కబీరు దంపతుల నాశీర్వదించిరి.

రాత్రి 10½ గంటలు కావచ్చుచున్నది. సుందరీదేవి శరీరమం తయు శృంగారించుకొన్నది. శృంగారవతియైన తనధర్మపత్నిని కబీరు షాహుకారు ఇంటికి గొనిపోయెను. కబీరు సత్యవాక్యమునకు మురిసి పోయి షాహుకారు విలువైన హారమొకటి ఆతని మెడలో వేసెను. వెంటనే కబీరు దానిని తీసివేసి 'ఇప్పటికే నేను నీకింకను ఋణపడి యున్నాను. మరి నాకేమియు వలదు. రామ కైంకర్యము పూర్తి అయినది. నాకు ధనముతో పనియేమి?' అని పలుకుచు భార్యను అచట దిగవిడచి అతిథి సేవకై యింటికి పోయెను.

కామాంధుడగు షాహుకారు తలుపుబిగించి సుందరీ దేవితో శృంగారభాషణల కుపక్రమించెను. ఇంతలో తలుపువద్ద పెద్దచప్పుడు. సుందరీదేవిని గదిలో మూలగా నుండుమని చెప్పి తలుపు తెరచి చూచెను. ఎవ్వరును లేరు. తలుపులోపల బిగించి మరల సుందరితో కామ ప్రసంగములను ప్రారంభించెను. మరల తలుపువద్ద చప్పుడు.

షాహుకారు కంగారుపడి సుందరిని మంచముక్రింద దాగుమని చెప్పి తలుపు తెరచి చూచెను. ఎవ్వరును లేరు. వీథిలో మానవసంచార మే లేదు. అర్ధరాత్రి సమయముకదా తలుపు మరలబిగించి కామాంధుడు పతివ్రతయును; భక్తురాలును నగు సుందరీమాతను తాకబోయెను. తలుపునద్ద పెద్దచప్పుడు - ఆధ్వని ఆగుటలేదు. తలుపులను బ్రద్దలు కొట్టుకొని ఎవరో ఇరువురు లోనికి ప్రవేశించిరి. వారిచేతిలో దుడ్డు కర్రలున్నవి. ఆ కర్రలతో వారు ఆ షాహుకారును మోదసాగిరి. 'తుచ్ఛుడా పతివ్రతను చెరచుచున్నావా? కామాంధుడా' అని తిట్టుచు వానిని బాగుగా మోదిరి. ఆతడు క్షమింప ప్రార్థించెను. అంత నా ఇరువురు సుందరీదేవిని తోడ్కొని కబీరు ఇంటిముంగల నామెను విడచి పోయిరి. కబీరు తనగృహములో భార్యను చూచి మండిపడెను. "ఓసీ దుష్టురాలా, షాహుకారును మోసముచేసి వచ్చితివా?" నాసత్యవాక్యమును భ్రష్టముచేసితివా? సత్యస్వరూపుడగు రాముడు అసత్యవాదులగు మనలను మన్నించునా" అని కోపముతో పలికెను. ఆమె జరిగిన దంతయు తెలిపెను. అత డాశ్చర్యపడి ఆవచ్చినవారెవ్వరో తెలిసికొందమని షాహుకారు ఇంటికి వచ్చెను. షాహుకారు మూలుగుచు పడియుండెను. కబీరు చూచి మరింత భయపడెను. కబీరు దంపతులు ఆతనికి కట్టులుకట్టి ఆతనిని కొట్టినవా రెవ్వరో చెప్పు మని కోరిరి. ఆతడు భయపడుచు వారిద్దరును ఈగ్రామాధికారులే. నా "బుర్రను పగులకొట్టినా రని చెప్పెను. నాభార్యను నా ఇష్టము వచ్చినట్లు చేసికొనుహక్కు నాకు గలదు. వీరెవరు నన్నడ్డుపెట్టుటకు ? ఇప్పుడేపోయి వారికి దుడ్డుకర్రతో బుద్ధిచెప్పెదనుగాక" అని కోపమున పరుగెత్తెను.

కబీరు గ్రామాధికారుల యింటికి పోయెను. ఆయర్ధరాత్రమున వారు గాఢనిద్రలో నుండిరి. వారిని బలవంతముగా కబీరు మేల్కొల్పెను. షాహుకారును కొట్టుటకు కారణమేమి? ఇదిగో ఈ కర్రతో మీబుర్రలు బ్రద్దలుకొట్టెదను. అని కర్ర పైకెత్తెను. వారు "ఈవిషయ

మేమియు తమకు తెలియ దనిరి.'' వారిని వెంటబెట్టుకొని కబీరు షాహుకారు ఇంటికి వచ్చెను. తన్ను కొట్టినవారు వారే యని షాహుకారు గుర్తించి పలికెను. కబీరు క్రోధావేశముతో కర్రను పైకెత్తెను. క్షణములో వారి శిరములు బ్రద్దలు కానున్నవి. అచట రామ లక్ష్మణులు. కబీరు సాష్టాంగ నమస్కారము గావించెను.

భగవంతుడు తన భక్తుల గౌరవ మర్యాదలను కాపాడును. భక్తుని పరాభవమును భగవంతుడు సహింపడు.

''ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి'' ప్రతిజ్ఞ చేయుచున్నాను. నాభక్తునకు పరాభవము లేదు - మానభంగము లేదు. వినాశము లేదు'' అని గీత చెప్పుచున్నది.

—...—

## 64. పత్రం, పుష్పం, ఫలం, తోయం.

### A leaf, a flower, a fruit or water.

హరి నామాంకితమైన గీత యొకమాటాలించి మూర్ధాత్ములున్,
విరతిం బొందగ జాలియుందురట యావిశ్వాత్ము వీక్షించుచున్
బరిరంభించుచు నంటుచున్ నగుచు సంభాషించుచున్ నుండు సుంద
దరులానంద నిమగ్న లౌట కిల జోద్యంబేమి భూవల్లభా॥

''భగవన్నామమును మూఢులైనను ఒక్కమారు గానము చేసిన బ్రహ్మానంద సుఖమును పొందుదురు. విశ్వాత్ముడగు కృష్ణ భగవానుని చూచుచు, స్పర్శించుచు, ఆలింగనము చేసికొనుచు, నవ్వుచు ఆయనతో మధుర భాషణములను గావించు గొల్లభామలానందనిమగ్న లయిరని పలుకుటలో నాశ్చర్య మేమున్నది'' అని శుకుడు పరీక్షితునకు చెప్పుచున్నాడు. భగవానుడు కాంక్షించునది భక్తుని సహృదయమే కాని బాహ్యావస్తువులు కావు. ఇంద్రియములను ఆయనకు పూజాపుష్పముగా సమర్పించుము. ఆయన కోరునది పవిత్ర

మగు ఆత్మార్పణము, చక్రిపొంగలి - దధ్యోదనము - చిత్రాన్నము చిట్టిగారెలు - పాయసాన్నములు గావు.

భగవంతునకు ఏది నివేదించవలయును? అను సమస్యయే లేదు. భగవానుడు నీ మధురాన్నములను, రసపానీయములను స్వీకరించుటకు క్షుత్పిపాసలతో బాధపడుట లేదు. ఎంత పరిమితిగల పదార్థములను పెట్టితి వని కాదు - ఎంత ఖరీదుగల వస్తువులను సమర్పించితివని కాదు!- మరి - ఏభావముతో అర్పించితివను నదియే ముఖ్యము.

సత్యభామ శ్రీకృష్ణుడు తనయందే విశేషాసక్తుడై యుండవలెనని ఒక వ్రతమును చేసినది. వ్రత నియమానుసారముగ శ్రీకృష్ణుని నారదునకు దానము చేసినది. శ్రీకృష్ణునితో సమానమైన తూకముగల వస్తువాహానాదు లిచ్చి తన భర్తను తిరిగి గ్రహింపవచ్చునని నారదుడు చెప్పెను. సత్యభామ శ్రీకృష్ణుని త్రాసులో నొకవంక కూర్చుండబెట్టి రెండవ ప్రక్కతన ఆభరణములను. అంతఃపురములోగల వస్తుసముదాయమును వేసి తూచినది. భగవానుడు సరితూగలేదు. లోకము లన్నియు తనలో ధరించిన భగవానుడు బారువుల కొలది బంగారమునకు తూగునా? ఆమె నిస్మయమును బొందినది. చింతాక్రాంత యైనది. ఆమె గర్వభంగ మయినది. ఏమియును తోచక రుక్మిణీదేవిని ప్రార్థించినది.

రుక్మిణీదేవి కృష్ణధ్యానము చేసి, భక్తి తాత్పర్యములతో ఒక్క తులసి దళమును మాత్రమే త్రాసులో నుంచెను. గోవర్ధన గిరి నెత్తిన గోవిందుడు చటుక్కున దూగినాడు. ఆ తులసిదళము ఎంత బరువైనది! అతి సామాన్యమగు తులసీదళముగాదు. పత్రము భక్త్యమృతముచే తడిసినది. కావుననే గిరిధారిని తూచగలిగినది. భక్తితో ఒక్క పత్రమును సమర్పించుము చాలును. భగవాను డానందముతో స్వీకరించును.

విష్ణుచిత్తు డనుదినమును పూలహారమును తయారుచేసి వట పత్రశాయి కొరకు సిద్ధపరచును. అతని కుమార్తె రహస్యముగా ఆలయములో ప్రవేశించి, భగవానుని కొరకు తండ్రి సిద్ధపరచిన ఆపూలహారమును తన మెడలో ధరించును. మరియొక మారు తన సిగలో పెట్టుకొని అద్దములో తనరూపు చూచుకొని మురిసిపోవును. మరల ఆ పూలహారమును యథాస్థానములో నుంచి ఆమె వెడలి పోవును. విష్ణుచిత్తుడు ఆ పూలమాలను పూజా సమయమున స్వామికి సమర్పించును. ఇట్లుండ ఒకనాడు తండ్రి, తన కుమార్తె భగవానుని పూలమాలను తాను ధరించి యుండుటను చూచి చాల కుపితుడై నాడు. ఆమెఅపచారమును జూచి చాలచింతించి ఆమెను దూషించినాడు. ఆపూలహారమును పారవైచి మరియొకటి స్వామికి సమర్పించినాడు. రాత్రి భగవానుడావిష్ణుచిత్తునకు కనబడి, 'నీ కుమార్తెమెడలోను సిగలోను ధరించిన పూలమాలయే నాకు ప్రియమైనది. దానినే నాకు నిత్యమును సమర్పించుము' అని పల్కెను. ఏమి ఆశ్చర్యము. భక్తురాలైన గోదాదేవి సిగలోని పూలే స్వామికి ప్రియములు.

ప్రతి శనివారము నామిత్రుడు భజనచేసి ప్రసాదమును పంచి పెట్టును. ఒక శనివారమునాడు భజన పూర్తిఅయిన తర్వాత అతడు మాయింటికి ప్రసాదమును పట్టుకొనివచ్చెను. నాకు ఆశ్చర్యము కలిగినది. ఎందుకయ్యా ఇంత రాత్రివేళ ప్రసాదము తెచ్చితివి. అంటిని. 'ఈవేళ దేవునకు ఆపిలుపండ్లు, నేతిమిఠాయి ప్రసాదములుగా చేసితిని. ఇవి చాల విలువైనవి,రుచికరములు, గనుక నీ కొరకు ప్రత్యేకముగా తెచ్చితిని' అని పలికెను.

'అయితే భగవానుడు నీ ఆపిలుపండ్లకును నేతిమిఠాయికిని మొగము వాచియున్నాడా?' అని నేను పలుకగా అతడు చాలనొచ్చుకొనెను. ఇట్టి పరిస్థితులలోనే మన భజనలు సమారాధనలు. సంతర్పణలు సాగుచున్నవి. ఈరోజున మా యింటిలో భజన. పులిహోర,

చక్రపొంగలి; నేతిగారెలు, హల్వా ఇవి ప్రసాదములు' అని ముందుగా చెప్పిన కాని భక్తులు చేరుటలేదు. ఈ ప్రసాదములు భక్తులకేగాని భగవానునకు మాత్రము కాదని మనము గ్రహించవలెను. గొప్ప కొరకు, ఆర్భాటము 'కొరకు – అహంకారముతో చేయబడు పనులు మాత్రమే యివి. ముక్కిపోయిన అటుకులను కుచేలుని వద్దనుండి భగవానుడు ప్రీతితో స్వీకరించి భక్షించెను. అవి మామూలు అటుకులు గావు. భక్తిరసములో తడిసినవి. శబరి ఇచ్చిన ఎంగిలి పండ్లనే శ్రీరాముడు ప్రీతితో భుజించెను. అవి భక్తి రసపూరితములగు పండ్లు. భక్తురాలిచ్చిన అరటిపండ్ల తొక్కలనే శ్రీకృష్ణుడు హాయిగా తిని ఆనందించెను.

భగవానుడు పరీక్షించునది భక్తినేకాని బాహ్యవస్తు సముదాయ సమర్పణమును గాదు.

ఒక భక్తుడిట్లు పలుకును. 'ఓ దేవాదిదేవా, నిన్ను కూర్చుండ పెట్టుటకు నాయింటిలో మెత్తని సోఫాలు లేవు, నా ప్రణయాంక సీమయే నీకు సింహాసనము. నీకు పాద్యము నిచ్చుటకు పన్నీరు లేదు. నాకన్నీటితోనే నీ కాళ్ళు కడిగెదను. నీకు సమర్పించుటకు ఫలము లేవియు నా కడ లేవు. నా హృదయము నే నీకు సమర్పింతును.' ఏమి ఆ భక్తి తన్మయత్వము.

'నీవు ఏది చేసినను, ఏది భుజించినను, ఏది హోమము చేసినను– ఏది ఇతరున కొసంగినను – ఏ తపమాచరించినను దానిని నాకు సమర్పింపుము' అని భగవానుడు పలుకును. నీవు నీ నిత్యదైనందిన జీవితము లోను గావించు సకల విధములగు లౌకిక – పారలౌకికాది సకల కర్మలను వివిధ క్రియలను సర్వవ్యాపారములను భగవానుని పాదపద్మముల చెంత సమర్పింపుము. ఇదియే భక్తి. నీ జీవితమంతయు భగవదర్పణము అగునుగాక.' ఇదియే గీతాచార్యుడు బోధించు మహాసందేశము.

ఒక భక్తుడిట్లు పలుకును.

'ఆత్మా త్వం గిరిజా మతిః సహచరాః ప్రాణాః
శరీరం గృహం, పూజా మే విషయోప పభోగరచనా
నిద్రా సమాధిస్థితిః, సంచారః పదయోః
ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరః, యద్యద్క-
ర్మకరోమి తత్తదఖిలం శంభో త వారాధనం'

'నీవే నా ఆత్మవు, పార్వతియే నాబుద్ధి పంచప్రాణములే నా సహచరులు, ఈశరీరమే నా గృహము, నావిషయోప భోగములే నీకు పూజ లగును గాక. నానిద్రయే సమాధిరూపము నొందుగాక. నేను పాదములతో చేయు సంచారమంతయు నీకు ప్రదక్షిణములై విలసిల్లు గాక, నానోటిగుండా వచ్చుపలుకు లన్నియును నీకు స్తోత్రపాఠములే యగునుగాక. నేనుచేయు శారీరక మానసిక వాచిక కర్మములన్నియును నీకుపూజా కుసుమము లగుగాక.' ఇదియే సంపూర్ణమగు ఆత్మార్పణముతో గూడిన భక్తితత్వము.

---

## 65. భగవద్విశ్వాసం గలవానికి అసాధ్యములేదు.

**There is no impossibility for a man of faith in God.**

**It is faith that steers us throngh stormy seas faith that moves mouutains and faith that Jumps across the Occan. That faith is nothing but a livng wide-awaken consciousness of God within. He who has achieved that faith wants nohting. Bodily diseased, he is spiritually healthy, physically poor he rolls in spiritual riches.**

ఆత్మవిశ్వాసము సంక్షోభిత కల్లోల మహాసాగరముల నుండి మనలను సంరక్షించును. మహీధరములను గూడ నది కదలించును.

అయ్యది విశాల మహాసాగరములను లంఘింపచేయును. అయ్యది మానవ హృదయాంతర్గత మహాచైతన్యమగు భగవద్గీతాభావనా ధుగీణత. దానిని సంపాదించిన వానికి గావలసినది మరెద్దియును లేదు. శారీరకముగా నాతడు రోగగ్రస్తుడయ్యును ఆధ్యాత్మికముగా నారోగ్యశీలుడు. భౌతికముగా నాతడు పేదవాడయ్యును, ఆధ్యాత్మికముగా నాతడు సంపన్నుడు (మహాత్మాగాంధి)

భగవాను డీ యధ్యాయములోను, ఇతర అధ్యాయములయందును, ఆత్మవిశ్వాసము యొక్క గొప్పతనమును గూర్చి గానముచేసినాడు. ఆత్మ విశ్వాస మనగా భగవద్విశ్వాసమే. జార్జినల్లరు జర్మనీ దేశస్థుడు. ఆయన ఒకపెద్ద అనాథశరణాలయమును నడుపుచుండెను. ఆ శరణాలయమున వేలకొలది ఆనాథులకు భోజనవసతు లొసంగుచు విద్యాబోధనము చేయుచుండెను. ఆయన ఎవరివద్దకును పోయి ధనము కొరకై యాచింపడు. ఆయన వంగి భగవానునకు మోకరించి 'ఈ యనాథులగు బిడ్డలను రక్షించు భారము నీదే కదా' అని వేడుకొనును. తెల్లవారుసరి కెచ్చటనుండియో ఎందరెందరో భోజన పదార్థములను తీసికొని వత్తురు. బెల్లిగ్రాము మనియార్డర్లు వచ్చిపడుచుండును. నిర్విఘ్నముగా శరణాలయ కార్యక్రమము కొనసాగు చుండును.

పవిత్రుడైన వ్యక్తి ప్రారంభించిన పుణ్యకార్యములు, దేవాలయములు, సప్తాహములు, ఒక్క నయాపైస యైనను చేతిలో లేకున్నను మహావైభవముతో నిర్వహింపబడుచున్నవి.

రామభక్తుడగు హనుమంతుడు మహాసాగరమును లంఘించెను. మీరాబాయి విషమును త్రాగి జీర్ణింపజేసి కొనెను. నూతిలో పడిన అంధుడగు సూరదాసును శ్రీకృష్ణుడు తన స్వహస్తములతో లేవదీసెను.

భగవద్విశ్వాసము సర్వశ్రేయములను ప్రసాదించును. తండ్రి ప్రహ్లాదుని మహాసాగరములో ముంచినాడు. కొండలపై నుండి

తోయించినాడు, విషసర్పములచే కరపించినాడు. గజేంద్రములచేత త్రొక్కించినాడు. శూలముచే పొడిపించినాడు. కాని భక్తుడగు ప్రహ్లాదు డెట్టి యపాయమును బొందలేదు.

'మన్మనాభవ' నీ మనస్సును నా యందుంచుము' అని భగవానుడు చెప్పుచున్నాడు. కాని మనము మనమనస్సులను దారాపుత్రుల యందు లగ్నము చేయుదుము. కీర్తిప్రతిష్ఠల యందు ప్రవేశింప జేయుదుము. ధన కనకాదులయం దాసక్తి గలిగింతుము. కాని పరమేశ్వరుని యందు మాత్రము మనమనస్సును పోనీయము.

'మద్భక్తః' నాకు భక్తుడవుగమ్ము అని భగవానుని వాక్యము. కాని మనము కాంతలకు భక్తులము. కాంచనమునకు భక్తులము. సినీతారలకు భక్తులము. మన పరిస్థితి యిట్లున్నది.

'నాకు నమస్కరింపుము' అని భగవానుడు పలుకును. కాని మనము రాజకీయనాయకులకు మోకరింతుము. ధనవంతులకు కైమోడ్పులు సేతుము. అధికార గర్వపూరితులకు సాష్టాంగ పడుదుము.

నీవు భగవానుని చేతిలో కీలుబొమ్మ కావలయును. నీ సర్వస్వమును భగవానునకు సమర్పించి, నీవు కేవలము ఆయన చేతిలోని పనిముట్టుగా మారిపొమ్ము. భగవానుడు నిన్ను తీర్చి దిద్దు భారమును తనపై వేసికొనును. ఏమాత్రము అహంకార మున్నను భగవత్కటాక్షము రాదు.

రాధాదేవి ఒకపర్యాయము మురళినిచూచి ఇట్లు పలికినది. ఏమి మురళీ! నీవన్న కృష్ణునికి చాలప్రీతి. కారణ మేమిటో చెప్పెదవా?'

'రాధా! చెప్పుటకేమున్నది. నాలోపల చూడుము. ఏమియును లేదుకదా. ఏమియును లేకుండుటయే కృష్ణప్రేమకు అర్హత' అన్నది మురళి.

పోతనామాత్యుడు, 'పలికించెడివాడు రామభద్రుడు' అని భావించినంతనే రామకటాక్షము కవితారూపమున ప్రవహించి ఆంధ్ర భాగవత మయినది.

భగవంతుని నాశ్రయింపుము. సర్వము చేకూరును. గంగానది కావలియొడ్డునుండి ఒక గొల్లభామ పాలకుండను నెత్తిపై బెట్టుకొని పడవపై గంగను దాటివచ్చి పా లమ్ముకొనుచుండెను. ఒకనాడామె ఆలస్యముగా వచ్చుటచే ఒక గృహస్థు కారణ మేమని ప్రశ్నించెను. 'పడవదాటుట ఆలస్యమయినది' అని ఆమె బదులు చెప్పెను.

'ఓపిచ్చిదానా! పడవలతో గంగనుదాటవలసిన యవసర మే మున్నది? రామనామము భయంకరమగు సంసారసాగరమునే దాటించుచుండ ఈగంగానదిని దాటించలేదా' అని గృహస్థపండితుడు పలికెను. పవిత్రశీలముగల ఆ గొల్లభామ రామనామ మహిమను విశ్వసించి మరునాడు నెత్తిపై కుండబెట్టుకుని రామనామమును ధ్యానించు గంగనదిపై చరచరా నడచి వచ్చెను. ప్రతిదినము పెందలకడనే పాలు తెచ్చుటను చూచి గృహస్థుడు కారణ మేమని ప్రశ్నించెను.

'పడవతోనిమిత్తములేక రామనామధ్యానముచే గంగపై నడచి వచ్చుచుండుటచేత పెందలకడనే వచ్చుచున్నాను.' అని ఆమె చెప్పెను. గృహస్థు డాశ్చర్యపడి తాను గూడ ఆమెతో గంగను దాటుటకు బయలుదేరెను. ఆమె చరచర నడచిపోవుచుండెను. గృహస్థుడు బట్టలు పైకిగట్టి గంగలోదిగెను. అడుగు వేయుసరికి మునుగసాగెను. దీనికి హేతు వేమియో యూహింపుడు.



## 66. మహాపాపియైనను ఈశ్వరారాధనముచే పవిత్రుడే

**Even the greatest sinner is purified by God's worship.**

'అపి చే త్సు దురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥ (అ. 9–శ్లో 30)

ఎట్టి దురాచారుడైనను భగవంతుని ఆరాధించినచో అతడు పుణ్యాత్ము డగును. తాను గావించిన పాపములకు పశ్చాత్తాపమును బొంది వేడికన్నీటిధారలచే పాపమాలిన్యమును కడగివైచినవాడు

పుణ్యాత్ముడే గదా! 'ఎంతకాలములో అతడు పుణ్యాత్ము డగును? అని ప్రశ్నింపకుము. అతని పరితాప మెంత తీవ్రముగా నున్నదో అంత వేగముగా అతడు పవిత్రు డగును. భగవంతుని ఆశ్రయించినవారికి పాపము లెక్కడివి? దీపము వెలుగులో చీకటి నిలుచునా? మహావాయు ప్రవాహమున కెదురుగా మేఘములు నిలువగలవా? కడవపోతగా వర్షము కురియుచుండగా చిన్న చిన్న గడ్డిమంట లాగునా? పాపయోనుల యందు జన్మించిన స్త్రీలును, క్రయవిక్రయ వ్యాపారముల యందు అధర్మ జీవితమును గడుపు వైశ్యులును, వేదకర్మాధికార శూన్యులగు శూద్రులును, భగవదారాధనముచే పరమ పవిత్రులగుచున్నారు. జాతి మత వర్ణ కులభేదములతో నిమిత్తము లేదు. కావలసినది పవిత్రమగు భక్తిభావము. దానిని నీవు కలిగియుంటివా భగవంతుడు నీవాడు పాండిత్యముతో నిమిత్తం లేదు. అధికార ప్రాపకముతో నవసరమే లేదు. ధనకనకాదులతో పనియే లేదు.

'ఏవేదంబు పఠించెలూత, భుజగం బేశాస్త్రముల్ సూచె తా
నేవిద్యాభ్యాసనం బొనర్చె కరి చెం చేమంత్ర మూహించె బో
ధావిర్భావనిదానముల్ చదువులయ్యా కావు నీపాద సం
సేవాసక్తియె కాని జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!

అని ధూర్జటి మహాకవి గానము చేయును.

దారులనుకొట్టి జీవించు మహాక్రూరుడగు వాల్మీకి మహాపుణ్యాత్ముడై రామాయణ మహార్ణవమును సృష్టించి జగదారాధ్యుడయినాడు. అది రామనామ మహిమచేతనే సిద్ధించినది గదా! రామనామము సకలపాపహరము.

రామనామము సకలతాపత్రయములను హరింప చేయునది. అంతశ్శత్రువులను నాశనముచేయునది రామనామము. బహిశ్శత్రువులను దహించునది రామనామము. అమంగళములను మంగళకరములను గావించునది రామనామము. సకల శారీరక మానసికరోగము

లను హరించునది రామనామము. గాంధీజీ రామనామ మహిమచేతనే కుష్ఠువ్యాధులను కుదిర్చినాడు. సామాన్య వ్యాధులనుగూర్చి వేరుగా చెప్పనేల?

కాశీనగరమున ఒక మహాధనవంతుడుండెను. ఆయనకు భయంకర మగు కుష్ఠువ్యాధి ప్రవేశించినది. బంధువులును మిత్రులును అందరును ఏవగించికొనిరి. పాపమాతడు జీవితముపై రోతకలిగి ఆత్మహత్యకు ప్రయత్నించెను. కాని అది మహాపాతక మని భావించి గంగాతీరమున ఒక కుటీరమును నిర్మించుకొని ఏకాకిగా నివసింప సాగెను. ఒకనాడు రామభక్తుడగు కబీరు ఆ ప్రదేశమునకు రాగా ఈ యభాగ్యుడు ఆయన పాదములపై బడి వేడికొనెను. కబీ రాతనికి తారకమంత్ర ముపదేశించెను. ఆ మంత్రప్రభావముచే నాతడు క్రమక్రమముగా రోగరహితుడై సంపూర్ణారోగ్యమును చెందెను.

పంచమహాపాతకము లాచరించినవారికైన భగవంతుని దర్బారులో ప్రవేశించుటకు అర్హత కలదు. కావలసినవి హృదయ పూర్వకములగు భక్తిప్రేమలు.

నీ మనస్సును పవిత్రీభూతము చేయుము. ఇతరుల దోషములను వర్ణింపకుము. నీ వెట్టి నికృష్టకర్మలను చేయుచున్నను నీ మనశ్శుద్ధి నిన్ను రక్షించును.

వ్యభిచారవృత్తిచేత జీవించు ఒక వేశ్యయొక్క గృహమున కెదురుగా ఒక సాధువు నివసించుచుండెను. ఆమె ఇంటికి వచ్చు విటులను లెక్కించుచు ఒక్కొక్క రాయి చొప్పున తన ఆశ్రమములో ఒక మూల వేయుచుండెను. ఇట్లుండగా కొన్ని సంవత్సరముల కది చిన్న గుట్ట అయినది. ఆ సన్యాసి ఆ వేశ్యను పిలిచి 'చూచితివా, ఈ రాళ్ళ గుట్టలో ఎన్ని రాళ్ళున్నవో అంతమంది విటులతో నీవు సంచరించితివి. వ్యభిచారము మహాపాతకము సుమా' అని చెప్పెను.

ఆ వేశ్య తన పాపజీవితమునకు పశ్చాత్తాపడి వేడికన్నీళ్ళు

కొర్చుచు భగవానుని ప్రార్థించుచు మరియొక జీవనాధారము లేక ఆ వృత్తిలోనే జీవించుచుండెను. కాని మనస్సులో మాత్రము భగవానుని ధ్యానము మానలేదు.

ఇట్లు కొన్ని సంవత్సరములయినది రాళ్ళగుట్ట మహాపర్వతమయినది. సన్యాసి నిత్యము ను వేశ్య యింటికి వచ్చు విటులను లెక్కించుచు రాళ్ళను గుట్టపై వేయుచుండెను. కాలకర్మవశమున వేశ్యయును సాధువును ఒకసమయముననే మరణించిరి. వేశ్యకొరకు స్వర్గలోకము నుండి విమానము వచ్చినది. సాధువు కొరకు భయంకరులగు యమదూతలు వచ్చిరి. దీనికి కారణమేమియో మీరలే యూహింపగలుగుదురుగాక.

మహాపాపియు భగవద్ధ్యానముచే ఉత్తమురాలైనది. సన్యాసి యయ్యును నిరతంర దుష్టచేష్టలను గణించుటచే నాతడు పాపాత్ముడే.



## 69. 'యోగక్షేమం వహామ్యహం' (అ 9-శ్లో 22)

**I carry on the acquisition and presentation of my devotion**

నాభక్తులకు గావలసిన సమస్తమును సమకూర్చువాడను నేనే. 'వానిని పరిరక్షణముచేయువాడను నేనే' యని భగవానుడు పలుకుచున్నాడు. కావలసిన పదార్థములను సమకూర్చుట 'యోగ' మని చెప్పబడును. వాని సంరక్షణము 'క్షేమ' మని చెప్పబడును. ఈ భారమును వహించువాడను నేనే యని శ్యామసుందరుడు భక్త జనులకు అభయ ప్రదాన మొసగుచున్నాడు.

**'This is Godly promise-This is Devine declaration'** ఇది భగవానుని వాగ్దానము. ఇయ్యది పరమేశ్వరుని స్పష్టమగు దివ్యప్రకటనము. అని భక్తులు ఈ మంగళ శ్లోకమును నిరంతరమును

స్మరించుచు, భావించుచు, చింతించుచు, ధ్యానించుచుంటిమని నిత్యజీవితములందు అనుభవించుచు సకలార్థములను బొందుచు సుఖశాంతులతో వర్ధిల్లుచున్నారు. భగవంతుడు ప్రేమమయుడు. కరుణాసాగరుడు. తన్నాశ్రయించి శరణాగతిని బొందిన భక్తులకెట్టి ప్రమాదములను రానీయడు. వారికి తాను అండయై, దండయై, సారథియై, సచివుడై, మిత్రుడై, బాంధవుడై మహాఫలసంధాయకుడై వారి యోగక్షేమములను వహించుచుండును.

మాగురుదేవుడు చెప్పిన ఒకయథార్థ సన్నివేశమును వివరించుచున్నాడను. ఉత్తర బృందావనస్థానమున 'రీటా' యను సంస్థానము పూర్వ ముండెడిది. ఆసంస్థానాధీశుడు కృష్ణభక్తుడు. ఆ భక్తుడు తన పట్టణము నందొక కృష్ణాలయమును నిర్మించినాడు. ఆయన ప్రతిదినమును నియమానుసారముగా సాయంకాలమునందు దేవాలయమునకరిగి శ్యామ సుందరుని అర్చించి, కీర్తించి, ధ్యానించి, అర్చకస్వామి యిచ్చిన ప్రసాదమును స్వీకరించి యింటికిపోవును. ఇది ఆయన నిత్యనైనందిన ముఖ్యకార్యక్రమము.

ఆ దేవాలయమందున్న అర్చకస్వామియును మహాభక్తుడు. ప్రతిదినమును విధిగా సంపూర్ణగీతా పారాయణముచేసి స్వామిని సహస్రనామములతో విధివిధానముగా నర్చించును. ప్రసాదమును నివేదనముచేసి సంధ్యాసమయమున నచ్చటకు వచ్చిన రాజుగారికి భక్తితో నిచ్చును.

ఒకనాటి సాయంకాల సన్నివేశ మిది. రాజుగారు ఆనాటిసాయంకాలము దేవాలయమునకు సకాలమునకు రాలేదు. అర్చకుడు చాల ప్రొద్దుపోవువరకును వారికొరకు ఉంచిన ప్రసాదమంతయును అచ్చటనున్న వారికే పంచియిచ్చి గర్భాలయ ద్వారమును మూసివేసెను. అంతట పరుగు పరుగున రాజుగారు దేవాలయమునకు విచ్చేసిరి. గర్భాలయము మూయబడి యుండుటచేత దైవదర్శనము కాలేదే

యని చాల విచారించెను. అర్చకస్వామినిచూచి, ప్రసాదమైనను నున్న యెడల కొంచెము దయచేయుమని రాజు ప్రార్థించెను.

కాని వాస్తవముగా ప్రసాద మేదియును లేదు. 'ప్రసాదమేదియును లేదని చెప్పుటకు మనస్సొప్పక అర్చకస్వామి రాజుగారికి కానరాకుండ ప్రక్కగాబోయి తన సిగలోనున్న మల్లెపూల దండలో నుండి కొన్ని పూవులను దీసి, మహారాజా ఇదిగో శ్యామసుందరుని దివ్య ప్రసాదము, స్వీకరింపు డని ఆయన హస్తములలో నుంచెను. మహారాజాపుష్పములను భక్తితో కండ్ల కద్దుకొని చూచెనుగదా వానిలో తెల్లగానున్న రెండు మూడు శిరోజములుగాన నయ్యెను. 'స్వామి, ఇదియేమి! ఈపువ్వులలో శిరోజములు కానవచ్చుచున్న వేమి అని ప్రశ్నించెను. 'శ్యామసుందరుని శిరోజములలో నలంకరింపబడిన దివ్యపుష్పములనే దీసి మీకు ఈనాడు ప్రసాదముగా నిచ్చినాను' అని అర్చక స్వామి బదులు చెప్పెను.

మంచిది, అయితే మన శ్యామసుందరుని శిరోజములు అప్పుడే తెల్లబడిపోయినా యేమి ? అని ఆశ్చర్యముగా రాజు ప్రశ్నించెను. పూర్వకాలమున చాలమంది వైష్ణవభక్తులు తమసిగలయందు|పూలను అలంకరించి కొనుట సంప్రదాయమైయున్నది. వృద్ధుడగు ఈ దేవాలయార్చకుడు కూడ మల్లెపూవులను సిగలో ధరించియుండెను. తొందర పాటుగా సిగలోనిపూవులను తీయుటలో రెండు మూడు తెల్లని వెంట్రుకలు కూడ పూలతో కలసి వచ్చి రాజుగారి చేతిలోని ప్రసాదమైనది.

నిన్నటివరకును తుమ్మెద రెక్కలవలె మిక్కిలి నల్లనైయున్న నందనందనుని శిరోజము లాకస్మికముగా తెల్లబడిపోయినవా! ఏదీ చూతము—దేవాలయద్వారములు తెరువుడు' అని మహారాజు గంభీరముగా పలికెను. అర్చకస్వామి మిగుల కంగారుపడినాడు. ఏమియును తోచ లేదు. నందనందనుని మనసార ధ్యానించెను.ఆత డీరీతిగా పలుక

సాగెను. మహారాజు అప్పను. శ్యామసుందరుని శిరోజములు తెల్లబడి పోయినవి. సందేహము లేదు. గర్భాలయ ద్వారములు మూసివేసి యున్నందున మరల నిప్పుడు తెరచుట సంప్రదాయ విరుద్ధము గదా! రేపు ఉదయమున మీరు విచ్చేసినచో స్వామి శిరోజములను దర్శించ గలరు.

రాజుగారు ఆశ్చర్యముతో గృహమునకు పోయెను. అర్చక స్వామియును తనగృహమునకు పోయెను. అతని కేమియును తోచుట లేదు. భయకంపితుడయ్యెను. 'తెల్లవారగనే రాజువచ్చి శ్యామసుంద రుని దర్శించును. తన అసత్యవాక్యమునకు తన్ను నిందించును. తన్ను ఉద్యోగమునుండి తొలగించును. తాను అపకీర్తి పాలగును' అని దుఃఖించుచు, ధైర్యము తెచ్చుకొని సర్వమునకును నందనందనుడే శరణ్యమని భావించెను. భక్తిశ్రద్ధలతో రాత్రి యంతయు గీతను పలు మారులు సంపూర్ణపారాయణము చేసెను. అందుగల భగవానుని వాగ్దానవాక్యములను మరల మరల స్మరించెను.

'యోగక్షేమం వహామ్యహం' 'న మే భక్తః ప్రణశ్యతి' (నా భక్తునకు పతనము లేదు) మచ్చిత్తః సర్వ దుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి (నీ మనస్సు నాయందుంచినచో సకల కష్టములనుండియు నాయనుగ్రహముచేత దాటిపోగలవు.) ఇట్లు జపించుచుండగా బాల భానుని అరుణారుణదివ్య శోభలతో తూర్పు దిక్కు భాసింపసాగెను.

అర్చక స్వామి స్నానమాచరించి, 'యోగక్షేమం వహామ్య హం' అష్టాక్షరీ అన్నమంత్రమును జపించుచు దేవాలయమునకు పోయెను. అంతకుముందే మహారాజు తన ఉద్యోగులతో గర్భాలయ

మున కెదురుగా నాసీనుడై యుండెను. అర్చకస్వామి నిశ్చయముగా శ్యామసుందర ధ్యానముతో గర్భాలయమును తెరచెను.

ఆశ్చర్యము! పరమాశ్చర్యము! అద్భుతము! పరమాద్భుతము. శ్యామసుందరుడు తెల్లనిశిరోజములతో భాసించుచుండెను.

దీని సారాంశమును పాఠకులు గ్రహించియే యుందురు. గీతా వాక్యములలోని పరమ సత్యమును భక్తులు గ్రహింతురుగాక. అర్హతలు గల భక్తుని యోగక్షేమములను మాత్రమే భగవానుడు వహించునని గ్రహించవలయును. ఏమిఅర్హతలు గావలయును?

'అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥

అనన్య చింతన కావలయునని భగవానుడు పలుకుచున్నాడు. 'అన్యాశయానాం త్యాగోఽనన్యతా' ఎట్టియితరచింతలును, భావములును, ఆలోచనలును, లేక భగవంతుడే పరమప్రాప్యముగా భాసించుటే' అనన్యచింత యగును. 'ఉపాసనగాక పర్యుపాసన గావలెను. అనగా ఎడతెగని నిరంతరధ్యానము కావలయును. అట్టివారే నిత్యాభియుక్తు లనబడుదురు. సారాంశ మేమన-ఆసక్తి స్థానమును, ఆశ్రయస్థానమును ఒక్కటియై యుండవలెనని భావము.

తిరుపతికి పోయి భక్తులు వేంకటాచలపతిని ఆశ్రయింతురు. భగవానుని ఆశ్రయించుట విశేషమే, కాని వారి ఆసక్తి యెక్కడనున్నదో గమనించదగును. ధనధాన్యములపై కోరిక, భోగభాగ్యములందాసక్తి, ప్రాపంచిక విషయలందే అనురక్తి, ఈరీతిగా ఆశ్రమస్థానమును, ఆసక్తిస్థానమును భిన్న భిన్నములుగా నుండును. ఎవరిని

ఆశ్రయించి నావో వానిని పొందుటయందు మాత్రమే నీకు ఆసక్తి యుండవలెను. అట్లైనచో మానిత్య సాంసారిక జీవితము ఎట్లు జరుగునని మీరు ప్రశ్నింతురు. అదిగో! 'యోగక్షేమం వహామ్యహం' అని భగవానుడు అభయ ప్రదానము చేయుచున్నాడు.

మా గురుదేవు డెరింగిన ఒక పాఠశాలోద్యోగి (**Deputy Inspector of Schools**) గలడు. ఆయన రామభక్తుడు. నిరంతరమును రామస్మరణ చింతనధ్యానములు చేయుచు తన ఉద్యోగమును భగవదారాధనముగా, యజ్ఞముగా చేయుచున్న ఉత్తమ గృహస్థుడు.

ఆయన సత్ప్రవర్తనమున విద్యాశాఖలో మంచిపేరు ప్రతిష్ఠలను సంపాదింపగలిగినాడు. ఒకనాడు విద్యాశాఖోన్నతాధికారి ఆయనకొక లేఖ వ్రాసెను. అందులో నిట్లున్నది. 'ఒకానొక పాఠశాలను గూర్చి ప్రజలనుండి అనేకములగు చెడ్డ విమర్శలు వచ్చినవనియు, అతి రహస్యముగా పోయి, అచ్చటి పరిస్థితులను గూర్చి స్వయముగా పరిశీలించి, విచారణ గావించి విషయమంతయును వెంటనే తనకు తెలుపవలయుననియు కోరబడెను. అతిప్రధానమగు ఈవిషయ పరిశోధనకై సదరు ఉద్యోగి మరునాడు ఉదయమే ఆగ్రామమునకు బయలుదేరెను. మార్గ మధ్యమున కొందరు భక్తులు దేవాలయమున గూర్చుండి భక్తితో సంకీర్తనలు చేయుచుండగా రామభక్తుడగు నీపాఠశాలోద్యోగి అచ్చటే ఆగిపోయి సంకీర్తనములో పాల్గొనెను. తన్మయత్వముతో సంకీర్తనాదులు చేయసాగెను, తనవిధ్యుక్తధర్మమును మరచిపోయెను. రాత్రి ఎనిమిదిగంటలైనది. సంకీర్తనాదులు పూర్తియైనవి. హారతి ఈయబడెను. అంతట మన ఉద్యోగికి దేహస్మృతి కలిగెను. కర్తవ్యనిష్ఠకు భంగము కలిగినందులకు చాల విచారించి గృహము

నకు తిరిగి పోయెను. పై అధికారి నుండి తనకు మందలింపులు శిక్షలు రాగల వని భావించెను. నాలుగురోజులైనది. ఆయనకొక తంతి వచ్చెను. అందులో ఆయన పంపిన పాఠశాల విచారణకు సంబంధించి రిపోర్టు చాలబాగుగా నున్నదనియు, ఇంతటి ఘనకార్యమును చాలమెలకువగా తెలివితేటలుగా నిర్వహించి నందులకుగాను ఆయనకు జిల్లావిద్యా శాఖాధికారిగా ప్రమోషను చేయనున్నట్లును విషయము గలదు. ఆయన ఆశ్చర్యచకితు డయ్యెను.

ఇందలి సారాంశమును పాఠకులు గ్రహించియే యుందురు. శ్రీరామచంద్రుడే ఆ పాఠశాలోద్యోగి యొక్క వేషమును ధరించి ఆ గ్రామమునకు బోయి, తనిఖీలుచేసి, విచారణలుచేసి రిపోర్టును పై యధికారులకు పంపినాడు. భగవంతుడు భక్తునకు సేవకుడైనాడు.

'యోగక్షేమం వహామ్యహం' అన్న గీతా సూక్తి పరమ సత్యమే.

...—...

# గీతాకల్పవృక్షము

పదవ అధ్యాయము – విభూతి యోగము

## 70. గీతా వైభవము. The splendar of Geeta.

కరుణాసముద్రుడైన పార్థసారథి అనుగ్రహ విశేషముతో గీతాశాస్త్రములోని పూర్వార్థమును ముగించి ఉత్తరార్థములోనికి ప్రవేశించుచున్నాము. ఈసందర్భమున గీతా వైభవమును గూర్చి మరికొంతగా భావించి, తలచి, ధ్యానించి, పవిత్రుల మగుదుముగాక. గీతా వైభవ విశేషములను గూర్చి లోగడ అధ్యాయములో మనము శ్రవణము చేసియున్నను మరల దానిని గూర్చి శ్రవణముచేయుటయు, ప్రవచించుటయు, రచించుటయు, పునరుక్తి గావని పాఠకులు భావింతురుగాక!! ఆధ్యాత్మిక విషయములలో పునరుక్తి దోషములేదు. సరిగదా, పునరుక్తి వలన దానివైభవమును, విశిష్టతను, సౌరంభర్య మును మరల మరల గ్రహించి భక్తి జ్ఞానపథములలో మరింత ముందుముందునకు గమనము చేయుటకు దోహదములుగా గలవు.

'పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతం అద్వైతా మృతవర్షిణీం భగవతీం అష్టాదశాధ్యాయినీం అంబ! త్వా మను సంద ధామి భగవద్గీతే భవద్వేషిణీం.

ఒక గ్రంథము యొక్క గొప్పదనము దానిని గానము చేసిన వ్యక్తినిబట్టి కలుగు చుండును. భగవద్గీతను గానము చేసినది మానవుడు కాడు. ఒక పండితుడుగాడు. ఒకసాధువుగాడు, ఒకసంస్కర్తయునుగాడు, ఒక ఋషియునుగాడు. సాక్షాత్తు భగవంతుడే గానము చేసినాడు, 'ఎవ్వనిచే జనించు జగము ఎవ్వని లోపలనుండు లీనమై, ఎవ్వని యందు డిందు అట్టి పరమాత్మయే గీతాగానము చేసినాడు.

గదా, ప్రపంచ వాఙ్మయములో భగవానుడు గానము చేసినది భగవద్గీత యొక్కటియే.

భగవంతుని కుమారుడు గానము చేసినది క్రైస్తవుల పవిత్ర గ్రంథముగా వచ్చును. దేవ దూతి గానము చేసినది ముస్లిముల మత గ్రంథ రాజము గావచ్చునుకాని భగవంతుడే స్వయముగా గానము చేసినది గనుకనే భగవద్గీత విశ్వ వేదాంత మహాగ్రంథ రాజమైనది. (Universel text book of religion and philosophy) కనుకనే 'భగవతా నారాయణేన స్వయం,అని తెలుప బడినది, నారములకు (సమస్త జీవకోటులకును) నిలయమైనవాడు (The supreme abode of all beings)కనుకనే ఆయన నారాయణుడైనాడు. అంత మాత్రమేగాదు. నారము అనగా జ్ఞానము. జ్ఞానసాగరుడగుటచే (Supreme ocean of knowledge) భగవానుడు నారాయణు డని పిలువబడు చున్నాడు. అంత మాత్రమే గాదు. ఆయన భగవానుడు అనగా షడ్గుణైశ్వర్య సంపన్నుడు.

'ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా
ఉత్పత్తిం ప్రళయం చైవ భూతానాం మాంగతం గతం
వేత్తి విద్యా మ విద్యాంచ సవాచ్యో భగవా నితి,

సమగ్రమైన మహైశ్వర్య, ధర్మ, యశోభూవితులతోను మహాప్రాభవ జ్ఞాన వైరాగ్యములతోను శోభిల్లుచు జగదుత్పత్తి ప్రళయములు, భూతకోటుల గతా గతములు, విద్యా విద్యలు నెరింగినవాడే భగవాను డని విష్ణు పురాణము వర్ణించును. అట్టి అనంత కల్యాణ గుణార్ణవ దివ్యమూర్తి గానము చేసినదే శ్రీమద్భగవద్గీత. కావుననే వ్యాసదేవు డిట్లు వచించును.

గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరే,
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాత్ వినిసృతా'

భారతీయ వేదాన్త సాహిత్య ప్రపంచములో ఎన్నియో గీత లున్నను 'గీత' అనగా కురుక్షేత్రమున భగవానుడు గానము చేసిన భగవద్గీత యని సార్థ యర్థము చెప్పబడు చున్నది కనుకనే 'గీత' 'సుగీతా' యని చెప్పబడెను. అనగా గీతను చక్కగా పఠింపవలెను. పారాయణము చేయవలెను. అనుష్ఠానము చేయవలయు నని యే భావము.

అసంఖ్యాకములగు ఉపనిషత్తులసారామృతమే 'గీతయైనది గదా...' కిమన్యైః శాస్త్రవిస్తరైః అని చెప్పుటచే ఇతరగ్రంథము లతో నిమిత్తము లేదని భావము. అష్టాదశ పురాణములు; ఉపపురాణ ములు, న్యాయ, సాంఖ్య, వైశేషిక, యోగ, పూర్వ మీమాంసా, ఉత్తర మీమాంసాది షడ్దర్శనముల సారమంతయును గీతాశాస్త్రమే యని భావము. ఇయ్యది 'పద్మనాభుని ముఖపద్మమునుండి జాలువారిన అమృత స్రవంతి' యగుటయే దాని విశేషము.

ఇయ్యది ఎవరికి బోధింపబడినది? యనునది రెండవప్రశ్న. పార్థునకు చెప్పబడినది గదా పార్థుడు. మానవజాతికి ప్రతినిధి (Representative of mankind) పృథివీతత్వముతో గూడిన మానవుల కెల్లరకును అది ఉపదేశ గ్రంథము ఇది నరునకు చెప్పబడినది. చెప్పినవాడు నారాయణుడు – ఇదినరనారాయణ సంభాషణము – మానవునకును మాధవునకును జరగిన సంభాషణము (adiology between man and God)

ఇక దీనిని గ్రంథస్థము చేసిన (edited) మహనీయు డెవడు? 'వ్యాసేన గ్రథితాం పురాణమునినా' అని చెప్పబడినది. మునిలోక సార్వభౌముడైన వ్యాసదేవుడు దీనిని గ్రంథస్థము చేసినాడు. వ్యాసుడు విశ్వవేదాంత కవిసార్వభౌముడు. వ్యాసునివలె అనంతమగు కావ్య సృష్టిని గావించిన మహాకవి యింతవరకును ప్రపంచ సాహిత్య లోక మున మరి యెవ్వరును గానరారని మాక్సుముల్లరువంటి మహాపండితులు

గానము చేసియున్నారు. 'మునీ నా మప్యహం వ్యాసః' మునులలో నేను వ్యాసుడను' అని భగవానుడు వచించినాడు. (గీత 10. శ్లో.37)

గీతా గ్రంథమెచ్చట నిక్షిప్తము చేయబడినది?- మహాభారత మధ్యభాగములో - విశ్వసాహిత్యంలో మేటి గ్రంథము మహాభారతము. చరిత్రగా, పురాణముగా, మహాకావ్యముగా, నీతిశాస్త్రముగా, కవితారసవాహినిగా, మహాసాహిత్యభండారముగా వ్రాసి గాంచిన మహాభారతములోని భీష్మపర్వము లో వ్యాసదేవుడు దీనిని పొందు పరచుట విశేషము. 'తత్వమసి' 'Thou art That' అన్నదే గీతాశాస్త్ర సందేశము. జీవో బ్రహ్మైవ నాపరః' The individual soul is no other than the Supreme self జీవుడే పరబ్రహ్మమని ప్రబోధముచేసిన అనుష్ఠాన వేదాంత సార మే భగవద్గీత.

ఆమె భగవతి, ఆమె అంబ, ఆమె మనకు జననీమతల్లి, గీతా హృదయము మాతృహృదయమే.

'అష్టాదశాధ్యాయినీం' అని వర్ణించుట మరియొక గొప్పవిశేషము. మహాభారతములోని పర్వములు పదునెనిమిదిటి యొక్క విశిష్టతను గూర్చి తొలి అధ్యాయమున కొంతవరకు వివరింపబడినది. గీతలో అధ్యాయములు పదునెనిమిది. పదునెనిమిది అనగా (18) 1+8=9 యగును. తొమ్మిది పూర్ణసంఖ్య. భగవంతుడు పూర్ణుడు. 'పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావశిష్యతే'యని ఉపనిషత్తు వచించును. తొమ్మిది యను సంఖ్యను దేనితో గుణించినను వచ్చిన లబ్ధములోని సంఖ్యలను సంకలనము చేసినచో తిరిగి తొమ్మిదియే వచ్చును. ఇది దీని విశిష్టత.

ఇట్టి పరమపవిత్రమగు భగవద్గీత విలసిల్లిన పుణ్యభూమిలో మనము జన్మించినాము. ఈ అధ్యాయము సుందరాతిసుందరమైనది. భగవానుని విభూతి శోభలతో గూడిన సుందరాధ్యాయ మిది. 'విభూతి' అనగా భగవానుని యొక్క మహైశ్వర్య స్వరూప మని అర్థము. (Devine glories)

విశ్వసూత్రధారుడు భగవానుని దివ్యకళా సుందర మందిరమే. కాని నీవు ముందుగా మంగళరూపములలో భగవానుని దర్శించుము. పిమ్మట రావణాసురునిలో గల భగవానునికూడ పిమ్మట దర్శించగలవు. కృష్ణునిలోని దివ్యత్వమును మున్ముందు దర్శించి ముగ్ధుడనగుము. తరువాత కంసునిలోగల దివ్యత్వమును దర్శించుటకు ప్రయత్నింపుము.

గోమాతలోని సాధుత్వమును దర్శింపుము. పిమ్మట పెద్దపులిలోని దైవత్వమును దర్శింపగలవు.

సర్వవ్యాపకమగు భగవంతుని దివ్యతత్త్వమును దర్శించి; చింతించి భక్తులు ఆనంద సాగరములో నోలలాడుచుందురు. మానవునకు ఆనందమెట్లు లభించును?

'మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ (అ 10–శ్లో 9)

'మచ్చిత్తాః మద్గతప్రాణాః' భక్తులు తమసమస్త – ఇంద్రియములను మనస్సును భగవంతుని యందే లగ్నము చేయుదురు. ఎట్లు.

'కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని చూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము'

అని భాగవతము ప్రహ్లాదుని భక్తి విశేషములను వర్ణించును. భక్తుడు తన హస్తములతో భగవానుని పూజించును. నాలుకతో హరి కీర్తనము చేయును. నేత్రములలో భగవద్రూపములను దర్శించును. శిరమువంచి నమస్కరించును. పాదములతో నడచి విష్ణుమందిరమునకు పోవును. అదియే వారికి ఆనందము. ప్రాపంచిక విషయ భోగములవైపు వారిమనస్సు ప్రసరించదు.

బోధయన్తః పరస్పరం (Mutual discussions about God) భగవంతుని గూర్చిన సంభాషణము లే వారు చేయుదురు. భక్తి మార్గమునుగూర్చి, జ్ఞానమార్గమును గూర్చి కర్మమార్గమును గూర్చి వారు తెలియ చెప్పుకొందురు. 'కథయన్తశ్చ మాం నిత్యం' భగవంతుని కథలను గానము చేయుటయే వారిపని. ఈరీతిగానుండు భక్తులను వారి వారి చిత్తములను పరిశుద్ధము చేసి వారి యందలి అజ్ఞానమును తొలగించి ఆత్మజ్ఞాన జ్యోతిని తానే విరాజిల్ల చేయుదునని భగవాను డీ యధ్యాయములో పలుకుచున్నాడు (శ్లో 10-11).

---

## 71. భగవంతుడు సర్వవ్యాపి. God is all pevading.

శ్రీకృష్ణ స్వరూపులయిన సోదరీ సోదరులకు నమస్సులు. భగవానుని ఆశీస్సులచే గీతలోని పూర్వార్ధమును పూర్తిచేసి ఉత్తరార్ధములో ప్రవేశించుచున్నాము. పరమేశ్వరునకు మనపై సంపూర్ణమగు కారుణ్యము కలదు గనుకనే గీతను గురించి శ్రవణము - ప్రవచన పారాయణములు చేయగలుగుచున్నాము. కళ్యాణమూర్తియగు గీతాచార్యునకు - ఆపార్థసారథికి, ఆ గోపాలదేవునకు, సాష్టాంగ నమస్కారములు మరల మరల గావించుచు పుణ్యప్రదమగు ఈ దశమాధ్యాయమును ప్రారంభింతును. ఇది భగవంతుని విభూతి రూపములతో నిండియున్న మంగళకరమగు అధ్యాయము. భగవంతుడు ప్రపంచము నందేయే స్థలములలో, ఏయే రూపములలో, ఏయేభావములలో, ఏయే ఆకారములలో, ప్రకాశించుచున్నాడో భగవానుడే ఈ అధ్యాయములో గానము చేయుచున్నాడు. అందువలన ఇది అతిమధురమైనది.

భగవంతుడు కొన్ని తావులయందే కలడా, కొన్ని ఆకారములలోనే గోచరించునా, కొన్ని స్థలములలోనే ఆయన కానుపించునా, ఇతర స్థలములలోను రూపములలోను ఆకారములలోను ఆయన

లేదా, అని మీరు సందేహించుచున్నారా? అట్టి సందేహమును మీ రెన్నడును పొందకుందురు గాక.

విశ్వమంతయు భగవంతుని అన్యూతకావ్యము. తాను సృష్టించిన ప్రతి అణువులోను ఆతడు ప్రకాశించును. ఆయన లేని తావు లేదు. సాగరములోని ప్రతి నీటితుంపరలోను ఆయన తాండవించును. ప్రతి ఇసుక రేణువులోను భగవంతుడే విలసిల్లును.

'అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే' సర్వమునకు సృష్టికర్తను నేనే. నా వలననే సకలము వ్యాపించియున్నవి' అని భగవానుడు పలుకును.

ఒక గురువు సంవత్సరకాలమునుండి పరమేశ్వరుని సర్వవ్యాపకత్వమును గూర్చి శృతి స్మృతి పురాణేతిహాసములతో బోధించుచుండెను. తాను చెప్పుచున్న బోధ శిష్యుల కెంతవరకు అర్థమయినదో పరీక్షించవలయునని గురువుగారి కాసక్తి గలిగెను. ఆయన తన శిష్యులనుపిలచి 'నాయనలారా, నావద్ద పది అంజూర ఫలము లున్నవి. ఒక దేవదూత నాకు వీని నిచ్చినాడు. ఇవి అతిరుచిగా నుండును. మహాశక్తి వంతములగు ఫలము లివి. వీనిని భుజించినవారికి దీర్ఘాయువు, మేధాశక్తి కలుగును. కాని వీనిని మీరు అతిరహస్య స్థలమున, అనగా ఇతరులు చూడని తావున, పరులకంట బడకుండా భక్షింపవలెనుసుమా' అని పలికి ఒక్కొక్కరికి ఒక్కొక్క ఫలము చేతిలో పెట్టెను. శిష్యులందరును ఆ ఫలమును తీసికొని పరుగు పరుగున పోయిరి.

మరునాడుదయమున వారు గురువుగారి వద్దకు చేరిరి. మొదటి శిష్యు డిట్లు చెప్పెను. గురుజీ నేను చీకటిగా నున్న గదిలో ఒంటరిగా ప్రవేశించి తలుపు బిగించి రహస్యముగా భక్షించి వచ్చితిని.

రెండవవాడు, నేను దూరముగా అరణ్యములోనికి పోయి ఎవ్వరును లేనితావున భక్షించితిని.

మూడవవాడు, నేను నీటిలో మునిగి భక్షించితిని. నాల్గవవాడు, భూమిపై మానవు లుందురని చెట్టుపైకెక్కి భక్షించితిని.

అయిదవవాడు నేను గొంగళిని శరీరమంతయు కప్పుకొని భక్షించితిని. నేను తినుచుండగా నెవ్వరును చూడలేదు.

ఆరవవాడు; నేనొక్కడను మరుగుదొడ్డిలోనికి పోతిని. తలుపు బిగించితిని. మరెవ్వరును అందు ప్రవేశింప వీలులేదుకదా. అక్కడ నేను రహస్యముగా భక్షించితిని.

ఏడవవాడు నేను పర్వత గుహలోనికి పోయి తింటిని. ఎనిమిదవ వాడు నేను మనయూరి దేవాలయ గోపురము ఎక్కి రాత్రి రహస్య ముగా భక్షించితిని.

తొమ్మిదవవాడు నే నాఫలమును ఒకానొక భూమిసొరంగ ములో దూరి భుజించితిని. ఎవ్వరును రాని రహస్య స్థల మది.

పదియవ శిష్యుడిట్లు పలికెను. 'గురుదేవా నమస్కారము. నాకు రాత్రియంతయు నిద్దురపట్టలేదు. ఎవ్వరును లేని స్థలము నాకెచ్చ టను గోచరింపలేదు. భగవంతుడు లేనితావు ఎచ్చట గలదు? ప్రతి అణువులోను ఆయన విరాజమానుడై యున్నాడని తాము ప్రతిదిన మును సెలవిచ్చు చున్నారుగదా. భగవంతుడు లేని తావు నాకు కాన రాలేదు. అందుచే ఈఅంజూరఫలమును నేను భుజింపలేదు. గురుదేవా! వందనము మీఫలమిదిగో' అని గురువుగారి చేతిలో అంజూరఫలముం చెను. గురువు మహాప్రీతుడై శిష్యుని ఆలింగనము చేసికొనెను. 'నాయనా' నీ కొక్కనికే నా బోధ అర్థమయినది.' అని గురువు వచించెను.

సారాంశ మిది. భగవానుడు లేని తావులేదు. ఆయన సర్వత్ర ప్రకాశించుచున్నాడు.

అయితే భగవంతుని కొన్నిరూపములలోను - కొన్ని ప్రదేశ ముల యందును దర్శించుమని చెప్పుచున్నారే - దీని భావ మేమియని ప్రశ్నించుచున్నారా ? ఆలకింపుడు. భగవంతుని సూక్ష్మస్వరూప

మును సామాన్య మానవుడు చూడలేడు. భగవంతుని అవ్యక్తస్వరూపము కన్న వ్యక్తస్వరూపము సాధకునకు హృదయంగమముగా నుండును. భగవత్ప్రకాశము అన్నిటియందును సమానముగా నున్నను కొన్ని వస్తువుల యందు ప్రకాశము మరింత తీవ్రముగా గోచరించును. ఒక ఉదాహరణమును గమనింపుడు.

సూర్యుడు అన్నిటియందును సమానముగానే తన కిరణజాలముల‌ను ప్రకాశింప చేయును. ఆయనకు ఒకరిపై ప్రియముగాని వేరొకరి యందు ద్వేషముగాని లేదుకదా. ఆయనకు ఒక ప్రదేశము ఇష్టము, వేరొక ప్రదేశము అనిష్టమును గాదుగదా.

ఇచ్చట మూడువస్తువు లున్నవి. మొదటిఅద్దము. రెండవది నీటి తొట్టె. మూడవది నాపరాయి. ఈ మూటిడిపైనను సూర్యకిరణములు సమానముగనే పడుచున్నవి. కాని నాపరాతిపై సూర్యబింబము కొంచెమైనను ప్రతిఫలించుట లేదు. నీటి తొట్టెలో రవిబింబము కొలదిగా ప్రతిఫలించును. అద్దముపై రవిబింబము ప్రకాశవంతముగా శోభిల్లును. సూర్యునకు అన్నిటియందును సమాన భావమే యున్నను ఆయావస్తువుల సహజస్వాభావిక స్థాయినిబట్టి సూర్యప్రభావము భిన్న భిన్నముగా గోచరించునట్లే, భగవానుని దివ్యప్రకాశ మన్నిటియందును సమానమే, యయ్యును కొన్నిటియం దాదివ్యప్రకాశము మహా ప్రతిభావంతమై స్థూలనేత్రమునకు గోచరించును. అట్టి వస్తువులే భగవద్విభూతి రూపములు భగవంతుని ఉపాసనమునకు ఇవియన్నియును సాధనములు. మొదట భగవానుని స్థూల రూపములలో తిలకించుము. తరువాత క్రమముగా సూక్ష్మాతి సూక్ష్మకణములలో గూడ ఆయన దివ్య దర్శనమును పొందగలవు. మహాపర్వతములో ముందుగా భగవద్విభూతిని దర్శించుము. పిదప ఇసుక రేణువులో దర్శించ గలవు.

ముందు సరళ రూపమును చూడుము. తరువాత పరుష రూపములో చూడవచ్చును. దీనినే ఖండోపాసనా పద్ధతియని పిలుతురు. ఖండో పాసనా పద్ధతి అఖండో పాసనకు దారితీయగలదు. భగవంతుడు తన విభూతులను చెప్పుచున్నాడు. శ్రద్ధగా ఆలంకింపుడు.



# 72. ప్రకృతిలో భగవానుని ఆరాధనము.

భగవానుని సూక్ష్మరూపమును మీరు చూడలేక పోవచ్చును. కాని ఆయన అనేక రూపములతో మనకు స్థూలస్వరూపముతో కానవచ్చుచుచే యున్నాడు. సహస్ర కిరణములతో భాసిల్లి లోకమునకు వేడిమిని వెలుతురును ప్రసాదించు సూర్యుడు భగద్విభూతి. భగవానుని దివ్యప్రకాశ మిట్లు సూర్య రూపమున ప్రకటితమగుచున్నది. లోకమునకు చల్లదనమును ప్రసాదించు చందమామ భగవానుని విభూతిగాక మరియేమి? సూర్య చంద్రులు విష్ణుదేవుని నేత్రద్వయ మని కవి గానముచేయును. ఆ వర్ణన ఎంత మనోహరమైనది.

ఓహో ఏమి ఆ మలయపవనము! సంక్షుభిత హృదయముల కెంతటి హాయిని ప్రసాదించుచున్నది. మలయపవనుడు దేవ దేవుని ప్రేమసందేశమును వ్యాపింపచేయుచున్నాడు. మీ రెప్పుడైనను బ్రాహ్మణోత్తములు సామవేదమును గానముచేయుచుండగా వింటిరా! ఆ సామగాన మెంత మధుర మైనది. అది భగవానుని విభూతి. అగ్నిహోత్రమీ జగత్ వంద్యుని తేజోవిభూతికాక మరి యేమి ?

శంకరుని యందలి శుభప్రదాయకత్వము, కుబేరునియందలి యైశ్వర్యము, బృహస్పతిలోని బుద్ధిబలము. నారదునిలోని దైవసంపత్తి,

స్కందునిలోని సైన్యపరిపాలనా దక్షత-భృగువులోని మహాత్మ్యము, కపిలునిలోని ప్రాధనము-మన్మథునిలోని మన్మథత్వము - ప్రహ్లాదుని లోని భక్తి - యమునిలోని దండన పరుషత్వము - శ్రీరామునిలోని శస్త్రధారణచాతుర్యము - వ్యాసునిలోని ధౌరంధర్యము - పార్థుని లోని సుహృత్సంపద - సర్వము ఆ పరాత్పరుని లీలావిశేషచాతుర్య ములే యని గీత తెలుపుచున్నది.

ప్రకృతిలో పరమేశ్వరుడెట్లు తాండవించుచున్నాడో ఒకపర్యాయము పరికించి ముగ్ధుడవు గమ్ము.

ప్రాణులలో గల చైతన్య మాయన విభూతియే. అదిగో మహా సాగరము. ఓహో అదిఎంత గంభీరమైనది. ప్రణవ నాదమును గానము చేయు విశ్వమునకు ఆధ్యాత్మిక సందేశము నిచ్చుచున్నది. సాగరతీర మున కూర్చున్నచో ఎంతప్రసన్నత! ఎంత పవిత్రత! ఎంతటి యానందము! పరమేశ్వరుని గాంభీర్యభక్తి కది యొక చిహ్నమేమో!

అదిగో మహోత్తుంగ మహనీయ హిమశైలశృంగము! ఓహో అది ఎంత మనోహరము? ఆ మహోన్నత హిమశైలాన్ని దర్శించినంతనే, శరీరము రోమహర్షమును బొందుచున్నది. ఆంధ్రకవితా పితామహుడు అల్లసాని పెద్దన కవీంద్రుడు హిమాలయమునుగూర్చి ఎట్లు వర్ణించి తన్మయుడగుచున్నాడో-

అటఁ జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగతరంగ మృదంగ నిస్వన
స్ఫుట నట నానుయూప పరిఫుల్లకలాప కలాపి జాలముం
గటక చరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్.

ఆ మంచుకొండలు దేవాది దేవుని విభూతి స్వరూపములు. అక్షరములలో 'అ' కారమునన రూపము. ఓంకార మా మహాముని స్వరూపము. అదిగో ఆ రావిచెట్టును చూడుడు. దాని సమిధలు.

యజ్ఞకార్యముల కుపయోగింతురు. ఎందరెందరో దాని చుట్టును ప్రదక్షిణములు చేయుదురు. దాని యందు మహత్తరమగు శక్తిగలదు. కావుననే దానిచుట్టును ప్రదక్షిణమాత్రమున భక్తులకు సకలరోగములును నశించుచున్నవి. అది దేవదేవుని దివ్యభూతి. అల్లే మారేడు మర్రి తులసి మున్నగునవి దేవాధినాథుని దివ్యవిభూతులే. విశ్వాసపాత్రమగు అశ్వము, మహారాజు లూరేగు గజేంద్రము! సామ్రాజ్యాధిపతియగు చక్రవర్తి, సాధుస్వరూపిణియగు గోమాత ఆయన స్వరూపములే. వీని యన్నిటి యందును భగవానుని దర్శింపుము.

సర్పము నందును భగవానుని చూడు మని గీత పల్కెను. వేదబ్రాహ్మణునివలె అతిశుచిత్వము గలది సర్పము. అది విషజంతు వని భయపడు చుంటివా? కాదు. లోకములో మానవుల కున్నంత విషము సర్పములో లేదుసుమా. సర్పము కన్న మానవులే విషజంతువు లని చెప్పుటలో నాశ్చర్యమున్నదా? పామునకు విషము శిరమందే గలదు. కాని ఖలునకు నిలువెల్ల విషము. సర్పరాజు మహావిష్ణువు శయనించు పట్టుపరుపుగదా! పరమేశ్వరున కయ్యది కంఠహారము. పాము దుష్టజంతు వను భావమే నీకు భీతిని కలిగించుచున్నది. కాని దానియందు దుష్టత్వము లేదు. మహర్షుల శరీరములపై అదిపడగయెత్తి యాడును. సర్పము మనకు పూజనీయము గనుకనే నాగ పూజ హిందూ సంప్రదాయమైనది.

ఆ మృగరాజు గంభీరరూపమును చూడుము! ఎంత మనోహరము. అది భగవానుని గంభీరతకు చిహ్నము. అదిగో గరుత్మంతుడాకాశమున ఎంతఎత్తున రివ్వురివ్వున బోవు చున్నాడో? అదియును భగవత్స్వరూపమే.

అల్లదే విష్ణుదేవుని పాదతీర్థము – పవిత్ర గంగాస్రవంతి– దేవదేవుని కరుణా ప్రవాహము. శివదేవుని జటాజూటము నలంకరించిన

దివ్యవాహిని. హిమాలయోన్నత శిఖరములనుండి గంతులువేయుచు, దుముకుచు సమతలమున సొగసుగా కులుకుచు - గంభీరగానము చేయుచు సాగరగర్భములో లీనమగుచున్నది. ఎంత చల్లని తల్లి ఆ గంగామాత? నామస్మరణ మాత్రము చేతనే సకల పాపములను పోగొట్టు పరమపూత ఆమాత. అది లోకేశ్వరుని విభూతి. ఆయన అధ్యాత్మ విద్యాస్వరూపుడు.

సర్వమును హరించుమృత్యువును ఆయన రూపమే. జననమును ఆయన రూపమే. సత్కీర్తి ఆయన విభూతి. సగరమాంధాతాౖదిరాజ శేఖరుల కీర్తి ఆయన స్వరూపము. ఆయన ఐశ్వర్య స్వరూపుడు. శ్రీమంతులలోని శ్రీ ఆయన విభూతి. పోతన తులసీదాస వాల్మీకి వ్యాస సూరదాసాది మహాకవులలో ఆయన కవితాశక్తియై దీపించును. మహాపండితులలోని పాండితీ ప్రకర్ష - వాదనాపటిమ ఆయన విలాసములే. సీత, సావిత్రి, దమయంతి మున్నగు భారత నారీమతల్లులలోని పాతివ్రత్య మాయాన మహామహిమ దివ్యశోభయే. మహిళామణులలోని క్షమాధైర్య మేధావిజ్ఞానము లాయన దివ్యప్రతిభాతరంగములే.

అరుగో బ్రాహ్మణోత్తములు సామవేదమును గానముచేయుచున్నారు. అ వేదస్వరము ఎంత పవిత్రము? గానముచేయువారి నందరను కాపాడు గాయత్రీ మంత్రమెంత పావనము? ఈ మహామంత్రముతోనేకదా మహాకవి వాల్మీకి 24 వేల శ్లోకములలో రామగాథను రచించినాడు. గీతోపదేశము చేసినమాసమే మార్గశిరము. కురుక్షేత్ర సంగ్రామ పవిత్రకాలము. ఇవి యన్నియు సర్వేశ్వరుని విభూతులు.

వసంతకాల మెంత మనోహరము-ప్రకృతిలక్ష్మి వింతసొగసుతో తాండవించు వినోదకాలము. మల్లెలు - మొల్లలు గుబాళించు

మధురకాలము. చూత ఫలరసములతో సుందరమైన కాలము. కోకిలల మధురగానములతో - కలుషు లాలికించు కుముదకాలము - ఇది విశ్వేశ్వరుని విభూతి.

మహావీరులలోని వీరత్వ మాయన సొమ్ము. అందువలననే వీరారాధనము భారతీయ సంప్రదాయము. తేజశ్శాలులలోని తేజో విభూతి ఆయనదియే. ప్రయత్నశీలతయు నాయనదియే. హరిశ్చంద్రునిలోని సత్యము - శిబిచక్రవర్తిలోని ఆర్తరక్షణము - కర్ణునిలోని వదాన్యత - భోజరాజులోని కవితాపోషణ - బుద్ధునిలోని అహింస - జయదేవునిలోని గానము - మీరాలోని అమృతప్రేమ - యుధిష్ఠిరునిలో స్థిరత్వము - మహాయోగిలోని మౌనము - ఇవి యన్నియు ఆయన వివిధ విలాససంపదలే.

భగవానుని విభూతులను వర్ణించుట యెవరితరము! శ్రీమంతంబులు, ఊర్జితంబులగు స్వరూపములన్నియు ఆయన నివాసమందిరములై - సాధకుని స్థూలనేత్రములకపూర్వములై ఉపాసనా యోగ్యములై గోచరించును.



## 73. సృష్టిలో ఈశ్వరదర్శనము Devine vision in creation

ఈవిశాలమగు సృష్టియంతయు భగవానుడు రచించిన సుందర శిల్పము. అదిగో ఆకాశమెంత సుందరము? ఆ నీనీలాకాశములో మిల మిలలాడు నక్షత్రములెంత సొగసుగ నున్నవి? ఆ రత్నకంబళమును నిర్మించిన మహామహు డెవ్వరో వానికి జోహారులు. ఏమి ఆ గులాబి కన్నె సొగసు. ఏమి ఆ స్నిగ్ధత్వము - ఏమి ఆ మృదులాతి మృదులత్వము - అదిగో సంపెంగ - దాని తియ్యని సువాసన లెంతదూరము

వ్యాపించును. అది విశ్వనాథుని మధుర సందేశమును వినిపించు చున్నదా!

ఉప్పునీటి సముద్రతీరమున వేలకొలది ఎత్తైన కొబ్బరిచెట్లు. వాని పై భాగమున తియ్యటి నీటితో నిండిన కొబ్బరి బొండములు. ఆ తీపిజలమును వానిలో పోసినవారెవరు! ఆ కోనసీమ తోటలలో కనిపించు పనసపండు ఎంత పెద్దదిగానున్నది. దానిలో అమృతమును నింపినవారెవ్వరో ఎరుగుదువా? ఆ మొగలి రేకలలో సువాసన - ఆ మాలతీలతలలో గుబాళింపు-ఆ పంచముఖ మందారంలోని తళతళ లెవ్వరు పూసినారంటావు? నారింజలోని పులుపు, బత్తాయిలోని మధురిమను పోసినవారెవరో చెప్పగలవా?

సర్వమును ఆ పరమేశ్వరుని దివ్యలీలా స్వరూపము. ప్రకృతిలోని మిక్కిలి స్థూల స్వరూపములలో భగవంతుని ముందుగా గుర్తించుటను తెలిసికొనుము. క్రమక్రమముగా ప్రతిఅణువులోను భగవానుని దర్శించగలవు. సుందరమగు వస్తువులలో ముందుగా దేవునిసౌందర్యమును చూడుము. పిమ్మట కురూపములలో గూడ ఈశ్వరత్వము నీకు కనబడును. తల్లిలో, తండ్రిలో, గురువులో, దేవతాదర్శనము ముందు కానిమ్ము. తరువాత అందరియందు దేవుని దర్శించు అర్హత నీకు కలుగగలదు. సాధుపురుషులలో భగవద్దర్శనమును చేయుము. తరువాత దుష్టులలో గూడ దేవత్వమును నీవు అనుభవించగలవు.

ఆకులలో, పూవులలో, పిందెలలో, అణువులో సర్వత్రా ఈశ్వర దర్శనమును చేయుము.

...—...

# గీతా కల్పవృక్షము

పదునొకండవ అధ్యాయము - విశ్వరూప సందర్శన యోగము

## 74. విశ్వరూప దర్శనమునకై అర్జునుని ప్రార్థన

సర్వభూతముల హృదయాంతరాళములలోను ప్రకాశించు చున్న శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కారములు. భక్తితో పిలిచినవా రందఱకును సాక్షాత్కరించు కరుణాస్వరూపుడైన లక్ష్మీపతికి ప్రణా మములు. స్మరణమాత్రము చేతనే సకల పాపములను హరించు శ్రీకృష్ణనామమునకు నమస్సులు! తలచిన మాత్రముననే భక్తుల బాధలను తొలగించు గీతాసార్వభౌమునకు నమోవాక సహస్ర ములు. ఆ కారుణ్యసాగరుని దయావిశేషముచేత ఈనాడు ఏకాదశా ధ్యాయమున ప్రవేశించుచున్నాము.. గీతా గంగాతరంగిణీ తీరమున నిది మరియొక సుందరతీర్థము. వ్యాసభగవాను డీ యధ్యాయమును అతి మనోహరముగ-పురాణశయ్యా కోమలత్వమున - గంభీరరూప మున రచించినాడు. దీనిని గానము చేయునపుడు భక్తులకు శరీరము పులకరించును. ఇందు భగవానుని వాత్సల్యావిశేషము వరదవలె పొంగి పోయినది.

ఈ అధ్యాయములో బీజాక్షరములతో గూడిన మహాప్రతిభా వంతములగు శ్లోకరాజము లెన్నియో గలవు. వానిని పఠించిన మాత్రముననే భూతప్రేత పిశాచాదుల బాధలు తొలగిపోవును. ఇం దలి దివ్యశ్లోకముల సంతత పారాయణమున దుఃఖదారిద్ర్యములు పాసిపోవును. ఐశ్వర్యప్రాప్తిని గలిగించును. అందుచే ఇహపరసుఖ సంధాయకములైన ఈ అధ్యాయ శ్లోకములు నిరంతరమును పఠింప దగినవి.

10వ అధ్యాయమునందు భగవానుడు అర్జునునకు తన విభూతి రూపము లెన్నియో తెలియబలికినాడు. వానిని వినినంతనే భక్తుడగు అర్జునునకు మహాత్మ్యము గలిగినది. సృష్టిస్థితి లయములలో భాసిల్లు ఆ విరాట్ స్వరూపసందర్శనమును గోరి పార్థుడు భగవానుని ప్రార్థించినాడు. భగవానుడు భక్తులు కోరినవెల్ల నిచ్చును. దేవతలకు కూడ సందర్శింప వీలుకాని విశ్వరూప సాక్షాత్కారము పార్థునకు గలుగుచున్నది. కారణము ఆతని వినయశీలత – శరణాగతి – భక్తి తత్పరత. 'భక్తోసి మే సఖ్యా చేతి రహస్యం హ్యేతదుత్తమం' నీవు నాకు భక్తుడవును, సఖుడవును అగుటచేత పరమ రహస్య విశేషములను నీకొరకు చెప్పుచున్నాను అని గీతలోనే భగవానుడు చెప్పియుండెను గదా.

పార్థుడు అంతకు పూర్వ మెన్నడును విశ్వరూపమును గాంచి యుండలేదు. అందుచేత కంగారును, భయమును పొందునేమో యను శంకచే భగవానుడు తన భక్తునకు అందలి విశేషములను ముందుగనే చెప్పినాడు. కాశీకి పోదలచిన వారికి అందు చూడదగిన విశేషములు, ఆశ్చర్యకరములగు సన్నివేశములు – ముందుగా తెలిసియున్నచో ఆతని కెంతయో యుపయోగముగా నుండును గదా. అట్లే పార్థసారథియు పార్థునకిట్లు చెప్పెను. 'అర్జునా' విశ్వ రూపములో ఇంతకు ముందు నీ వెన్నడును కనివిని యెరుగని మహాద్భుత దివ్య రూపములను – విచిత్రసన్నివేశములను, రోమహర్షమును గలిగించు ఘట్టములను చూడగలవు. ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, అశ్వనీ దేవతలు, ఇంకను అత్యాశ్చర్య కరము లెన్నియో నీవు దర్శించగలవు. నీవు దేనిని చూడ గోరుదువో అవి యెల్లను నీ వీ విశ్వరూపమున చూడగలవు. కాని, నాయనా ఈ తోలు నేత్రములతో మాత్రము నా విరాట్ స్వరూపమును, దర్శింప

లేవు. నీ కివే దివ్యనేత్రములను ప్రసాదించు చున్నాను!' అని పలుకుచు భగవానుడు తన విరాట్ స్వరూప మహాసందర్శన భాగ్యమును అర్జునునకు కలిగించినాడు.



## 75. భగవానుని విశ్వరూప దర్శనము.

### God's Universal form.

ఓహో! ఏమి ఈ విశ్వరూప సందర్శనము! అసంఖ్యాకము లగు నేత్రములతో, పాదములతో, వక్త్రములతో, బాహువులతో, ఊరువులతో, ఆ విరాట్పురుషుడు విలసిల్లు చున్నాడు. అనేక దివ్యాభరణ శ్రేణులను ధరించి, దివ్యమాల్యాంబరములను దాల్చి, దివ్యగంధానులేపములతోనున్న పురుషుని యందొక మూల చతుర్ముఖ బ్రహ్మ ఎనుబదినాలుగు లక్షలయోని వర్గములను సృజించుచున్నాడు. అదిగో ఆవంక మహేశ్వరుడు లయము చేయుచున్నాడు. స్వర్గలోకములను గోచరించు ద్వాదశాదిత్యులు భాసిల్లు చున్నారు. అదుగో అష్టవసువులు, ఏకాదశ రుద్రులదుగో, అశ్వినీ దేవతలట కానుపించుచున్నారు. దేవతలు చేతులు మోడ్చి ఆ దేవ దేవుని స్తవము చేయుచున్నారు. రాక్షసులు భయభ్రాంతులై పరుగెత్తు చున్నారు. ఏమి ఆశ్చర్య మేమి యాశ్చర్యము! అవిగో మహోన్నతములగు హిమాలయములు, శివుని జటాజూటమున గంగ, పాలకడలిలో భాసిల్లు లక్ష్మి; అదిగో వాగ్దేవి! నా శరీరము పులకించుచున్నది. నా కండ్లు ఆ దివ్య తేజః ప్రవాహములను గాంచలేక చీకట్లు గ్రమ్ముచున్నవి, నోట మాటవచ్చుట లేదు. అబ్బో భయము, మహాభయము. ఏమి ఆ విరాట్పురుషుని వికటాట్టహాసము, ఏమి ఆ ప్రళయ తాండవము. కౌరవ పాండవ మహాసైన్య సమూహము లన్నియు ఆ మహా పురుషుని భయంకర వదన గహ్వరములలో చొచ్చుకొని పోవుచున్నవే, మహానదులు సాగరములో లీనమగునట్లు సేనా వాహినులు ఆ

మహాగ్ని సాగరములో [illegible]న్నవి. [illegible]ల [illegible] దీపములలో బడి చచ్చునట్లు, ఈ కౌరవ పాండవ [illegible] సైన్యములు ఆ కాలాగ్ని గోళములో భస్మము అగుచున్నవి.

ఆ కాలపురుషుని భయంకరములగు [illegible]లందలి దంతము లతో భీష్ముని గొట్టుచున్నాడే! అదిగో [illegible]. అదిగో ద్రోణా చార్యులు, కర్ణ జయద్రథులు కూడ. వారందరు ఆ కాల పురుషుని భయంకరములగు నోళ్లలో ప్రవేశించు చున్నారే. అయ్యో! నేను చూడజాలను. వారి శిరస్సులు కొరికి వేయబడుచున్నవి. ఆ భయంకర దంతములచే వారందరును చూర్ణములుగా చేయబడు చున్నారు. అయ్యో నా[illegible] కలుగుచున్నది. మహాశక్తి [illegible]చున్నది. నా అవయవము లన్నియు వణకుచున్నవి. 'ఓ ఉగ్రరూపా! నీ వెవ్వ రవు? నీకు నమస్కారము? నీ వెవరవయ్యా, ఈ రూపమును నేను దర్శింపలేకున్నాను. నన్ను రక్షింపుము. నాయందు ప్రసన్నుడవుగమ్ము' ఆ భయంకర విశ్వరూప సన్నిధానంతరము అర్జునుని పలుకు లవి.

ఆ భయంకర విశ్వరూపు డిట్లు పలికెను. 'నేను కాలుడను, సంహార కర్తను నేను. సర్వలోకములను నేను నాశనము చేసెదను. నీవు యుద్ధము చేయనని భీష్మించి కూర్చున్నను, ఓ పిచ్చివాడా, ఈ ధార్తరాష్ట్రులందరును నశించి పోవలసినవారే. అహంకార పడకుము. నీవు కాదోయీ వీరిని చంపగలవాడవు. నీ వెంత? నీ శక్తి యెంత? నీ గాండీవము యొక్క పాటవ మెంత? సర్వమును చేయువాడను నేను. నా వలననే ఈ భీష్మ, ద్రోణ, కర్ణాదులు, చంపబడినారు. ఈ సేనా సమూహమును చంపు వాడను నేనే, నా వలననే వీరందరును హతు లైనారు సుమా, చచ్చినవారినే నీవు చంపునది, విజయగౌరవము నీ కీయదలచి నేనట్లు చేయుచున్నాను. విచారించకు, దుఃఖించకు, కన్నీరు కార్చకు మోయి, నావల్లనే సర్వమును జరుగుచున్నది. కౌరవ సేనా సమూహములను జయించి పేరుప్రతిష్ఠలు సంపాదించుకొమ్ము.'

భగవానుని ఈ మాట లాలించి పార్థుడు మరింత భయకంపితు డైనాడు. ఆ జగన్నాథుని వేనోళ్ళ స్తవము చేసినాడు. శత సహస్ర ముగా నమస్కరించినాడు. క్షమాపణములు వేడుకొన్నాడు. ఓ భయంకరమూర్తీ! ఈ భయానక రూపమును నేను చూడ లేను. నీ సౌమ్యరూపమును చూపుము. పార్థసారథివై భాసిల్లుము అని వేడు కొన్నాడు పార్థుడు.

కరుణా స్వరూపుడగు భగవానుడట్లే భాసిల్లినాడు.



## 76. "నిమిత్త మాత్రం భవ" Be an instrument.

నేను ఈమేడను కట్టినాను. నేను కావుననే ఈ మహాకా ర్యము చేయగలిగినాను. నా అధికారము చేతనే వానిని త్రొక్కి వేసి తిని. నా తెలివితేటల మూలమున వానిని పైకెక్కించినాను. ఈసంపా దన యంతయు నాబుద్ధి విశేషఫలము అని మానవుడు అహంకారము చేత భావించును. ఇది అజ్ఞాన చిహ్నము. అర్జునుడును అట్లే అహం కరించినాడు. ధార్తరాష్ట్రులను సంహరింప నని గాండీవమును నేలపై జారవిడిచినాడు. కాని అర్జునుడు శస్త్రసన్యాసమును చేయగలిగి నాడా? ధార్తరాష్ట్రులు చావకుండ నుండగలిగిరా! భగవానుడు మహాశక్తివంతుడు. ఈశ్వరేచ్ఛ బలీయమైనది. దాని నెవడును ఎది రింపలేరు. భగవానుడు విశ్వరూపమును చూపి సర్వమును అర్జునున కెరింగించినాడు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" "ఓ అర్జునా నీవు నిమిత్త మాత్రుడవు కమ్ము" అని హెచ్చరించినాడు పరమేశ్వ రుడు. ఇది గీతయొక్క మహత్తర దివ్యసందేశము. "నీవు నిస్సంగుడ వుగా చరించుము" అని గీత చెప్పును. మరియొకచో 'నిష్కామ్య బుద్ధితో కర్తవ్యపాలనము చేయుము' అని గీతావళి ధ్వనించును. 'పరమేశ్వరుని యందు చిత్తముంచి కర్మచేయుము" అని వేరొక్క

గీతా నాన్యగ్రామము గానము చేయును. ఈసుభాషితము లన్నియును ఒకే భావముయొక్క వివిధ రూపాంతర శబ్దజాలము. భగవద్గీత వివిధమానసిక ప్రవృత్తులను తెగినట్లు ఒకే పరమసత్య సూత్రమును వివిధపదజాలములలో తెలియ చేయును ఇది గీతయొక్క ప్రత్యేకత లేక సంప్రదాయము.

భగవంతుని చేతిలో నీవొక సాధనముగా నుండుము. Let thy will be done. ప్రభూ, నీయిచ్ఛయే నెరవేరునుగాక, అని తలంపుము. ఈ భావములో ఎంత ఆనందము, ఎట్టి సంతృప్తి యున్నవో గమనింపుము. రాముునికి దాసుడుగా నుండుటలోనే మహా నంద మున్న దని తులసీదాసు పలుకును. నీవు నిమిత్త మాత్రముగా నున్నప్పుడే నీ ద్వారా మహత్తర కార్యక్రమములు నడుచుచుండును? నేను నిమిత్తమాత్రుడను అని భావించెను. గనుక నే అమృత కవితాధార పోతనార్యుని లేఖనినుండి వర్షించినది. రామునకు సర్వార్పణము జేసిన కతమున నే మధురామృత దివ్యగానధారలు త్యాగరాజునుండి ప్రవహించినవి. ప్రపంచములో మహత్తర కార్యములను సాధించిన భక్తులు, జ్ఞానులు, సిద్ధపురుషులు, ప్రవర్తకులును ఇట్టి మానసిక మహాస్థాయిని పొందినవారే! నీవు అహంకరించితివా అడుగడుగునను నీకు అడ్డంకులే; క్షణ క్షణమును నీకు పొరపాట్లే. ప్రతి నిమిషమున కడగండ్లే, ప్రతి పదమునందును బాధలే తటస్థించును. 'సర్వమున్ అతని దివ్య కళామయమం'బని భావించిన వాడే మహాత్ముడు.

సంసారములో నుండుము, కాని సంసార పాశములచే బంధింపబడకుము. పడవ జలరాసిలో నుండవచ్చును. కాని జలములు మాత్రము పడవలో ప్రవేశింప రాదుసుమీ. అట్లే నీవును రాగ రహితుడవై సంసారమున సంచరించుము. జనకుడు సువిశాల సుందరమహా

సామ్రాజ్యాధి పతియయ్యెను. దాస దాసీ జన సుఖభోగ విలాస సంప న్నుడయ్యెను రాగరహితుడు.

జనకుడు యాజ్ఞ వల్క్యుని శిష్యుడు. జ్ఞానతుల్యుడు. జనకు నకును తదితర శిష్యులకును వేదాంత సూత్రముల నుపన్యసించు చుండెను. ఇంతలో జనకుని రాజధాని నగరమగు మిథిల కాలిపోవు చున్నదని వార్త వచ్చెను. జనకుడు చలింపలేదు. ఇంతలో మరియొక వార్త రాజాంతఃపురమునకుగూడ నిప్పంటుకొన్న దని, కాని జనకుడు చలింపడయ్యె. ధనాగారం కూడ అగ్నిజ్వాలల కాహుతి యయ్యెనని మరియొక వార్త వచ్చినది. జనకుని ముఖమున చిరునవ్వు మాత్రమే పొడసూపు చున్నది. 'ఈమిథిలను లోగడ ఎందరో పాలించినారు. ఇంకను ఎందరో పాలింప గలరు. అనివార్యము వారింపబడదు.' అని జనకుడు పలికెను. ఏమి ఆరాగ రాహిత్యము. జనకుడు నిమిత్త మాత్రముగా సంసారమున సంచరించెను. సర్వ రాజ కార్యము లను సక్రమముగ నిర్వహించెను. అయినను ఆయన నిమిత్త మాత్రుడు.

అహంకార మమకార శూన్యుడై కర్తవ్యతాదృష్టితో సర్వ లోక జనసంఘములను చిత్రవధ చేసినను పాప మంటదని గీత పదు నెనిమిదవ అధ్యాయములో పలుకును.

న్యాయాధిపతి ఉరిశిక్ష విధించును. అతడు నిమిత్త మాత్రుడు కావున పాపరహితుడు, తలారి రాజాజ్ఞచే తలలు ఖండించును. అతడు నిమిత్తమాత్రుడుగాన పాప మంటదు. తామరాకులో జల మంట నట్లు, కమ్మరి పురుగునకు బురద సోకనట్లు నీవును ప్రపంచములో సంచరించుము. కప్ప నీటిలోనున్నను దానికి పడిశము పట్టదు. అట్లే నీకును భగవంతుని దయవల్లనే సర్వమును జరుగు చున్నది. ఆ పర మేశ్వరుని దివ్యశక్తియే సర్వమును కదలించుచున్నది. 'నీ ప్రజ్ఞ యెంత? నీ ప్రతిభ యెంత?' అహంకారమును బొందకుము. ఈ అహం

కొరకు మహామాయాశక్తి ఒక్కొక్కప్పుడు సిద్ధులను, పండితులను, భక్తులను, జ్ఞానులను, దేవతలను కూడను మోహపెట్టు చున్నది. కేనోపనిషత్తులోని ఒక మధుర గాథను ఈ సందర్భమున మనవి చేయుదును.

ఒక పర్యాయము దేవతలకును రాక్షసులకును యుద్ధము వచ్చినది. భగవానుని యనుగ్రహము చేత దేవతలు విజయము నొందిరి. విజయోన్మాదముచే దేవతలు గర్వించి తమశక్తి సామర్థ్యములను గూర్చి స్తుతించుకొనసాగిరి. భగవాను డీది గమనించి దేవతల అహంకారమును బోగొట్ట నెంచి ఒక యక్షస్వరూపముతో నచట సాక్షాత్కరించెను. అహంకార మత్తులైయున్న దేవతలు పరమేశ్వర స్వరూపమును గమనింప లేరైరి. దేవేంద్రుడు అగ్నిహోత్రుని పిలిచి 'ఆ వచ్చినవా రెవరో తెలిసికొని రమ్మ'ని పంపెను. అగ్ని దేవుడు వెళ్ళి 'నీ వెవరవు? నీ పేరేమి?' అని ఆ యక్షుని ప్రశ్నించెను.

'నీ వెవరవో నాకు ముందుగా దెలుపుము' అని యక్షుడు మరల ప్రశ్నించెను.

అగ్ని దేవుడిట్లు పలికెను. 'ఓహో నీవు నన్నే యెరుగవా? ప్రపంచమందు నన్నెరుగని వారుండరు. మొన్న జరిగిన దేవదానవ సంగ్రామములో నామహిమ, నాప్రతిభ, విశ్వవ్యాప్త మైనది.'

'అయిన, నీప్రతిభ యెట్టిదో నాకు తెలిపెదవా?' అని యక్షుడు ప్రశ్నించెను.

'ప్రపంచములో దేనినైనను భస్మముచేయు మహాశక్తి గల వాడను నేను. సర్వమును దహించగలవాడను నేను, నాపేరు అగ్ని దేవుడు' అని గర్వముగా అగ్ని దేవుడు చెప్పెను.

'అయినచో, అగ్ని దేవుడా ఇదిగో ఈగడ్డిపోచ, దీనిని దహించుము. చూతము నీప్రజ్ఞ' అని యక్షుడు పలికెను.

అగ్ని దేవుడు తన సర్వశక్తిని నియోగించెను. కాని ఆ గడ్డి పరక దహనము కాలేదు. అతడు తెల్లబోయి, పరాభవమును బొందె

తలవంచుకొని, సిగ్గుపడి, వెడలిపోయెను. తరువాత దేవేంద్రుడు వాయువును బంపెను.

నేనువాయుదేవుడను, మొన్న దేవదానవ మహాయుద్ధములో విజయమును సాధించిన మహావీరుడను నేను. మహా పర్వతములను సైతము ఎగురకొట్ట గల మహాప్రభంజనుడను నేను' అనివాయువు మహాగర్వముతో పలికెను.

అట్లయిన 'ఇదిగో ఈగడ్డిపోచను కదల్చుము. చూతము నీ శక్తి' అని యక్షుడు పలికెను.

వాయువు తన సర్వశక్తి యుక్తులను ప్రయోగించెను. కాని గడ్డిపరక కదలదాయెను. వాయువు సిగ్గుతో తలవంచుకొని పరాభవముతో మరలిపోయెను. దేవేంద్రు డీవిషయములను గ్రహించి తానే స్వయముగా యక్షుని చూచుటకు బయలుదేరెను. దేవేంద్రుడు బుద్ధిమంతుడు. అజ్ఞాన మోహావరించినను తిటాలున జ్ఞానమును దెచ్చికొని, వచ్చినవాడు సర్వశక్తి మంతుడగు పరమేశ్వరుడని గ్రహించి అహంకార రహితుడై సాష్టాంగ నమస్కారమును చేసి రక్షింప ప్రార్థించెను.

దీని సారాంశమిది. భగవానుని యిచ్ఛచేతనే అగ్నికి దహనశక్తి, వాయువునకు స్పందనశక్తియు గలుగుచున్నవి. అహంకారమును పూర్తిగా నిడనాడి పరమేశ్వరుని దివ్య పాదారవిందముల నాశ్రయింపుమని 'గీత' మరల మరల హెచ్చరించు చున్నది.

"నిమిత్తమాత్రం భవ" —

...—...

# 77. గీతా సారము - పంచసూత్ర ప్రణాళిక.

## Essence of Geeta - A plan of five principles.

ఈఅధ్యాయములోని తుది శ్లోకము గీతార్థసార సంగ్రహముగా పలువురు వ్యాఖ్యానకారులు పేర్కొని యున్నారు. గీతాశాస్త్రము యొక్క సంపూర్ణ జీవితవిధాన మిందు పేర్కొనబడి యున్నది. గీతా

సందేశమును సంపూర్ణముగా చిత్రించు శ్లోకరాజములు గీతలో అనేక అధ్యాయములలో, అనేక తావులలో నున్నమాట వాస్తవము. ఈ అధ్యాయాంతములోని శ్లోకములో కరుణా స్వరూపుడైన భగవంతుడిట్లు అర్జునునకు ప్రబోధించుచున్నాడు.

'మత్కర్మకృత్ మత్పరమో మద్భక్తస్సంగవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ.

ఈ మహా శ్లోకములో ఈశ్వరారాధనమునకు అయిదు సూత్రములు పేర్కొనబడినవి. జాతి, కుల, వర్ణ, భేదములు లేక, స్త్రీ పురుష తారతమ్యములతో నిమిత్తము లేక సమస్త మానవకోటికి ఈ పంచసూత్ర ప్రణాళికను భగవాను సూచించెను. వ్యక్తికల్యాణమునకును, జాతి కల్యాణమునకును, విశాల విశ్వ కల్యాణమునకును ఈ పంచసూత్రములే ఆధారములు. లోకశాంతికివి మూలసూత్రములు. మానవుడు చంద్రలోక యాత్రలుచేసినను, అంగారకగ్రహ పర్యవేక్షణము కావించినను, రాకెట్టులను నిర్మించినను, కృత్రిమగ్రహములను మహా వేగముతో ఖగోళమునందు త్రిప్పగలిగినను, విశ్వశాంతి కలుగుటలేదు సరిగదా, మరింత భయము, లోకములో మానవ హృదయాంతరాళాలయం దాందోళనము కలుగు చున్నవి. భౌతిక విజ్ఞానముగాని బాహ్య సాధనములుగాని విశ్వశాంతిని చేకూర్చ లేవు. హృదయ పరివర్తన ముఖ్యము. దానినే గీత బోధించును.

1. మత్ కర్మ, కృత్. నా సంబంధమగు పనులను చేయుము. ఇది మొదటి సూత్రము. మానవుడు సాధారణముగా తానుచేయు పనులను రెండు తరగతులుగా భావించును. దేవుని పనులు కొన్ని, తన సొంతపనులు కొన్ని. స్నానము చేయుట, సంధ్యావందనము, మడి బట్ట, దీపారాధనము, దేవాలయ ప్రదక్షిణము. టెంకాయలు కొట్టుట ఇవి యన్నియును దేవతా సంబంధమగు కార్యములుగా భావించును. భోజనము చేయుట, వ్యవసాయము, వ్యాపారము, ఉద్యోగము, సంతా

భాగ్యవిలాస సంపన్నుడయ్యెను. వాని పాశములచేత బంధింప బడని కారణముచే, ఆకలి తొలగినప్పుడుగాని, పెరిగినప్పుడుగాని క్లేశ మోదములు బాధింపక సాగరమువలె నిత్యగంభీరుడై యుండును. అసంగమనునది ఉత్తమోత్తమ సాధనసిద్ధస్థితి. అది బాహ్యపరిస్థితులపై ఆధారపడియుండదు.

5 నిర్వైరం సర్వభూతేషు. సకలభూతముల యందును విరోధ రహిత భావముతో నుండుము. అనగా సకల ప్రాణుల యందును ప్రేమభావమును కలిగియుండుము. ఇదియే సర్వభూతదయను పెంపొందించును.

నీలో ప్రేమామృతము వెల్లివిరిసెనా, ప్రకృతిలో ప్రతియణువును నీపై ప్రేమధారలను వర్షింపచేయును. నీలో ద్వేషాసూయా విరోధభావములు తాండవించుచుండెనా, ప్రకృతిలో ప్రతిచోటునందును, నీవు విరోధాసూయా భావముల వికటాట్టహాసములే సాక్షాత్కరించును. నీ హృదయమే ప్రకృతిలో ప్రతిబింబితమగును.

నన్నయభట్టు కణ్వాశ్రమమును వర్ణించుచు ఇట్లు పలికెను. ఏమి ఈముని అద్భుతశక్తిసామర్థ్యములు. ఈవనములో ఏనుగుతొండముల నీడలలో సింహములు విశ్రాంతిని తీసికొనుచున్నవి. ఎలుకలును పిల్లులును ఒకేతావున చేరి ఆహారమును భక్షించుచున్నవి. ఏమి ఆశ్చర్యము !!

కణ్వ మునీంద్రుని హృదయాంతరాళమందు పొంగి పొరలు అహింసాశక్తిసామర్థ్యమే, సకలభూతముల యందును ఆయనకు గల నిర్వైర భావమే ఆమహావనసీమను కళ్యాణరంగ స్థలముగా మార్చినది. ప్రేమార్ద్రసీమగా రూపొందించినది...

'నిర్వైరస్సర్వ భూతేషు' అను పంచమసూత్రము సర్వలోక శాంతిదాయకము.

# గీతాకల్పవృక్షము

పంద్రెండవ అధ్యాయము :- భక్తి యోగము.

## 78. ఇది ధర్మస్వరూపామృతము

**This is the Nector of Dharma.**

గీతా కల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాస వివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురం
నానాశాస్త్ర రహస్య శాఖ మరతిక్షాంతి ప్రవాళాంకితం
కృష్ణాంఘ్రి ద్వయభక్తి పుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినాం॥

భగవద్గీత కల్పవృక్షము. అది నీవేదికోరిన దానినే ప్రసాదించ గలదు. నీ వేదియును కోరకున్నను దానిని భక్తిపురస్సరముగా నాశ్ర యించిన నీకు సకల శ్రేయములను వర్షింప చేయును. భగవానుడగు శ్రీకృష్ణుడే ఈ కల్పవృక్షమును నాటినాడు. విజ్ఞాన నిధియగు వేద వ్యాస మునీంద్రుడు దీనిని పెంచి వృద్ధిచేసినాడు. దీనివిత్తనములు వేదశిరంబులగు నుపనిషత్తులు. మనోహరములగు దీని చిగురుటాకులు వైరాగ్యసమానములు. వివిధశాస్త్ర వితానములే దీని బహువిధ శాఖలు. శ్రీకృష్ణ పవిత్ర పాదాబ్జ భక్తి పుష్పములచే నిది గుబాళిం చును. ఇయ్యది జ్ఞానులకు మోక్షప్రదాయి.

ఇట్టిపరమ పవిత్రమగు మహత్తర గీతా కల్పవృక్షముయొక్క మహాశ్రయము మనకు లభించినది. మనమెంతయు ధన్యులము. ఈ కల్పవృక్షము అష్టాదశ శాఖలతో ఏడువందల సురభిత కుసుమ ములతో శోభిల్లును. ఆపుష్ప సువాసనలు సర్వేంద్రియములను పవి త్రములను చేయును. మానవునకు దివ్యత్వమును కలిగించు నెత్తావి యిది. ఈమహాశోభిని ఆశ్రయించిన వారికి దుఃఖములేదు. నిరతిశయా నందమే వారికి కలుగును.

కృష్ణభగవానుని దయా విశేషముచే ఈకల్పవృక్షము యొక్క పదునొకండు శాఖలలోని పుష్పరాసుల సువాసనలను కొలది కొలదిగా గ్రోలి ఆనందించితిమి. ఇప్పుడు ద్వాదశశాఖా పుష్ప మనోహర సువాసనల నాఘ్రాణించెదము గాక. ఇందుగల పుష్పములు ఇరువది మాత్రమే యయ్యును అతిలోక మనోహరములు. ఆ సుశ్లోక పుష్పము లతిగంభీర భావసమన్వితములు...ఇందు స్రవించు మకరంద ధారలు మధురాతి మధురములై విలసిల్లును.

గీత అంతయు సంపూర్ణముగా పారాయణము చేయుటకు మీకు సావకాశము లేనియెడల కనీస మీ పండ్రెండవ అధ్యాయాన్నైనా తప్పని సరిగా ప్రతినిత్యము పారాయణము చేసి తీరవలయును సుమీ. దీని పవిత్రత వర్ణనాతీతమైనది. ఒకప్పుడు మాలవ్యా పండితుడు హరిజనుల నందరిని పిలిచి గంగా తోయములలో స్నానము చేయించి పవిత్రమగు గాయత్రీ మంత్రాన్ని వారి కుపదేశించి గీతలోని పండ్రెండవ అధ్యాయాన్ని ప్రబోధముచేసి, నిత్యమును దీనిని పారాయణ చేయవలసినదిగా హెచ్చరించినాడు. భారత భాగ్యమూర్తి గాంధీజీకి ఈ అధ్యాయం అత్యంత ప్రియమై నిత్యపారాయణ భాగ మైనది.

భారతీయ సాహిత్యములో భక్తినిగురించి చెప్పే గ్రంథా లనేకము లున్నవి. వానిలో భక్తులు భగవానుని స్తవముచేస్తూ వ్రాసిన ఘట్టములే విశేషములుగా నుండును. కాని దీనిలో భగవానుడే భక్తి విశేషమును గూర్చి, భక్తుని లక్షణములను గురించి గానము చేయుట ఈ అధ్యాయము యొక్క విశిష్టత. సగుణనిర్గుణ విధానములలో నేది గొప్పది? అను పార్థుని ప్రశ్నకు సమాధానముగా భగవంతుడు గంభీరమగు మహోపన్యాసము చేసినాడు. నిర్గుణ పరబ్రహ్మము యొక్క లక్షణములను, దానిని పొందుటకు సాధకునికి గావలసిన అర్హతలను తెలిపి, భగవానుడు సగుణోపాసనా మార్గములను గానముచేసి అనంతరము భక్తలక్షణములను ఏడు శ్లోకరాజములలో

సువ్యక్తము చేసినాడు. ఉత్తమ పురుష లక్షణములను గూర్చి ఈ అధ్యాయము ప్రవచించును...దీని పారాయణ చేతనే శరీరము పులకరించును. మానసము ప్రఫుల్లమగును. భావములు దివ్యత్వము నందును. ఇది భయంకర భవరోగహరమగు దివ్యౌషధి, మహారసాయనము. కావుననే భగవానుడు 'యే తు ధర్మ్యామృత మిదం' 'ఇది ధర్మస్వరూపామృతము' అని పలుకును.

ఈ అమృత ధారను గ్రోలి మనము తరింతుముగాక.

—...—

## 79. సగుణ నిర్గుణముల తారతమ్యము.

**The difference between the form and the formless.**

కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవ మౌక్తికం కరతలే వేణుం కరే కంకణం
సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠేచ ముక్తావళీ
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల చూడామణిః.

ఓహో! ఏమి ఆ మనోహర దివ్యగోపాలకృష్ణుని సుందరస్వరూపము! ఎంత ఆకర్షణీయము! ఎంత ఉత్సాహసంజనకము! ఆ విశాల ఫాలభాగమందు కస్తూరీ తిలకము తళతళలాడు చున్నది. ఆ సువిశాల సుందర వక్షస్థలమందు కౌస్తుభమాణిక్యము ధగద్ధగాయమానమై వెలయుచున్నది. నాసికాగ్రమందు మౌక్తికరాజము మిలమిలలాడు చున్నది. పాణిపల్లవమందు జగన్మోహనమైన మురళి. కరములయందు సుందరకంకణరవములు-సర్వాంగములును హరిచందన శోభితములు. ముత్యాలహారములు కంఠసీమ నలంకరించిన గోపికాసహస్రములచే పరివేష్టితుడై యున్న ఆ సుందర గోపాలచక్రవర్తి నాకన్నుగవకు నిరంతరమును సాక్షాత్కరించును గాక! భగవానుని సగుణ స్వరూపము భక్త హృదయాల నాకర్షించినట్లు నిర్గుణ స్వరూపము ఆకర్షింప లేదు.

సగుణోపాసన భక్తిమార్గము. నిర్గుణోపాసన జ్ఞానమార్గము. రెండిటి ఆదర్శములును ఒక్కటియే యయ్యును మార్గములు మాత్రము విరుద్ధములు. భక్తుడు తన సకలేంద్రియములను భగవానునికి పూజా పుష్పములుగ సమర్పించును. హస్తములతో పూలను తెచ్చి హారములుగా గుచ్చి స్వామి మెడనలంకరించును. చేతులారంగ పూజించును. నోటితో భగవానుని స్తుతిగీతములుపాడి ఆనందించును. చెవులతో దేవదేవుని మంగళకథలను విని మురిసిపోవును. నేత్రములతో ఆ మంగళ స్వరూపుని తిలకించి పొంగిపోవును. పాదములతో దేవతాతీర్థములకు పయనించును.

హరిని పూజింపని కరములు తరుశాఖలన్నా దర్వీ యని దుఃఖించును. కమలేశు చూడని కన్నులు శరీర కుడ్యజాలరంధ్రము లని యేడ్చును. దేవుని స్తుతింపని నోరు ఢమ ఢమ ధ్వనిసేయు ఢక్కమాత్రమే యని వాపోవును. సకలేంద్రియములను భగవత్సేవార్థం కర్యములలో వినియోగించుటే భక్తిమార్గసాధన. ఇక జ్ఞానమార్గమందునో – జ్ఞానికి ఇంద్రియము లన్నియు పాపకారులు – దొంగలు – విఘ్నకారకములు. ఇట్లు భావించి జ్ఞాని వానిని బలాత్కారముగా వానిసహజ వ్యాపారములయందు పోనీయక నిరోధించును – నిగ్రహించును. ఆత్మయందే లగ్నము చేయుటకు ప్రయత్నించును. ఇది ఎంతకష్టసాధ్యము. రాతిబండను ఎత్తైన కొండశిఖరముపైకి లాగుట వంటిది. ఎంతగా నిరోధించుచున్నను ఇంద్రియములు మోసమునే చేయుచుండును. భక్తుడు, జ్ఞాని వీరిలక్ష్యము ఒక్కటే యయ్యును, ఒకరిది సహజపద్ధతి; రెండవవారిది, బలాత్కారపద్ధతి. ఒకరిది ప్రేమమార్గము, రెండవవారిది విరాగమార్గము.

మొదటిది అనుకూలపద్ధతి. రెండవది ప్రతికూల పద్ధతి. ఇంద్రియములు మనకు శత్రువులు గావు. వానిని భగవత్పరముగా త్రిప్పిన మిత్రులుగా మారును. జ్ఞానము గొప్పదియే యయ్యును, ఆ మార్గమున ప్రమాదము లధికము. జ్ఞానమువలన మనస్సులోని సూక్ష్మ

మాలిన్యములు తొలగిపోవుట చాలకష్టము. ఎంతటి జ్ఞాని యయ్యును కొలదిగనో, గొప్పదిగనో దేహాభిమానము కలిగియేయుండును. భక్తి యోగమును ఆశ్రయించినగాని మనస్సు సంపూర్ణముగా పవిత్రతను బొందలేదు. అందువలననే మహాజ్ఞాని యయ్యును శంకరుడు భక్తి యోగము నాశ్రయించి లక్ష్మీనృసింహాది స్తవములను గానముచేసినాడు. అయితే భక్తియు జ్ఞానము నాశ్రయించనిచో నసంపూర్ణమే యగును. భక్తి జ్ఞానమును, జ్ఞానము భక్తిని నాశ్రయించినపుడే సంపూర్ణ సిద్ధికి హేతుభూత మగును. సగుణము నిర్గుణమును-నిర్గుణము సగుణమును సమాశ్రయించ వలయును.

నీ మనస్సును నాయందుంచుము.

నీ బుద్ధిని నాయందు లగ్నము చేయుము.

ఏవిధముగానైనను భగవానుని దివ్యపాదారవిందములయందు నీ మనస్సును లగ్నముచేయుట ఆవశ్యకము. భాగవతములో నిట్లున్నది.

'కామోత్కంఠత గోపికల్, భయమునన్ కంసుండు వైరిక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్, సంబంధులై కృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రిన్ గంటి మెట్లైనను
ధ్యామధ్యాన గరిష్ఠులైన హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా'

గోపికాంగనలు మోహనకృష్ణుని కామించినారు. ఆతనితో రాసక్రీడా వినోదములలో తేలియాడినారు. ఆయన యధరామృతములను గ్రోలినారు. ఆయన వక్షస్థలమున విహరించినారు. ఆయన యెడబాటును సహింపక రోదనము చేసినారు. ఆహారపానీయములను వదలినారు. అడవులలో, పొదలలో, చెట్లలో, చేమలలో ఆయనకొరకు పరితాపముతో, హృదయవేదనతో, మన్మథాగ్ని సంతప్తులై అన్వేషించినారు. వారికి కన్నుమూసినను, కన్ను తెరచినను కృష్ణమోహనుడే సాక్షాత్కరించును. వారి పలుకులు, పాటలు, చేష్టలు, గమన

ములు, భావములు, చింతనములు, సర్వమును కృష్ణుని గూర్చియే. వారిజీవితమే కృష్ణమయమైపోయినది. వారి సంభాషణములలో కృష్ణ గానమే వినవచ్చెడిది. నారదుడు భక్తిసూత్రములను వ్రాయుచు 'యథా వ్రజగోపికానాం' అని వ్రజగోపకన్యలే భక్తితత్త్వమున కుపమానములని చెప్పినాడు. ఇట్లు గోపికలు కామాత్మకంగా తరించినారు.

ఇక కంసుని కృష్ణభక్తిని చూతము. ఈతనిది విరోధభక్తి. కంసునకు వాసుదేవుడన్న గిట్టదు. శత్రువుగా భావించును. అతని చర్యలను చూచి భయపడును. భాగవతములో పోతనామాత్యు డిట్లు వర్ణించును.

'శ్రవణరంధ్రముల నేశబ్దంబు వినబడె, నదిహరిపలుకని యూహించు నక్షిమార్గమున నెయ్యదిసూడబడెనది, హరిమూర్తిగానోపునంచు జూచు దిరుగుచో దేహంబుత్సృశ్యమైనజోకిన హరికరాఘాతమోయనుచుగదియు గంధంబు లేమైన ఘ్రాణంబుసొచ్చిన, హరిమాలికాగంధమనుచు నదరు బలుకులెవ్వియైనబలుకుచో హరిపేరుపలుకుబడియెఅనుచు బ్రమసిపలుకు దలపులెట్టివైన దలచి యాతలపులు, హరితలంపులను చు నలుగ దలచు'

కంసుని కన్నులు, చెవులు, నాసిక, నాలుక, దేహము-సర్వేంద్రియములును హరిభావమందే సతతమును లగ్నమయ్యెను. గోపికలు ప్రణయభావముచే కృష్ణుని సర్వేంద్రియములతో నారాధించినట్లు భయముచే కంసుడు తన సర్వేంద్రియములతో గోపాలదేవుని భావించును. ఇరువురి ధ్యానవస్తువు ఒక్కటే. ఇరువురును జేసినది సంతత ధ్యానమే. కావున ఇరువురును బొందినది కృష్ణపరమాత్మనే. ఒకరికి ప్రణయము మరియొకరికి భయమును సాధనమయ్యెను. శిశుపాలాదులకు విరోధభావము కృష్ణధ్యానమునకు సాధనమయ్యెను. యాద

వులకు బంధుభావము. ప్రేమతో కొందరకు; భక్తి సాగానములతో మరికొందరకు భగవానుడారాధితుడైనాడు.

ఎట్లయినను సరియే కావలసినది కృష్ణధ్యానము.

'మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః'

అని గీతాచార్యుడు పలుకును.

---

## 80. సగుణ నిర్గుణములు భగవంతుని రెండురూపములు

**Saguna and Nirguna two forms of God·**

నేనొకనాడొక సగుణోపాసనమును గూర్చియు - విగ్రహారాధనలోని గొప్పతనమును గూర్చియు ఒక సభలో నుపన్యసించుచుంటిని. ఒక క్రైస్తవ మిత్రుడు వెంటనే లేచి యిట్లు ప్రశ్నించెను. ఏమండీ సర్వవ్యాపకుండయిన భగవంతునికి ఒక దేవాలయమునుకట్టి 'ఇందు దేవుడున్నాడనుట' ఆయనకు, ఆయన విశ్వవ్యాపక లక్షణమునకు విరుద్ధముకాదా! ఆకార రహితుడైన పరంజ్యోతి స్వరూపమునకు ఒక విగ్రహమును కల్పించుట, ఆయన నిరాకార లక్షణమునకు ప్రతిబంధ మగుటలేదా!

నే నిట్లంటిని. నాయనా భగవంతునకు ఆకారము లేదు! ఆయనకు ఆకారము గలదు. ఆయన నిరాకారుడు సాకారుడునుకూడ. ఆయన సగుణుడు, నిర్గుణుడుకూడా, ఆయన నామరహితుడు మరియు అసంఖ్యాకములగు నామములు గలవాడు కూడ. ఇట్లు పరస్పర విభేద లక్షణములు గలవాడే భగవంతుడు. ఆయన బ్రహ్మాదులకు కూడ మనస్సులతో యోచించుటకు శక్యముకాని వాడు. ఇంద్రియాతీతుడు. ఆయన భక్తులకు కోరినరూపములతో ప్రసన్నుడగును. ప్రవహించు నదీజలములకు ఆకారము లేదుకదా. కాని ఆజలమును ఈ గ్లాసుతో నేను తెచ్చినప్పుడు జలము ఈపాత్రయొక్క ఆకార

మును పొందది. బంగారమున ఆకారము లేదు. కాని అదియే కుండలముగా, గాజులుగా, గొలుసులుగా ఆకారమును పొందుటలేదా... ప్రకృతికి ఆకారము లేదు. కాని అది వస్త్రముగా ఆకారము దాల్చును. ఇట్లే నిరాకార భగవానుడు సాకార భగవానుడగును.

నిరాకారముకంటె సాకారము మధురమైనది. ప్రియమైనది, ఇంద్రియగోచరమగుటచేత సాధకునకు అవలంబన సాధ్యమయినది.

క్రైస్తవుడవయిన నీవు నిర్గుణ నిరాకారోపాసనము చేయుచున్నానని తలంచుచున్నావు. ఇది పొరపాటు. నీవు కూడా చేయుచున్నది సగుణసాకార దైవోపాసనమే సుమా.

హిందువుల దేవాలయమును ఆక్షేపించుచున్నావు. నీవు 'చర్చి' ని ఏల కట్టుకొన్నావు. హిందువులకు ఏకాదశివలె నీకు 'ఆదివారము' ప్రత్యేక ప్రార్థనదినము కదా. హిందువుల పండుగులవలె నీకును క్రిస్టమసు, ఈస్టరు, గుడ్ ఫ్రైడే, మున్నగు ప్రత్యేక పర్వదినములున్నవి కదా. ఆ దినములలో ప్రత్యేకారాధనములు, నివేదనములు, భోజనాదులు గలవుగదా. ఇప్పుడు నీవు చేయునది సగుణారాధనా లేక నిర్గుణారాధనమా? ఇట్లే మహమ్మదీయుల మసీదు, నమాజు, శుక్రవారము, బక్రీదు, రంజాను, ఇవి అన్నియు సగుణోపాసనా విధానములే.

**"O Father in Heaven"** స్వర్గములోనున్న ఓతండ్రీ! అని భగవానుని నీవు ప్రార్థింతువు కదా.

తండ్రి అనగా భగవంతుడు పురుషుడనియే కదా నీభావము. 'స్వర్గము' అని పిలుచుటలో నీవును ఆయనకు ఒక నివాసస్థలమును నిర్ణయించుట లేదా! ఇవి సగుణలక్షణములా లేక నిర్గుణలక్షణములా. కావున ఇతరులను ఆక్షేపించకుము. భగవానుడు 'అఖిల రూపులు తన రూపమైనవాడు మరియు ఆదిమధ్యాంతములు లేక యలరువాడు, భక్తజనముల, దీనుల పాలివాడు.'

ఆ దివ్యమూర్తిని ఏరూపములో నైనను ధ్యానింప వచ్చును. రూపరహితునిగా ధ్యానించు శక్తి నీకున్నచో అట్లే కానిమ్ము. కాని సగుణారాధనము తేలికపద్ధతి. నిర్గుణము క్లేశభూయిష్ఠమని గీత పలుకు చున్నది. సర్వాలంకార శోభితమై హృదయాకర్షణమును గలిగించు దేవతామూర్తి సన్నిధానములోనే నీమనస్సు ఏకాగ్రతను చెందింప చలించుచుండ నిర్వికార పరబ్రహ్మము నుపాసించు శక్తి నీవు గలవని అహంకరించు చున్నావా?

దేహాభిమానం గలవానికి నిర్గుణ పరబ్రహ్మోపాసనము దుస్సాధము. సగుణ నిర్గుణములు ఒక రూపముయొక్క భిన్న రూపములు. ఒకటి సాధనము రెండవది సాధ్యము. సాధ్యసాధనములు అవినాభావ సంబంధములు గలవి.

.....—.....

## 81. అభ్యాస మార్గమున హరిపాదము లాశ్రయింపుము

'అనిత్యమ సుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మాం'

ఈ లోకము అశాశ్వత మైనది, దుఃఖభూయిష్ఠ మయినది. నీవు నన్ను భజింపుము, అని భగవానుడు గీతలలో పలుకును. నీ మనోబుద్ధులను నిరంతరమును నాయందు నిలుప జాలకున్నచో అభ్యాస మార్గమున సాధన చేయుమని భగవానుడు హెచ్చరించును. చేసిన పనినే మరల చేసిన అభ్యాసమగును. ఆ అభ్యాసమే కాలనియమమును పాటించి చేయుచున్న మరింత బలపడును. అభ్యాసముతో సాధ్యము కాని దీ ధరాతలములో నేయొకటి లేదు. సర్వమును అభ్యాస సాధ్యము.

'అనగ ననగ రాగ మతిశ యిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన'

అని నేమనయోగి గానముచేసినాడు. బండరాతిని కూడదిన దినమునకును క్రమ క్రమ సాధనముచే కొండ శిఖరాగ్రమునకు తీసికొని పోవవచ్చును. ...ని నిత్యసాధనము చేతనే తీగపై అవలీలగా నడుచుచున్నది. సర్కసులో ఏనుగును మోయుట దానిని చిన్నతనము నుండియు అభ్యాసము చేసికొన్న ఫలితమే. రైళ్ళు, సైకిళ్ళు, విమానములు, వీనిని నడుపుట నిరంతరాభ్యాసము వలననే సాధ్యమగుచున్నది. చిన్నతనములో నీ తల్లిదండ్రులు అభ్యాసముచేసిన అన్నప్రాశనమే క్రమక్రమముగా నీవుపెరిగిపెద్దవాడవయిన పిదప విశేషభోజన పదార్థములను జీర్ణము చేసుకొను శక్తిని గలిగించినది.

సాతతము శిక్షతో అభ్యాసము చేసిన కారణముననే బ్రాహ్మణ కుమారుడు వేదమంతయును చక్కగా గానము చేయుచున్నాడు. గాంధీజీ గీతను కంఠస్థము చేసిన విధము మీరు తెలిసియే యుందురు. ప్రతి దినమును ఒక్కొక్క శ్లోకము కాగితముపై వ్రాసుకొని గోడకు తగిలించి దంతధావన కాలమున దానిని మానసికముగా శ్రద్ధగా మననము చేయుచురాగా అనతి కాలములోనే గీత యంతయు కంఠస్థమయ్యెను.

**"There is no impossibility in my Lifes'dictionery"** నాజీవిత నిఘంటువులో 'అసాధ్య' మను పదమే లేదు'అని నెపోలియను పలికినాడు. సర్వమును దృఢనిశ్చయముతో కూడిన సాధనవలన సమకూరును.

సద్గుణములను సచ్ఛీలమును సంపాదించుకొనుటకును, దుర్గుణములను దుశ్శీలమును పోగొట్టుకొనుటకును నిరంతరసాధనాక్రమమే తోడ్పడును. ఒక గురువువద్ద ఒకశిష్యుడుండెను. అతనికి విశేషముగా నల్లమందు అలవాటుండెను. ఆ దురభ్యాసము వలన ఆ శిష్యుని మనోబుద్ధులు క్షీణించుచున్నవని ఆ గురువు గ్రహించెను. శిష్యునకు కూడ

నల్లమందుయొక్క దుర్గుణములు తెలియును కాని ఆ యలవాటు మానజాలడయ్యెను.

'నాయనా రోజునకెంత నల్లమందు వాడెదవు?' అని గురువు శిష్యుని ప్రశ్నించెను.

'రోజునకు ఒక్క అరతులము సేవింపక తప్పదు.' అని శిష్యుడు చెప్పెను.

మంచిది అట్లే కానిమ్ము. అయితే అరతులము కంటెఎక్కువగా మాత్రము సేవింపకుము. ఇదిగో అరతులము తూకముగల రాయి. దీనితో సరిగా త్రాసులో పెట్టి తూచి అంతే ప్రమాణము గల నల్లమందు వాడుము. అయితే నీవొక పని మాత్రము చేయవలయును. రాముడు మనకు అధిష్ఠానదైవము. నేను నీకు రామమంత్రమునే యుపదేశించినాను గదా! ఈ రాతితో 'శ్రీరామ' యని పలకపై మూడు పర్యాయములు వ్రాసి తరువాత ఈ రాతితో నల్లమందును తూచి సేవించుము.

శిష్యుడట్లే చేయుచుండెను. గురువుగారిచ్చిన అరతులము తూనికరాయి బలపమురాయి యగుటచే 'శ్రీరామ' యని వ్రాయునపుడు కొలది కొలదిగా అరిగిపోవుచుండెను. దానితో సమాన తూకము గల నల్లమందు కూడ కొలది కొలదిగా తరుగుచుండెను. కాని ఈ తరుగుదల స్థూలనేత్రమునకు కానరాదు. దినదినమును రాయి అరుగుచుండెను. నల్లమందు తూకము కూడ తగ్గుచుండెను. ఇట్లు కొన్ని దినములగు సరికి రాయి పూర్తిగా అరిగి పోయెను. నల్లమందు అలవాటును పూర్తిగా నశించెను. చూచితిరా క్రమానుగతమైన అభ్యాసములో నెంతశక్తి యున్నదో,

ఇట్లే బీడీలు, సిగరెట్లు మున్నగు దురభ్యాసములు గలవారు కూడా క్రమ క్రమముగా సంఖ్యను తగ్గించుచు అలవాటును పోగొట్టుకొనవచ్చును.

మనస్సును భగవానునియందు నిలుపుటకు శక్తిలేనిచో అభ్యాసముద్వారా సాధించుము. తెల్లవారుజామున లెమ్ము. ప్రారంభములో నీకిది కష్టమే యగును గాక. కాని పట్టుదలతో పదిరోజులిట్లు చేచుట కలవాటు పడుము. ఆయలవాటు నిన్ను వదలిపెట్టదు. మొదటి దినమున రెండునిమిషములు మాత్రమే ధ్యానముచేయుము. నియమిత కాలములో నియమానుసారముగా అట్లే చేయుము. క్రమక్రమముగా ధ్యానకాలము పెరిగి ధ్యానము చేయక నీవు మరొక పనిని చేయజాలవు.

సనాతన బ్రాహ్మణ కుటుంబములో సంధ్యావందనము చేయనిచో, తల్లిదండ్రులు బిడ్డలకు భోజనము పెట్టరు. ఇట్లు బలాత్కారముగా ఆ కార్యక్రమము చేయించుటచేతనే పెద్దవారైనను బ్రాహ్మణులు సంధ్యావందనము చేయక, భోజనముచేయరు. ఈశ్వర పాదాబ్జ సేవకు మనస్సును అలవాటు చేయుము. అనవభ్యాసము నీకు త్వరలో ఆత్మ సాక్షాత్కారము కలుగ చేయగలదు.

'అభ్యాస యోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ' 'ఓ అర్జునా అభ్యాస యోగముద్వారా నన్ను పొందుము' అని గీతాచార్యుడు పలుకుచున్నాడు.

---

## 82. పుణ్యకర్మల ద్వారమున భగవత్ప్రాప్తి

నాచిన్నతనంలో శ్రావణమాసం రాగానే ఆడపిల్లల చేత ఎన్నెన్నో నోములు పట్టిస్తూ వుండేవారు మాఫూళ్లో. మంగళగౌరీ వ్రతం, వరలక్ష్మీవ్రతం, పూవుతాంబూలం, నందికేశుని నోము, వినాయక వ్రతం, శనివారాలనోము, ముప్పదిమూడు పున్నములనోము, కార్తీకవ్రతం, వైశాఖవ్రతం, ఇంకా ఎన్నోవ్రతాలు, నోములు, పూజలు, అన్నదానములు హిందూ సమాజంలో ఉన్నవి. పెండ్లయిన కన్యలు మూగనోమును పట్టేవారు. సూర్యాస్తమానం అయిన

తర్వాత చుట్టుప్రక్కల నున్నవారి యొద్దకు వెళ్ళి ఆ బాలిక తాను పఠానమును బూని నిర్ణీతసంఖ్యగల ముత్తైదువులకు బొట్టుపెట్టి నమస్కరించి రావలెను. ఆ నిర్ణీతసంఖ్యపూర్తియయిన తర్వాత నక్షత్రదర్శనంచేసి, నిర్ణీతసంఖ్యగల నక్షత్రాలను ఆరాధించవలెను. అంతవరకును ఆమె మాట్లాడరాదు. ఆ బాలికల ప్రతిసమయములో ఆ బాలకలను వెక్కిరించుచు, వేళాకోళముచేయుచు నవ్వించుటకు, పలుకరించుటకు కొంటె పిల్లలు ప్రయత్నించెడివారు. ఆ నోము పట్టిన బాలికలు మాత్రము మాట్లాడువారుకారు. ఆనోములలోని అంతరార్థము నాకిప్పుడర్థ మగుచున్నది. చిన్నతనము నుండియు మితభాషిత్వము, మౌనము, పెద్దలయందు గౌరవము, ఆస్తికత, క్రమశిక్షణలకు ఈ నోములు సాధనములుగా పెద్దలు నిర్ణయించిరి.

ఈనాడు కళాశాలలలోను, పాఠశాలలలోను చదువుకొను బాలికల కీ నోములు మోటుతనముగా కనబడుచున్నవి. కాని వానిలోని పరమేశ్వర ప్రాప్తిసాధనము వారికి గోచరించలేదు. ఇట్టివ్రతములు, నియమములు, నోములు కలవంశములయందే మహాపురుషులు జన్మించినారని చరిత్ర చెప్పుచున్నది. అట్టి కుటుంబములే సిరిసంపదలతో కలకలలాడు చున్నవి.

మత్కర్మ పరమో భవ మదర్థమపి కర్మాణి కుర్వాణఃసిద్ధి మవాప్స్యసి

నాసంబంధములగు కర్మలు చేయుము. నాకొరకై చేసిన ఈ పుణ్యకర్మలు నీకు మోక్షమును ప్రసాదించును అని భగవానుడు పలుకును.

'మత్కర్మ'లను గూర్చి రామానుజు లిట్లు వ్రాసియున్నారు. 'దేవాలయములను కట్టుట, దేవతాప్రతిష్ఠలు, సత్రములను కట్టుట చెరువులను, బావులను త్రవ్వించుట, దేవాలయమును తుడుచుట రంగవల్లులను దిద్దుట, ఆలయప్రదక్షిణాదులు ఇవన్నియును మోక్షప్రాప్తికి సాధనములే.

ఇళ్లే, విద్యాలయములు కట్టుట, పేద విద్యార్థులకు ఉపకార వేతనము లిచ్చుట, వైద్యశాలల నిర్మాణము, రోగులకు సేవ, సంతర్పణలు, సమారాధనములు, తీర్థయాత్రలు, తపోహోమములు, ఏకాహములు, ఇవన్నియు పుణ్యకార్య క్రమములే! భగవంతుని నుద్దేశించి చేయు కార్యములన్నియు పుణ్యకర్మలే.

ఈ పుణ్యకర్మలు క్రమక్రమముగా చిత్తశుద్ధిని కలిగించును. పేరుకొరకును, గౌరవము కొరకును ఈ పుణ్యకార్యము లాచరించినను వానివలన ఫలితము లేకపోలేదు. క్రమక్రమముగా వారికి ఈ పుణ్యకర్మలు సచ్చింతనమును కలుగచేయగలవు. కర్మజ్యాయోహ్యకర్మణః లోప భూయిష్ఠములైనను సత్కర్మలు ఆచరించుటయే విశేషము- ఈపుణ్యకర్మలలో దివ్యశక్తిగలదు. అది వారి మనస్సులను పవిత్రము చేయును. పవిత్రమగు అంతఃకరణములో పరమాత్మ ప్రకాశించును. పుణ్యకర్మలు జ్ఞానసాధనములై మోక్షప్రాప్తి గలిగించును.

---

## 83. సర్వకర్మఫల త్యాగము మరొకసాధనము

**Geeta tells the world what really is the duty of man in life. It teaches how in view of this duty one should mould ones life be as to attain moksha even remain in samsari. (Balagangadhar Thilak)**

జీవితములో మానవుని వాస్తవికమైన విధ్యుక్తకర్తవ్యమేదియో విశ్వమునకు గీతాశాస్త్రము ప్రబోధము చేయును. ఆ ఉత్తమ మహాధర్మము కొరకు – సంసారంలో ప్రవర్తిల్లు చుండియు మోక్ష సామ్రాజ్యమును బొందుటకు మానవుడు తన జీవితమున నెట్లు నడపవలెనో ఈమహాశాస్త్రము ప్రబోధము చేయును.

మోక్ష సామ్రాజ్యమును బొందుటకు ఈ అధ్యాయములలో ఇంతవరకు మూడు మార్గములు చూపబడినవి. సర్వకర్మసంత్యాగము

నాలుగవ మార్గము. గీతయొక్క సందేశము ఫలత్యాగ రూపకమైన యోగము.

ఈవిషయమును భగవానుడు 3వ 6వ అధ్యాయములలో తెలిపియే యున్నాడు.

నీవుకర్మ చేయక తప్పదు. ఆ కర్మఫలమును మాత్రము కాంక్షింపకుము. ఆ కర్మఫలములను సకలలోకేశ్వరుండైన భగవానునికే సమర్పింపుము. కర్మఫలమును భగవదర్పణ చేసిన దాని ఫల మనంతమగును. ఆనిష్కామ కర్మ మొక స్వల్పమైనను మహాభయమునుండి నిన్ను రక్షించు నని ద్వితీయాధ్యాయమున భగవాను డుపదేశించినాడుగదా! భక్తిజ్ఞాన కర్మల సమన్వయ సంపుటీకరణమే కర్మఫల త్యాగయోగము. నీవు చేయు ప్రతిచిన్నకర్మయు భగవదర్పణ చేయుము. కర్మలలోమంచివి-చెడ్డవి యను భేదమును గమనింపకుము. సర్వమును ఆయనకు సమర్పింపుము. దానివలన నీకు లభించునది పరమశాంతి. దీనిని నీస్వానుభవముచే గ్రహింపుము. ఈసందర్భమున నొక చిన్నయుదాహరణమును వినోబాజీ తెలిపినాడు. ఈకథ మిక్కిలి చమత్కారముగా నుండవచ్చును. ఇందలి సత్యాసత్యములను గూర్చి నీవు విమర్శింపవద్దు. ఇందలి అంతరార్థమును, నీతి పాఠమును గ్రహింపుము.

ఒకగ్రామములో ఒక యువతి యుండెను. ఆమె భక్తురాలు. శ్రీకృష్ణుడన్న నామెకు మిక్కిలి ప్రీతి. ఆమెచేయు సకలకర్మలను కృష్ణునికే సమర్పించును. ఆమె వంటగదిని అలికి శేషించిన మట్టిని ముద్దగా చేసి 'కృష్ణార్పణ'మని గిరాటు వేయును. సరిగా ఆ ముద్ద ఆ గ్రామమునందలి కృష్ణాలయములోని కృష్ణవిగ్రహముపై బడును. పూజారి నిత్యమును ఆ విగ్రహమును కడిగివేయుచుండెను. ప్రతినిత్యమును ఇట్లే జరుగుచుండెను. దీనికి కారణమును గూర్చి పూజారి పరిశీలన చేయగా కృష్ణభక్తురాలగు ఆ స్త్రీ కృష్ణార్పణ భావముతో

గిరాటవేయుచున్న మట్టిముద్ద సంగతి ఆతనికి తెలియవచ్చెను. ఆమె జీవించియున్నంతవరకు తానా విగ్రహమును ప్రతిదినమును కడుగవలసి యున్నదని పూజారి నిశ్చయించుకొనెను. కొంతకాలమున కా స్త్రీకి జబ్బుచేసెను. మరణయ్యాపై నుండెను. ఆమె మృత్యువును గూడ కృష్ణార్పణ మనెను. వెంటనే దేవాలయములోని విగ్రహముముక్కలు ముక్కలుగా విరిగిపోయెను. స్వర్గలోకము నుండి ఆమెకొరకు దివ్య విమాన మొకటివచ్చినది. కృష్ణపాదాబ్జ దత్తచిత్తయగు నాయువతి దానినిగూడ కృష్ణార్పణము గావించెను. వెంటనే ఆవిమానము దేవాలయ శిఖరమును తాకినది. ఈవిధముగా వినోబాజీ కథాఘట్టమును రచించినాడు.

ఇందలి సారాంశమును గ్రహింపవలయును. ఆయువతీ మణి సర్వమును కృష్ణార్పణ మొనర్చినది. ఇందు శుభాశుభములు రెండును గలవు. స్వర్గఫలమును గూడ ఆమె కృష్ణార్పణ మన్నది. ఓహో ఏమి ఆశ్చర్యము!

సర్వకర్మ ఫలత్యాగము అనంతఫలదాయకము 'సర్వకర్మఫల త్యాగం తతః కురుయతాత్మవాన్' అని గీత పలుకును. మరియును 'శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్, జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే
ధ్యానాత్ కర్మఫలత్యాగం, త్యాగా చ్ఛాంతి రనంతరం'
అని గీత చెప్పుచున్నది.

ఓ అర్జునా అభ్యాసముకన్న జ్ఞానము శ్రేష్ఠమైనది సుమా. జ్ఞానముకంటెను ధ్యానము శ్రేష్ఠమైనదని గ్రహింపుము. ధ్యానము కంటె కూడ కర్మఫలత్యాగము సర్వశ్రేష్ఠ మైనదని గ్రహింపుము. దానివలననే పరమశాంతి లభించును.

## 84. భక్త లక్షణములు. The quality of a true devotee

నీతో నవ్వులు నర్మగర్భితములున్ నీతోడ సల్లాపముల్
నీతో ముద్దులు ముచ్చటల్ మురిపముల్ నీతోడి విజ్ఞానముల్
నీతో నాటలు పాట లేకతమునన్ నీతో జగంబంతయున్
నీతోనే సుమి నీదు భక్తునకు తండ్రీ భక్తచింతామణీ॥

భక్తునకు లోకమంతయు భగవన్మయము...లోకులందరును భగవత్స్వరూపము. ఆతని చేష్టలన్నియును భగవదారాధనములే. అతనిలో మూర్తీభవించును. ఆతని గుణగణమునుబట్టియే ఆతడు భక్తుడని గుర్తింపబడును. ఆ భక్త లక్షణములనుగూర్చి భగవానుడీ అధ్యాయములో 13 వ శ్లోకమునుండి 19 వ శ్లోకమువరకును ఏడు శ్లోకములలో గానము చేసినాడు. ఈ సప్త శ్లోకములలో భగవానుడు గానము చేసినాడు. ఈసప్తశ్లోకములును నిత్య పఠనీయములు, స్మరణీయములు, ధ్యానీయములు, పురుషార్థ సాధకులగు స్త్రీ పురుషు లెల్లరును ఈశ్లోకములను చక్కని అట్టపై వ్రాసిదానికి అద్దమును కట్టించి తమ పడక గదులలోను ఆఫీసు గదులలోను, గుమ్మములపైనను వ్రేలాడ దీయవలయును. వారు పరుండునపుడు, లేచునపుడు, పనిలో కూర్చుండు నపుడు ఈ శ్లోకరాజములను పఠింపవలయును.

ఇవి మణులకంటెను, మాణిక్యములకంటెను, రత్నములకన్నను, వజ్రముల కన్నను, వైడూర్యముల కన్నను మిక్కిలి విలువైనవి.

గీత చెప్పిన ఆదర్శజీవిత విధాన మిది. భగవద్గీత ప్రబోధము చేసిన ఉత్తమ పురుషుని శీల సంపద ఇదియే, భగవానుడు మానవునకు బోధించిన భాగవత ధర్మము లివియే. మానవుని మాధవ స్వరూపునిగా మార్చు దివ్యరక్షణము లివియే.

భక్తుడనగా ఈ లక్షణములు కలిగియున్నవాడే యని తెలిసికొనుము. అతడే జ్ఞానియు సన్న్యాసియుకూడ. ఈ లక్షణములు లేక

కేవల బాహ్యవేషములు మాత్రము ధరించి నేను భక్తుడను, నేను జ్ఞానిని, నేను సన్యాసిని, అని చెప్పుకొనువాడు మిథ్యాచారి, కపటి, సంఘద్రోహి. తాళములు మ్రోగించుచు కీర్తనలు పాడినంత మాత్రమున అతడు భక్తుడు గాడు. జ్ఞాన సంబంధములగు ప్రసంగములు చేసినంతమాత్రమున అతను జ్ఞానికాబోడు. కాషాయాంబరములను ధరించినంత మాత్రమున నతడు సన్యాసియు కాబోడు. అతనిలో మూర్తీభవించిన ఉత్తమ సుగుణ సంపదలను బట్టియే, అతనిసత్ ప్రవర్తనమును బట్టియే, అతని మహోన్నత శీలమును బట్టియే, ఆతని నైతిక స్థాయిని బట్టియే, ఆతడు భక్తుడని భగవద్గీత నిర్ణయించును. ఈసప్త శ్లోకములలో భగవానుడు ముప్పదిమూడు సుగుణములను పేర్కొనినాడు. ఈ గుణసంపద గలిగినవాడే భక్తుడనియు, అట్టి భక్తుడే తనకు ప్రియుడనియు భగవానుడు నిస్సందేహముగా స్పష్టముగా, మరల మరల తెలియ జెప్పినాడు. ఇట్టి లక్షణములు లేనివాడు శరీరమంతయు విభూతి రేఖలు దిద్దుకొన్నను, దేహమంతట ఊర్ధ్వ పుండ్రములు ధరించినను వ్యర్థము. కావలసినది ఉత్తమ ప్రవర్తనమే యని గీతాశాస్త్రము నొక్కిచెప్పును. ముప్పది ఆరు దివ్యగుణములు గానము చేయబడుచున్నవి.

ద్వేషరాహిత్యముతో నారంభమై స్థిరబుద్ధితో ముగింపునొందిన ఈ మహోన్నత దివ్యగుణములే లోకమును స్వర్గ సామ్రాజ్యమును గావించును. సర్వ దేశములకును సర్వకాలములను సుఖశాంతి, అభ్యుదయ క్షేమా యోగములు ప్రసాదించు, ఈ మహాగుణ సంపత్తిని మీరు పొందుదురుగాక! గీతా సమ్రాట్ కృష్ణభగవానుడు మిమ్ముల నాశీర్వదించుగాక!

భక్త లక్షణములను గూర్చి తెలిసికొందముగాక!



## 85. భక్తి మందారషట్కము.

**The six flowers of devotion.**

ఈ అధ్యాయములోని పదమూడవ శ్లోకములో వ్యాసదేవుడు భక్తి మందారపుష్పాల నారింటిని వికసింప చేసినాడు. ఆ దివ్యమందారాల దివ్య సుగంధాల నాఘ్రాణించి మధుర రసాస్వాదనము చేసి పవిత్రుల మగుదుము గాక!

'అద్వేష్టా సర్వభూతానాం, మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకార, స్సమదుఃఖ సుఖఃక్షమీ.'

1. భక్తుని దివ్యగుణాలలో ద్వేషరాహిత్యము ప్రధానమగుటచే నయ్యది ప్రధానమగు తొలిపుష్పముగా భగవానుడు కీర్తించుచున్నాడు.

మనము పూజలను చేయవచ్చును. వ్రతముల నాచరించవచ్చును. పురాణములను వల్లెవేయ వచ్చును. సంకీర్తనలు చేయవచ్చును. సమారాధనలు సలుపవచ్చును. ఇవి మాత్రమే భక్తుని యొక్క ప్రధాన లక్షణము లని భావించవలదు. భక్తి బాహ్యమైనది గాదు. భక్తి అంతర్గతమైనది. మనస్సుయొక్క మాలిన్య రాహిత్యమే భక్తియని గీతాచార్యుడు వచించును. నీవు పూజలు సంకీర్తనలును చేయుచున్నను తోడివారిని ద్వేషించుచున్నచో నేమి ప్రయోజనము? మానవులయందు మాత్రమేగాదు సమస్తభూత జాలముల యందును ద్వేషరాహిత్యమును గలిగి యుండుట భక్తి. రామభక్తునకు విశ్వమంతయును రామమయముగా గోచరించినచో నిక ఆతడు ఎవ్వరిని ద్వేషించును. విశ్వమంతటను ఆత్మ స్వరూపమును భావించినపుడు ఎవ్వడు ఎవనిని దూషించ గలడు? కాలు, చెవి, కన్ను, నాసిక మున్నగు వివిధావయవము లన్నియును ఒకే శరీరములోని భాగములు గానున్నందున ఏ అవయవమునకు బాధ కలిగినను శరీరమంతయును

క్షోభించునుగదా. అటులనే ఎవ్వరిని ద్వేషించినను తన్ను తాను ద్వేషించుకొనుటయే యగును.

నీ యందు ప్రేమ నెలకొని యున్నచో విశ్వమంతయును ప్రేమ మయముగానే గోచరించును.

ఒక ఉదాహరణము:- సమర్థ రామదాసు మహారాష్ట్ర భాషలో రామాయణమును రచించినవాడు. మధురమైన యామహా కావ్యమును ఒకానొక ఏకాదశీ పర్వదినమున తన, శిష్య బృందము లకు చదివి వినిపించు చుండెను. ఎచ్చట రామగానము జరుగుచుండునో అచ్చట మహాభక్తుడగు వీరహనుమాన్ మారువేషములో నుండి రామ కథను శ్రవణము చేయు చుండునని రామ భక్తుల విశ్వాసముగదా. అందులో మహాభక్తుడగు సమర్థుడు తాను స్వయ ముగా వ్రాసిన రామకథను భక్తితో గానము చేయుచుండగా ఆ పుణ్య స్థలమునందు హనుమ తు డుండు ననుటలో నాశ్చర్యమేమి? అనాడు మహాకవి రామాయణములోని మధుర ఘట్టమైన సుందర కాండను గురించి చెప్పుచుండెను. హనుమంతుని బలవీర్య శక్తిప్రభా వము లీకాండలో మహోజ్వలముగా వర్ణింపబడియున్నవి గదా.

'సీతా మహాసాధ్వి అశోక వృక్షము క్రిందకూర్చుని రామధ్యా నము చేయు చున్నది. ఆ యశోక వృక్షమంతయును తెల్లని పుష్పము లతో శోభిల్లు చున్నది'. అని సమర్థుడు తన మధుర కవితాభాషలో తెల్లని అశోక పుష్పముల శోభలను వర్ణించుచున్నాడు.

ఇంతలో వీరహనుమాను డచ్చట సాక్షాత్కరించి నాడు. సమర్థుడు పరమోత్సాహముతో లేచి, నా జీవితము ధన్యమైనది. నా రామాయణ కావ్య రచన ఫలప్రదమైనది. రామ భక్తాగ్రేసరుండ వగు నీ దివ్య దర్శనభాగ్యము లభించినది. అని పలుకుచు మారుతికి సాష్టాంగ నమస్కారము చేసెను. మారుతి యిట్లు పలికెను. మహాకవీ నీకావ్యమంతయు మధురముగా నున్నది. కాని అశోకవన వర్ణన ఘట్ట

మున కొంచెము పొరబడితివి సుమా, అశోక వృక్షము నందలి పూవులు తెల్లగానున్నట్లు వర్ణించినావుగదా! కవీ! వినుము. ఆ పుష్పములు ఎఱ్ఱగానున్నవి. కనుక నీ కావ్యములో సరిదిద్దు కొమ్ము, అని పలికెను.

మహాకవి యిట్లు పలుకను మారుతీ, అశోక వనమందలి పుష్పములు తెల్లగా నున్నవి. అవి ఎఱ్ఱగా లేవు. నీవు చాల పొరబడితివి సుమా.

మారుతి ఆవేశముతో నిట్లు పలికెను. 'ఓకవీ' వినుము సాగరమును దాటి అశోక వనమునకు పోయిన వాడను నేను. సీతమ్మను చూచిన వాడను నేను. అశోకవనమంతయును కలయ దిరిగినవాడను నేను. అశోకవనమును దగ్ధము చేసినవాడను నేను. నాకంటె నీకేమి తెలుసును? అచ్చటి పూవులు ఎరుపుగానే యున్నవని ప్రత్యక్షముగా చూచిన నేను నీకు స్వయముగా చెప్పు చున్నాను. కనుక నీ కావ్యమును సరిదిద్దుకొమ్ము' సమర్థు డంగీకరింప లేదు. అందలి పుష్పములు తెల్లగానే యున్న వని వాదింపసాగెను. మారుతికిని సమర్థునకును వాదోప వాదములు చెలరేగెను.

చివరకు వారిరువురును ఒకనిర్ణయమునకు వచ్చిరి. మన మిరువురమును రాముని వద్దకు పోదము. ఆయన ఏది చెప్పిన దానినే శిరసా వహింతము. అని తలంచిరి.

నీవే పోయి తెలిసికొని రమ్మని సమర్థుడు హనుమంతుని కోరెను. వీరహనుమాన్ రాముని వద్దకు పోయి సమర్థునకును తనకును జరిగిన వాదము నంతను నెరింగించి అశోక పుష్పముల రంగును యథార్థముగా తెలుపు మని కోరెను.

రామచంద్రుడు చిరునవ్వు నవ్వుచు, 'మారుతీ' సత్యము చెప్పుచున్నాను వినుము. అందలి పుష్పములు కవిచెప్పిన రీతిలో తెల్లగానే యున్నవి. ఎరుపురంగు మాత్రము కాదు సుమా.' హనుమంతుడు దిగ్భ్రాంతు డాయెను.

రాముడిట్లు పలికెను. మారుతీ! లంకలో ప్రవేశించిన తరువాత రావణాసురునిపై నీకు కలిగిన క్రోధావేశముచేత నీకన్నులు ఎఱ్ఱపడినవి. ఎఱ్ఱపడిన నేత్రములతో చూచిన కారణముచేత నీకా తెల్లని పుష్పములు ఎఱ్ఱగా కానవచ్చినవి.

సారాంశ మిది. నీమనసులో ప్రేమ యున్నచో విశ్వమంతయును ప్రేమ మయముగా నుండును. నీ హృదయము ద్వేషముతో నిండిన లోకములో నీకు సర్వత్ర, ద్వేషమే కానవచ్చును. కామెర్ల వ్యాధి గలవానికి లోకమంతయును పచ్చగానే యుండును. కావున అద్వేష్టా సర్వభూతానాం' హృదయము నుండి ద్వేషము తొలగినవాడే భక్తుడు. బాహ్యమగు వేష భాషలు భక్తుని లక్షణములు గాజాలవు.

2. మైత్రః కరుణ ఏవ చ. (Friendly and Compasinate)

భక్తునకు ఎట్టి దుర్గుణము లుండరాదో పైని వివరింపబడినది. ఇప్పుడు ఏ గుణము లవసరములో తెలుపబడుచున్నవి.

ప్రేమ, కరుణ, దయ, ఇవి భక్తుని లక్షణములు, కష్టములో నున్న వారికి సేవచేయువాడే నిజమైన భక్తుడు. సమస్త భూతముల లోను భగవానుని దర్శించుచు వారియొక్క సేవయే భగవత్సేవగా భావించువాడు భక్తుడు.

ఉదాహరణము. ఏకనాథస్వామి తన శిష్య బృందముతో ఉత్తరదేశయాత్రకు బోయెను. 'హరిద్వార'లో శుద్ధ గంగను రెండు బిందెల నిండుగా నింపి తన శిష్యులతో నిట్లు చెప్పెను. గంగోదకము చాల పవిత్రమైనది. దీనిని భూమిపై పెట్టరాదు. ఒకరి తరువాత నొకరు బిందెలను భుజములపై మోయుచు దక్షిణ భారతమున రామేశ్వరము నకుబోయి అచ్చట రామలింగేశ్వరున కభిషేకము చేయవలయును. అప్పుడే పూర్ణయాత్ర ఫలము గలుగును.

గురుదేవుని పలుకులు విని భక్తి శ్రద్ధలతో గంగోదకముతో నిండిన బిందెలను మోసికొని వచ్చుచుండిరి. గ్రీష్మ తాపము

విశేషముగా నుండెను. ఐనను వారు లక్ష్యపెట్టక గురుదేవుని ఆజ్ఞను శిరసావహించి ప్రయాణము చేయుచుండిరి.

దారిలో వారికొక గాడిద కానవచ్చెను. అది క్రిందపడి దొర్లుచు కాళ్లు కొట్టుకొనుచుండెను. గ్రీష్మ తాపమును సహింపలేక దాహము నకు తట్టుకొనలేక ఆగార్దభ మట్లు పడిపోయి కొట్టుకొనుచున్న దని గ్రహించి ఏకనాథుడు తన శిష్యులవద్ద నుండి గంగోదకము గల ఒక బిందెను తీసుకొని ఆ గార్దభ రాజము యొక్క శరీరమున కభిషేకము చేయించెను. రెండవ బిందెను తెచ్చి ఆ మృగమున కెదురుగా నుంచెను. ఆ గార్దభ రాజు ఆ జలమంతయును పూర్తిగా త్రాగివేసి సంతృప్తితో తోక నాడించుచు పరుగెత్తుకొని పోయెను.

గురుదేవుని చేష్టనుచూచి శిష్యు లాశ్చర్యము బొందిరి. గురుదేవు డిట్లు పలికెను. శిష్యులారా మీరెంతో బాధతో పాదయాత్ర చేయుచు ఈ బిందెలను మోయుచున్నారుగదా. పరమేశ్వరుడు మీ బాధలను చూడజాలక యిచ్చటనే గార్దభేశ్వరుడుగా సాక్షాత్కరించి నాడు. ఆయనకు మనమిపు డభిషేకము చేసితిమి. ఆ రామలింగేశ్వరుడే ఈ రూపములో వచ్చి మన అభిషేకమును స్వీకరించి ఆశీర్వదించినాడు' భూతదయ కరుణ దేవతా లక్షణము.

3 మమకార రాహిత్యము(Non-attachment) మమకారమే బంధనము - మమకార రాహిత్యమే భక్తి. నిత్యుడై నందిన జీవితములో మమకారము లేనివాడవై - సంగరహితమగు చిత్తముతో వ్యవహరింపుము. బాహ్యవస్తు నిరాకరణము చేతనే మమకార రాహిత్యము పొసగదు.

ఉదాహరణము సంగరహితముగా జీవితమును గడపినగాని మోక్షము రాదని యెరింగి శిఖిధ్వజ మహారాజు తన భార్యా-బిడ్డలను విడిచి, రాజ్యమును వదలి, ఎవ్వరితోను చెప్పకుండ అరణ్యమునకు

పోయి తపస్సు ప్రారంభించెను. మరునాడు భార్య భర్తకొరకు వెదకి ఆయన అరణ్యమున తపమాచరించుకొనుచున్నట్లుగా తెలిసికొనును. ఆమె మంత్రుల సహాయముతో రాజ్యపాలన నిర్వహించుచుండెను.

కొన్ని సంవత్సరముల తరువాత ఆమె పురుష సన్యాసి వేషమును ధరించి భిక్షాపాత్ర, కమండలువు, దర్భాసనమును గైకొని తన భర్త తపస్సు చేయుచున్న అరణ్యమునకే పోయెను. భర్త తప మాచరించు చున్న వృక్షమువద్దకే పోయి అచ్చటనే తన కమండలము మున్నగు వస్తువులను పట్టుకొని తపస్సునకు కూర్చుండెను.

అంత నా మహారాజు విసుగుదలతో చూచుచు నిట్లు పలికెను. ఓ సన్యాసి, ఈచెట్టు నాది, నేను చాలకాలము నుండి యిచ్చటనే కూర్చుండి తపము చేసికొనుచున్నాను. నీవు మరొక చెట్టువద్దకు పొమ్ము నావృక్షమువద్ద నీవుండ తగదు పొమ్మని గద్దించెను.

సన్యాసి రూపముతోనున్న ఆతని భార్య, 'ఓరాజా, ఇదిగో నీ తపస్సుయొక్క ఫలితము. భార్యను వదలితివి, బిడ్డలను వదలితివి, రాజ్యమును కూడ విడనాడినావు, కాని యిచ్చట నీకు వృక్షమునందు మమకారము జనించినది. 'ఇది నా చెట్టు' అని మిగుల మమకారముతో పలుకుచున్నావే, ఏమి జ్ఞాన మిది? అని పరిహాసము చేసెను. మమకార త్యాగమే భక్తిగాని బాహ్యావస్తు త్యాగముకాదు.

**4.** అహంకార రాహిత్యము (**Free from egoism**) ఎవనికి అహంకారము లేదో వాడే భక్తుడు వాడే భగవత్సేవకు అర్హుడు. ఒక ఉదాహరణము:- భగీరథ చక్రవర్తి ఒకనాడు గురుదేవుడగు వసిష్ఠు లవారిని సమీపించి యిట్లు పలికెను. 'గురుదేవా'నాకు వయస్సు మళ్ళు చున్నది. బ్రహ్మజ్ఞానమును బొందవలెనని కోరిక గలుగుచున్నది. నాకు మంత్రోపదేశము చేయప్రార్థన.

వసిష్ఠు డిట్లు పలికెను. రాజా, నిజముగా నీవు మంత్రోపదేశ మును బొందగోరినచో నాకు ముందుగా గురుదక్షిణను సమర్పించ వలయును.

చిత్తము గురుదేవా, మీరేది కోరిన దానినే నేను తప్పక సమర్పించెదను. అని మహారాజు బదులుపలికెను. అట్లయిన వినుము, రేపటి దినమున, నీవు ధరించిన విలువయగు పీతాంబరములను, ఆభరణములను, మణిమయ కిరీటమును విడిచి కౌపీనధారివి కావలయును. ఒక భిక్షాపాత్రను చేత బూనుము. ఏ రాజవీథుల యందు నీవు ఏనుగుపై నధిరోహించి వందిమాగధులు స్తోత్రములు చేయుచుండగా పురంధ్రీమణుల మంగళహారతులను స్వీకరించుచు మహోత్సాహముతో విహరించితివో అట్టి రాజవీథులలో కౌపీనధారివై నడచి భిక్షాపాత్రను చేబట్టి భిక్షము తీసికొనివచ్చి నాకు సమర్పించుము. అదియే నాకు గురుదక్షిణ. అని గురుదేవుడు పలికెను.

వెంటనే చక్రవర్తి గురువు చెప్పిన రీతిగా సంచరించి బ్రహ్మజ్ఞానోపదేశమును బొందెను.

అట్టి పవిత్రమగు గురుశిష్య సంప్రదాయముగల పుణ్యభూమిలో మనము జన్మించినాము. అహంకార త్యాగమే భక్తి.

5. సమదుఃఖ సుఖః (**Equal in painful pleasure**) సముద్రతరంగముల వలె సుఖదుఃఖములు ప్రతివాని నిత్యదైనందిన జీవితమునందును, గలుగు చుండును. వాటిని నిగ్రహించుటయే 'భక్తి' యని గీత వచించుచున్నది. మనము భజనలు చేయవచ్చును. పూజలు సలుపవచ్చును. అంతమాత్రము చేతనే భక్తులనుగా భగవంతుడు తలంపడు. భక్తునియొక్క భక్తి సాధనలో సుఖదుఃఖములు గీటు రాళ్ళు. సుఖదుఃఖములలో సమత్వమును బొందినవాడే యోగియని గీత వచించినది.

'సమత్వం యోగ ఉచ్యతే (62-శ్లో) సమత్వమే యోగము (**Balance of mind is yoga - Even ness of mind is yoga**) అని గీతలో మరల మరల భగవానుడు ప్రబోధము చేసినాడు 'సమ' శబ్దము గీతలో అనేక పర్యాయములు వ్యాసదేవుడు గానముచేసినాడు.

'నిర్దోషం హిసమం బ్రహ్మతస్మాత్ బ్రహ్మణి సంస్థితాః' పరబ్రహ్మము నిర్దోషము సమత్వమునునై యున్నది. కావున అట్టి వారందరును పర బ్రహ్మ మందున్న వారే యగుదురు.

6. క్షమ (forgiveness) క్షమ దేవతాలక్షణము (forgiveness is a divine virtu) రామాయణమునుండి ఒక ఉదాహరణము రావణ సంహారానంతరము హనుమంతుడు సీతాదేవి కీ సంతోషవార్త తెలుపుటకు అశోకవనమునకు వచ్చెను. సీతమ్మకు శ్రీరామవిజయము నెరింగించి యిట్లు పలికెను. తల్లీ నీచుట్టునున్న రాక్షస స్త్రీలు నిన్ను ఎన్నియో విధముల బాధించి యున్నారుగదా. నీవు ఆజ్ఞయిచ్చి నచో ఈ దుర్మార్గురాండ్ర నందరను ఒక క్షణములో చంపివైచెదను. శాంతస్వరూపిణియగు సీతమ్మ యిట్లు పలికెను. నాయనా నీ వంతటి శక్తిగలవాడ వని నేనెరుగుదును. వారు వారి రాజాజ్ఞ ననుసరించి వ్యవ హరించినపుడు వారిలో దోష మేమున్నది? మరియును మన భారతీయ సంస్కృతిని ఆలకింపుము. అపకారము చేసినవారికే ఉపకారము చేయు మని తెలుపుచున్నది ఈ రాక్షస స్త్రీల కందరకును చీరలు సారెలు నిచ్చి వారియిండ్లకు పంపుము.

క్షమయే ధర్మము, క్షమయే జ్ఞానము, క్షమయే భక్తలక్షణ మని గీతాచార్యుడు తెలుపుచున్నాడు.



## 86. భక్తిపుష్ప పంచక సౌరభము

### The frogrance of the five devotional flowers

ఈయధ్యాయమునందలి పదునాలుగవ శ్లోకమున గీతాచార్యుడు అయిదు విధములగు భక్తలక్షణములను గానము చేయుచున్నాడు.

'సతతం సంతుష్టః' (Always contended)

సంతుష్టి భక్తలక్షణము, అసంతృప్తి నీచుని లక్షణము:- బాహ్యపరిస్థితులతో, బాహ్య వాతావరణములతో నిమిత్తము లేక

భక్తుడు సదా ఆనందమునే పొందుచు తన కర్తవ్య కర్మలను నిర్వహించును.

బాహ్య వాతావరణము మాయొక్క జపతపో ధ్యాన నిష్ఠలకు భంగముగా నున్నదని తరచు చెప్పుచుందురు. భక్తుడు ఆవాతావరణమును నిగ్రహించి తన కర్తవ్యమును నిర్వహించును.

ఉదాహరణము ఒక గుఱ్ఱపురౌతు ఎండలో ప్రయాణము చేయుచుండెను. గుఱ్ఱమునకు విశేషముగా దాహము కలుగుచుండెను. దూరమున నొక రైతు సోదరుడు ఒక గిలకబావివద్ద నీటిని తోడుచుండుటను గమనించి అచ్చటికిపోయి,నాయనా! నాగుఱ్ఱమునకు చాల దాహము వేయుచున్నది. దయచేసి కొంచెము జలము నిత్తువా' యని అడిగెను.

అట్లనే యిచ్చెదను. గుఱ్ఱమును తీసికొనిరమ్మని రైతు పలికెను. రైతుగుఱ్ఱమును తీసికొని వచ్చి గిలకబావివద్ద నిలిచెను. రైతు నీరు తోడుచుండగా కిఱ్ఱుకిఱ్ఱున ధ్వని యగుచున్నది. ఆ ధ్వనికి బెదరినదై గుఱ్ఱము నీటిని త్రాగజాలదాయెను.

ఆ గుఱ్ఱపు రౌతు ఇట్లు పలికెను. రైతుసోదరా! నీ గిలకబావి ధ్వనికి గుఱ్ఱము బెదరుచున్నది, దయచేసి చప్పుడు లేకుండగా నీరు తోడుము.' అంత నవ్వుచు రైతు ఇట్లు పలికెను. 'సోదరా చప్పుడు లేకుండ నీరు రాదుగదా,గిలకబావివలన నీరుచేదునపుడు తప్పక ధ్వని కలిగియే తీరును. నీరుకావలయునన్న ధ్వనిని సహించియే తీరవలెను. కావున నీ గుఱ్ఱము ఈ ధ్వనికి అలవాటుపడునట్లు తరిఫీదు ఇచ్చి తీసికొనిరమ్ము.

ప్రపంచమంతయు నిరంతరమును ఏదియోవిధముగ గందరగోళములతోనే నిండియుండును. భక్తుడు దానికి వశముకాక నిత్యసంతుష్టాంతరంగుడై, కలవరపాటు లేక మానసిక సామ్యమును కలిగి చరించవలెనని గీతాచార్యుని సందేశము.

2. యతాత్మా (Control of the mind and senses) నిగ్రహించిన యింద్రియములును మనస్సును గలవాడే భక్తుడు మన యింద్రియములన్నియును బహిర్ముఖముగా నున్నవి. వీనిని అంతర్ముఖ ముగా చేయవలయును. ఇంద్రియములను భగవత్పరము చేసినచో అవి నిగ్రహింపబడును.

ఇంద్రియము లన్నిటిలో మిక్కిలి శక్తివంతములైనవి 1. జిహ్వేంద్రియము 2. గుహ్యేంద్రియము. వీనికి రెండేసి శక్తులు గలవు. జిహ్వేంద్రియమగు నాలుక వాగింద్రియముగను, రసనేంద్రియముగను పనిచేయును. జిహ్వేంద్రియ నిగ్రహమువలన గుహ్యేంద్రియ నిగ్ర హముకలుగునని సాధకుల అభిప్రాయమైయున్నది. సాత్వికాహారమును మితముగా నియమానుసారముగా భుజించవలెను. వాక్కును వశ ములో నుంచుకొనవలెను. వాక్కువలననే లోకమంతయును వినోధ ముగా మారును. కనుక సత్యమును హితముగా మధురముగా ప్రియ ముగా మితముగా మాటలాడు వాడే మహాపురుషుడు.

3. ధృఢనిశ్చయము (**firm convection**) భక్తుడు కృత నిశ్చయముతో కార్యమును సాధించును. నీచమానవులు తాము చేయదలచిన కార్యమందు రానున్నకష్టములను గురించి భయపడి కార్యమునే ప్రారంభించరు. మరికొందరు కార్యారంభమును గావించి మధ్యలో సంప్రాప్తములగు కష్టములను నిగ్రహించక ఆకార్యమును మధ్యలోనే విడిచివైతురు. కాని మహాపురుషులు తాముప్రారంభించిన మంచికార్యమునందు ఎన్నివిధములగు కష్టములు వచ్చినను వానిని సరకుచేయక ధీరులై ఉత్సాహముతో, పట్టుదలతో ఆకార్యమును పూర్తిచేయుదురు. ఇట్టి కార్యశూరుడే భక్తుడని గీత వచించును.

4. సతతం యోగీ (**Be always the Devine Consious-ness**) కొందరుమానవులు దినమునందుకొన్ని నిమిషములు మాత్రమే

భగవంతుని చింతనలో గడుపుదురు. మరికొందరు కొన్నిగంటలు మాత్రమే దేహభావమును విడనాడి ఆత్మభావమును గలిగియుందురు. అట్లుగాక నిరంతరము యోగమునందే (అనగాఆత్మభావమునందే) యుండువాడు భక్తుడని గీత వచించును. భక్తి యనునది తాత్కాలికముగా ధరించు ఒక వేషము లేక బురఖా గాదు. అయ్యది నిరంతరాయముగా నుండు పవిత్ర ఆధ్యాత్మిక స్థితి. ఒకపోలీసు ఉద్యోగి ఉద్యోగ నిర్వహణమునకు (duty) పోవునపుడు ప్రత్యేక దుస్తులను (Special uniform dress) ధరించును. ఇంటికి వచ్చినంతనే దానిని తొలగించి మామూలు దుస్తులను ధరించును. అదియే రీతిగా భక్తి యనునది ఏకాదశినాడో, కృష్ణాష్టమినాడో, శివరాత్రినాడో ధరించు ప్రత్యేకవిధానము కాకూడదు. దేవాలయములో నున్నను, గృహమందున్నను,ఆఫీసునందున్నను దైవీభావముతోనే యుండవలయు నని గీతాశాస్త్రము చెప్పును.

5. మయ్యర్పితమనోబుద్ధిః (The mind and intellect attached to me) భగవదర్పితమైన మనస్సును, బుద్ధియును గలవాడే భక్తుడు. సాధారణముగా మనము భగవంతునకు పూవులు, పత్రములు, కాయలు, చక్రపొంగలి, పాయసము పిండివంటలు మున్నగునవి సమర్పింతుము. ఇదియే భక్తుని యొక్క నివేదన మని భావింతుము.

'నీమనస్సు నాకు సమర్పింపుము. నీబుద్ధిని నాకు ఇమ్ము' అని భగవానుడు పలుకును. కావుననే భగవంతునకు మనోహరుడు, చిత్తచోరుడు అనునామధేయములు గలవు,

మనస్సు కోరికల పుట్ట. మనస్సు విషయవాంఛలకు నిలయము. దీనిని భగవత్పరము చేసినచో అనగా మనస్సు లయించినచో మానవుడే మాధవుడు కాగలడు.

# 87. భక్తిపద్మత్రయ దివ్యశోభలు

**The Brilliance of the three devotional flowers.**

భగవానుడు పదునైదవపుణ్యశ్లోకమునందు మూడు భక్తలక్షణములను గానము చేయుచున్నాడు. భక్తుడు శాంతమూర్తి, ధర్మమూర్తి, ప్రేమమూర్తి, కరుణామూర్తి, ప్రసన్నమూర్తి. భక్తియనగా బాహ్యాచారములతో గూడిన పూజలు, స్నానములు, ప్రసాదములు, పాటలు, పద్యములు మాత్రమే గావు. అవి ప్రాథమిక దశ మాత్రమే, ఉత్తీర్ణుడైన భక్తుని దివ్యశోభలను తిలకింపుడు.

1. ఎవ్వనిచేత లోకము ఉద్వేగమును చెందదో వాడే భక్తుడు.

**By whom the world is not agitated is a true devotee.**

భక్తుడు శాంతమూర్తి యగుటచేత నాతడు వసించియున్న ప్రదేశమంతయును శాంతియుతమై భాసిల్లును. భక్తుడు వసించు ప్రదేశములలో కల్లోలవాతావరణము లుండవు. ఈర్ష్యాద్వేషములతో గూడిన సంఘటనలు జరుగవు.

సూర్యుడు ప్రకాశించుచోట చీకట్లుండునా? మంచిగందపు చెట్లున్నచోట దుర్వాసన లుండునా? భక్తుడున్నచోట కలతలుండవు. ప్రకృతి యంతయును ప్రసన్నమై,మధురమై మంజులమై భాసించుచుండును. మానసిక వ్యథలతో క్రుంగిపోవువారు – సాంసారిక తాపములతో క్రుగ్గువారును భక్తుని సన్నిధికి చేరినచో వారితాప మడుగంటును. వారి చిత్తములు ప్రశాంతము లగును.

భక్తుడు వసించిన స్థలము పుణ్యతీర్థ మగును.అతడు భాషించు ప్రదేశము దేవాలయ మగును. తీర్థములకు పవిత్రతను చేకూర్చువాడే భక్తుడు. భక్తుల పాదధూళితో పవిత్రమైనభూమి స్వర్గధామ మగును. రమణమహర్షి రామకృష్ణపరమహంస, వివేకానంద, సిరిడీసాయిబాబా, భగవాన్ సత్యసాయిబాబా, మున్నగు భక్తులు వసించు స్థలములు ప్రపంచములో పుణ్యక్షేత్రములై వెలయుచున్నవి.

2. లోకముచేత ఉద్వేగమును బొందనివాడే భక్తుడు. **He who is not agitated by the world is a devotee.** భక్తుడు బ్రహ్మీభూతు డగుటచేత ప్రాపంచిక దుష్టకల్లోల పరిస్థితు లాయన మానసప్రశాంత సాగరమును కల్లోలపరచజాలవు. దుర్మార్గులు, దుష్టులు, ఈర్ష్యాసూయాపరులు, వంచకులు మున్నగువారి మధ్యలో నున్నను భక్తుడు ఉద్వేగమును చెందడు. ఎవ్వ రెన్ని విధములుగా అనుమానించినను క్షోభను కలిగించుచున్నను భక్తుడు ప్రసన్న వదనుడై యుండును. ప్రతికూల వాతావరణములన్నియును అతనికి అనుకూల వాతావరణములై ఆయనలో మరింతగా భక్తిజ్ఞాన వైరాగ్యములను వికసింపజేసి లోకుల కాదర్శమూర్తియై భాసించుటకు తోడ్పడును. ఒక ఉదాహరణము.

మహాభక్తుడగు ఏకనాథస్వామి కాశీనగరమునందున్న దినములలో ప్రతిదినమును బ్రాహ్మ ముహూర్తమునందు నిద్రలేచి గంగానదిలో స్నానముచేసి ఈశ్వరస్తోత్రములు, నమకము, చమకము మున్నగునవి పారాయణము చేయుచు విశ్వనాథుని మందిరమున కరిగి పూజాభిషేకములు చేయుచుండెను. ఒకరోజున కొందరు ఈర్ష్యాళువులగు దుర్మార్గు లాయనను పరాభవింప నమకట్టిరి. ఏకనాథుడు గంగలో స్నానముచేసి ఈశ్వరస్తోత్రములు చేసికొనుచు వచ్చుచుండగా ఈ దుర్మార్గులాయన కెదురుగాబోయి తాము నోటిలో నములుచున్న పుగాకు తాంబూలములను ఆతనిపై ఉమియసాగిరి. ఏకనాథుడు చిరునవ్వునవ్వి వెనుదిరిగి గంగలోనికి దిగి మరల చక్కగా స్నానముచేసి నమక చమకాదులు పఠించుచు మరల పైకివచ్చెను. ఆదుర్మార్గబృందము మరల ఆయనపై ఉమియసాగెను. ఏకనాథుడు ఉద్వేగము చెందక - చిరునవ్వు శోభలే ముఖముపై తాండవింపగా మరల గంగాస్నానమాచరించి పైకి వచ్చెను. మరల మూడవసారికూడ ఆదుండగులట్లే యాచరించిరి. ఏకనాథునిలో చిరునవ్వువెన్నెలలు భాసించుచునే

యుండెను. వెంటనే మరల గంగాస్నానముచేసి పైకివచ్చెను. దుండగులు మరల ఆతనిశరీరముపై తాంబూలరసములను ఉమియసాగిరి. ఏకనాథుడు మరల గంగాపవిత్రధారలలో సుస్నాతుడై ఈశ్వర స్తవము చేయుచు వచ్చెను. మరల మరల గంగలో మునిగివచ్చెను. ఈ రీతిగా విసుగు విరామములేక ఈర్ష్యాళువులై నూరుపర్యాయములు ఉమియసాగిరి. బ్రహ్మీభూతుడగు ఏకనాథస్వామి నూరుపర్యాయములు పావనగంగాతరంగిణీపుణ్యతీర్థాలలో సుస్నాతుడగుచువచ్చెను. నూటయొకటవ పర్యాయము స్నానమాచరించి వచ్చిన యోగీశ్వరుండగు ఏకనాథుని ముఖపద్మమునందు భాసించుచున్న దివ్యకాంతులనుగాంచి ఆ దుండగులు ఆశ్చర్యచకితులై ఆయన పాదపద్మములపై వ్రాలి క్షమింప వేడికొనిరి.

శాంతమూర్తియగు ఏకనాథు డిట్లు పలికెను. నేనే మీకు మరల మరల నమస్కరించుచున్నాను. మీరందఱును విశ్వనాథుని స్వరూపులు. కాశీవిశ్వనాథు డిచ్చట నాకు ఇన్ని రూపములతో సాక్షాత్కరించినాడు. నాజన్మము ధన్యమైనది. మీవలన గదా నేసీ పుణ్య దినమున నూరుపర్యాయములు పవిత్ర గంగాస్నానమాచరించ గలిగినది. మీవలననేగదా నే నీనాడు నూరుపర్యాయములు ఈశ్వర స్తవము(నమక-చమక పారాయణము) చేయగలిగినది! మీకు నే నెంతో ఋణపడియున్నాను. అని పలుకుచు పాదములకు నమస్కరించెను.

భక్తుడు ఉద్వేగ రహితుడు - శోక మోహరహితుడు - సదా ప్రసన్న ప్రశాంత మంగళ దివ్యమూర్తి.

3. హర్షా, మర్ష భయోద్వేగ రహితుడే భక్తుడు. **who is free from joy every fear and anxiety is a devotee.** మానసిక వికారములు సామాన్య మానవలక్షణములు. చిత్తవికారములెవ్వియును లేనివాడే మహాభక్తుడని, అట్టివాడే తన కత్యంత ప్రియుడని భగవానుడు పలుకును. సాగరముయొక్క పై భాగమున

తరంగ పంక్తు లెన్నియో లేచి నాట్యమాడుచు మరల నశించుచుం డును. కాని సాగర మధ్యమున ఎత్తైన కొండపై నిలిచియున్న దీప స్తంభము (light house) ఎట్టి సంక్షోభమును చెందక తన దివ్య కాంతులను వెదజల్లు చుండును. భక్తుడు సాగర గంభీరుడు. నిత్యాదై నందిన జీవితములో ఈ రీతిగా పరమ గంభీరుడై అసూయాది దారు ణములు లేక సత్ప్రవర్తనతో భాసిల్లువాడే పరమ భక్తుడు.

## 88. ఆధ్యాత్మిక కుసుమషట్కము.

**The six spiritual flowers.**

భగవంతుని ఆరాధించ వలసినది సామాన్య పుష్పములతో గాదు. ఆధ్యాత్మిక కుసుమాలతో అర్చించవలెను. మానవునిలోని ఉత్తమగుణములే భక్తిస్వరూపము. సత్ప్రవర్తనయే భక్తి. సచ్ఛీలమే భక్తి-సదాచారమేభక్తి-నిత్యజీవితములో నైతిక, ధార్మిక పథములో సంచరించుటే భక్తి. పదునాఱవ శ్లోకమున గీతాచార్యుడు మరల భక్తి ప్రసూనముల నారింటిని బోధించుచున్నాడు.

1. అనపేక్ష:- **(free from wants)** కోరికలు లేనివాడే భక్తుడు భక్తుడు తన సమస్త వాంఛలను భగవంతుని కర్పణముచేసి చేసి శరణాగతు డగును. ఆతనికి కోరదగిన దేదియును లేదు. నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ అను గీతావాక్యము ననుసరించి భరించు వాడే భక్తుడు **'Let thy will be done'** నీ యిచ్ఛ నెరవేరుగాక యని భగవానుని ప్రార్థించువాడు భక్తుడు.

2. శుచి **(The Pure)** :- పరమ పవిత్రుడే భక్తుడు. శుచి త్వము మూడు రకములు. శరీరశుద్ధి - వాక్శుద్ధి - మానసిక శుద్ధి కలిగి యుండవలెను. శుచియైన శరీరము, శుచియైన దుస్తులు, శుచియైన ఆహారము, శుచివంతమగు గృహము భక్తు డుప యోగించు వస్తువు లన్నియును శుచిమంతములై యుండును. శుచి

త్వమే దేవత్వము. (Clearlin-ss next Godliness) - వాక్శుద్ధి - హితరమణీయమగు వాక్కు - సత్యమగు ప్రియవాక్కు భక్తుని యాభరణములు. మనశ్శుద్ధి భగవచ్చింతనము తప్ప అన్యచింతనము లేని మనస్సు గలవాడే భక్తుడు.

3. దక్షః (The smart) :- భక్తుడు సర్వసమర్థుడై యుండును. భక్తుడనగా సోమరిగానుండి ఏ కార్యమును చేయజాలని వాడనియును చాలమంది భావింతురు. అది సరిగాదు. విద్యారణ్యస్వామి భక్తుడు సామ్రాజ్యమును నిర్మించినాడు. సమర్థ రామదాసు భక్తుడు శివాజీని శక్తివంతునిగా చేసి మహారాష్ట్ర నిర్మాణమును గావించినాడు. భక్తునకు క్లైబ్య ముండదు. భగవచ్ఛక్తి యాతనిలో నిరంతరమును తాండవించు చుండును. సర్వసమర్థుడై యుండును. ఉత్సాహము, సాహసము, ధైర్యము, శక్తి, బుద్ధి పరాక్రమములు భక్తి యందు సహజముగా విలసిల్లు గుణసంపదలు. పుణ్యకార్యాచరణ దక్షుడే భక్తుడు.

4. ఉదాసీనుడు (The un-worried)- ఉదాసీను డనగా తటస్థుని భావము. దేనియందును సంగము (attachment) బొందడు. అన్నిటికిని సాక్షి మాత్రుడై యుండును. అద్దమునందు అన్ని రూపములును ప్రతిఫలించుచున్నను, ఏ ప్రత్యేక రూపముతోను సంగమును బొందను. సూర్యుని దివ్యకాంతిలో ఎవ్వరెవ్వ రెన్నెన్ని మంచి, చెడ్డ కార్యము లాచరించుచున్నను సూర్యునకు వానితో సంబంధముండదు. అతడు ఉదాసీన భావములో కర్తవ్య కర్మానుష్ఠానము చేయును. అట్టివాడే భక్తుడు.

5. గతవ్యథః (The un-concerned) భక్తునకు చిత్తక్షోభ లేదు. కార్యములు ఫలించినను ఫలించక పోయినను ఆతడు విచారింపడు. ఫలాసక్తి వ్యథను కలిగించును. సంగదోషము వ్యథను కలిగించును. ఇట్టి దోషములు లేనివాడే భక్తుడు.

6. సర్వారంభ పరిత్యాగి :- (Renouncing all the undertakings) సర్వకార్యారంభములను పూర్తిగా వదలినవాడని చాలమంది ఈ పదమునకు అర్థము చెప్పుదురు అది సరిగాదు. హిందూ ధర్మము సోమరితనమును భరించదు. సోమరి తనమును వేదాంతశాస్త్రము నిషేధించినది. సోమరితనము తమో గుణమునకు చిహ్నము. తమోగుణము భక్తుని లక్షణము గాదు. ఆతడు సర్వసమర్థునిగా మహాశక్తి సంపన్నునిగా పైన వివరించిన గుణములు వివరించుచుండగా భక్తుడు ఏపనియును చేయక కూర్చుండు సోమరి, యని భావించుట నింద్యము. సర్వారంభ పరిత్యాగి యనగా కర్మాచరణము లోని దోషము లన్నింటిని పూర్తిగా పరిత్యజించిన నిష్కామకర్మానుష్ఠానపరు డనియే భావము. కర్మకు నాలుగు దోషములు గలవు. 1. కర్తృత్వదోషము (attachment of doership) నేనే కర్మను చేయుచున్నా నను కర్తృత్వాహంకారము. 2. కర్మసంగదోషము (attachment to the work) కర్మతో సంగమమును బొంది వ్యథను బొందుట రెండవ దోషము 3. Evil of attachment to the fruits of action. కర్మఫలాసక్తి దోషము 4. Evil of attachment to the engyoment of fruits of action. కర్మఫలభోగాసక్తి దోషము. ఈ నాలుగు దోషములును లేకుండ కర్మ చేయువాడే కర్మయోగి యనబడును. ఆతడే పరమభక్తుడు. ఆతడే జ్ఞాని. భగవంతుని చేతిలో పరికరముగా ఈశ్వర ప్రీతిగా నిష్కామ కర్మ నాచరించు మహాపురుషుడే సర్వారంభ పరిత్యాగి యని శ్యామసుందరుడు ప్రవచనము చేయుచున్నాడు.

భగవద్గీతయొక్క పఠన, పాఠన, శ్రవణ, పారాయణ, ప్రవచన, వ్యాఖ్యానాదుల యొక్క ప్రయోజనము అనగా నట్టి మహాపురుషులను తయారుచేయుటయే, యగునుగదా. ఇట్టి ఉత్తమ గుణములు గలవాడే పరమభక్త డనియు, ఆతడే తనకు ప్రియుడనియు నిందు గీతాచార్యుడు మరల మరల గానము చేయుచున్నాడు.

## 89. ఆరుపుష్పాల మధురమాల.

A sweet garland of six flowers.

ఇంతవరకును ఇరువది భక్తలక్షణములు గానము చేయబడినవి కాని నందనందనున కింకను సంతృప్తి గలుగదాయెను. ఇంకను మరిం తస్పష్టముగా భక్తి తత్వము చెప్పబూని పదునేడవ శ్లోకమున మరల ఆరు భక్తలక్షణములను తెలుపుచున్నాడు. భక్తుడనగా కేవలము బాహ్యములగు పూజలు, కీర్తనములు చేయువాడు మాత్రమే కాద నియు నిత్యదైనందినజీవితమున జీవన్ముక్తునివలె జీవించు మహాపురుషు డనియును గమనించవలెను. అంత మాత్రముచేత పూజలు, ఆరాధన ములు, సంకీర్తనములు, భజనలు, త్యాజ్యము లని భావింపతగదు. అవి భక్తునియొక్క ప్రాథమిక దశను మాత్రమే సూచించును. వానితో పాటు ఈ దివ్యలక్షణములను కలిగి యున్నపుడే ఆతడు మహాభక్తు డగును. అట్టివాడే జ్ఞాని. భక్తి, జ్ఞానములు భిన్నభిన్నములు గావని ఈ లక్షణములను బట్టి సాధకులు గుర్తింప గలరు.

1. 'యో నహృష్యతి' 'who neither rejoices' ఫలాసక్తి తో నొకకార్యము చేసినపుడు ఆఫల మాతనికి లభించునపుడు మాన వుడు పొందు మానసికస్థితియే 'హర్షము' (సంతోషము) అనబడును. ఇది సామాన్య మానవునిస్థితి. మహాభక్తునికి కర్తవ్య కర్మాచరణమే లక్ష్యముగాని తత్ఫలమువలన కలుగు ఆనందము కాదు.

'కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన' అని గీతాసూక్తి స్మరణీయము. (అ 2 – శ్లో 47) They ought is to work only never for its fruits.

2. నద్వేష్టి 'who neither hates' మనస్సులోని ఒకానొక కోరిక నెరవేరనపుడు దానికి భంగము కలిగించినవారిపట్ల గలుగు వికారభావము ద్వేషము (2-48). ద్వేషమువలన మనస్సు ఖేదమును బొందును

'యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే'

అను గీతావాక్యము సదా స్మరణీయము. యోగనిష్ఠయం దుండి సంగమును వీడి కార్యము ఫలించినను ఫలించక పోయినను సమత్వమం దున్నవాడవై కర్మచేయుము. అట్టి సమత్వ బుద్ధియే యోగము.

3. న శోచతి (**who neither grieves**) దుఃఖము సామాన్య మానవ స్వభావము. బంధు వియోగము, ధనవియోగము, శారీరక మానసిక క్లేశములు దుఃఖమును కలిగించును. భక్తునకు దేహాభావము లేనందున సంయోగ వియోగములతో నిమిత్తమే లేదు.

4. న కాంక్షతి(**who neither desires**) ఒక ప్రత్యేకవస్తువు కావలయునను వాంఛ జ్ఞానికి లేదు. యేది సంప్రాప్త మయినను దానితో తృప్తిని బొందుచుండును. కాంక్షారాహిత్యము మహాపురుష లక్షణముగా గీతాచార్యుడు లోగడ అధ్యాయములందు అనేకపర్యాయములు దెలిపియున్నాడు.

'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే (2-55)

ఎపుడు మానవుడు తన మనస్సునందు గల సమస్తములగు వాంఛలను పూర్తిగా విడనాడి తన ఆత్మచేత ఆత్మయందే ఆనందమును బొందునో అప్పు డాతడు స్థితప్రజ్ఞు డని చెప్పబడును.

**When a man casts off all the desires from his mind and when he satisfies by the self in his self then he is called a God realised soul.**

అట్టి స్థితప్రజ్ఞుని దివ్యమూర్తినే ఈఅధ్యాయమునందును మరల మనము దర్శించుచున్నాము. స్థితప్రజ్ఞుడే భక్తుడు.

5. శుభాశుభ పరిత్యాగి (He who renounces good and bad) జ్ఞాని అన్నిటియందును పరమాత్మనే దర్శించును. 'ఆత్మ దృష్టి గలవాడే జ్ఞాని. అట్టిభావముగలవాడే భక్తుడు. ప్రాపంచికదృష్టి గలవానికి శుభాశుభములు భిన్న భిన్నములుగా గోచరించును. సర్వమును ఈశ్వరలీలగా భావించువాడే భక్తుడగును. ఈ లక్షణములను బట్టి పరీక్షించి కొందరు సామాన్య మానవులు. భక్తుడనగా శుభాశుభములు గమనింపక దేనిని వాంఛింపక వీడియుండు పాషాణ సదృశుండని భావింప జనదు. దయ, ప్రేమ, కరుణ, దీనజనాదరణ, సేవానిరతి మున్నగునవి భక్తలక్షణములుగా లోగడనే వివరింప బడినవి గదా. ఈ లక్షణములను కేవలము వాచ్యార్థముగా గాక లాక్షణికార్థముగా సాధకులు గమనింపవలయును.

ఉదాహరణ:- ఒకవ్యక్తికి నిద్రలో స్వప్నము వచ్చినది. ఆ స్వప్నములో ఆతడు ఒక మహాచక్రవర్తియై ఆనందమును బొందుచున్నాడు. కొందరు శత్రువు లాతనిపై దండయాత్రకు వచ్చిరి. వారిపట్ల వానికి ద్వేషము కలిగినది. ఆతనికి స్వప్నములోనే బంధువియోగము కలిగినది. అందుచే శోకింప సాగినాడు. ఇంతలో కొందరు బంధువులు వచ్చి కానుకలు సమర్పించినారు. ఆ వస్తువులపై ఆతనికి ఎంతయో మక్కువ కలిగినది. కొద్దిక్షణములలో ఆతడు మేల్కాంచినాడు. నిద్రావస్థపోయినది. జాగ్రదవస్థ వచ్చినది. ఇపుడు రాజ్యము లేదు. రాజ్యమునందాతనికి ఇప్పుడు హర్షము లేదు. శత్రువులే లేరు కనుక ద్వేషమే లేదు. బంధు వియోగాదులు లేవు. కనుక శోకముగాని కాంక్షగాని లేదు. శుభాశుభము లన్నిటిని నాతడు పరిత్యజించినాడు. స్వప్నావస్థలోని శుభాశుభములు జాగ్రదవస్థలో లేవు. అటులనే ఆత్మభావన (జ్ఞానస్థితి) కలిగినపుడు శారీరక భావములు నశించునని భావము. కావున జ్ఞానభావముతో జీవించువాడు. భక్తుడు గనుక ఆతడు శుభాశుభ పరిత్యాగి యని కీర్తింప బడెను.

6. భక్తిమాన్ యస్సమేప్రియః(Such a devotee is dearer to me) :- భక్తి యనగా పైవివరించిన దివ్య గుణములు గల వాడే యని గ్రహింప నగును. అట్టి భక్తితత్వము గలవాడే భగవానునకు ప్రియుడు.

---

## 90 మరికొన్ని భక్తి పుష్పాలు

A few more flowers of devotion.

ఈ అధ్యాయమునందు 13వ శ్లోకమునుండి 20వ శ్లోకము వరకును ఎనిమిది దివ్య శ్లోకాలను 'అమృతాష్టకము' అని వచింతురు. ఈ పుణ్య శ్లోకములందు ముప్పదియారు మంగళ గుణములు గానచేయబడుచున్నవి. ఇవియే భక్తికుసుమావళిగా సనాతన ధర్మసూత్రములుగా చెప్పబడినవి. ఇవి మానవునియొక్క శారీరక,మానసిక,బుద్ధిగతమగు దివ్యశోభలను వికసింపచేసి పరిపూర్ణ మానవునిగా (a perfect man) తీర్చిదిద్దు సాధనలు. ఈ గుణగణములే సనాతన ధర్మమని భగవానుడు గానముచేసెను. 18,19. శ్లోకములందు గల పది భక్తికుసుమముల మధుర శోభలను తిలకింపుడు.

1. సమశ్శత్రౌ చ మిత్రే చ :- శత్రుమిత్రులయందు సమానత్వము (equal to friend and foe) తనకు ఉపకారము చేసిన వానిని మిత్రునిగను అపకారము చేసిన వానిని శత్రువుగను భావించుట సామాన్య మానవ స్వభావము. ఇది హృతయగతమైన భావమును సూచించును భక్తునియొక్క దృష్టిలో అందరును భగవత్స్వరూపులే. కనుక ఆయనకు శత్రుత్వ మిత్రత్వాలు లేవు. జీససుక్రైస్తు తన్ను శిలువపై వధించు సందర్భమున కూడ వారిపై శత్రుభావమును చూపలేదు.

2. తథా మానావమానయోః - మానావమానములు భక్తునకు సమానములు(equal in honour and dishonour) భక్తునకు

గౌరవాగౌరవములు భగవత్ప్రసాదములు, ఇవి మానసిక సంబంధములగు ఉద్వేగములు. మనస్సు భగవత్పరమై యున్నందున భక్తుని దృష్టిలో మానావమానములే లేవు. ఒకనాడు పూలమాలలతో గౌరవింప బడిన వ్యక్తి మరియొక రోజున దేశకాల పరిస్థితులను బట్టి అగౌరవమును బొందును. ఎన్నికలలో విజయమును బొందిన ఒక నాయుడు పూలమాలలతో సత్కారమును బొందవచ్చును. ఆతడే మరియొక పర్యాయము ఓడిపోయినచో అగౌరవమునకు పాల్పడ వచ్చును. బ్రహ్మవేత్తయగు మహాపురుషున కిట్టి మానసిక మగు ఉద్వేగము లుండవు.

3, 4. శీతోష్ణ సుఖదుఃఖేషు సమః (**equal in heat and cold and also in pleasure and pain**) శీతోష్ణములు శరీరసంబంధములగు ఉద్వేగములు, సుఖదుఃఖములు మానసికము లగుభావములు. బ్రహ్మవేత్త శారీర మానసిక భావముల కతీతుడు. శీతోష్ణములు, సుఖదుఃఖములు మరల మరల వచ్చుచు పోవుచుండును. వీనినే ద్వంద్వములందురు. ద్వంద్వాతీతుడు భక్తుడు.

5. సంగవివర్జితః సంగరహితుడు భక్తుడు(**without attachment**) : సంగమే మానవునిబంధించును. సంగరాహిత్యమే మోక్షము ఉదాహరణము. 'పడవలు నదులలో ప్రయాణము చేయును. కాని నదియందలి నీరు మాత్రము పడవలోనికి రాకుండ జాగ్రత్త పడవలయును. సంసారములో నుండుము, కాని సంసారమును మాత్రము నీలోనికి రానీయకుము' అని వేదాంత శాస్త్రము బోధించును. జనకుడు మున్నగు చక్రవర్తులు సామ్రాజ్యములను పాలించినను సంగరహితులుగా సంచరించుటచేత బ్రహ్మవేత్తలైరి.

6. నిందాస్తుతులలో సమానము. (**equal in cansure and praise**) నిందించినను స్తుతించినను భక్తునకు ఉద్వేగము కలుగదు. ఆతడు మహాసాగరమువలె గంభీరుడు. నదులు వచ్చి తనలో చేరినను

చేరుచున్నను సాగరుడు తన మేర మీరడు. ఒకనాడు కీర్తింప బడిన వ్యక్తి దేశకాలముల భేదము ననుసరించి మరియొకనాడు నిందింపబడ వచ్చును. సాగరము నందలి తరంగములవలె నిందాస్తుతులు బ్రహ్మ వేత్తను చలింప చేయజాలవు.

7. మౌనము (Silence). భక్తుడు మననశీలుడు గనుకనే మౌని యనబడును. మౌనము గలవాడు భక్తుడని గీత గానముచేయును. మౌనము రెండు విధములు. వాఙ్మౌనము. మాటలాడకుండ నుండుట వాఙ్మౌన మనబడును. గాంధీజీ ప్రతి సోమవారమును మౌనదీక్షను వహించువాడు. కొందరు భక్తులు ఏకాదశినాడు మౌనమును వహింతురు. మౌనము వాగ్వ్యయమును తగ్గించును. వాక్కు యొక్క శక్తి అనంతము. విశేషముగా మాటలాడు చుండుటచే వాగ్వ్యయమగును. శక్తి దిగజారును. కొందరు మౌనమును వహించినవార మని తెలుపుచు; తమ తమ మనోభావములను, అవసరానవసరములను, సైగల ద్వారా, కాగితములపై వ్రాయుట ద్వారా చేయుచున్నారు. ఇట్టి మౌనవ్రతము పూర్ణ ఫలము నీయదు. వాఙ్మౌనముతో బాటు మానసిక మౌనము'ను కూడ బూనవలయును. మనస్సునందలి ఆందోళనములను సంకల్పాదులను నిగ్రహించ వలయును. ఇదియే మానసిక మౌనము.

8. 'సంతుష్టో యేన కేన చిత్' దొరికిన దానితో సంతుష్టిని బొందువాడు భక్తుడు (content with any thing) బ్రహ్మవేత్త లభించిన పదార్థముతోనే తృప్తినొందును. ఆయనకు ప్రత్యేకావసరము లేవియును నుండవు. ఏదిలభించినను దానినే దైవప్రసాదముగాభావించి ఆనందించును. మహాభారత శాంతిపర్వమున మోక్ష ధర్మమున నిట్లు చెప్పబడియున్నది. (245-12)

'ఏది లభించిన దానినే ధరించువాడును, ఏది సంప్రాప్తమయినను దానినే భుజించు వాడును, ఎచ్చటనైనను చక్కగా శయనించు

వాడును, నగు మహాపురుషుని దేవతలు బ్రహ్మవేత్త యని పిలుతురు.

9. అనికేతః గృహము లేనివాడు (The homeless) :- గృహము లేనివాడు భక్తుడని చెప్పుటలో గల ఆధ్యాత్మిక భావమును పాఠకులు గమనించవలెను. ఈ విశాల విశ్వమంతయును భక్తునకు గృహమే. ఆతనికి ఒక ప్రత్యేక నివాసము నందలి మమకారము లేదు. గృహాభిమానమును వదలినవా డని సారాంశము. ఏవిధమగు మమకారముున్నను భక్తునకు చిత్తవిక్షేపమే కలుగును గనుక ప్రత్యేక నివాసస్థలాభిలాషను గూడ విడనాడినవాడే భక్తుడగును.

వారియొక్క భావమునుగూడ వ్యాఖ్యాతలు చెప్పుదురు. నికేతన మనగా గృహము. ఈశరీరమే జీవునకు గృహము వంటిది. శరీరాభిమానములు వీడినవాడే అనికేతను డని గ్రహింప నగును.

10 స్థిరమతిః (firm convection) :- భక్తుని లక్షణములలో నిది తుది లక్షణమైనది. ద్వేష రాహిత్యముతో ప్రారభింపబడిన భక్త లక్షణములు 'స్థిరమతి' యను గుణముతో ముగియుచున్నవి. సామాన్య మానవుని బుద్ధి చంచలమైనది. భక్తుని చిత్తము స్థిరసంకల్పముతో గూడి యుండును.

'దృఢనిశ్చయః -అను లక్షణమును లోగడ మనము 14వ శ్లోకములో గమనించి యున్నాము. మరల 'స్థిరమతిః' అని అదియే సుగుణముతో గీతాచార్యుడు భక్తలక్షణములను ముగించుటలోనున్న విశేషమును పాఠకులు గమనించియే యుందురు. మనో నిశ్చయము లేని వానికి పురోగతియే లేదు. ఆధ్యాత్మిక సాధనలో 'ధృఢనిశ్చయము' 'స్థిరమతి' అత్యంతావశ్యకములు.

'ధర్మ్యామృత మిదం' (This is the mortal Dharma) ఇదియే అమృత ధర్మము, ఇదియే సనాతన ధర్మము అని భగవానుడు తెలుపును. ఈ ముప్పదియారు దివ్య గుణములే భారతీయ సంస్కృతి స్వరూపము. వేదాంత ధర్మసారమంతయును నిదియే. దీనిని తెలిసికొన్నంత మాత్రము చేతనే ప్రయోజనము లేదు. ఈ యుగళశ్లోకములను కంఠస్థము చేసి చక్కగా వివరించి చెప్పగలిగిన ప్రజ్ఞ యున్నంత మాత్రముననే పూర్ణ ప్రయోజనము లేదు. దీనిని నిత్యనైసందిన జీవితములో అనుష్ఠించవలె నని గీతాచార్యుడు చెప్పుచున్నాడు. అట్టి అనుష్ఠానమూర్తి యగు భక్తుడే తన కత్యంత ప్రియుడని భగవానుడు పలుకుచున్నాడు.

**An ounce of practice is better than tons of knowledge.** టన్నుల కొలదిగా గల శాస్త్రపాండిత్యము కన్న ఒక ఔన్సు పరిమాణమాత్రముగల అనుష్ఠానమే మేలు.



# గీతా కల్పవృక్షము

పదమూడవ అధ్యాయము - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

## 91. శరీరము తాత్కాలిక గృహము

**This body is a temporary house.**

శ్లో. భక్తాపాయ భుజంగ గారుడమణి స్త్రైలోక్య చూడామణిః
గోపీలోచన చాతకాంబుదమణి స్సౌందర్య ముద్రామణిః
యంకాంతామణి రుక్మిణీ ఘన కుచద్వంద్వైక భూషామణిః
శ్రేయో దేవ శిఖామణి ర్దిశతు నో గోపాల చూడమణిః॥

శ్రీకృష్ణుడు తన్నాశ్రయించిన భక్తజనుల యొక్క సమస్త కష్టములను పారద్రోలువాడు. ఆయన సర్వలోకములకును అధిపతియైన వాడు. గోపికా సహస్రముల కానందమును గూర్చిన పుణ్యామూర్తి. సకలలోకములను మోహింపచేయు సౌందర్య నిధి యా కృష్ణభగవానుడు. మహాభక్తురాలైన రుక్మిణీసతి కానంద సంధాయకుడైన శ్రీకృష్ణ ప్రభువు మనకు సమస్త సుఖములను, భక్తి జ్ఞానవైరాగ్యములను ప్రసాదించుగాక! మనబుద్ధులను, మనస్సులను సత్యధర్మముల వైపునకు నడుపును గాక!

ఆకరుణాసాగరుని ఆశీస్సుచే మనము గీతాశాస్త్రములోని జ్ఞాన కాండలో ప్రవేశించుచున్నాము. గీతలోని మొదటి ఆరు అధ్యాయములను కర్మకాండ యని పిలుతురు. మధ్యనున్న ఆరు అధ్యాయములను భక్తికాండ అని పిలుతురు. చివరనున్న ఆరు అధ్యాయములును జ్ఞానకాండ. వాస్తవముగా గీతలలో కర్మ, భక్తి, జ్ఞానములు విడివిడిగా చెప్పబడ లేదు, ప్రతి అధ్యాయములోను ఈమూటియొక్క ప్రశంసయు చేయబడుచునే యున్నది. కర్మ భక్తి జ్ఞానముల సమన్వయ సంపుటీ

కరణమే గీతలోని ప్రత్యేకత. అయితే ఒక్కొక్క షట్కములో నొకొక్క దానిని గూర్చి విశేషించి చెప్పబడుటచేత దానికి ఆ ప్రత్యేక నామ మీయబడినది. ఈషట్కమునందు అఖండ జ్ఞానధార వెల్లివిరిసినది. మానవుడే మాధవుడు, నరుడే నారాయణుడు, జీవుడే శివస్వరూపుడు. అను మహాసత్య మిందు సహస్రముఖముల ప్రబోధము చేయబడు చున్నది.

ఓ మానవుడా, నీవు శరీరము కావు. నీవు మట్టిముద్దవు కావు, అఖండ సచ్చిదానంద స్వరూపుడవు. కాని నీ దృష్టి, నీధ్యానము, నీదీక్ష నీబుద్ధి, నీకర్మలు, సర్వమును ఈ శరీర పోషణకొరకే వినియోగించు చున్నావు. ఈ క్షుద్ర శరీరత్వ స్థితికి, రక్షణకు, ఎన్నియో అమానుష ములు, చేయుచున్నావే. దీని నెన్ని విధముల పోషించి రక్షించినను స్థిరమైనది కాదు. నిన్ను నీవు తెలిసికొనుటకు ప్రయత్నింపవు. కాని నీకనవసరములగు ఎన్నియో విషయములను గూర్చి అహర్నిశములు కృషిచేసి తెలిసికొందువు. ఎంత వెఱ్ఱివాడవోయి నీవు.

నీ స్వవిషయమే నీకు తెలియదు. అంగారకగ్రహ విషయమును గూర్చి నీ ప్రయత్నమా? ఎంత తెలివితక్కువ!! 'నిన్ను నీవు తెలిసి కొనుము. సర్వమును నీకు తెలియబడును.' ఇక యౌవనకాలమంతయు స్త్రీవిషయాసక్తితో పరుగెత్తుచున్నది. ఇక ముసలితనము రకరకము లగు తాపత్రయములతో, చింతలతో గడిచిపోవుచున్నది. కాని పర తత్వమును గూర్చి నీకు యోచన యెక్కడ? ఓ మూఢుడా! పర మేశ్వరుని భజింపుము.

ఈ శరీరము తాత్కాలికమైనది. దీని పోషణకొఱకు, పాలన కొరకే సర్వశక్తులను వినియోగించుట మూఢత్వము. శరీరమును ఆరోగ్య వంతమును బలిష్ఠముగను నుంచుకొనుట యవసరమే. కాని అదే పర మార్థము గాదు. పరమార్థప్రాప్తికి శరీర మొకసాధనము మాత్రమే. అవసర మయినచో ఈ క్షుద్ర శరీరమును పరమార్థ సాక్షాత్కార

ములో భస్మము చేయవలసియే వచ్చిన వెనుకంజ వేయరాదు ధర్మ నిర్వాహణములో, సత్యాన్వేషణలో, ఈ దేహమును బలిచేయ వలసియే వచ్చును. అని శాస్త్రము చెప్పును. కాని దానిమాటను నీవు వినవు. నీ చింతన మెప్పుడును ఈ శరీరమును గూర్చియే! దీనిని బలముగాచేయుట ఎట్లు? దీనికి రంగువేయుట ఎట్లు ? ఈ ఆలోచనముల తోనే జీవితమంతయును గడిచిపోవును.

శంకరు లిట్లు పలుకుచున్నారు.

'బాలస్తా వత్క్రీడాసక్త,' స్తరుణ స్తావ త్తరుణీ సక్తః
వృద్ధస్తావ చ్చింతా సక్తః, పరమే బ్రహ్మణి కోపి నసక్తః' భజగోవింద.

చిన్నతనమంతయు ఆటపాటలయందే గడిచిపోవు చున్నది. దాని కొరకు విచారింప వలసిన పనిలేదు. ఆత్మనుండి శరీరమును వేరు చేయుము. అందువలన శరీర మన నేమియో తెలిసికొనవలసి యున్నది. ఈ శరీరము చతుర్వింశతి తత్వములతో గూడిన తాత్కాలిక గృహము. యజమాని కొరకు గృహముకాని గృహము కొరకు యజమాని కాదు. అట్లే ఆత్మకొరకు శరీరము. ఈ శరీరము అద్దెకొంప అన్నాడు మహాత్ముడు.

'మహాభూతా న్యహంకారో, బుద్ధి రవ్యక్త మేవచ
ఇంద్రియాణి దశైవంచ, పంచేంద్రియ గోచరాః'

'భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, అహంకారము. బుద్ధి అవ్యక్తము, కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, మనస్సు, చూచుట, వినుట, పలుకుట, శ్వాసించుట, స్పర్శించుట,' అను ఈ ఇరువది నాలుగు తత్వములలో గూడినది శరీరము. శరీర మనగా జీర్ణించునది యని యర్థము. దేహమనగా దహింప బడునది యని యర్థము, ఈ శరీరమునకు ఏడు వికారములు గలవు. ఇచ్ఛ, ద్వేషము,సుఖము,దుఃఖము, సంఘాతము, ధృతి, చేతనము. ఈ ఏడును శరీరముయొక్క లక్షణములే కాని ఆత్మ

లక్షణములు గావు. ఈశరీరమును 'క్షేత్ర' మని భగవానుడు చెప్పు చున్నాడు. వశిష్ఠాది మహాత్ముల చేతను బ్రహ్మ సూత్రాదుల చేతను ఆత్మస్వభావము, క్షేత్రస్వభావము తెలుపబడియున్న . భగవానుడు ఆ మహాతత్వ రహస్యములను అర్జునుని నిమిత్తమాత్రముగా నిడుకొని మనకు ప్రబోధము చేయుచున్నాడు.



## 92. జ్ఞాన దీపావళి The lamps of knowledge

'మా కురు ధన జన యౌవన గర్వం, హరతి నిమేషాత్కాల స్సర్వం
మాయా మయ మిద మఖిలం హిత్వా, బ్రహ్మపదం త్వం ప్రవిశ
విదిత్వా' భజగోవిందం.

ఓ మానవుడా! నాకు లక్షల కొలది ధనమున్నదని గర్వించ కుము. లక్షాధికారు లందరును ఏమయినారో తెలిసికొనుము. విశాల సామ్రాజ్యాధికారు లందరును మట్టిలోనే మ్రగ్గిపోయిరని తెలిసికొనుము. నాకు విశేషముగా అంగబలమున్న దని విఱ్ఱవీగకుము. కోట్లకొలది మహాసైన్యముల రక్షణలోనున్న సార్వభౌము లేమయినారో తెలి యదా! శరీరములో బలమున్నదని నీకండరములు బలిష్ఠముగా నున్న వని మదించి కన్నూ మిన్నూ గానక తిరుగకుము. ఒక క్షణకాలములో సర్వమును నాశనము కాగలవు. సర్వమును మాయామయము. అహం కారమును త్యజించి పరమాత్మ నాశ్రయించుము. కన్నువిప్పి జ్ఞాన దీపావళిని దర్శింపుము. జన్మ సార్థకమగును.

కరుణామయు డగు భగవానుడు మనకు జ్ఞానదీపావళిని చూపు చున్నాడు. ఆజ్ఞానకాంతి మన అజ్ఞానతిమిరములను పారద్రోలును. ఈ అధ్యాయములో అయిదు శ్లోకములలో ఈ జ్ఞానప్రసారము చేయబడు చున్నది. జ్ఞాన మనగానేమి? శ్లోకములను కంఠస్థముచేయువాడు భారత

భాగవతములనువప్పగించుటగాదు.సభలలో నుపన్యాసములను చెప్పుట కాదు. కోర్టులలో వాదోపవాదములను గావించుచు బల్లలు గ్రుద్దుచు వాక్చాతుర్యముతో, భాషాపటిమతో, మాట్లాడ నేర్చు న్యాయ వాదు లనబడు ప్లీడర్ల జ్ఞాను లందునూ, నామిత్రు డొకడు గలడు. ఆయన మహాకవి యని పేరు గాంచెను. ఆయన అనేక గ్రంథములు వ్రాసెను. ఆయన అనేక పద్యములను కంఠస్థము చేసి మనోహర ముగా గానము చేసి సభలలో మెప్పును బొందెను. ఆయన జ్ఞాని యని మహాపురుషుడని స్త్రీ పురుషు లాయనకు నమస్కరింతురు. కాని ఆయనకు అహంకారము, కోపము వర్ణనాతీతము. మద్యపానమున కల వాటుపడెను. దాని ననుసరించియే వ్యభిచార ముండును గదా, ఇది యేనా జ్ఞాని లక్షణము? జ్ఞాన మనగా ఉత్తను శీలసంపద, పవిత్రత, ఋజుప్రవర్తనము. గీతలో భగవాను డీ విషయమును అతిస్పష్టముగా చెప్పుచున్నాడు. ఈ మధురములైన పంచ శ్లోకములలో ఇరువది లక్షణములను గీతాచార్యుడు గానము చేయును. ఇవియే జ్ఞానసాధన ములును మరియు సాధ్యమును గూడ. ఇవి రెండవ అధ్యాయములో చెప్పిన స్థితప్రజ్ఞ లక్షణము వంటివి.

జ్ఞానేశ్వరుడు ఈ అయిదు శ్లోకములను అయిదువందల పద్య ములలో విస్తరించి, అతి మనోహరముగా ఆయనకు సహజమగు మధు రమగు ఆలంకారిక భాషలో తెలిపినాడు. అది మహారాష్ట్రభాషలో మిక్కిలి ప్రచారములో నున్నది. ఈ జ్ఞానేశ్వర మహాయోగిని గూర్చి భాషించినను, విన్నను, వ్రాసినను జన్మ సార్థక మగునుగదా! మహా రాష్ట్ర దేశములో జన్మించిన మహాయోగీశ్వరుడు జ్ఞానదేవుడు. ఈ పుణ్యపురుషుడు తన పదిహేనవసంవత్సరమున భగవద్గీతకు అత్యద్భు తమగు మహావ్యాఖ్యానమును రచించినాడు. తన ఇరువది యొకటవ సంవత్సరమున భౌతిక దేహమును విడిచినాడు. దున్నపోతుచే వేద ములను పలికించిన మహా ప్రతిభా సంపన్నుడు. పితృదేవతలను

స్వయంగా ఆహ్వానముచేసి కర్మకాండలను నెరపిన మహాశక్తిమంతుడు. ఇట్టి మహాపురుష నామస్మరణము మాత్రముననే మన సకల పాపములును నశించిపోగలవు. ఈ అధ్యాయములోని ఇరువది జ్ఞాన లక్షణములను గూర్చి తెలిసి కొందము.

## 93. తొమ్మిది జ్ఞానపుష్పాల అనంతశోభ.

**The supreme beauty of the nine flowers of knowledge.**

'అమానిత్వం, అదంభిత్వం, అహింసా, శాంతి, రార్జవం
ఆచార్యోపాసనం, శౌచం, స్థైర్యం, ఆత్మ వినిగ్రహః'

మానవుని పవిత్రునిగా జేయునది సత్ప్రవర్తనమే. సత్ప్రవర్తనమే జ్ఞానము. సచ్ఛీలమే జ్ఞానము (Good conduct and character is really true knowledge) సత్ప్రవర్తనను, శీలసంపదను, సద్గుణములను (moral codes and ethical values) గూర్చి, గీతాశాస్త్రములో మరల మరల భగవానుడు గానముచేయుచున్నాడు. నిత్యదైనందిన జీవితములో సత్ప్రవర్తనతో, సదాచారములో, శీలసంపదతో వర్తించుటయే భక్తి యని 12 వ అధ్యాయమున భగవానుడు ముప్పదిఆరు గుణములను గానము చేసినాడు. ఈ అధ్యాయములో మరల ఇరువది సద్గుణములుగల ప్రవర్తనా నియమావళిని జ్ఞాన లక్షణము లను పేరుతో గానము చేయుచున్నాడు. అందులో మొదటిది అమానిత్వము.

1 అమానిత్వము (**Humanity or Modesty**) అమానిత్వమనగా మానము లేకుండుట యని అర్థము. దురభిమాన రాహిత్యమే అమానిత్వము. మాన మనగా గౌరవము. తాను గౌరవింపబడవలయుననియు, సత్కార సన్మానములు, పొందవలయు ననియు ఆకాంక్షయే మానము. గౌరవనీయుడు, పూజనీయుడు, స్తవనీయుడు, ఆరాధ్యుడు

భగవంతుడు మాత్రమే. ఈ యభిమానము అనేక రీతులుగా, వర్గాభిమానము, విద్యాభిమానము, ధనాభిమానము, నేను జ్ఞానిననే అభిమానము, నేను భక్తుడననే అభిమానము, నేనువక్తననే అభిమానము నేను రచయితననే అభిమానము, నేను అధికారిననే అభిమానము, నేను దాతననే అభిమానముగా, మానవులను పిశాచ రూపమునబట్టి పీడించుచున్నది. నీయందు ఏకొలది మంచిగుణ మున్నను దానిని గోప్యముగా నుంచుము. బహిరంగము చేసికొనుటకు ప్రయత్నింపకుము. మట్టిలో గోప్యముగా దాగియున్న విత్తనము, అనుకూలవాతావరణము వచ్చినంతనే చిగురుటాకులతో శోభాయ మానముగా వికసించును.

ఆత్మస్తుతి (Self prize) వలదు. Simple living and high thinking (నిరాడంబర జీవితము, మహోన్నత భావములు) అను ఆంగ్లసామెత స్మరణీయము.

కొన్ని ఉదాహరణము.

1. అమెరికానుండి ఒక కోటీశ్వరుడు గాంధీజీని జూచు నిమిత్తము భారతదేశమునకు వచ్చెను. ఆయన పేరు, ప్రతిష్ఠలు అమెరికా పత్రికలలో చదివి, అపరక్రీస్తుగా, అపర బుద్ధావతారముగా, మహారాజకీయవేత్తగా ఋషిపుంగవుడుగా పేరుగాంచిన ఆమహనీయ మూర్తిని దర్శించి ధన్యుడు గావలయునను తలంపుతో గాంధీజీ ఆశ్రమమునకు వచ్చెను. ఆ సమయమున గాంధీజీ ఒక నూతివద్ద ఒక మట్టి కుండలో నీళ్ళు తోడుకొనుచుండెను. ఆ కోటీశ్వరు డాయనను చూచి, నేను అమెరికానుండి వచ్చితిని. దయచేసి నాకు గాంధీగారిని చూపించెదరా? అని ప్రశ్నించెను. 'అట్లే చూపెదను, నాతోరండు' అని బాపుజీ పలికెను. బాపుజీ నీళ్ళను కుండనిండుగా తోడి తనభుజముపై పెట్టుకొని ఆశ్రమములోనికిపోయి కుండను దింపి ఆనీళ్ళతో అచ్చటిపాత్రలను పరిశుభ్రము చేయుచుండెను.

అంతట కోటీశ్వరుడు, 'నాకు గాంధీజీని త్వరగా చూపించగలరా?' అని మరల ప్రశ్నించెను. ఆ బోసినోటి తపస్వి చిరునవ్వు నవ్వుచు, 'వీడే గాంధీ' యను పేరుగల మానవుడు' అని బదులు చెప్పెను.

అంగవస్త్ర ధారియై, కుండలు కడుగుచున్న ఆమహనీయ వృద్ధమూర్తిని గాంచి యాతఁడు పరమాశ్చర్య భరితు డాయెను. అమానిత్వమే మానవునకు మహాభూషణము.

మరొక ఉదాహరణము.

మహాపండితుడగు ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు ఒక పర్యాయము రైలులో ప్రయాణము చేయుచు ఒకానొక రైలు స్టేషనులో దిగెను. చాలమంది ప్రయాణీకు లచ్చట దిగిరి. అందొక ప్రయాణీకుడు మహా ధనవంతుడుగా బాగుగా చదువుకొన్న వానివలె గానవచ్చుచుండెను. ఆతని చేతిలో ఒక చిన్నసంచి గలదు. దానిని తనతో తీసికొనివచ్చుటకు ఒక కూలివాని కొరకు అతడు కేకలు వేయుచుండెను. కూలివాడు దొరక లేదు. కూలివాడు దొరకనందులకు స్టేషను మాష్టరును నిందింపసాగెను. సామాన్య పౌరుని వేషములోనున్న విద్యాసాగరుడు వినయముగా నిట్లు పలికెను. 'స్వామీ! ఆసంచిని నాకిండు నేను మీ యింటివద్దకు తీసికొని వచ్చెదను. ఆ ధనవంతుడు సంతోసించి తన సంచిని విద్యాసాగరున కిచ్చెను. విద్యాసాగరుడు సంచిని తీసికొని ఆ ధనవంతుని వెంట నడచిపోయి ఆతని యిల్లు చేరెను. ధనవంతు డాతని వద్దనుండి సంచిని తీసికొని ఒక్కరూపాయిని ఆతని కీయబోయెను. విద్యాసాగరుడు దానిని స్వీకరింపక వెడలి పోయెను. ఆధనవంతున కెంతయో ఆశ్చర్యము గలిగెను.

విద్యాసాగరుని రాకను పురస్కరించుకొని మరునాడు గ్రామములో ఒక గొప్ప బహిరంగ సభజరిగెను. గ్రామములోని పెద్ద లందరును ఆ మహాసభలో విద్యాసాగరుని మహావైభవముగా సన్మాన

సత్కారములు చేసిరి. మన ధనవంతులు కూడా ఆ సభకు విచ్చే సెను. నిన్నటి రోజున తన సంచిని ఇంటివరకును మోసికొని వచ్చిన సామాన్య మనుష్యుడే యిచ్చట మహావైభవముగా సన్మానింపబడు చుండుట గాంచి పరమాశ్చర్యభరితు డాయెను. అతడు విద్యాసాగ రుని సమీపించి తన్ను క్షమింప ప్రార్థించెను. ఆహా! అమానిత్వము దైవీసంపద (**Divine virtue**)

ఒకప్పుడు బాపుజీ ఒక ప్రాథమిక పాఠశాలకు పోయెను. అందు చదువుకొనుచున్న చిన్న బాలుడు గాంధీజీని చూచి 'బాపుజీ! మీరు చొక్కా ఎందులకు తొడుగుకొనలేదు? మీకులేదా? మా అమ్మను అడిగి మీకొక చొక్కాను తెచ్చెదను.ధరించెదరా?అని ప్రశ్నించెను. ఆ చిన్న బాలుని అమాయికమైన ముద్దుమాటలకు బాపుజీ వానిని భుజముపై ముద్దుగా తట్టుచు, 'బాబూ! అట్లనే ధరింతును. నాకు వేలకొలదిగా అన్నలు- తమ్ముళ్ళు ఉన్నారు. వారికికూడ చొక్కాలు లేవు. మీఅమ్మగారిని అడిగి వారికికూడా చొక్కాలను నీవు తీసికొని వచ్చినచో నేను తప్పక ధరించెదను.

అట్టి అమానిత్వజీవితమే (**simple lives**) బాపుజీని మహా త్ముని చేసినది.

2. అదంభిత్వము (**Non-pretending**) అమానిత్వమునకు వ్యతిరేకమే డంబము. డంబరాహిత్యమే జ్ఞానము. నేడు లోకమంతయు డాంబికముగా నున్న స్త్రీపురుషులతో నిండియున్నది.

విద్యలేకున్నను మహావిద్యావేత్తగా డాంబికముగా సంచరిం తురు. భక్తుడ ననే డాంబికము – జ్ఞానము లేకున్నను మహాజ్ఞానివలె సంచారము–సన్యాసలక్షణములు లేకున్నను సన్యాసివలె వేషభాషలు– తననేత్రాలతో తన్నుచూచుకొనుట మాని పరులనేత్రాలతో తాను గొప్పగా చూడబడవలయు నను తలంపే డంబ మగును. మహాజ్ఞాని యైన రమణమహర్షి కౌపీనధారి.

తనలోనున్న మంచిని బహిర్గతము చేయక - తనలోనున్న చెడ్డగుణమును బహిర్గతము చేసికొనుటయే డంబరాహిత్య మగును. గాంధీజీ ఒకప్పు డిట్లు పలికెను. I have connected a Himalayan blunder. నేను హిమాలయమంత పెద్ద తప్పు చేసినాను అని తనతప్పును తాను విశదపరచుకొన్నాడు.తమ తప్పును కప్పిపెట్టుకొను వారే గాని బహిరంగముగా తమదోషములు చెప్పుకొను వారు అరుదు. అట్టివారే డంబరహితులు-జ్ఞానసంపన్నులు. 'నీవు జ్ఞానివి కావ లయునన్న చో-భగవానుని కృపను బొందగోరెద వేని - నీదోషములను నీవు బహిర్గతము చేసికొమ్ము - భగవంతుని శరణాగతిని బొందుము' అని గురుదేవుడు పలుకును.

3. అహింస మూడవరత్నము **Non-injury is the third devine virtue.** :- అహింస అనగా ఏప్రాణిని శారీరకముగా - వాచికముగా - మానసికముగా హింసింపకుండుట యని అర్థము. 'అహింసా పరమోధర్మ' అని ఆర్యులు వచింతురు. కొట్టుట - దండిం చుట మాత్ర మేగాదు - ఎవ్వరితోను కఠినముగా మాటలాడకుము. ఇతర మనస్సునకు బాధకలుగురీతిగా మాటరాడ రాదు.మధురముగా- మంజులముగా - సత్యముగా హితముగా పలుకవలయును. మనస్సు నందు కూడ ఎవ్వరికిని హాని తలంపకుము. అట్టి అహింసామూర్తియే బ్రహ్మవేత్త. ఇట్టి మహత్తర సుగుణ సంపదలు గలవాడే భక్తు డన బడును. ఇట్టివారినే భగవంతుడు ప్రేమించును. కేవలము బహిరంగ ముగా చేయబడు కర్మకాండలే భక్తి సంప్రదాయములును జ్ఞానదీపిక లనియును భావించజనదు.

4. క్షాంతి (సహనము) **Endurance forgiveness** మహా సాగరములోని తరంగముల వలె కష్టములు - బాధలు - క్లేశములు పరాభవములు - ధిక్కారములు మానవుని నిత్యాదైనందిన జీవిత ములో కలుగుచునే యుండును. వీనిపట్ల సహనభావమును గలిగి

యుండును. సహనము మహాపురుష లక్షణము. క్షమామూర్తి దైవ మూర్తియే. అపకారికి నెపమెన్నక సేయువాడు నేర్పరి యని సుమతి వచించును 'క్షమకవచంబు' అని భర్తృహరి వచించెను.

క్షణక్షణమునకు కోపము, విసుగుదల, మానసికాందోళన, చిరాకుపడుట, ఇవన్నియును రజోగుణలక్షణములు, ఆధ్యాత్మిక సాధనకు భంగకరములు, ఓర్పు, సహనము, ప్రతీకారవాంఛ లేకుండుట. ఇవి సాత్వికలక్షణములు, కావుననే క్షాంతి జ్ఞానలక్షణముగా చెప్పబడినది. ప్రతీకారము చేయుటకు శక్తి లేకపడియుండుట క్షాంతికాదు. చెల్లియుండియు సైరణ చేయువాడే మహనీయు డనబడును.

5. ఆర్జవము (ఋజుప్రవర్తనము) **Strait farwardness.** దీనికి 'నిజాయతీ' యనియును కల్లకపటములులేని జీవిత మనియును పెద్దలు వచింతురు.

'మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనః 'మహాత్ములకు మనస్సు వాక్కు కర్మ ఒకే విధముగా నుండును. దుర్మార్గులకు మనస్సువేఱు, పలుకువేఱు, కర్మవేరుగా నుండును. త్రికరణశుద్ధి మహాపురుషలక్షణం. కొందరు పలుకులు మాత్రము తియ్యగా చెప్పుదురు. మనస్సు మాత్రము విషపూరితమై యుండును. వీరే పయోముఖ విషకుంభము లని చెప్పబడుదురు. నిత్యాద్వైనందినజీవితములో నిజాయితీని పాటించువాడే గీతోక్త జీవితమును గడుపువాడు.

6. ఆచార్యోపాసనం :–గురుసేవ–**Service to the teacher.** భారత దేశములో గురుశిష్యసంప్రదాయము చాల పవిత్రమైనది. 'గుః అనగా అజ్ఞానాన్నిరుః' అనగా నశింపచేయువాడని భావము. గురుః అనగా గుణాతీతుడు రూపరహితుడగు భగవంతుడని భావింపబడును. ఈనాడు పాఠశాలలలోను,కళాశాలలలోనుగానవచ్చుఉపాధ్యాయులు విత్తాపహారకులేగాని పవిత్రమగు గురుశబ్దమునకు అనర్హులు. కుంభినీధవు చెప్పెడి గురుడే గురు డని పోతన్నగారు భాగవతములో రచించి

నారు. భగవంతుని కంటెను ముందుగా నమస్కరింప దగినవాడు గురు వేయని కబీరు వర్ణించెను. శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు నైన గురువును ప్రణిపాతము, పరిప్రశ్నము; సేవయును గావించి ఆత్మవిద్య నభ్యసింప వలయును (గీత అ4-34) గురుకటాక్షముచే నరేంద్రుడు వివేకానందు డైనాడు. గురువు అనుగ్రహముచేతనే శంకరశిష్యుడు పద్మముల వంతెనపై గంగను దాటినాడు. అవతారమూర్తులగు శ్రీరాముడు శ్రీకృష్ణుడును తమ తమ గురుదేవుల నత్యంత భక్తిశ్రద్ధలతో నారాధించినారు.

7. శౌచం Purity భక్తలక్షణములలో గూడ శౌచమును గూర్చి వివరింపబడినది. శుచిత్వము చాలప్రధానమయినది. బాహ్య శౌచము అంతఃశౌచము (out word clearliness and in word clearliness) రెండును ముఖ్యములే. శరీరశుద్ధి - దుస్తులశుద్ధి-పరిసరముల శుద్ధి - ఆహారశుద్ధి - వాక్శుద్ధి-ఇతరులతో మనకు కలుగుచుండు అన్ని వ్యవహారములయందు పరిశుద్ధి మనశ్శుద్ధి అన్నియును అవసరములు. కొంతమంది బాహ్యశుద్ధికన్న అంతశ్శుద్ధి చాలగొప్పదని ప్రవచనములు చేయుచు తామేమో బ్రహ్మవేత్తలమయినట్లు స్నానము చేయక పరిశుద్ధమగు దుస్తులు ధరింపక - దంతధావనాదులను గూడ సక్రమముగా చేయక దుర్వాసనతో గానవత్తురు. వీరు మిక్కిలి తమోగుణము గలవారు. మిక్కిలి సోమరులు.

ఉదాహరణము. గంగాతీరమున నొక ఆశ్రమముగలదు. ఒక రోజున ఒకసన్యాసి ఆ యాశ్రమమునకు అతిథిగా వచ్చెను. ఆయన కాయాశ్రమములో ఆతిథ్య మీయబడెను. తెల్లవారుజామున ఆశ్రమవాసు లందరును లేచి గంగాస్నానమునకుపోవుట వారి సంప్రదాయము. అందరితోపాటు సన్యాసి అతిథిని గూడ స్నానమునకు రమ్మని తెల్లవారుజామున ఆశ్రమవాసు లాయనను కోరిరి. ఆతడు విసుగుకొనుచు నిట్లు పలికెను. 'మీ రెంకను బ్రహ్మజ్ఞానమును బొందుటలో తక్కువ

స్థాయిలోనున్నాను. ఈ బాహ్యస్నానముల వలన ప్రయోజనము లేదు. నాలోనే గంగ యున్నది. నాలోనే యమున యున్నది. నాలోనే సరస్వతియున్నది. నాయందున్న త్రివేణీ సంగములో నేను నిరంతరమును స్నానమాచరించుచుంటిని. ఈబాహ్యస్నానము లనవసరములు. మూర్ఖులకు మాత్రమే అని చెప్పి దుప్పటి ముసుగుపెట్టి పరుండెను. సోమరియగు ఆ సన్యాసికి గుణపాఠము చెప్పవలె నని వారు తలచిరి. ఆనాడు పండుగ యగుటచే నెవ్వరో ధనవంతుడు ఆశ్రమవాసులకు పిండివంటలతో విందుచేసెను. మనసన్యాసి అతిథి చక్కగా బూరెలు బొబ్బట్లు పులిహార మున్నగువానిని చక్కని నేతితో సమన్వయించి భుజించెను. రాత్రి తానుపరుండుగదిలో పెద్దచెంబు నిండుగా మంచి నీరు నింపుకొని పరుండెను. ఆతడు నిద్రించిన వెంటనే ఆ మంచినీటి చెంబును ఆగదినుండి తీసికొని ఆగదికి బయట గొళ్ళెము పెట్టిరి.

ఒకరాత్రివేళ సన్యాసికి దాహము హెచ్చుగా నుండుటచేత లేచి మంచినీటి పాత్రకొరకు వెదకసాగెను. నీటిపాత్ర కానరామిచే కంగారు పడెను. విశేషముగా దాహమగుచున్నది. మంచినీరు లేదు. తలుపు వద్దకువచ్చి చూడగా బయట బంధింపబడి యుండెను. ఆసన్యాసి చాలా కంగారుపడుచు, బాబూ దాహము, దాహము, నోరెండిపోవు చున్నది. తలుపు తీయండి, మంచినీరు, మంచినీరు కావలెను. అని గట్టిగా అరవసాగెను. కొంచెముసేపటిని అరచిన తరువాత ఆశ్రమ వాసులు తలుపు తెరచి, స్వామీ మంచినీటి కొరకు ఈరీతిగా కేకలు వేయుచున్నారేమి ? మీలోనే గంగానది కలదని చెప్పినారు గదా. అందులోనే మీరు సదా స్నానమాడుచుండగా మీకు దాహ మెట్లు కలుగును. స్నానమునకు జలమిచ్చిన గంగలో త్రాగుటకు జలములు లేవా? యని ప్రశ్నించిరి.

ఆసన్యాసి అతిథి సిగ్గుపడి తన పొరబాటును గ్రహించెను. బాహ్యశౌచము అత్యంతావశ్యకము. వైశాఖ స్నానములు

కార్తీక స్నానాదులు బాహ్యశుద్ధితోపాటు అంతఃకరణ శౌచమును కూడ తెలుపును.కొందరు బాహ్యశుద్ధికిమాత్రమే ప్రాధాన్యమిచ్చుచు అంతఃకరణ మాలిన్యములతో నుందురు. పొలమునకు బయట చుట్టును బాగుగా కంచెను పెంచుచు లోపల మాత్రము చక్కనిపైరు పెట్టని రైతునవలె అట్టి సాధకుడు పూర్ణ ప్రయోజనమును బొందడు.

8. స్థైర్యము (firm conviection) ధృఢచిత్తము, స్థిరమైన సంకల్పము, ధృఢనిశ్చయము, తీవ్రమగు కార్య దీక్షయును లేసి మానవుడు నిత్యమైనందిన జీవితములోనే వ్యర్థుడగును. ప్రతిదినమును చక్కని దీక్షతో చదువని విద్యార్థి పరీక్షలలో ఉత్తీర్ణుడు గానట్లు ఆధ్యాత్మికసాధకుడు స్థిరబుద్ధితోను దీక్షతోను కృషిచేయుచో ఆత్మ సాక్షాత్కారమును బొందలేడు. చపలచిత్తుడు ఏకార్యమును సాధింప లేడు. స్థిరచిత్తుడే విజయములు సాధించును. ఆధ్యాత్మిక సాధనలో ఎన్నియో కష్టములు క్లేశములు రావచ్చును. వాటిని నేర్పుతో నిగ్ర హించి తన నిత్యసాధనము విడువక చేయుచు నుండువాడు బ్రహ్మ త్వమును బొందగలడు. నాకొక మిత్రుడుగలడు. భగవద్గీతను నిత్య పారాయణము చేసెదనని వాగ్దానము చేసెను. అయిదారు రోజుల తరువాత తన యింటిలో గల ముసలమ్మకు జ్వరము వచ్చినది. గీతా పారాయణము బెడిసి కొట్టినది. ఎవ్వరు చెప్పిరో ఆ మిత్రుడు గీతా పారాయణమునకు స్వస్తి చెప్పెను. ముసలమ్మ మరణమునకు, గీతా పారాయమునకు సంబంధ మేమి ?

ప్రతిదినమును క్రమశిక్షణతో, గురువు బోధించిన సాధనలను క్రమము తప్పక, సకాలములో (Regular and Punctual) నిర్వ హించువాడే ఫలమును బొందును. సోమరిగాని చపల చిత్తుడుగాని, సంశయాత్ముడు గాని ఆత్మ విజయమును సాధింపలేడు. ధ్రువునివలె బుద్ధునివలె, దృఢ శిక్షతో సాధన చేయవలెను. రోజునకొక గురువు, రోజునకొక మంత్రము రోజునకొక దీక్ష, రోజునకొక పద్ధతి, వీటివలన ఎట్టి ప్రయోజనమును సాధకుడు పొందడు.

9 ఆత్మవినిగ్రహము (Self control) ఇచ్చట 'ఆత్మ' అనగా ప్రత్యగాత్మగాదు. ఇంద్రియములు, మనస్సు అని అర్థమగును. జ్ఞానేంద్రియముల నైదింటిని మనస్సును జయించుటచేతనే ఆత్మసాక్షాత్కారమగును. భక్తియోగ వివరణమునం దీ విషయములు చర్చింపబడి యున్నందున పాఠకు లాయా తావులయందు పరిశీలింప ప్రార్థన :- కళ్లెములేని గుఱ్ఱమువలె నిగ్రహము లేని మనస్సు గమ్యమును చేరదు. మన యిష్టప్రకారము [అనగా ఆత్మ నిర్దేశించిన రీతిగా ఇంద్రియములు వర్తించవలెనే గానే ఇంద్రియములు చెప్పినరీతిగా యజమాని వర్తింపరాదు. యజమానికి సేవకులు విధేయులై యున్నపుడే యజమానికి సుఖము గలదు. అట్లుగాక సేవకుల యిష్టానుసారముగా యజమాని యున్నచో సత్ఫలములు రావు. ఇంద్రియములు గుఱ్ఱముల వంటివి. నీవు వానిని స్వాధీనపరచుకొను రౌతువు. ఇంద్రియములు సేవకులు. వానిని స్వాధీనములో నుంచుకొని నీ యిష్టానుసారముగా పనిచేయించుకొను యజమానివి నీవు.

మనస్సును నిగ్రహించుకొనుటకు సజ్జనసాంగత్యము, జపతపోధ్యాన సంకీర్తనములు, సదాచారము, ఆహారనియమములు అత్యంతావశ్యకము లని సాధకులు ముఖ్యముగా గమనింపదగును.

—···—

## 94. నిత్యజీవితములో జ్ఞానసాధనాత్రయం

**Three practices of knowledge in the daily life.**

ఈ అధ్యాయములోని తరువాతి శ్లోకములో (9వ శ్లోకము) భగవానుడు మూడు జ్ఞానసాధనలను తెలుపుచున్నాడు. ఈజ్ఞానపుష్పత్రయ సౌరభములను నిత్యమై నందిన జీవితమునందు సాధకుడు అనుభవించవలయును.

10 ఇంద్రియార్థేషువైరాగ్యం (ఇంద్రియ విషయములయందు వైరాగ్యము కలిగియుండుట) - **Dispassion towards sense**

obje ts మనకు అయిదు జ్ఞానేంద్రియములు గలవు. ఒక్కొక్క యింద్రియమునకు ఒక్కొక్క విషయము గలదు. నేత్రములకు రూపము, చెవులకు శబ్దము, చర్మమునకు స్పర్శ, నాసికకు ఘ్రాణము, నాలుకకు రసము.వీనియందలి ఆసక్తియే జీవుని సుఖదుఃఖములందు బంధించుచు పతనముచేయుచున్నది. వీనియందు వైరాగ్యభావమును కలిగియుండవలెను. ఇంద్రియార్థములు పురుషార్థములు గావని తెలియవలెను. ఆత్మసాక్షాత్కారమే పరమపురుషార్థము. సాధకులు తమ నిత్యజీవితలలో ఇంద్రియవిషయములందు రాగమును క్రమక్రమముగా తగ్గించుకొనుచు వానివల్ల వైరాగ్యమును పెంపొందించుకొనవలెను. ఇంద్రియభోగములందాశ నశించినగాని జ్ఞానోదయము కాజాలదు.

'యే హిసంస్పర్శ జా భోగాః దుఃఖ యోనయ ఏవ తే' (5–22)

ఇంద్రియ విషయభోగము లన్నియు దుఃఖహేతువులే. కావున వానిని త్యజించుమని గీత హెచ్చరించుచున్నది.

బాహ్యములగు శబ్దాది విషయములందాసక్తిని పూర్తిగా విడిచిన వానికే ఆత్మానందము చేకూరును. (5–21)

అనహంకారము :- (free from egoism) అహంకారము లేకుండుట. 12వ అధ్యాయమున భక్తలక్షణములను వివరించుచు 'అహంకార రాహిత్యమును గూర్చి తెలిసియున్నాడు. మరల జ్ఞాన లక్షణములలో అహంకారరాహిత్యమే జ్ఞానము అదియే భక్తి.అహంకార మనేకరూపములు. నేను ధనవంతుడను అను అహంకారము, అధికారి ననే అహంకారము, జ్ఞాని ననే అహంకారము, భక్తుడ ననే యహంకారము, నిరహంకారి నని చెప్పుకొనునట్టి అహంకారము. అహంకార మే రూపములోనున్నను మానవుని పతనముచేయును.

ఒక రమణీయగాథను చెప్పుచున్నాను వినుడు. కొంతకాలము క్రిందట ఒకానొక హిందీ ఆధ్యాత్మిక మాసపత్రికలో పొందుపరుప

బడిన ఈవిషయము సాధకులకెంతయో కనువిప్పు కలిగింప గలదను భావముతో వివరించుచున్నాను.

కురుక్షేత్ర యుద్ధము ముగిసినది. శ్రీకృష్ణభగవానుని అనుగ్రహముచేత పాండవులకు జయము లభించినది. వాస్తవ మిట్లుండగా జనులందరును అర్జునుని పొగడసాగిరి. 'అర్జునా! నీకు జయముజయము. పార్థా! నీకు విజయోస్తు. 'సవ్యసాచీ! నీవే మహావిజేతవు' ఈరీతిగా అర్జునుని గూర్చిన పొగడ్తలు ఆతనిలో అహంకారము గలిగించినవి. చెట్లపైనున్న పక్షులుగూడ విజయుని విజయగీతములే ఆలపించుచున్నట్లుండెను. ప్రకృతియంతయును రమణీయమై పాండవుల విజయపరంపరలతో ముఖ్యముగా పార్థుని మహాప్రభావ తేజస్సంపదలతో భాసించుచున్నట్లు గానవచ్చెను. ఈ దురహంకారమును పార్థుని చిత్తమునుండి తొలగింపచేయవలె నని పార్థసారథి భావించెను.

ఒక రోజున కృష్ణార్జును లిరువురును గలిసి రథముపై నెక్కి షికారుగా బోవుచుడిరి. కొంతదూరము పోయిన తర్వాత అర్జునుడు 'కృష్ణా! నాకు దాహము మిక్కిలిగానున్నది. ఎక్కడైనను కొంచెము మంచినీరు లభించిన బాగుండును.' అని పలికెను. కృష్ణుడు రథము నాపి, పార్థా! ఇదిగో ఈ దారినే పొమ్ము. కొంచెము దూరములో ఒకచక్కని ఆశ్రమము నీకు గానవచ్చును. అందొక వృద్ధురాలు నా యొక్క పూజలనుచేయుచు అందు కానవచ్చును. ఆమెవద్దకు పోయినచో మంచినీరు లభించగలదు. నీ దాహబాధ తగ్గును.' అని పలికెను.

అర్జునుడు రథము దిగి ఆశ్రమమువైపు వేగముగా నడువసాగెను. శ్యామసుందరుడు పార్థుని వెనుకకు పిలిచి, అర్జునా! నీవు అచ్చట జాగ్రత్తగా మాటలాడవలయును సుమా! 'నేనొక కృష్ణభక్తుడను నాకు దాహ మగుచున్నది.' అనియే పలుకుము. అంతియేగాని నేను

అర్జునుడను,అని మాత్రము చెప్పబోకుము, జాగ్రత్త. త్వరగా రమ్ము' అని చెప్పి పంపెను.

కొంతదూరము పోవుసరికి ఒక రమ్యమగు ఆశ్రమము పార్థునకు గానవచ్చెను. రమణీయమగు ఆయాశ్రమమును అచ్చటి ప్రసన్న ప్రశాంతమగు, ఆధ్యాత్మిక వాతావరణమును గాంచి పార్థుడు ముగ్ధుడయ్యెను. ఆశ్రమ మధ్యభాగమున సుందరమగు కృష్ణ విగ్రహము కానవచ్చుచుడెను. ఒక వృద్ధురాలు ఆకృష్ణ విగ్రహమును భక్తిశ్రద్ధలతో పూజించుచుండెను.

'అమ్మా నాకు దాహ మగుచున్నది. తల్లీ! నాకు కొంచెము మంచినీరు ఇత్తువా ?' అని వినయముగా పార్థుడు పలికెను. 'ఎవరు నాయనా నీవు?' అని ఆవృద్ధురాలు ప్రశ్నించెను. 'నేనొక బాటసారిని, కృష్ణభక్తుడను తల్లీ, అని అర్జునుడు జవాబు పలికెను. వెంటనే ఆతల్లి లేచి సంభ్రమముతో, నాయనా, కృష్ణ భక్తుడవా, చాలసంతోషము, శ్యామసుందరుడే యిచ్చటకు వచ్చినట్లున్నది. ఇదిగో ఈ పీఠముపై కూర్చుండుము. క్షణములో చల్లనిపానీయములు- ఫలరసములు-తీసికొనివత్తును. అని పలుకుచు వృద్ధురాలు లోనికి వెళ్ళెను.

అర్జునుడు ఆశ్రమమంతయును గలయచూచెను. ఆధ్యాత్మిక వాతావరణముతో శోభాయమానముగా నుండెను. ముఖముమునైకెత్తి చూడగా, పై భాగమున వాడియైన ఖడ్గములు - ఆయుధములు వ్రేలాడు చుండుటను పార్థుడు గమనించెను. ఆతనికి చాలభయమును ఆశ్చర్యమును గలిగెను. ఇంతలో ఆవృద్ధురాలు చల్లని పానీయములను మధురములగు ఫలములను తెచ్చి భక్తితో అతిథి దేవునిముందుంచి స్వీకరించుమని ప్రార్థించెను.

ఆతల్లికి నమస్కరించి పార్థుడు సవినయముగా నిట్లు పలికెను. అమ్మా! ఆశ్రమ మంతయును మిగుల శోభాయమానముగా నున్నది.

పైకి చూడగా భయంకరములగు వాడి ఖడ్గములు వ్రేలాడదీయ బడి యున్నవే. ఎందుల కివి ?' అని ప్రశ్నించెను.

పార్థుని పలుకులు విన్నంతనే ఆ వృద్ధురాలి నేత్రములు ఎఱ్ఱనయ్యెను. మిగుల క్రోధావేశముతో నిట్లు పలికెను.

'ఈ ఖడ్గము లెందుకో చెప్పెదను వినుము. ఎచ్చటనైనను అర్జునుడుగాని, ద్రౌపదిగాని, ఉత్తరగాని కనుపింతురేమో యని ప్రయత్నించుచున్నాను? వారి నీఖడ్గములతో శిక్షించవలెనని తలంచుచున్నాను. వారిని దారుణముగా శిక్షించుటకే ఈఖడ్గములు జాగ్రత్త పెట్టినాను'అను ఆ వృద్ధాంగన పలుకులను విని పార్థుడు భయకంపితుడయ్యెను.

అమ్మా! వారందరును కృష్ణభక్తులేగదా! కృష్ణభక్తులపై నీకు గౌరవము ఉండవలసినదే గాని క్రోధ మెందులకు తల్లీ. అర్జునుడు కృష్ణసఖుడు. ద్రౌపది కృష్ణభక్తురాలు. ఉత్తరయును కృష్ణపాదారవింద సేవకురాలు. వారిపై నీకెందుకమ్మా! కోపము'అని పార్థుడు వినయముగా పలుక సాగెను.

వృద్ధురాలు మహాకోపావేశముతో నిట్లు పలికెను. అర్జునుడు భక్తుడని ప్రశంస చేయుచున్నావా? ఎంత ఘోరము.అర్జునుడు స్వార్థపరుడు. తన స్వప్రయోజనముకొరకు భగవానుని ప్రక్కకు చేరినాడు. తన రాజ్యకాంక్ష కొరకు మాత్రమే శ్యామసుందరుని ఆశ్రయించిన మహాలోభి. తాను హాయిగా రథములో గూర్చుండి శ్యామసుందరుని సారథిగా నియోగించినాడు. ఎంత పాపమున కొడిగట్టినాడు పార్థుడు? అయ్యో! శత్రువుల బాణపరంపర లన్నియు మురళీధరునకు తగులుచున్నవి. ఎంతగా నా సుకుమారి శ్యాముడు బాధపడినాడో గదా- మహాస్వార్థపరుడు, మహాపాపి, శ్యామసుందరుని మిగుల కష్టపెట్టిన పార్థుడు భక్తుడగునా? వడీ కానవచ్చినచో వానికి తగిన బుద్ధి చెప్పుటకే ఈ ఆయుధములు అని ఆవేశముతో పలుకసాగెను.

అర్జును డా ముసలితల్లి ఆవేశపూరిత వాక్యములను విని భయ భ్రాంతు డయ్యెను. ఆమె మహోన్నతమగు కృష్ణభక్తికి ఆశ్చర్య చకితు డాయెను.

'తల్లీ! నీవు చెప్పినది యథార్థమే. పార్థుడు రాజ్య కాంక్షచే మురళీమోహనుని కష్టపెట్టిన దుర్మార్గుడే యగును. మరి నీకు ద్రౌప దిపై ఎందులకమ్మా కోపము' అని అర్జునుడు ప్రశ్నించెను.

వృద్ధురాలు మరింతకోపముతో నిట్లు పలికెను. ద్రౌపది భక్త రాలా! ఆమెలో కొంచెమైనను కృష్ణ భక్తి లేదు. తన స్వార్థముకొరకై కృష్ణుని బాధించినది. ఆమెలో భక్తలక్షణము లేమి గలవు. కౌరవ సభలో దుశ్శాసనుడు వస్త్రాపహరణము చేయుచుండగా ద్వారకలో సుఖముగా శయనించియున్న ఆ శ్యామసుందరుని 'రమ్ము రమ్ము' వేగ ముగా రమ్ము అని బాధించవలసిన యవసర మేమి గలిగినది? మానల్ల నయ్య మా సుకుమారి కృష్ణయ్య, ఆ మండుటెండలో, మట్ట మధ్యా హ్న సమయమున చెమటలు గ్రక్కుకొనగా రప్పించిన ద్రౌపదిలో కృష్ణభక్తి యేమాత్ర మున్నది. కృష్ణుని అంతగా వేధించిన ద్రౌపది భక్తురాలా లేక దుష్టురాలా? భక్తునకు దేహాభిమాన ముండదు దేహా భిమానముతోగూడి దేహగౌరవాన్ని కాపాడుటకు శ్రీకృష్ణుని బాధిం చిన ద్రౌపదిని క్షమింప వీలులే' దని ఆమె పలికెను.

నిష్కామ మగు వృద్ధురాలి పవిత్ర కృష్ణభక్తికి అర్జునుడు పర మాశ్చర్యము బొందెను.

'తల్లీ! దేహాభిమానముతో ప్రగ్గిన ద్రౌపది శిక్షార్హురాలే కావచ్చును. కాని, తల్లీ! ఉత్తర ఏమి పాపముచేసినది?' అని పార్థుడు ప్రశ్నించెను.

వృద్ధురాలు ఇట్లు పలికెను, 'ఉత్తర పాపము చేయ లేదంటావా! ఏమి వింతగా పలుకుచున్నావు? అశ్వత్థామ భయంకరమగు బాణ ప్రయోగము చేసినవాడే అనుకొందము. గర్భములోనున్న పరీక్షిత్తును

ఆ బాణము తీవ్రముగా బాధింపవచ్చును. అంత మాత్రముననే ఉత్తర తబ్బిబ్బుపడుచు సుకుమార సుందరుడగు నా కృష్ణయ్యను వచ్చి కాపాడు మని బలవంతపెట్టుట ఏమంత భక్తిస్వభావ మగును? పాపము కృష్ణయ్య అంగుష్ఠమాత్ర శరీరమును ధరించి, ఆమె గర్భ కుహరములో ప్రవేశించి ఎంతగా కష్టపడినాడో గదా' యని ఆ ముసలి తల్లి ఏడువసాగెను.

ఆవృద్ధాంగనయొక్క నిష్కారణమై, నిరుపమానమై, నిర్మలమై పొంగులెత్తుచున్న ఆ కృష్ణభక్తికి తన్మయత్వము బొంది 'తల్లీ! నేనిక వెళ్ళివత్తును. నమస్కారమమ్మా యని పలుకుచు పరుగు పరుగున రథముపై నవ్వుచు కూర్చొనియున్న శ్యామసుందరునివద్దకు చేరి ఆయన పాదపద్మములకు నమస్కరించి, కృష్ణదేవా! నా అంహాకార మటువం టిది. ఈ జన్మలో కాకున్నను మరుజన్మలోనైనా ఆ వృద్ధురాలికి గల పరమభక్తిని నాకు ప్రసాదింపు మని ప్రార్థించెను.

ఈ పుణ్యగాథలోని పవిత్రభావములను పాఠకులు గ్రహింతురు గాక.

12. జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనము
**(Perception of evil in birth, death, old age and disease)**

జననమందును, మరణమునందును, ముసలితనమునందును వ్యాధియం దును గల దుఃఖదోషములను చింతనచేయు మని గీత ప్రబోధించు చున్నది. వీనిని బాగుగా చింతనముచేసినచో దేహాభిమానము నశిం చును. వైరాగ్య ముదయించును. కావున నిది జ్ఞానలక్షణమని పేర్కొన బడినది. జననము భయంకరమైనది. ఈ భయంకర సన్నివేశమును గూర్చి మరలమరల ఆలోచించినచో ఇక జననము వలదనియే మానవుడు తలంచును.

తొమ్మిది సుదీర్ఘమాసములు తల్లికడుపులో, మలమూత్రాల మధ్య, దుర్వాసనలమధ్య, అసహ్యమగు వాతావరణములో, పురు గులు క్రిమికీటకములమధ్య గడుపుచు, తల్లి తినునట్టి ఆహారములతో

ఉద్వేగములను బొందుచు గర్భనరకమును అనుభవించవలయును. అనంతరము మావితో గట్టిగా కట్టబడి పరమ దుర్గంధభూయిష్టమైన స్త్రీయొక్క సన్నని అధోమార్గముద్వారా భూమిపై పడుదువు. ఇది నీ జననములోని రహస్యము గదా! ఇట్టి మహానరకమును బుద్ధిమంతు డెవ డైనను కోరునా?

ఇక మరణమును గూర్చి చెప్పవలయునా? ఇది యెంత భయంకరమో అందరకు తెలిసియే యున్నది. వేయి తేళ్ళు గుట్టిన బాధను ఆతడు అనుభవించును. కావున మరణమునందలి బాధను మననము చేసికొన్నచో జ్ఞానోదయము కాగలదు.

ఇక ముసలితనములోని బాధనుగూర్చి చెప్పనవసర ముండదు. ఇంద్రియముల పటుత్వము తగ్గును. కన్నులు కానరావు. చెవులు వినబడవు. పండ్లూడిపోవును. దేహపటుత్వ ముండదు. అతినీరసము. తిం టే అరిగదు. తిననిచో బలహీనత. ఈస్థితిని గూర్చి మరలమరల చింతన చేసినచో జ్ఞానోదయము కాగలదు.

ఇక వ్యాధులను గురించి వేరుగా చెప్పనవసరము లేదుగదా. వ్యాధులు ఏవిధముగా పీడించుచున్నవో గమనించిన బుద్ధిమంతునకు తప్పక జ్ఞానము కలుగును.

సిద్ధార్థుడు ఒక్కపర్యాయము మాత్రమే వ్యాధిగ్రస్తుని, వృద్ధుని, మరణించిన వ్యక్తిని గాంచినవాడై, విషాదమును బొందెను. ఆ విషాదమే ఆతనికి జ్ఞానోదయము కలిగించినది. కాని మానవు లిట్టి విషాద సన్నివేశములను చూచుచున్నను వారిలో వైరాగ్యము కలుగదాయెను. జ్ఞానోదయము పొడసూపదాయెను.

కావున మరల ఈ దుఃఖదోషములను గూర్చి చింతన చేయవలెను.



## 95. మరికొన్ని జ్ఞానపుష్పాలు

**A few more flowers of knowledge.**

ఇంతవరకును పన్నెండు జ్ఞానలక్షణములను గూర్చి వివరించడమైనది. 10, 11, 12 శ్లోకములలో భగవానుని యెనిమిది దివ్యగుణములను గూర్చి భగవానుడు గానముచేయుచున్నాడు. సాధకులు వీనిని నిత్యజీవితములో అభ్యసించవలయును.

13. అసక్తి :- un-attachment ప్రాపంచిక విషయములపై ఆసక్తి లేకుండుటయే 'అసక్తి' యనబడును. మానవుడు ప్రపంచములోనికి వచ్చియున్నాడు. తిరిగి ప్రపంచమును వీడిపోవునపుడును ఏకాకిగా పోవలసియేయున్నది. ఈపరమసత్యమును నిరంతరమును మననము చేయుచున్న బుద్ధిమంతునకు 'ఆసక్తి' నశించును. ఇదియే జ్ఞాని యొక్క లక్షణము. 'ఈశావాస్య మిదం సర్వం' అని ఉపనిషత్తు చెప్పను. 'సర్వమును ఈశ్వరునిచేతనే ఆచ్ఛాదింపబడి యుండగా 'నాది నాది' యని మమకారమేల యని బుధులు పలుకుచున్నారు.

ఒక కోటీశ్వరునకు ముగ్గురు స్నేహితులు గలరు. ఒకపర్యాయము కోటీశ్వరునిపై ఒక గొప్ప నేరము మోపబడినది. న్యాయాధికారి విచారణచేసి నిన్నుగురించి, నీ యథార్థస్థితిని గూర్చి చెప్పగల ఒకగొప్ప సాక్ష్యమును తీసికొనిరమ్ము. నీనేరమును కొట్టివేయుదు నని తెలిపెను. కోటీశ్వరుడు తన స్నేహితునివద్దకు పోయి తన్ను గురించి కోర్టునకువచ్చి సాక్ష్యమును పలుకు మని కోరెను. అంత నామిత్రుడు అయ్యా! నేను కోర్టునకుమాత్రము రాజాలను. ఇంటివద్దనే సాక్ష్యమును పలికెదను' అనెను. కోటీశ్వరుడు చాల విచారించి రెండవ మిత్రుని అర్థించెను. 'మిత్రమా! నేను కోర్టు గుమ్మమువరకు మాత్రమే రాగలుగుదును. లోనికిమాత్రము నేను రాను సుమా'అని బదులు చెప్పెను. కోటీశ్వరుడు బాధపడి మూడవ మిత్రుని యాచించెను. 'మిత్రమా! నేను నీ వెంబడివచ్చెదను. నీవు ఎచ్చట కేగిన నచ్చటకే విశ్వాసముతో నస్తును. నిన్ను గురించి యథార్థమును చెప్పెదను అని పలికెను.

ఈముగ్గురు మిత్రులను ఎవ్వరో పాఠకులు గమనించవలెను. 'ధనము ఒకమిత్రుడు. ఇల్లు వదలిరాడు. రెండవరకము మిత్రులు ప్రాపంచిక స్నేహితులు. వీరు మరణసమయమున స్మశానమువరకు మాత్రమే వచ్చి పోవుదురు. వీరిరువురితో ఏమి ప్రయోజనము? మూడవ మిత్రుడు మానవుని వెంబడించి వచ్చును. వాడే జ్ఞాన మిత్రుడు. ఈసత్యమును గుర్తించి మానవుడు ప్రాపంచిక విషయములపై వ్యక్తులపై మమకారమును వీడి జ్ఞానదేవుని నాశ్రయించవలయును.

14. పుత్రునియందును – భార్యయందును – గృహమందును మమకారమును వీడుట. (**Non-identification with son, wife and house**) పైన వివరించిన 'అనాసక్తినే' మరింత స్పష్టముగా ఈ గుణమునందు నిరూపింపబడుచున్నది. మానవుడు ఎన్ని మమకారములను వదలుకొన్నను మరలని మమకార బంధనములు మూడుగలవు. భార్యా-పుత్రులు-గృహము.

తాను మంచి జీవిత భాగస్వామిగా నిర్ణయించుకొని సుఖదుఃఖాదులను ప్రతిదినమును అనుభవించుచున్న భార్యయందు మమకారముపోదు. జ్ఞానసాధనచేతను, విచారణ వివేకములచేతను ఈ బంధనత్రయమును వదలించుకొన ప్రయత్నించవలెను. అనగా భార్యను ఇంటివద్దనుండి గెంటివేయవలయు ననికాని, పుత్ర-గృహాదులను బహిష్కరింపవలయు ననికాని గీతాశాస్త్రము చెప్పదు. వానియందు గల 'అభిష్వంగము' (తాదాత్మ్యభావము) వీడవలయు నని సారాంశము. ఒకరిద్దరు సంతానము కలిగిన పిమ్మట భార్యను భోగదృష్టితోగాక మిత్రునిగా, సహచారిణిగా భావించి వర్తించవలె నని గాంధీజీ తన జ్ఞాన సాధనయందు తెలిపియున్నాడు. పుత్రుని పెద్దవానిగా భావించవగును. గృహముకూడ తనకు బంధనము కారాదు. గత అధ్యాయమున భక్తుని లక్షణములను తెలుపుచు (అనికేతః **The homeless**)

అని చెప్పఁబడిన విషయములోని సారస్యమును పాఠకు లిచ్చట గ్రహింప నగును.

15. ఇష్టానిష్ట ప్రాప్తి యందు సమానత్వము (**Even mindedness on the attainment of desirable and undesirable**) ప్రపంచమున్నంతవరకు సుఖదుఃఖములు - హెచ్చుతగ్గులు-అని వార్యములే యగును. బుద్ధిమంతుడు వీనియందు సమత్వబుద్ధి గలిగి యుండవలెనని గీతలో అనేక తావులలో చెప్పబడియే యున్నది. ఇట్టి ద్వంద్వాతీతస్థితిని గూర్చి అనేక శీర్షికలలో లోగడనే మీరు చదివి యున్నందున మరల వివరణ మనవసర మని భావింతును.

16. మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ - అవ్యభిచారమగు అనన్యభక్తిని నాయందు కలిగియుండుము. **Un beavering and constant devotion to me by the yoga of non-separation.** ఇయ్యది జ్ఞానసాధనలో పదునారవ దివ్య లక్షణ ముగా తెలుపబడియున్నది. అన్యభావనలేని భగవద్భక్తియే జ్ఞాన మని మరియొక పర్యాయము తెలుపబడుచున్నది. పరాభక్తియే జ్ఞానమని శ్రీ శంకరులు నుడివియున్నారు.

తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర అన్ని కాలము లందును నన్నే స్మరింపుము.

'తస్మాత్ సర్వేషు కాలేషు యోగయుక్తో భవ'

అన్ని కాలము లందును యోగయుక్తుడవై యుండుము. అని గీత మరల మరల హెచ్చరించుచున్నది.

17. వివిక్తదేశ సేవిత్వం **Resort to salitory place:** జ్ఞాన సాధనకు ఏకాంత వాసము అత్యంతావశ్యకము కావుననే యోగులు మహర్షులు మున్నగువారు నదీతీరములకు,కొండగుహలకు,పుణ్యాశ్రమ ములకును తపస్సు కొరకు పోవుచుండెడివారు. గృహస్థుల కిట్టి ఏకాంత వాసము ఎట్లు లభించు నని కొందరు ప్రశ్నింతురు. ఆరవ అధ్యాయ

మున ఈవిషయమును గూర్చి వివరింప బడినది. గృహస్థుడు తన గృహమునందే ఒక గదిని ప్రత్యేక ధ్యానమందిరముగా ఏర్పాటు చేసికొనవలెను. అదియే ఆతనికి ఏకాంతగృహము,తపోవనమును, కాగలదు. ఏకాంతము మానవునకు గాదనియును మనస్సున కనియును బుద్ధిమంతులు గ్రహింపగలరు. అందులకు బాహ్యసాధనమే ఏకాంత స్థలము.

18. జనసమూహమునందు ప్రీతిలేకుండుట.(అరతి ర్జన సంసది) **Dislike society of men.** జ్ఞానసాధకుడు ప్రాపంచిక వ్యామోహముగల వ్యక్తులనుండి దూరముగా నుండవలెను. ఆసురీగుణములు గలవారు, దుర్మార్గులు, భోగపరాయణులు. వీరితో సాంగత్యముకూడదు. నీటిబిందువు కాలుచున్న యినుపకమ్మి పైబడినచో నామరూపములు లేక నశించును. ఆ జలబిందువే లేతతామరాకుపైని పడినచో ముత్యమువలె ప్రకాశించును. ఆ జలబిందువే ముత్తెపుచిప్పలో బడినచో ముత్యమై ప్రకాశించును. కావున సాంగత్యము మంచిది కావలెను.

19. అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం **Continuity in the knowledge of the self.** నిరంతరమును ఆధ్యాత్మిక భావమునే గలిగి యుండవలెను. ఏమరు పాటుగా నున్నచో మాయ తటాలున వచ్చి ఆవరించును కనుక సర్వకాలము లందును దైవచింతన మవసరము (**Continuous Divine Consciousness**, ఈవిషయమును గూర్చి లోగడ శీర్షికలో వివరించియే యున్నాము.

20 తత్త్వజ్ఞానార్థ దర్శనము **Perception of the end of the knowledge.** ఇయ్యది జ్ఞానసాధనములలో ఆఖరున చెప్పబడిన సాధన. అమానిత్వముతో ప్రారంభించిన ఈ జ్ఞాన విభాగము తత్త్వజ్ఞానార్థ దర్శనములో ముగియుచున్నది జ్ఞానసాధనయొక్క పరమలక్ష్యము మోక్షమే యని సాధకుడు గుర్తించవలెను.

కీర్తి కొరకుగాదు. సిద్ధులను బొందుట కొరకుగాదు, ప్రతిష్ఠ కొరకుగాదు, ప్రాపంచిక వస్తు ప్రాప్తి కొరకుగాదు, ఆత్మ సాక్షాత్కారమే లక్ష్యముగా సాధకుడు కృషి చేయవలయు నని గీతాచార్యుడు హెచ్చరించుచు ఈ జ్ఞాన విభాగమును ముగించుచున్నాడు.

— • • —

## 96. మిక్కిలి దూరస్థుడు, సన్నిహితుడు భగవానుడేగదా,

**God is very far and ve y near**

శా॥ 'నీపద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరంబనిచేయు హస్తయుగముల్ నీమూర్తిపై చూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై చిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా'

నిజమైన భక్తుడు భగవానుని కోరుకొను విధాన మిదియే! బయట నున్న చేప నీటి కొరకు తహతహ లాడునట్లు, నీటిలో ముంచబడిన వ్యక్తి ఊపిరి పీల్చుకొరకు ఆరాటపడునట్లు, పతివ్రత యగు స్త్రీ భర్తను వాంఛించునట్లు, నదీప్రవాహము సాగరుని చేరుకొంకు పరితపించునట్లు తల్లి స్తన్యము కొరకు పసిబిడ్డ యేడ్చునట్లు, లేగ దూడ తన తల్లికొర కెదురు చూచునట్లు, నిజమైన భక్తుడు భగవంతుని కొరకు పరితపించును, ఆరాటపడును, విరహ వేదన ననుభవించును. భక్తునకు భగవంతు డెప్పుడును సన్నిహితుడే. నీ భక్తిలోని తీవ్రతను బట్టియే భగవంతుని పరమాశ్రయము నీకు లభించును.

కురుక్షేత్ర యుద్ధానంతరము పాండవులు రాజ్యపరిపాలనము చేయుచు సుఖులై యున్న సమయములో ఒకనాడు ద్రౌపది కృష్ణుని గాంచి యిట్లు పలికెను. 'కృష్ణా నీకు ఆర్తత్రాణ పరాయణు డని బిరుదు కలదు. కాని నీవు భక్తుల నేడ్పించి యేడ్పించిగాని సహా

యము చేయవుకదా. భక్తుల యేడ్పులను చూచుట నీకు ఆనందమా? నేను ఆనాడు కౌరవ సభలో ఘోరమగు ఆపదలో నుంటిని గదా. దుష్టుడగు దుశ్శాసనుడు నావలువలను లాగుచుండెను గదా...భీష్మ, ద్రోణాదు లుండియు నా మొర విన రైరి. నాభర్తలు ధర్మ బద్ధులై చేయునదిలేక పడియుండిరి. నేను కన్నీరు కార్చుచు నీకొరకు పరితపించి నపిదపగాని నీవు రక్షణకు రాలేదుగదా. నీ వెందుల కంత ఆలస్యము చేసితివి కృష్ణా. నీ ఆలస్యాగమనమునకు నే నెంతగా వ్యథ నొందితినో గదా.

అంత కృష్ణుడు నవ్వుచు 'ద్రుపదపుత్రీ! నేను భక్తులను బాధ పెట్టవలయునని యెన్నడును కోరను. వారు ఎంత ఆర్తితో పిలిచిన అంత వేగముగా వారికడకు వత్తును. నీ వస్త్రాపహరణ సందర్భమున ఆకౌరవసభలో నీవు నన్నేమని పిలిచితివో జ్ఞాపకమున్నదా?'ఓకృష్ణా! ద్వారకా నిలయా, వచ్చి నను రక్షింపుము,' అని గదా నీ ప్రార్థన. నీ ప్రార్థనకు తగినట్లుగానే నేను వచ్చినాను. నేను ద్వారకలో నున్న వాడ నని కదా నీ తలంపు. ద్వారక హస్తినాపురమునకు చాలదూర మున్నది గదా! నీపిలుపు వినగానే వేగముగానే పరుగెత్తి వచ్చితిని. ఎంత వేగముగా వచ్చినను ద్వారకనుండి రావలయును గదా మరి, అందుచే కొంచె మాలస్య మయినది.

నేను ద్వారకలో నుంటి ననియే నీవు అప్పుడు భావించితివి. నేను సర్వాంతర్యామి నను భావము నీకప్పుడు లేదు. ప్రతిచోటను నేనుంటినిగదా. నీ హృదయములోనే నేనున్నాను. హృదయ గతుడ వైన శ్రీకృష్ణా యని పిలిచినచో తత్ క్షణము హృదయములో నుండి బయటికివచ్చి నిన్ను కాపాడియుందును గదా ? నీవు దూర ముగా నున్న ద్వారకా వాసునిగా భావించి పిలుచుటచే నా రాక ఆలస్యమయినది...అది నీ పిలుపులో నున్న లోప మేగాని నా ఆర్త

పరాయణత్వములో ఆలస్య మెన్నడును లేదు' అని పలికెను. సారాంశ మిది. భగవానుడు భక్తుని కెప్పుడును దగ్గరగానే యున్నాడు. భక్తి హీనున కాతడు మిక్కిలి దూరుడు. 'హృద్దేశే అర్జున తిష్ఠతి' అని గీతాచార్యుడు పలుకును.

ఒక రాజుగారి ఆస్థానములో ఒక పౌరాణికుడు పోతనామాత్యుని భాగవతములో గజేంద్రమోక్షణ కథను చెప్పుచుండెను. 'వైకుంఠపురములో, అంతఃపురములో, మృదుపుష్ప పర్యంకమున రమా వినోదియగు శ్రీ మహావిష్ణువు గజరాజు మొర విని, లక్ష్మితో చెప్పక, పరివారమును జీరక, గజరాజ రక్షణార్థము పోవుచుండెను' అని కథాక్రమమును చెప్పుచుండెను. అప్పుడు పురాణమును వినుచున్న రాజుగారు 'ఏమండీ శాస్త్రిగారూ వైకుంఠము ఎంతదూరములో నున్నది?' అని ప్రశ్నించిరి. శాస్త్రిగారు జవాబు చెప్పలేకపోయిరి. ఎంతదూరమున్నదో ఎవ రూహింపగలరు? అంత రాజుగారికి విసనకర్రతో వీజనము చేయుచున్న చాకలివాడు 'బాబూ ఎంతో దూరముండదండి. ఆగజరాజు కేక వేస్తే వినబడేటంత దూరములో నున్నదండి వైకుంఠపురము. ఆ కేక వినియే కదా మహావిష్ణువు బయలుదేరి వచ్చాడు.' అన్నాడు.

'చదువుకొన్న వాడికంటె చాకలివాడు మెరుగు' అన్నాడు రాజుగారు.

వాస్తవ మిది. నీ ఆర్తిలోనున్న వేదనాబలమే భగవానుని క్షణములో సాక్షాత్కరింప చేస్తుంది.

'దూరస్థం చాంతికే స్థితం' భగవంతుడు దూరముగానున్నాడు. మరియును ఆయన సమీపముననే యున్నాడు' అని గీత చెప్పుచున్నది.

అశ్వత్థామ 'అపాండవ మగుగాక' అని మహాస్త్రము ప్రయోగించినాడు. ఆభయంకరాస్త్ర జ్వాల ఉత్తర గర్భములో ప్రవేశించి శిశువును చంపివేయసాగెను. ఆగర్భ వేదనను ఉత్తర భరింపజాలదయ్యెను. ఆమె శ్రీకృష్ణభగవానుని నిట్లు ప్రార్థించినది. ఆ ప్రార్థనలోని ఆర్తిని, భగవద్విశ్వాసమును గమనింపుము.

శా॥ రాడా చూడ సమస్త భూతములలో రాజిల్లు వాడిచ్చటన్
లేడా! బాలుని చిచ్చురంబురికి తా హేలాగతిం బ్రోచి నా
కీడా నేడభయ ప్రదాన మిత డూహింపం భయత్రాత ము
న్నాడా! యెందరిఁ బ్రోవడీ యెడల! మద్భాగ్యంబు దానెట్టిదో.

సకలభూత జాలములలోను విరాజమానుడై యున్న పరమేశ్వరుడు నాగర్భములోపల గూడ వెలుంగుచునే యున్నాడు. నాకా ప్రభువు తప్పక అభయ ప్రదాన మిచ్చును. ఆయన ఆర్తత్రాణ పరాయణుడు అని దేవదేవుని ప్రార్థించుసరికి శ్రీకృష్ణుడామె గర్భమునందలి బాధను పోగొట్టి పరీక్షితుని రక్షించినాడు. భగవంతు డెప్పుడు నీకు తోడుగనే యున్నాడు. ఆయనకొరకు నీ వెచ్చటకును పోనక్కరలేదు. నీడవలె నిన్నాయన వెన్నంటియే యున్నాడు. శబ్దమును అర్థమువలె - సూర్యుని కిరణము వలె, చంద్రుని చంద్రిక వలె, భగవానుడు నిన్ననుసరించియే యున్నాడు. ప్రేమతో పిలువుము; ఆయన నీతో పలుకును. ఆర్తితో అడుగుము, ఆయన నీకు సకలార్థములను వర్షింప జేయును.

భగవానుడు కల్పవృక్షము, కామధేనువు, చింతామణియునై యున్నాడు. నీ హృదయక్షేత్రములో కల్పవృక్ష ముండగా నితరులను యాచింతువేల? నీ పెరటిలో కామధేను వుండగా పరులను యాచింతువేల? నీ పడకగదిలో చింతామణి యుండగా గాజుముక్కల కొరకు పరుగెత్తెదవేల?

ప్రార్థన యనగా పాటలుపాడుటగాదు; తాళములతో, మృదంగములతో ధ్వని చేయుటగాదు, గట్టిగా అరచుటగాదు, భగవంతునకు బధిరము లేదు. అంతటను ఆయన శ్రోత్రేంద్రియములే కలవు సుమా! ప్రార్థన హృదయగతమైనది. ఆర్తి దానికి ప్రాణము. శరణాగతి దానికి శక్తి. కన్నీటిలో దేవదేవుని పాదములు తడుపుము. మానవుని పరమేశ్వరునిలో కలుపు వంతెన వంటిది ప్రార్థనము.

అట్టి ప్రార్థనమునే భగవాను డాలకించును. నీవెచ్చట నున్నను, ఎట్టి గహనాంతర సీమలలో నున్నను, మహాపర్వతముల క్రింద త్రొక్కబడుచున్నను, ఎట్టి దుర్భర కష్టసాగర కల్లోల తరంగములలో కొట్టుకొని పోవుచున్నను ఆయన వచ్చి నిన్నాదరించును. ఆలింగనము చేసికొనును, ఆశీర్వదించును.

ఆ భగవానుని అనంతశక్తి విశేషములను గూర్చిన యధ్యాయములో వ్యాసదేవు డిట్లు చిత్రించెను. ఈ వర్ణన మెంత మనోహరమైనది.

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం
సర్వత శ్రుతి మల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి
సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ
బహి రంతశ్చ భూతానా మ చరం చరమేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థంచాంతి కే చ తత్.

ఆ పరాత్పరుని పాదములు అంతటను గలవు. ఆయన పవిత్ర హస్తము లెల్లెడలను వ్యాపించి యున్నవి.

ఆ పరమేశ్వరుని నేత్రములు విశ్వమంతయు వెలుగుచున్నవి. ఆయన శిరస్సులు, ముఖములు సర్వప్రదేశము లందును విలసిల్లును. ఆ జగత్ప్రభువుయొక్క శ్రవణేంద్రియము లన్నియు నాకర్ణించును. ఆ లోకేశ్వరుం డంతటను వ్యాపించి యున్నాడు. ఏ యింద్రియములును లేకున్నను, సర్వేంద్రియ శక్తి ప్రదాత యీయన. ఇంద్రియాతీతుడా జగన్నాటక సూత్రధారి.

అత డసక్తు డయ్యును సర్వమును ధరించును.నిర్గుణు డయ్యును గుణభోక్త ఆ పవిత్రమూర్తి సకల భూతములకును వెలుపలను లోపలనుగూడ ప్రకాశించును. ఆ పరమేష్ఠి అచరుడను చరుడును గూడ నై యున్నాడు. ఆ విశ్వమూర్తి మహాసూక్ష్మత్వము వలననే తెలియబడును. ఆయన భక్తులకు దగ్గరగా గోచరించును. అభక్తులకు దూరముగా నుండును.

అట్టి దయానిధి యగు శ్రీకృష్ణ ప్రభువు మనలను గాపాడు గాత !



# గీతా కల్పవృక్షము

పదునాలుగవ అధ్యాయము - గుణత్రయ విభాగయోగము

## 97. జ్ఞానములలో నెల్ల నుత్తమ జ్ఞాన మిది

**The supreme knowledge.**

'శంపాలతికతోడ జలదంబుకైవడి, మెఱుఁగు టొల్లియతోడి మేను వాని
కమనీయమృదులాన్నకబళ నేత్రవిషణ్ణ, వేణు చిహ్నంబుల వెలయువాని
గుంజవినిర్మిత కుండలంబుల వాని, శిఖిపింఛ శేఖరిత శిరమువాని
వనపుష్పమాలికా వ్రాత కంఠమువాని, నయనకోమల చరణములవాని
గరుణ గడలుకొనిన కడకంటి వానిని, గోపబాలు భంగి గుదురువాని,
నగు మొగంబు వాని ననుగన్న తండ్రిని, నినుభజింతు మ్రొక్కి నీరజాక్ష'

అని బ్రహ్మదేవుడు గోపాలబాల కృష్ణుని స్తవము చేసిన ఘట్టము భాగవతములో మనకు రమ్యముగా గోచరిస్తుంది. బ్రహ్మదేవుడు అహంకారముచేత జ్ఞానశూన్యుడై మోసగింపబడి, తుదకు కృష్ణలీలా విశేషమును గ్రహించి, అహంకారమును విడిచి, భగవంతునికి పాదాక్రాంతుడైనాడు. మహా బుద్ధిమంతులను గూడ త్రిగుణాత్మకమైన మాయ కట్టివేస్తుంది. ఈ అధ్యాయంలో గీతాచార్యుడు త్రిగుణాత్మకమైన ఈ ప్రకృతిని జయించి, పరతత్వాన్ని సాధించే విధానమును తెలియచేసినాడు. గత అధ్యాయంలో క్షేత్రక్షేత్రజ్ఞులను విభాగము చేసి చూపినట్లే ఈ అధ్యాయములో గుణత్రయమునుండి ఆత్మను వేరుచేసి చూపుచున్నాడు. ఇది ఉత్తమోత్తమ మగు మహా జ్ఞాన సారమని భగవానుడు పలుకును. 'జ్ఞానానాం జ్ఞాన ముత్తమం.' ఈ జ్ఞానము వల్లనే మునీశ్వరు లందరును సిద్ధి పొందినారు. స్వయం ప్రకాశమయిన ఆత్మను సత్వరజస్తమో గుణములతో గూడిన

మాయ లేక ప్రకృతి బంధించుచున్నది. వీనినుండి విడువ బడుటయే మోక్షము. ఈమూడు గుణములను జయించిన వాడే త్రిగుణాతీతుడు. ఈ మూడు గుణములును మనకు మహాశత్రువులు. ఈ శత్రువులను మనము జయించవలెను. ముగ్గురను ఏకపర్యాయము జయించుట కష్టమందువా, ఒక్కొక్కరినే జయించుము. శత్రువును నిర్జించవల యునన్న వాని లక్షణములను, బలాబలములను మనము గ్రహించి నప్పుడే వానిని సులభముగా జయింపవచ్చును.

అందులకై పరమేశ్వరుడు తమోగుణము, రజోగుణము - సత్త్వగుణము - వీని లక్షణములను సంప్రదాయములను - వీని దుష్ట శక్తి ప్రాబల్యములను ముందుగాజెప్పి, వీనిని క్రమపద్ధతిలో జయించు విధానమును గూడ గానము చేసినాడు.

—...—

## 98. తమోగుణములక్షణము-దానిని జయించువిధానము.

జీవుని బంధించే మూడు గుణాలలోను మిక్కిలి నికృష్టమైనది- నీచమైనది - పాపహేతు వయినది - తమోగుణము. ప్రపంచములో కోట్లకొలది స్త్రీ పురుషుల నిది ఆవహించియున్నది - పండితులు, పామరులు, ధనవంతులు, ధనహీనులు, స్త్రీలు, పురుషులు అను భేద ములేక విశేషజనులు ఈ తమోగుణ మహారాక్షసికి వశులైయు న్నారు. ఇదిమోక్షానికి ప్రతిబంధకము. 'ఈ తమోగుణము మాన వుని లోతైన అజ్ఞాన సాగరంలో ముంచివేయును. దీని లక్షణములు మూడు. సోమరితనము, అతినిద్ర, మరుపు ఈలక్షణము లెవరియం యందుండగలవో వారు తమోగుణజీవులని చెప్పవచ్చును. ఇట్టివారికి తరణోపాయము లేదు. కత్తిని ఒకచోట పారవేసిన చో త్రుప్పుపట్టి నట్లు, సోమరితనము జీవుని సర్వభ్రష్టునిగా చేయును. ఆలస్యము దారిద్ర్య చిహ్నము. చురుకుతనము లక్ష్మీప్రదము.

నామిత్రుడొకడుండెను. 'నాయనా ఏడుగంటలైనది. లెమ్ము ముఖము కడుగుకొనుము. కాఫీ చల్లారి పోవుచున్నది' అని తల్లి ఆతనిని మేల్కొల్పును. 'ఉండవే బద్ధకంగా వుంది' అని దుప్పటిని బిగతన్ని పరుండును. 'నాయనా భోజనమునకు రమ్ము' అని తల్లి కేకవేయును. 'వస్తానులే' అని పడకకుర్చీలో కళ్ళు నలుపుకొంటూ పరుండును. 'నాయనా బజారునకు వెళ్ళి కూరలు తెమ్ము' అని తల్లి పలుకును. ఇప్పుడేమి కూరలు' అన విసిగికొని మంచమెక్కును. నాయనా రైలునకు సమయమైనది. త్వరగా బయలుదేరుము' అని తల్లి తొందర పెట్టును. 'ఇదిగోనమ్మా బయలుదేరుతున్నా' అనును కాని కదలడు. తానులేచి బయలుదేరు సరికి రైలు పదమ్మెళ్లు పరుగెత్తును. ప్రతివిషయములోను సోమరితనమే. సామాన్య గృహములలోకంటె పనిపాటులు లేని శ్రీమంతుల యిండ్లలోనే యీ సోమరితనము పిశాచము విశేషముగా గోచరించును. శరీర వ్యాయామమే దీనికి విరుగుడు. సోమరితనమును నిర్జించేది శరీరపరిశ్రమ.

'Idlenes's mind is the devils work shop'. సోమరివాని మనస్సు సైతానుయొక్క కర్మాగారము అని ఒక ఆంగ్ల కవి పలుకును. కావున నిరంతరమును శరీరపరిశ్రమ సోమరితనమును పోగొట్టును.

తమోగుణపు ద్వితీయలక్షణము 'అతినిద్ర. నిద్రాదేవత నిన్ను వరించెగదరా నిర్భాగ్య దామోదరా' అని ఒక కవి ఒక నిద్రపోతు మనుష్యునిజూచి హేళనగా పలికినాడు. దరిద్రునకు నిద్రయెక్కువ' అని తెలుగుభాషలో ఒకసామెత కలదు.

వాస్తవముగా నిద్ర శరీరారోగ్యమునకు అవసరమే. అయితే అది తగుమాత్రము గానే యుండవలయును.

'ఎంతకాలము పరుంటివి?' అన్నది కాదు సమస్య. 'ఎంత గాఢ నిద్ర పోతివి' అనునదియే ముఖ్యవిషయము. కొందరకు నిద్రలో పల

వరింతలు - కేకలు - దుస్వప్నములు కలుగు చుండును. ఇట్టి నిద్ర ఎన్నిగంటలున్న ఏమి ప్రయోజనము. సాధారణముగా మనుష్యునకు ఆరు గంటల నిద్రచాలును. ఆ గాఢమగు నిద్ర ఆతని శరీరమును, మనస్సును శక్తివంతముగా చేయును.

'Early to rise and early to sleep makes a man healthy wealthy and wi•e.' పెందలకడ లేచుట, పెందలకడనే నిద్రించుట మానవుని ఆరోగ్యవంతునిగను, ధనవంతునిగను చేయును. అనుసామెత ఇంగ్లీషులో చాలాప్రసిద్ధమైనది. మితిమగు నిద్రనుగూర్చి ఆరవ అధ్యాయమే తెలియ పలికినది.

సూర్యోదయానంతరము మేల్కాను వారందరును తమో గుణముచే బంధితులే. మితము మీరి భుజించిన వానికి నిద్రయెక్కువ. కావున నిద్రాదేవతను జయించుటకు ఆహార నియమముతోబాటు శారీరక శ్రమకూడ చాల అవసరము.

తమోగుణముయొక్క మూడవ లక్షణము 'మరుపు'

'అబ్బాయీ, నేను చెప్పిన పనిని చేసితీవా' అని తండ్రి అడుగును. 'లేదండి - మరచిపోయినాను' అని కుమారుడు జవాబు చెప్పును.

'మంచినీళ్ళు కాచిపెట్టితివా' అని భర్త భార్యను ప్రశ్నించును. 'అయ్యో మరచిపోయినానండి' అని ఆమె నొచ్చుకొనును.

'కూరలో ఉప్పువేయలేదా' అని బాలుడు తల్లి నడుగును. 'అయ్యో మరచిపోయినాను కాబోలురా, నా బుద్ధికాల, అని ఆమె బాధపడును.

ఈమఱపులు, పొరబాట్లు, తప్పిదములు, ఇవన్నియు తమో గుణలక్షణములు. వివిధరూపములలో తమోగుణ పిశాచము మానవునిలో ప్రవేశించగలదు కావున జాగరూకత అవసరము.

## 99. రజోగుణ విజయోపాయము

The method to conqurer Rajas

'రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవం'

అని గీత పలుకును. తమోగుణము కన్న రజోగుణము కొంచెము మెరుగైనను మహా భయంకరమగు రాగముతో గూడి మానవుని పతనము చేయును. 'నేనిప్పుడీపనిని చేయవలెను. రేపు గోదావరీ ప్రవాహమును మరలించి మరియొక వైపుగా త్రిప్పవలెను. కృష్ణానదిని విశాఖపట్టణ మధ్యభాగమున ప్రవహింపచేయవలయును. ఇట్టి వింత ఆలోచనలతోను కార్యక్రమములతోను ఎడతెరపిలేక కొట్టుకొనుచుండును. ఇట్టి వానికి చిత్తశాంతి యుండదు. ఒక కార్యము నాచరించి ఫలితమునకై యెదురు చూచును. ఫలితము వెంటనే రానిచో విసుగుచెందును, దుఃఖించును, మరొక కార్యక్రమమును తలపెట్టును. అతని భావములు చంచలములు, చేష్టలు చంచలములు, ఆలోచనలు క్షణక్షణములు. దీనికి విరుగుడు స్వధర్మాచరణము. గీతలో చెప్పబడినది. ఎన్ని కష్టములు వచ్చినను, ఎన్ని బాధలు పైబడినను స్వధర్మాచరణము నాచరించువాడు శ్రేష్ఠుడు. అతడు కర్మఫలమును కోరడు. ఆసక్తితో నాతడు కర్మ నాచరింపడు. స్వధర్మమగు కర్తవ్యమునే ఆత డాచరించును. స్వధర్మము చిత్తశుద్ధికి హేతు వగును. చిత్తశుద్ధికి సాధనముగాని కర్మలు కోట్లకొలది చేసినను నిష్ప్రయోజనము. అట్టిది కర్మయోగ మనిపించుకొనదు. కర్మయోగముచే చిత్త మేకాగ్రత నొందును. మనస్సుయొక్క చంచల స్వభావము నశించును. దీనితో రజోగుణము నిగ్రహింపబడిన ట్లగుచున్నది.

---

## 100. సత్త్వ గుణమును గూడ నిగ్రహింపుము.

ఇనుప సంకెళ్ళయినను బంగారు సంకెళ్ళయినను ఒక్కటే, రెండును చేతులను బంధించుననియే కదా. తామసిక రాజసికములు

ఇనుపసంకెళ్ళయిన, సత్త్వగుణము బంగారు బంధనము. కావున దీనిని కూడ విసర్జింపవలయును. సత్త్వగుణము జ్ఞానదాయకమయినది. మంచి చెడ్డలను నిర్ణయించునది. సుఖప్రదమైనది. సాత్త్వికుడు శాస్త్ర బోధితములగు యజ్ఞ దాన తపాది పుణ్యకర్మ లాచరించును. దాని వలన వానికి అపారములగు నిహపర సుఖభోగములు సిద్ధించును. ఇట్టి సుఖభోగముల వలన నొక మహాప్రమాద మున్నది. 'నేను సాత్త్వికుడను' 'నేను పుణ్యకర్మలను చేయుచున్నాను' అను అహంకారము పెరుగుప్రమాద మిందు గలదు. కావున దీనినిగూడ వర్జింపు మని గీత పలుకును. ఫలత్యాగము దీనికి విరుగుడు. సర్వకర్మ ఫలత్యాగమును గూర్చి లోగడ అధ్యాయములందు వివరింపబడియే యున్నది. తమోగుణము నికృష్టమైనదిగనుక, ముందుగా దానిని జయించును. తరువాత రజోగుణమును జయించుము. సత్త్వగుణము మిగుల శ్రేష్ఠమైనది. దీనిని అలవరచుకొమ్ము-సత్త్వము వలన కలగిన జ్ఞానముచే పుణ్య కర్మల నాచరించుము. తరువాత సత్త్వగుణ పాశమును గూడ భేదించుము. ఫలత్యాగ మే దీనికి సాధనము.

ఈ త్రిగుణములనుండి విడువబడిన జీవుడు జన్మమృత్యు జరా బంధనములనుండి విడువబడి పరమ కళ్యాణమును బొందు నని గీత పలుకును.

---

## 101. త్రిగుణముల ప్రాబల్యము - మూడు ఉదాహరణములు

'ఎన్నడునైన యోగివిభు లెవ్వనిపాద పరాగ మింతయున్
గన్నులగాన రట్టి హరి కౌగిట జేర్చుచు జెట్టపట్టుచున్
దన్నుచు గ్రుద్దుచున్ నగుచు తద్దయుపై బడి కూడియాడుచున్
మిన్నన సేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పు నే.

'తపస్సు గావించిన మహాయోగీశ్వరులు గూడ ఏ పరమే శ్వరుని పాదధూళిని గూడ చూడలేరో - అట్టిపరంజ్యోతి స్వరూపు డైన శ్రీకృష్ణునిఆలింగనము చేసికొనుచు-ఆయనతో నవ్వుచు-వివిధ ములగు నాటపాడలాడుచు గ్రుద్దుకొనుచు కేళీ విలాసములతో విహ రించు భాగ్యమా గొల్లపిల్లవాండ్ర కబ్బినది. వారెంతటి ధర్మాత్ములో గదా' అని శ్రీశుకుడు భాగవతములో పలుకుచున్నాడు. పరమేశ్వ రుని యందు అపారమగు భక్తి తాత్పర్యములు గలవారలకే పరమే శ్వరుని దర్శనభాషణ క్రీడ నాది భాగ్యము లబ్బును. త్రిగుణములను జయించుటకు భక్తి సాధనమని గీత తెలుపును. ఈత్రిగుణములను గూర్చి శ్రీరామకృష్ణ పరమహంసచెప్పిన యుపమానములను మనవి చేసెదను.

ఒకనాడు మూడు బొమ్మలు సముద్రస్నానమునకు పోయి నవి. అందొకటి రాతిబొమ్మ, రెండవదిగుడ్డతో చేయబడినది. మూడ దివ పంచదార బొమ్మ. ఆ మూడును సాగరములో మునిగినవి. రాతిబొమ్మ ఎట్టిమార్పును బొందక మొద్దువలె అట్లే యున్నది. ఇది తమోగుణ జీవిత చిహ్నము. గుడ్డబొమ్మ బాగుగా తడిసి బరువైనది. మొదటిదానికన్న దీనియందు జలము ప్రవేశించినది. ఇది రజోగుణ జీవిత చిహ్నము. పంచదార బొమ్మ రూపురేఖలు లేక పూర్తిగా జలములలో కలసిపోయినది. ఇది సత్త్వగుణ చిహ్నము.

మూడు క్రొవ్వొత్తులను వెలిగించి అందొక దానిపై కుండను బోర్లించితిని. రెండవదానిపై చిల్లులతో నున్న గంపను బోర్లించితిని. మొదటిది కాంతిని చూపించదు. ఇది తమోగుణమున కుపమానము. రెండవదానిలో గంపలోని సందులనుండి మినుకు మినుకుమని దీపపు కాంతి కనుపించును. ఇది రజోగుణ చిహ్నము. మూడవదానిలో చక్కని కాంతి ప్రకాశించును. ఇది సత్త్వగుణ లక్షణము.

ఒక ప్రయాణీకుడు నెత్తిపై ధనపుమూటను పెట్టుకొని అడవి మార్గమున ప్రయాణము చేయుచుండెను. ముగ్గురు దొంగలు ఆ యరణ్యమార్గమున నాతని పట్టుకొనిరి. మొదటివాడా బాటసారిని కత్తితో చంపివేసి ఆ ధనము నపహరింత మని చెప్పెను. రెండవవాడు ఆతనిని చంపుట యెందులకు? ఈ చెట్టున కాతనిని గట్టిగా కట్టివేసి ఆధనము నపహరింత మని అనెను. మూడవవా డిట్లనెను. 'అతనిని చంపిన మన కేమి వచ్చును. చెట్టునకు కట్టివేసినచో కలుగులాభ మేమి? మనకు కావలసిది ధనము గావున దానిని లాగికొని ఈతనిని పొమ్మందము' అనెను.

ఇందు మొదటి దొంగ తమోగుణము. రెండవదొంగ రజోగుణము. మూడవదొంగ సత్త్వగుణము. సారాంశ మిది. ఈ మూడు గుణములును ఒక దానికంటె నొకటి మంచివిగానే కనుపించినను ఈ మూడిటిని నిర్జించవలెను.

## 102. పద్మ పురాణములో నుండి ఒక కథ.

### A story from Padma Puranam.

భగవద్గీత రత్నాలమూట - జ్ఞాన పుష్పాల హారము. వ్యాస భగవానుడు సర్వశాస్త్ర సకలవేదసార భూతముగా దీనిని రచించి నాడు. భగవద్గీతకును భాగవతమునకును అవినా భావ సంబంధము మున్నది. అట్లే తదితర పురాణములకు కూడ, గీతలో చెప్పబడిన జ్ఞానసూత్రములకు భాగవతము వ్యాఖ్యానము. సూక్ష్మరూపములో చెప్పబడిన గీతా సూక్తులకు చక్కని యుదాహరణములతో - కథా చిత్రములతో ఉదాహరణములుగా ననేక కథలు - గాథలు భాగవతములో గలవు. భాగవతము భగవద్గీతకు సంపూర్ణమగు వ్యాఖ్యాన మని నా భావము. శంకర, రామానుజ, మధ్వాచార్యాది మహా పురుషులును, తిలక్, భావే మున్నగు తదితర వ్యాఖ్యాతలును ఏదో

యొక్క దృష్టితోనే గీతలకు భాష్యమును వ్రాసిరి. వారి దృష్టి కోణము లన్నియును యథార్థము లే. ఇందెవ్వరినిగూడ కాదన లేము. కాని భాగవతము పాక్షికదృష్టితో గాక సంపూర్ణముగా గీతాహృదయమును ప్రతిఫలింప జేసినది. రెండును వ్యాసదేవుని రచన లే. ఒకటి సంగ్రహము, వేరొకటి విస్తారము.

నేను గీతలను గురించి చెప్పునపుడుగాని, వ్రాయునపుడు గాని సాధారణముగా భారతములో సమన్వయించి చెప్పుచుందును ఇప్పుడు పద్మపురాణములోని ఒక చక్కని కథను వివరింతును.

కురుక్షేత్రంలో సత్యకేతుడనే బ్రాహ్మణు డుండేవాడు. గీతలో చెప్పిన బ్రాహ్మణ ధర్మాలన్నీ ఆయనలో మూర్తీభవించి యున్నవి. నిత్యమును స్నానసంధ్యావందనాది అనుష్ఠానాలు—పంచమహా యజ్ఞములును చేస్తూ, మూర్తీభవించిన ధర్మదేవతవలె గానుపించును.

ఒకనాటి సాయంకాలం, బావివద్ద స్నానంచేసి తన గృహంలో జపము చేసుకొను చుండెను. . .ఎక్కడనుండియో ఒక కుక్కవచ్చి ఆ బావివద్ద నిలిచియున్న నీటిని త్రావి ఆనీటి తావులో పరుండెను. ఆ యింటి నౌకరు ఒక రాతిముక్కను ఆ శునకముపై గిరాటువేసెను. ఆ దెబ్బ ఎచ్చట తగిలినదోగాని పాప మాకుక్క బిగ్గరగా అరచుచు ప్రాణము వదలెను.

ఆయార్త ధ్వనిని విని లోపనున్న బ్రాహ్మణుడు బయటకు వచ్చెను. పరమాశ్చర్యము. అచ్చట దివ్యతేజస్సుతో ప్రకాశించు నొక మహాపురుషుడు ప్రత్యక్షమయ్యెను. 'ఎవరు నీవు?' అని ప్రశ్నించి నాడు బ్రాహ్మణుడు.

బ్రాహ్మణున కాపురుషుడు నమస్కరించి 'మహానుభావా! నాకు గల పూర్వజన్మ స్మృతినిబట్టి నా వృత్తాంతమును తమకు నివేదించుచున్నాను.

నేను జంబూద్వీపాన్ని పాలించే సార్వభౌముణ్ణి. నియత సత్య వ్రతుణ్ణి. ధర్మపాలనమే నా ఆశయం. దానధర్మాలు చేస్తూ పుణ్య క్రతువుల నాచరించేవాణ్ణి. ఒకనాటిరాత్రి మారువేషాన్ని ధరించి ప్రజాక్షేమాన్ని తెలుసుకొనే నిమిత్తం నగరవీథులలో తిరుగుతు న్నాను. రాజమార్గాలను విడిచిసందుల గొందుల వెంబడి తిరుగుతు న్నాను. మనుష్యసంచారంలేదు. అర్ధరాత్రి. ఆ రాత్రిసమయంలో– ఆ ఏకాంత నిర్జనప్రదేశంలో మెఱపుతీగవలె నొక యువతీమణి నా కంటబడినది. ఆమె ఉన్నతమైన వక్షోజాలు – దొండపండువంటి పెద వులు, నిలువుటద్దాలను ధిక్కరించే ఆమె చెక్కిళ్లు – ఆవిశాల సుం దర నేత్రాలు – నన్ను పులకింపచేసినవి. ఆ యౌవనాంగితో సాంగ త్యాన్ని నామనసు వాంఛించినది. నేనామెను అడ్డగించితిని. ఆమె నిలిచిపోయినది. సిగ్గుబిడియములను విడిచి – అధర్మమని భావింపక నానీచపు వాంఛను ఆమె కెరిగించితిని. ఆసాధ్వీమతల్లి నాకు ధర్మోప దేశము చేసి నాకోర్కను నిరాకరించినది. కామాతురనకు ధర్మ భయ ముండదుగదా. నే నహంకరించి 'నే నీదేశము నేలు సార్వభౌ ముణ్ణి, నాకోర్క తీర్చవలసినదే' అని పలికితిని. పాపమా యువతి ఆపాదమస్తకము కంపించిపోయినది. నోటమాట లేకపోయినది. మౌన మంగీకారముగా నేను భావించి,బలాత్కారముగా నే నామెతో క్రీడిం చితిని. నావాంఛపూర్తి యయిన పిదప నేనామెను వీడి ముందునకు సాగితిని.

నేను రెండు గజము లేగుసరికి 'ఓ రాజా! ఎంతపనిచేసితివి?' అను స్త్రీకంఠధ్వని వినిపించినది. నేను తటాలున వెనుదిరిగి ఆ స్త్రీని సమీపించి చూచితినిగదా – ఆ సాధ్వీమతల్లి చనిపోయి పడియున్నది. నేను భయముచే కంపించి పోయితిని.

ఓ బ్రాహ్మణోత్తమా! తర్వాతవృత్తాంత మేమని చెప్పగలను? అత్యుత్కటమైన పాపపుణ్యాలు వెంటనే ఫలితాల నిచ్చునుగదా–

నాపాపఫలితముగా నారాజ్యమంతయు స్వల్పకాలములోనే శత్రువుల వశమయినది. దారాపుత్రులతో అరణ్యాలలో తిరుగసాగితిని. నేను పడిన నరకబాధలు వర్ణింప జాలను. నేను మరణించి చాతకపక్షి జన్మ మెత్తితిని. ఆ జన్మయనంతరము నేనే శునక జన్మమెత్తితిని. నీవుస్నాన ముచేసిన పవిత్రోదకమును త్రాగితిని. నా సకలపాపములును నశించి నవి. నీ నౌకరు దెబ్బచే ఆ శునకదేహమును వీడి సకల పాపరహితు డనై ఈ పుణ్యదేహమును దాల్చితిని. అదిగో విమానము వచ్చు చున్నది. ఆ దివ్యవిమానము నెక్కిపోవుటకు అనుజ్ఞనిమ్ము' అని పలికి ఆవిప్రునకు నమస్కరించెను.

ఈకథాసారాంశ మెంత మనోహరమైనది; నీతిదాయక మయి నది. ఎంతటి ప్రతిభావంతునైనను ఇంద్రియములు మోసగించి పత నము గావించును. 'ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః' అని చెప్పెనుగదా.

ఆయింద్రియముల నన్నిటిని భగవత్పరము గావింపుము. భగవత్ ధ్యానముచేతనే ఇంద్రియ నిగ్రహము సాధ్యమని గీత పలుతావులలో చెప్పెను అవ్యభిచారమగు భక్తిచేతనే నీవు నన్ను పొందగలవు. మరియు త్రిగుణాతీత స్థితి నీకు లభ్యమగు నని ఈయధ్యాయాంతమున భగవానుడు చెప్పెను.

మరియొక ముఖ్య విషయమీ కథాఘట్టము మనకు తెలియ జెప్పెను. మహాపురుషుల సందర్శన భాగ్య మనంత ఫలప్రదము. పవిత్ర మైన విప్రుని శరీరమును సోకిన పుణ్య జలములే వ్యభిచారాది దోష ములను నిర్మూలించినపుడు వారి దర్శన సేవాభాగ్య విశేషమును గూర్చి వర్ణింప దరముకాదు. అందువలననే ఆగ్నేయపాహసనమును గూర్చి గీత పలుతావులలో చెప్పెను.

... — ...

## 103. త్రిగుణాతీతుని లక్షణములు - భక్తియే త్రిగుణాతీత స్థితికి పరమసాధనము.

'చేతోదర్పణ మార్జనం భవమహాదావాగ్ని నిర్వాపణం
శ్రేయః కైరవచంద్రికా వితరణం విద్యావధూజీవనం
ఆనందాంబుధి వర్ధనం ప్రతిపదం పూర్ణామృతా స్వాదనం
సర్వాత్మ స్నపనం పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనం.

అని మహాభక్త శిఖామణి యయిన చైతన్యుడు గానము చేసినాడు. శ్రీకృష్ణ నామస్మరణము మానసిక మాలిన్యములనుపోగొట్టును. భయంకర సంసారదావాగ్నిని చల్లార్చును. సమస్త శ్రేయములను ప్రసాదించునదా పుణ్యనామమే. రాజవిద్యయగు ఆధ్యాత్మిక విద్య నయ్యదియే పెంపొందించునది. అది మానవుని ఆనందసాగరములో నోలలాడించును. అది అమృత స్వరూపమయినది. ఎవ్వరు భక్తితో ఆ సర్వలోకేశ్వరుడైన శ్రీకృష్ణ భగవానుని ధ్యానింతురో వారు మహోన్నత పుణ్య పదవిని పొందుదురు. శ్రీకృష్ణనామ మత్యంత మధురమైనది.

'ఆర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతాః, ఘోరేషుచ వ్యాధిషు వర్తమానాః,
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం, విముక్త దుఃఖాః సుఖినో భవంతి'

ఆర్తుడవైనప్పుడు విషణ్ణుడవై యున్నప్పుడు – మహాతాప త్రయములలో చిక్కుబడియున్నప్పుడు – భయంకర వ్యాధులచే పీడింపబడుచున్నప్పుడు, ఏకాలమందైనను, ఎట్టి వాంఛతోనున్నను పవిత్రమగు 'నారాయణ' శబ్దముతో, భక్తి తాత్పర్యములతో స్మరింపుము, ధ్యానింపుము, వెంటనే ఓ భక్తుడా నీ యార్తి తొలగును. నీ విషణ్ణ హృదయము ప్రసన్నమగును. నీభయము పటాపంచలగును. నీవ్యాధులు హరించును. సమస్త దుఃఖములును తొలగును. నీ పవిత్ర

ములగు కోర్కెలన్నియును నీడేరును. సమస్త సుఖ యశస్సంపదలును నీవు కలిగితీరును.

ఓ భక్తుడా! అదిగో రామదాసు ఏమని గానము చేయుచున్నాడో వింటివా!

ఉ. పాపము లొందువేళ రణపన్నగభూత భయజ్వరాదులం
దాపద నొందువేళ, భరతాగ్రజ మిమ్ము భజించువారికిన్
ప్రాపుగ నీవు తమ్ముడిరుప్రక్కియలం జని తద్విపత్తి సం
తాపము బాపి గాతురట దాశరథీ కరుణాపయోనిధీ.

పాపక్లేశముల చేత పీడింపబడువారు-యుద్ధభయముతో కూడినవారు - విషజంతువులగు సర్పాదుల చేత, భూత ప్రేత పిశాచాదుల చేత, భయంకర జ్వరాదుల చేత బాధనొందు మానవులు, ఒక్కసారి శ్రీరామచంద్రుని పాదము లాశ్రయింపుడు, రామనామమును మనసార ధ్యానింపుడు, రామ పదాంబుజములయందు భక్తి నిలుపుడు, వెంటనే కరుణాసాగరుడైన ఆ రఘురామమూర్తి తన సోదరునితో గూడివచ్చి నీకిరువైపులను ప్రేమతో నిలిచి, నిన్నోదార్చి, నీ బాధలను మాన్పి, నీకు శ్రేయములను ప్రసాదించునుసుమా! ఓహో రాము డెంత దయామయుడు!

ఈ యధ్యాయాంతమున భగవాను డిటులే తెలుపుచున్నాడు. అర్జునా, నేను అమృత స్వరూపుడను, నాశనరహితుడను నేను, ధర్మస్వరూపుడను నేను, సర్వ సుఖములకును నిధానమను నేనే, భక్తితో నన్నాశ్రయించుము. నీవు జరామరణ రహితుడ వయ్యెదవు. త్రిగుణములను దాటిపోగలవు సుమా!

ఈ యధ్యాయములో చెప్పబడిన త్రిగుణాతీతలక్షణములు ముఖ్యముగా ప్రతిమానవుడును గమనింపతగ్గవి. రెండవఅధ్యాయములోని స్థిత ప్రజ్ఞలక్షణములతోను, 12 వ అధ్యాయములోని భక్తలక్షణములతోను నివి సమానములు. సమానములగు శబ్దములే చాలవరకు ఈ సందర్భములలో వ్యాసదేవుడు ప్రయోగించినాడు. గీతయొక్క దృష్టిలో కర్మయోగియే భక్తుడు, భక్తుడే జ్ఞాని. వీరు ముప్వురకును భేదమెంతమాత్రమును లేదు. వీరి ముప్వురి లక్షణములును, గుణములను, ప్రవర్తనములును, శీలసంపదలును ఒక్కటే.

సత్త్వరజస్తమో గుణముల ప్రభావముచే గలుగు ప్రకాశ ప్రవృత్తి మోహముల నెవ్వడు ద్వేషింపడో, కాంక్షింపడో, ఎవ్వడు కర్మఫలములను కోరడో, మానావమానములయందు సుఖదుఃఖముల యందును, శత్రు మిత్రుల యందును సమానభావమెవ్వని యందు గలదో, మట్టిబెడ్డను, బంగారమును సమానముగా తిలకించునో, ప్రియాప్రియములును, నిందాస్తుతులును ఎవరికి సమానములో అట్టిధీరుడే త్రిగుణాతీతుడు.

యోగీశ్వరుండైన శ్రీకృష్ణపరమాత్మ అట్టి పవిత్రలక్షణములను నీకు ప్రసాదించుగాక.

# గీతాకల్పవృక్షము

పదునైదవ అధ్యాయము – పురుషోత్తమ ప్రాప్తియోగము.

## 104. పరమ రహస్యమైన మహాయోగశాస్త్ర మిది

శ్లో॥ ఇదం శరీరం పరిణామ పేశలం, పతత్యవశ్యం శ్లథసంధి నిర్భరం,
కిమౌషధైః క్లిశ్యసి మూఢ దుర్మతే నారాయణంకృష్ణరసాయనం పిబ.

ఓమూఢుడా, ఈశరీరము శాశ్వతమైనది కాదుసుమా! నిరంతరమును మార్పులను చెందుచు నశించునది. ఇయ్యది పట్టుతప్పిన సంధులతో సహజముగా అతిబలహీనమైనది. నీ వెన్ని ఔషధములు తిన్నను, ఎన్ని మందులు సేవించినను నీరోగములు తగ్గవు. ఇదిగో పవిత్రమగు శ్రీకృష్ణ రసాయనము. దీనిని త్రాగుము. సర్వరోగములును నివారణము లగును. జరామరణములు నిన్నంటవు సుమా! నీవు అమరత్వమును పొందుదువు. అని మహాభక్తుడగు కులశేఖరులు శారీరక మానసిక రోగ గ్రస్తులగు మానవులను చూచి కృష్ణరసాయన మహిమను గానము చేయుచున్నాడు.

కల్యాణమూర్తియయిన దేవదేవుని అనుగ్రహములో పరమ శాస్త్రమయిన ఈపదునైదవ యధ్యాయమును ప్రారంభించుచున్నాము. ఆ కారుణ్యాసాగరునకు నమస్సులు, ఆప్రేమమూర్తికి సాష్టాంగ నమస్కారములు. నిరంతరమును గీతామధువును గ్రోలు మహాభాగ్యమును ఆ వాసుదేవుడు మనకు ప్రసాదించుగాక.

ఈ అధ్యాయము ఇరువది శ్లోకములతో గూడిన చిన్న యధ్యాయమయ్యును, వేదసారమంతయు నిందు పొందుపరపబడియున్నది. కావుననే భగవానుడు దీనిని 'గుహ్యతమం శాస్త్రం' పరమ రహస్య శాస్త్ర మిది యని పలికినాడు. ఈ యధ్యాయమంతయు భగ

వానుని అమృత ప్రవచన మేగాని పార్థుని ప్రశ్నకు సంబంధించిన శ్లోక మే లేదు. తన శిష్యునకు చెప్పదలచిన పరమ రహస్యవిషయమగుటచే శిష్యుని ప్రశ్నతో నిమిత్తములేకయే వాత్సల్య నిధియగు జగద్గురువు శ్రీకృష్ణుడు తెలిపినాడు. ఈ అధ్యాయములో బీజాక్షరము లనేకము లున్న వని మంత్రశాస్త్రవేత్తలు తెలుపుదురు. అందుచే పారాయణమాత్రము చేతనే అనంత ఫలము సిద్ధింపగలదు. గీతనంతను ప్రతిదినమును పారాయణము చేయుదురు. పురుషోత్తముని పొందు రాజమార్గ మిందు స్పష్టముగా తెలుపబడినది. ఇందు వైశ్వానరో పాసన ముండుటచేత ఈ అధ్యాయమును భోజనాత్పూర్వము పఠించు అలవాటు చాలమందికి గలదు. మీరందరును మంగళ కరమును ఫలప్రదమును నగు నీచిన్న అధ్యాయమును ప్రతి దినమును పారాయణముచేసి జన్మసాఫల్యమును పొందుదురుగాక.

---

## 105. సంసార మహావృక్షము.

శ్లో. సంసారవృక్ష మఘబీజ మనన్త కర్మ
శాఖాయుతం కరణ పత్ర మనంగపుష్పమ్
ఆరుహ్య దుఃఖ జలధౌ పతితో దయాళో
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబం.

ఈ సంసారము భయంకర మహావృక్షము వంటిది. పాపమే దీనికి విత్తనమైయున్నది. దానివలననే జన్మించినది. దుష్టకర్మలే దీని కొమ్మలు. వివిధములగు ఇంద్రియములే దీని ఆకులు, మన్మథ వికారములే దీని పూవులు. నేను సంసారవృక్షము నెక్కి, దుఃఖతాపత్రయ క్లేశములతో గూడిన మహాసాగరములో పడి పోయినాను. ఓ దయానిధీ, లక్ష్మీనృసింహ స్వామీ! నీచేయూత నిచ్చి నన్నురక్షింపుము, అని శంకరులు గానము చేయుచున్నారు.

ఈ సంసారమును విచిత్రమయిన మహావృక్షముగా భగవాను డీయధ్యాయములోని తొలిశ్లోకములో గానము చేయును. ఇట్టివర్ణ నమే ఋగ్వేదములోను (1–24–8), అధర్వణ వేదములోను (5–4–3) తైత్తిరీయ బ్రాహ్మణము లోను (3–28–12), ఉపనిషత్తులలోను, మహాభారతములోను గూడ కలదు. పాశ్చాత్య మతగ్రంథములలో కూడ జగద్వృక్షముయొక్క వర్ణనము లున్నవి.

ఈవృక్ష మతి విచిత్ర మయినది. మనకంటికి కనబడే చెట్లవం టిది గాదిది. ఈ చెట్టుయొక్క వేళ్ళు పై భాగములో నుండును. ఈ ప్రపంచవృక్షము నాశనములేనిది. దీనియాకులు వేదములే. ఈ కొమ్మలు క్రిందికిని పైకిని వ్యాపించును. సత్త్వ రజస్తమో గుణముల చేత నిది వృద్ధిపొందును. శబ్ద,స్పర్శ, రస, రూప, గంధాదులే నిగూఢ ముగా వ్యాపించియున్నవి. ఈ సంసారమునకు ఆది మధ్యాంతములు గానరావు. ఈవృక్షము గాఢముగా పాతుకొని పోయియున్నది. దీనిని ఛేదించినగాని మోక్షము లేదు. దీనిని ఛేదించుటయెట్లు? 'అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా' అని గీత చెప్పును. సంగరాహిత్య మను శస్త్రముచే దీనిని ఛేదించుము.

సంసారములో నున్నను దానిని తాకవద్దు. ఒక జమీందారు గారియింట్లో ఒక దాసీమనిషియున్నది.వారు ఈమెకు జీతము నిత్తురు. రోజును ఆమె జమీందారుగారి బిడ్డలను ఎత్తుకొనును, ముద్దాడును, లాలించును, ముస్తాబుచేయును. కాని ఆబిడ్డలు తన బిడ్డలు కాని ఆమెకు తెలియును. ఆబిడ్డల భాగ్యభోగ్యములతోగాని సుఖదుఃఖము లతోగాని ఆమెకు సంబంధ మేమి? వారి యింటిలో నున్నంతసేపును అతి ఆప్యాయముగా, అతి మమకారమును నటించుచు ఆమె వ్యవహ రించును. కాని ఆమె మనస్సు తమయింటి యందును, తన సొంత బిడ్డలయందును మాత్రమే నిలిచియుండును. అట్లే ఓ మానవుడా నీవీ సంసారములో అసంగుడవై వర్తింపుము.

# 106. మహాత్యాగము చేత మాత్రమే బ్రహ్మజ్ఞాన సింహాసనము.

రసవత్తరములగు రెండు ఉదాహరణములను తెలిపెదను.

ఒక మహారాజునకు 'త్రిభువనసుందరి' యను కుమార్తె గలదు. ఆమె వాస్తవముగా త్రిభువనసుందరియే! ఆమె రూప రేఖావిలాసము లనన్య సామాన్యములు. బ్రహ్మదేవుడు లోకములోని సౌందర్యము నంతను బ్రోగుచేసి, ఈ చిరుగుబోడిని సృష్టించెనా యని, ఆ కాలము లోని రాజకుమారు లందరును తలంచువారు. తండ్రి ఆమెకు వివాహము చేయుటకు ప్రయత్నించెను. కాని సుందరి అందుల కొక నియమ మును బెట్టినది. ఆమె సౌందర్యవతియేకాక మహా బలశాలిని. తన కంటె బలిశాలియు, తేజశ్శాలియు నగు భర్త కావలయు నని యామె వాంఛ. ఆమె వేగముగా పరుగెత్తగల శక్తి సంపన్నురాలు. అందు చేత నాతో పరుగు పందెమునందు విజయమును బొందిన పురుష రత్నమునే నేను వివాహ మాడెదనని తండ్రితో తెల్పినది. తండ్రి అట్లే పరుగు పందెముల నేర్పాటు చేసినాడు. అనేకులు రాజకుమారులు, వస్తాదులు, బలశాలులును వచ్చి ఆమెతో పరుగు పందెములలో పాల్గొనిరి. కాని ఒక్కరును విజయమును బొందలేక సిగ్గు చెంది వెడలిపోయిరి.

సుందరుడగు యువకుడొకడా దివ్యసుందరిని వివాహ మాడవల యునని కాంక్షించెను. ఆకాంక్ష యెట్లు నెరవేరును? ఆమెతో పరుగు పందెములో జయించు టెట్లు? ఆ యువకుడు దేవీ భక్తుడు. అతడు భక్తిశ్రద్ధలతో ఆమెను ప్రార్థించెను. ఆమె ప్రసన్నురాలై 'నీకేమి కావలయునని, యడిగెను. అతడు తన కోరికను ఆదేవికి నివేదించు కొనెను. ఆ తల్లి ప్రసన్నురాలై ఆ యువకునకు కొన్ని బంగారుబంతుల నిచ్చి వాని నుపయోగించు విధానమును తెలిపి అదృశ్యురాల య్యెను.

మరునాడు యువకుడు రాజువద్దకు పోయి, తాను 'త్రిభువన సుందరి,' తో పరుగు పందెములో పోటీ చేయవచ్చితి నని తెలిపెను. యువకుడు బలహీనుడుగా పైకి కనబడుచున్నాడు. అందుచే రాజు పందెమున కంగీకరింపలేదు. ఎట్టకేలకు పరుగు పందె మేర్పాటై నది. సుందరి మహావేగముగా పరుగెత్తు చుండెను. యువకుడు వెనుక బడిపోయెను. కాని యాతడు వెంటనే తనవద్దనున్న బంగారు బంతు లను ఆమె ముందు భాగమునకు దారిలో గిరాటు వేసెను. దివ్యకాం తులతో మిగుల మిల్లు గొల్పు చున్న ఆబంగారు బంతులను గాంచి సుందరి పరమాశ్చర్యమును బొంది కొంచెమునే పచ్చట నాగి వాటిని ఏరుకొని ఒడిలో వేసుకొన్నది. ఈలోగా యువకు డామెను దాటి ముందుకు పోయెను. సుందరి మరల పరుగు సాగించి అతనిని దాటి పోయినది. మరల యువకుడు మార్గమున బంగారు బంతులను చల్లి నాడు. ఆ కనకపు ముద్దలకు భ్రమసి ఆ కనకాంగి ఆగిపోయి వానిని నేరుకొనుచున్నది. ఆ బంగారు ముద్దలతో ఆమె యొడి యంతయును నిండిపోయినది. భారము హెచ్చయ్యెను. ఈ లోపుగా మన యువ కుడు గమ్యస్థానము చేరి విజయమును పొందెను. త్రిభువన సుందరి అతనికి అర్ధాంగియైనది. ఆమె ప్రోగు చేసిన ధనరాసు లన్నియు ఆమెతోపాటు అతని కైవస మైనవి.

దీని సారాంశ మిది, బ్రహ్మజ్ఞాన పదవికి పయనము సాగించు నపుడు అనేక భ్రాంతులు, వ్యామోహములు, కామ స్వరూపము లును అడ్డు తగులుచుండును. సామాన్య వ్యక్తి వానికి వశుడై మార్గ ములో నాగిపోవును. స్థిరసంకల్పుడగు జ్ఞాని మాత్రమే ఈ భ్రాంతు లను త్యజించి ఈ సంగదోషములను లెక్కసేయక గమ్యమును పొం దును. మహాత్యాగమే బ్రహ్మజ్ఞాన సింహాసనాధిపతిని గావించును.

మరియొక మహోజ్వలమగు నుదాహరణము. గంగాతీర మందలి ఒకానొక ఆశ్రమ మందొక సన్యాసి తపస్సు చేసుకొను

చుండెను. క్షుద్బాధా నివారణార్థమై ఆయన సమీప గ్రామమునకు పోయి భిక్షాన్నమును తెచ్చి బాగుగా గంగా జలములతో కడిగి భుజించుచుండెను.

ఒకనాడా తపస్వి భిక్షాన్నము కొరకొక యింటికి పోగా, ఆగృహిణి రుచ్యములగు నాహారాదులను బెట్టి 'నీవు రోజును ఇదే సమయమునకు నా యింటికి రమ్ము, నీకు మధుర పదార్థము లిత్తును' అని చెప్పెను.

మరునాడా తపస్వి గృహిణి యింటికి పోగా, నామె మోహ పూరిత భాషణములతో మరింతగా మధురాన్నముల నొసగెను. అంత 'విరాగియగు నాతపోధను డిట్లనియెను.'తల్లీ నిన్నింతగా మోహపెట్టు చున్న విశేషమే మున్నదో జెప్పెదవా?' 'సుమనోహరములై, సుంద రములై, మందహాసములను చిందు నీ నేత్రములు నన్నాకర్షించినవి' అని ఆ సుందరాగి బదులు చెప్పెను.

మారు మాటాడక ఆ యతీశ్వరుడు తన యాశ్రమమునకు పోయెను. పొడుగుగా నున్న ఇనుప ఊచను తెచ్చి దానితో తన రెండు నేత్రములను పొడిచికొని వానిని పెకలించి తీసి ఒక గుడ్డలో మూటకట్టెను. మరునాడు ఒక కర్రసహాయముతో వెదకికొనుచు ఆ యిల్లాలి గృహమునకు పోయెను. ఆమె అప్పటికే సుందరాకారుడగు ఆయువక తపస్వి కొరకు మధుర పదార్థములతో గుమ్మము వద్ద వేచి యుండెను. ఇంత ఆలస్యమైన దేమి? అని ప్రశ్నించుచు ఆతని జోలెలో ఆ మధురాన్నములను వేసెను. తలను వంచియున్న కారణముచేత బహుశా ఆతరుణి ఆతపోధనుని ముఖమునుచూచి యుండక పోయె నేమో.

విరాగియగు తపశ్శాలి యామెను గాంచి, తల్లీ ఇవిగో, ఇంతగా నిన్ను మోహపెట్టిన నానేత్రములు. వీనిని తీసికొని నన్ను ఇంతటితో రక్షింపుము' అని పలికెను.

'శరీరమును పులకరింపచేయు ఆమహాత్యాగము బ్రహ్మజ్ఞాన దీక్షాపరుల కాదర్శమగునుగాక!' బ్రహ్మజ్ఞానము మాటలతోను, కబుర్లతోను, కాలక్షేపములతోను సిద్ధింపదు – త్యాగము మహాత్యాగము దాని కవసరము.

బైబిలు ఇట్లు పలుకును.

**If the right eye offend thee pluck it out and cast it out from thee for it is profitable for thee one of the members should perish and not that thy whole body should cast out into the hell.**

నీ కుడినేత్రము దోషము నాచరించిన యెడల దానిని నీశరీరము నుండి వెంటనే ఖండించి పారవేయుము. నీ శరీరమంతయు నరకకూపములో పడిపోవుట కంటె, ఒక్క అవయవమును మాత్రమే ఖండించి వేయుట మేలుకదా! బ్రహ్మజ్ఞానపథములో నీ చేయి అడ్డముగా నిలిచిన దానిని ఖండించి వేయుము. నీ ముక్కు, చెవి, నాలుక, మరియే అవయవము అడ్డముగా నున్నను దానిని ఖండించుట బ్రహ్మజ్ఞాన పదాన్వేషణ కార్యక్రమము. నీ గురువుగాని, తండ్రికాని, భార్యకాని, సోదరుడుగాని, అడ్డముగా నిలిచిన వారలనుగూడ, భీష్ముడు, ప్రహ్లాదుడు, భర్తృహరి, విభీషణాదులవలె దూరముగా త్యజింపుము.

వాంఛాత్యాగము, కాంతా కాంచన త్యాగము, సర్వదోష త్యాగము, సర్వత్యాగమే బ్రహ్మజ్ఞానమును కలిగించును.

'గీ' కారం త్యాగరూపంస్యాత్ ; 'త' కారం తత్త్వ బోధకమ్
గీతాశాస్త్ర మిదం తత్త్వం; జ్ఞేయం సర్వ మోక్షార్థిభిః పరం.

'గీతా' అను పదములోని మొదటి అక్షరమగు 'గీ' త్యాగమును బోధించుచున్నది. రెండవది యగు 'త' అను అక్షరము తత్త్వమును (ఆత్మబోధను) సూచించును. 'గీత' అను పదమున కిదియే యర్థమని ముముక్షువు లందరిచేతను దెలిసికొొన నగును.

# 107. పురుషోత్తమ దర్శనము.

## The Vision of the Supreme self.

ఒల్లరు నిర్జరేంద్ర పద మొల్లరు బ్రహ్మపదంబు నొందగా
నొల్లరు చక్రవర్తి సవ మొల్లరు సర్వరసాధిపత్యము
నొల్లరు యోగసిద్ధి మఱి యొండు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల సంగతి బొందిన ధన్యు లెప్పుడున్.

పురుషోత్తమ దర్శనం వాంఛించువారు మరిదేనిని గూడ వాంఛింపరు, వారికి దేవేంద్రపదవితో నిమిత్తము లేదు. బ్రహ్మపదవి వారి కక్కఱ లేదు. సార్వభౌమత్వమందును వారి కాశ యుండదు. ముల్లోకాధి కారమును వాడు లక్ష్యము సేయడు యోగసిద్ధులతో వానికి పనియే లేదు. ఇవి యన్నియును కాల గర్భములో నశించునవి. నశింపనిది, శాశ్వతమైనది ఆ పరమేశ్వర ధ్యాన మొక్కటియే. సూర్యచంద్రాగ్నుల తేజస్సులా దివ్యధామమును ప్రకాశింపజేయుశక్తి లేనివే. ఆ సూర్యునికి దివ్య తేజమును ప్రసాదించిన దెవరు? ఆ పురుషోత్తముడే! సూర్యమండల దివ్య తేజ మా పరాత్పరుని అంశమే సుమా!

పొయ్యిపై నీటిపాత్రనుపెట్టి అందు బియ్యమునుపోసి వంట చేయుదువు, అన్నము ఎట్లుడుకుచున్నది? 'అగ్నిహోత్రము వలన' అని నీవు పలుకుదువు. ఆ అగ్నిని ప్రసాదించునదియూ ఆ పరమేశ్వరుడే.

రైతులు వరిచేలను కోసి, కుప్పలువేసి, నూర్చి, ధాన్యలక్ష్మిని ఇంటికి తెచ్చుకొనుచున్నారు. ఆ ధాన్యరాసు లెవ్వరి వలన పండినవో నీకు తెలుసునా? నీవు వేసిన రసాయనపు ఎరువుల వలనగాదు, భగవానుడు ఏదోరూపమున భూమియందుండి పంటలు పండించుచున్నాడు సుమా! మామిడిపండులో రసమును పోసినవాడా తోటమాలియే గులాబీపుష్పములకు రంగులు దిద్దిన వాడా మహాశిల్పియే.

సాగరతరంగములలో సెలమేటి పాటలలో గానముచేయువా డా విశ్వ గాయకుడే.

స్త్రీలకడుపులలో శిశువులను కల్పించి, ఊపిరిపోయువా డా మహాభిషగ్వరుడే. చిగురుటాకులకు నిగనిగలు, సంపెంగలకు ఘుమఘుమలు గల్పించిన డా విశ్వకళావేత్తయే.

నీగర్భములో జఠరాగ్ని రూపములో నున్నవా డా పరమేశ్వరుడే సుమా. ఈ యధ్యాయములో గీతాచార్యు డిట్లు పలుకును.

'అహం వైశ్వానరో భూత్వా, ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః, పచా మ్యన్నం చతుర్విధం.

ఈపవిత్ర శ్లోకమును భజనసమయమునందు సనాతనులు పఠింతురు. దీని భావమిది. 'ఓ అర్జునా! నేను వైశ్వా నరరూపమున ప్రాణుల దేహము నావరించియున్నాను. నీవు తినునట్టి భక్ష్యములు, భోజ్యములు, చోష్యములు, లేహ్యములు మున్నగు పలురకములగు నాహారపదార్థములను జీర్ణము గావించువాడను నేనే సుమా.'

భగవానుని దయలేనిదే ఆహారము జీర్ణముకాదు. కావుననే భగవానుని ఆరాధనము చేసి, భుజించు మని శాస్త్రము చెప్పును.

ఈశ్లోకమును గూర్చి పెద్ద లనేక విధములుగా శ్లాఘించియున్నారు. ఈ శ్లోకమును నిరంతరమును పునశ్చరణ చేయుచున్నచో, భయంకరము లగు ఉదరవ్యాధు లన్నియును నివారణ యగు నని పెద్దలు చెప్పుదురు.



## 108. ఈ అధ్యాయములోని కొన్ని రహస్యములు.

### Some more secrets of the chapter.

ఈ అధ్యాయము 'గుహ్యతమ' మని భగవానుడు పలికినాడు. రహస్య మనగా ఎవ్వరికిని చెప్పరాని విషయ మనికాని గోప్యముగా నుంచవలయు నని కాని అర్థముగాదు. ఇందలి సిద్ధాంతములు ఎన్ని

పర్యాయములు చెప్పినను బోధించినను, నిత్యజీవితములో సామాన్య సాధకునకు అనుష్ఠానమునకు రాజాలవనియే అర్థము. కనుక సాధకుడు సద్గురులతో, దీక్షతో, వీనిని మననము చేయవలయుననియే భావము. అనఘునకు మాత్రమే (పాపరహితుడై, చిత్తశుద్ధిగలవానికిమాత్రమే) ఈదివ్యబోధ మహాఫలప్రద మగును. ఇందలి కొన్ని రహస్యములను మాత్రము సంగ్రహముగా గ్రహింతము.

1 విశ్వరహస్యము (Secrete of the universe) నామరూపాత్మకమై-వింత వింతలుగా - రంగురంగులుగా వికసించి విస్తరించి వ్యాపించియున్న ఈ అనంత విశ్వసృష్టి యంతయును 'మిథ్య'యే యగును. (జగన్మిథ్య - బ్రహ్మసత్యం) దర్పణ దృశ్యమున నగరము వంటిదే ఈవిశ్వము. అనగా ప్రపంచము అద్దములో గానవచ్చు నగరమువలె గోచరించునది మాత్రమే 'ఇది అశ్వత్థము.' (అ+శ్వ+థమ్= అ=లేదు (not) శ్వ=రేపు (to-morrow) థమ్ = ఉండునది (re-ma ning) రేపటివరకును నుండునదిగాదు. that will not rem-aind tomorrow) నశించు భోగములపై మమకారమును వీడుమని సందేశము,

2. కర్మరహస్యం :- (Secret of action) కర్మను బంధిని మనుష్యలోకే - మానవుడు కర్తృత్వాహంకారములో ఫలభోగకాంక్షతో కర్మలుచేయుటచేత ఉచ్చ,మధ్యమ, నీచ జన్మలను బొందుచున్నాడు. కనుక నిష్కామకర్మానుష్ఠానము చేయుమని సందేశము.

3. వైరాగ్య రహస్యము (Secret of non-attachment 'అసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా'(Cut off the tree of samsara with the sword of knowledge or non-attachment)

4. శరణాగతి రహస్యం (Secrete of Surrendar) ప్రపంచము యొక్క నాశన స్వరూపమును బాగుగా చింతించి దానిపట్ల మమకారమును త్యజింపవలెను. వైరాగ్య ముదయింపవలెను.

వైరాగ్యమే జీవితలక్ష్యముగాదు. వైరాగ్యము పరమపదమునుపొందుటకు ముఖ్యసాధనము.

పరమపదమును గూర్చి చింతనముచేసి ఆపరమ పురుషుని శరణాగతిని బొందవలెను. శరణాగతివలననే భగవంతుని సాక్షాత్కారము గలుగు నని సందేశము.

5. పరమపద రహస్యం (**The secret of the E ernal Abode**) 'యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ' ఎవ్వనినుండి యనంతమగు సృష్టి వెడలుచున్నదో, ఎవ్వనియందు తిరిగి లయమగునో సమస్తజీవకోటికి ఏది ఆలవాలమో, ఎచ్చట ప్రవేశించినచో మరల జననమరణ క్లేశము లుండవో, ఏది అమృతస్వరూపమో పరమమంగళమో అదియే పరమపదము.

6. పంచసోపానరహస్యం (**The secret of the five steps for the Eternal Abode**) ... ఈపంచసోపానములను గూర్చి ముందు శీర్షికలో పాఠకులు తెలిసికొనగలరు.

7. జీవేశ్వరాభేదరహస్యం 'జీవుడే పరబ్రహ్మము' అను విషయము ప్రబోధింపబడినది – జీవోదేవ స్సనాతనః **Every' soul is puerily devine** జీవోబ్రహ్మైవనాపరః (**Individual soul is no other than the supreme self**) అద్వైత సందేశము.

8. లింగశరీర రహస్యం (**Secret of the Astrol body**) జీవుడు శరీరమును విడిచిపోవునపుడు ఒంటరిగా పోడు. వాయువు గంధమును తన వెంట తీసికొనిపోవురీతిగా పంచేంద్రియములు–మనస్సు వానికి సంబంధించిన వాసనలను సంస్కారములను వెంటతీసికొని పోవును. కనుక మానవుడు మంచి సంస్కారములను గలిగియుండవలెనని సందేశము.

9. ఆత్మదర్శన రహస్యం (**Secret of divine on vision**) ఎంతగా సాధనలు చేయుచున్నను చిత్తశుద్ధిలేని వారికి (అకృతాత్మ

లకు) ఆత్మదర్శనముకలుగదు. చిత్తశుద్ధి (కృతాత్ములు) గలవారికి మాత్రమే ఆత్మసాక్షాత్కారము కాగలదు? కనుక చిత్తశుద్ధితో కర్మల నాచరించా లని సందేశము.

10. భగవద్విభూతుల రహస్యం (Secret of the devine glories? పదవ అధ్యాయమున భగవద్విభూతు లనేకములు తెలుప బడినవి. వానిలో కొన్ని ముఖ్య విభూతులు (సూర్య. చంద్ర, అగ్ని) తెలుప బడినవి. విభూతులయొక్క సందేశము గ్రహించునది.

11. వైశ్వానరోపాసనా రహస్యం. (The secret of the Digestive fire in the body) భగవంతుడే జఠరాగ్ని రూపమున శరీరమందున్న వాడే ఆహార పదార్థములను పచనము చేయుచున్నాడు. భోజనము యజ్ఞస్వరూప మని సందేశము.

12. హృదయ పద్మమున భగవదారాధనా రహస్యం (The secret of God's worship in the heart) భగవంతుని కొరకు అన్య ప్రదేశములకు వెళ్ళ నవసరము లేదు. ఆయన హృదయమునందే అతి సమీపముననే యున్నాడు. కనుక హృదయస్థ పరమేశ్వరుని ఆరాధించు మని సందేశము.

13. పురుషత్రయ రహస్యం (The secret of the three Purushas) కానవచ్చు ప్రపంచము క్షరపురుషుడు, జీవుడు అక్షర పురుషుడు, క్షరాక్షరముల కంటె వేరుగా నుండి సర్వలోకములందును వ్యాపించి భరించున్నవాడే ఉత్తమ పురుషుడు (The supreme self)

14. నేనే పురుషోత్తముడను (I am the supreme self) భగవానుడీ అధ్యాయమున సర్వ శాస్త్రసారములగు అనేక వేదాంత రహస్యములను తెలిపి, సర్వ సృష్టి, స్థితి, లయములకును, ఆధార భూతుడగు పరమేశ్వరుడు తానే యని గీతాచార్యుడు మరల స్పష్టముగా తెలియ చేయుచున్నాడు.

'కృష్ణస్తు భగవాన్ స్వయం' (శ్రీకృష్ణుడే సాక్షాత్తు భగవానుడు.

'భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం' యజ్ఞములకును తపస్సులకును నేనే భోక్తను; సర్వలోక మహేశ్వరుడను నేనే, (అ 5 – శ్లో 29)
'పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః (అ 9. శ్లో 17)
నేనే ఈవిశ్వమునకు తండ్రిని, తల్లిని, సృష్టికర్తను, పితామహుడను.
'అహం సర్వస్య ప్రభవః మత్తః సర్వం ప్రవర్తతే' (అ16–8)

సమస్త జగత్తునకును ఉత్పత్తి కారణము నేను, నావల్ల నే సర్వములును ప్రవర్తిల్లుచున్నవి!
బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తిస్య చ　　(అ 14–27)

నేను అమృతస్వరూపుడను,నిర్వికారుడను, నాశనరహితు డగు పరమాత్మను, శాశ్వతి ధర్మస్వరూపుడను, నిరతిశయానందమూర్తిని నేనే పరబ్రహ్మమను. ఈరీతిగా గీతాశాస్త్రమునందు గీతాచార్యు డనేక పర్యాయములు తానే భగవంతు డనియు తన్నే ఆరాధించు వారికి మోక్షము గలుగు ననియును మరల మరల ప్రబోధించినాడు. ఈ అధ్యాయమున పరమ రహస్య విషయములను మరల సంగ్రహముగా బోధించి తానే సర్వలోక మహేశ్వరు డని చాటినాడు' కావున ఇది అతిముఖ్యమగు అధ్యాయముగా పెద్దలు భావింతురు.

ఈ అధ్యాయమును గ్రహించినవాడు భగవంతు డే (బుద్ధిమాన్ స్యాత్) యగును. మరియు 'కృతకృత్యశ్చ' వేదశాస్త్రముల యందు చెప్పిన సమస్త కర్మలయొక్క మహా ఫలములను బొందినవాడే యగు నని భగవద్వాక్యము సదా స్మరణీయము. (అ 15–20)

కావుననే 'ఇతి గుహ్యతమం శాస్త్రం' (మహా రహస్యమగు శాస్త్రము.) అని భగవానుడు పలికెను.

కొందరు ఈ అధ్యాయములోనే గీతా శాస్త్రము పూర్తియైన దని తెలుపుదురు. 16, 17 అధ్యాయములు లోగడ చెప్పిన సంగ్రహ విషయములకు వివరణములు మాత్రమే యనియును 18 వ అధ్యాయము గీతా గ్రంథ సమీక్ష యనియు వాదింతురు.

సంస్కృతములో వేదాంత గ్రంథములు 'అథ' శబ్దముతో ప్రారంభము అగును. మరియు 'ఇతి' శబ్దముతో గ్రంథము ముగియు ననియు తెలుపుదురు. 'అథ' శబ్దము మొదటి అధ్యాయములో 20 వ శ్లోకమునందు గలదు. మరియు 'ఇతి' శబ్దము 15 వ అధ్యాయములోని 20 వ శ్లోకమునందు గలదు. కనుక ఈ అధ్యాయముతో గీతా శాస్త్రబోధ పూర్తిఅయ్యె నని వారు భావింతురు. సారాంశ మేమన, ఈచిన్న అధ్యాయము అత్యంత ప్రధానమైనది. దీనిని నిరంతరమును పఠించి, చింతించి, ధ్యానించి, మననముచేసి, నిత్యజీవితములో అనుష్ఠించి ధన్యులగుదురు గాక!

## 109. ఆత్మసాక్షాత్కారమునకు పంచసోపానములు.

(Five steps for self realisation)

నిర్మానమోహా జిత సంగదోషా
అధ్యాత్మ నిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞైః
గచ్ఛంత్య మూఢాః పద మవ్యయం తత్. (15-5)

1. నిర్మానమోహాః (who are free from pride and delusion) మానము అనగా గర్వము లేక అహంకార మనబడును. మోహమనగా అవివేకము. నిత్యానిత్య, సత్యాసత్య,వస్తుపరిజ్ఞానము లేనిస్థితి. ఈ దోషములు లేనివారే నిర్మానమోహులు. కులగర్వము, రూపగర్వము, విద్యాధనగర్వములు లేనివారు ప్రాపంచికవిషయముల యందలి అనిత్యత్వమునుగుర్తించి వానిపట్ల మోహము చెందనివారు.

2. జితసంగదోషాః (who are free from the evil of attachment) భోగవస్తువులు నిత్యములని నమ్మి వానియందే సంగమును (తాదాత్మ్యమును) బొందుట సంగదోష మందురు. అద్దము అన్నిటిని తనయందు ప్రతిబింబింపచేయును. కాని దేనితోను సంగము బొందదు. అటులనే మానవుడు ప్రాపంచిక విషయములయందు దిరుగుచున్నను వానిపట్ల ఉదాసీనత్వమును వహించి సాక్షిమాత్రుడై యుండవలయును. అట్టివాడే సంగదోషము లేనివాడు.

3. అధ్యాత్మ నిత్యాః (who are always in the devine consiousness) నిరంతర భగవద్ధ్యానము, సదాదైవచింతనము, తైలధారవలె సంతత నారాయణ స్మరణ, జరుపువారే అధ్యాత్మ నిత్యులు.

4. వినివృత్తకామాః (who are free from all desires) కోరికలు మానవుని బంధించును.కోరికలు లేనివారే వినివృత్తకాములు.

5. ద్వంద్వైర్విముక్తాః(who are free from the pairs of opposits such as pleasure and pain) ప్రపంచ మున్నంతవరకును కలిమిలేములు,సుఖదుఃఖములు, మానాభిమానములు మున్నగు ద్వంద్వములు తప్పవు. వానిని గ్రహించిన మహనీయులే ద్వంద్వైర్విముక్తులు. ఇట్టివారే 'అమూఢులు'.అనగా మౌఢ్యము లేనివారు. జ్ఞానసంపన్నులు. ఇట్టి మహనీయులకే మోక్షపదవి లభించును. ఈ అయిదును ముక్తిమందిరమునకు సోపానములు.ఇందులో ఏ ఒక్క లక్షణమునైనను సాధకుడు ప్రయత్నపూర్వకముగా కష్టపడిసాధించినచో మిగిలిన లక్షణములు గూడ వానిని వరించును. ఈ పవిత్ర లక్షణములను గూర్చి లోగడ మీరు 2, 12, 13, మున్నగు అధ్యాయములలో చదివియే యున్నారు. అయినను ఇవి అత్యంత ముఖ్యము లగుటచేత భగవానుడు మరల గానముచేసినాడు. వీనికి పునరుక్తిదోషము లేదు. ఈ శ్లోకమును ప్రతిదినమును పలుమార్లు పఠించుచు దీనియందలి సాధన

లను నిత్యజీవితములందు అనుష్ఠానము చేయవలయునను ఆకాంక్ష తోనే మరల నుదహరింపబడినవి.

ఇట్టి దివ్యగుణములతో భాసించుచున్న ఆదర్శమూర్తిని జ్ఞాన మూర్తిని, దర్శింపుడు. ఆయన సగుణసాకార దివ్యరూపమును మన మనోవీథులలో నిరంతరమును తాండవమాడునట్లు పోతనామాత్యుడు భాగవతములో తనకమ్మని కలముతో చిత్రించినాడు. ఆచిత్రశోభను తిలకించి పులకించి, ఆనందించి, అనుష్ఠానము చేయుడు.

ఆకార జన్మ విద్యార్థవరిష్ఠుడై, గర్వసంస్తంభ సంగతుడు గాడు
వివిధ మహానేక విషయ సంపన్నుడై, పంచేంద్రియములచే పట్టువడడు
భవ్య వయోరూపప్రాభవోతుడై, కామరోషాదుల గ్రందుకొనడు
కామినీ ప్రముఖ భోగము లెన్నిగలిగిన, వ్యసన సంసక్తి నావంకబోడు
విశ్వమందుగన్న విన్న యర్థములందు, వస్తువృష్టిచేసి వాంఛ యిడడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర, తంత్రుడై హతాన్య తంత్రు
డగుచు.

భగవద్గీత చిత్రించిన జ్ఞానసాధన మార్గములలో నారితేరిన ప్రహ్లాదకుమారుని దివ్యమూర్తియొక్క మధురవర్ణన మిది. ఆతడు నిర్మానమోహుడు. ఆయనయందు రూప ధన విద్యాధికారాది గర్వ ములు గానరావు. ఆతడు సంగదోషమును జయించిన మహనీయుడు. సుందరాంగులమధ్యలోనున్నను జితమన్మథుడు. ఆయన అధ్యాత్మ నిత్యుడు. నిరంతరమును హరిచింతనాలోలుడు. దివ్యవయో బలప్రా భవములతో గూడియున్నను కామరోషాదులు లేనివాడు. విశ్వ మందు గల సమస్త పదార్థముల యందును భగవానునే దర్శించిన వాడు. 'వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః' భగవంతుడే సర్వమునందును నిండియున్నవా డని భావించు మహాత్ములు లోకములో సుదుర్లభులు (గీత 7-14) అను గీతావాక్యము సదా స్మరణీయము.

# గీతా కల్పవృక్షము

పదునారవ అధ్యాయము - దైవాసుర సంపద్విభాగ యోగము

## 110. ఇరువదియారు దేవతా గుణములు - దైవీ సంపద.

**Twenty six devine virtues - The devine wealth.**

ఈ అధ్యాయములో సాధకులు గమనింప దగినవి దైవీసంపదకు సంబంధించిన ఇరువదియారు దివ్యగుణములు. ఈ గుణములను సాధించిన మానవుడే మాధవస్వరూపుడు. గీతా సార్వభౌముడు విసుగు చెందక ఈ పుణ్య లక్షణములను తన ప్రియశిష్యు డగు పార్థునకు మరలమరల బోధింపసాగినాడు. 2 వ అధ్యాయమున స్థిత ప్రజ్ఞ లక్షణములుగా బోధించినాడు. 12 వ అధ్యాయమున భక్త లక్షణములుగా ప్రబోధము చేసినాడు. 13వ అధ్యాయమున జ్ఞానలక్షణములుగా మరల తెలిపినాడు. ఇంకను నితర అధ్యాయము లందును ఈ మహత్తర దివ్య గుణములే సందర్భానుసారముగా, పదముల మార్పుతో చెప్పినాడు. మరల నిపుడును చెప్పుచున్నాడు. భగవంతునకే విసుగు లేనపుడు మన మెందులకు విసుగుదలను పొందవలెను. ఇది పునరుక్తి గాదు. మహాసూక్తి, దివ్యసూక్తి, దేవతావాణి. కనుక మరల మరల చదివి అనుష్ఠానము చేసి తరింతుము గాక!

1 అభయం (**fearlessness**) - భయరాహిత్యము దేవతా లక్షణము. అన్నిటి యందును ఆత్మదర్శనము చేసిన దానికి భయము లేదు. ఒకప్పుడు రామ తీర్థస్వామి హిమాలయములలో సంచరించు చుండగా ఒకసింహము భీకరముగా గర్జించుచు ఆయనవద్దకు వచ్చెను. రామతీర్థుడు ఆత్మజ్ఞాన సంపన్నుడు గనుక తన రెండు నేత్రములను బాగుగా విప్పి తదేక దృష్టితో దాని వైపు చూచెను. మృగరాజు ఆయన పాదములను స్పర్శించి వెడలిపోయెను.

2 సత్త్వసంశుద్ధి (Purity of mind) - అంతఃకరణశుద్ధి లేని వానికి ఈశ్వర సాక్షాత్కారము గలుగదు. వస్త్రమునకు రంగు వేయ దలచినచో ముందుగా దానిని ఉతికి పరిశుభ్రము చేయవలయును. లేనిచో రంగు చక్కగా వస్త్రమున కంటుకొనదు. అటులనే ఆత్మ సాక్షాత్కారమునకు చిత్తము యొక్క శుద్ధి అత్యంతావశ్యకము. వేదాంతశాస్త్రములో చెప్పబడిన సాధనలన్నియును చిత్తశుద్ధికొరకు చెప్పబడినవే.

ఒక ఉదాహరణ : ఒక మహారాజు తన అంతఃపురములోని గోడపై శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహమును చిత్రించుటకు చిత్ర కారుల నాహ్వానించెను. మిక్కిలి ప్రసిద్ధి గాంచిన ఇరువురు చిత్రకారులు వచ్చిరి. వారిరువురను ఎదురెదురుగా నున్న రెండు గోడలపై శ్రీకృష్ణ భగవానుని చిత్తరువులను వ్రాయుడని కోరెను. ఒక చిత్ర లేఖనము మరియొకరికి కానరాకుండు నట్లుగా, మధ్యలో దళసరియగు తెర యేర్పరుప బడినది. ఒక చిత్రకారుడు రకరకములగు రంగులతో రాత్రింబవళ్ళు శ్యామసుందరుని విగ్రహమును తనగోడపై మనోహరముగా చిత్రించుచుండెను. రెండవవాడు తన కీయబడిన గోడను బాగుగా రుద్దుచు పరిశుద్ధము చేయుచుండెను. అవి పాలరాతి గోడలు వానిని బాగుగా పరిశుద్ధి చేయుచు కాలము గడుపుచుండెను. నిర్ణీత కాలానంతరము రాజుగారు చిత్రకారుల చిత్రములను చూచుటకు వచ్చెను. మొదటి చిత్రకారుని గోడవద్దకు పోయి రాజు చూడగా శ్రీకృష్ణుని దివ్యసుందర విగ్రహ మత్యద్భుతముగా గానవచ్చెను. రాజు ఆతని చిత్ర లేఖనమునకు చాల మెచ్చుకొనెను. రెండవ వాని గోడవద్దకు రాజు వెడలెను. ఇరువురకును నడుమ కట్టబడియున్న తెర తొలగింప బడెను. ఆశ్చర్యము. ఎదురుగానున్న గోడపై చిత్రింపబడి యున్న కృష్ణస్వరూపము అద్దమువలె మిక్కిలి స్నిగ్ధముగానున్న ఆ గోడపై ప్రతిఫలింప సాగెను. రెండవవాడు చిత్రమును గీయక పోయిన

నను, గోడను అద్దమువలె స్నిగ్ధముగా చేయుటచే కృష్ణ స్వరూపము దివ్యముగా గానవచ్చినది. భగవంతుడు నీలోనే యున్నాడు. ఆయన దివ్యరూపమును నీవు చూడవలయునన్నచో నీమనస్సు అను అద్దమును మాలిన్య రహితముగా చేయుము.

3. జ్ఞానయోగ వ్యవస్థితి. (**Stead fastness in the yoga of knowledge**) జ్ఞానము వలననే మానవుడు మోక్షము బొందును. దేహభావనము తగ్గించి ఆత్మభావనను పెంపొందించుకొనవలెను. 'అహం బ్రహ్మాస్మి', 'తత్త్వమసి' అను మహావాక్యములను గురువు ద్వారా ఉపదేశము నొంది మననము చేయవలయును.

4. దానము (**Alms giving charity**) మానవుడు తనకు కలిగిన దానిలో కొంతభాగము నిష్కామదృష్టితో దాముచేయుట కలవాటు పడవలయును. అన్నదానము, వస్త్రదానము, మున్నగునవి పాత్రత నెరింగి చేయవలెను. అన్ని దానముల కంటెను జ్ఞాన దానము గొప్పది.(**of all the gifts the gift of knowledge is the best**)

5. దమము (**Control of the senses**) ఇంద్రియ నిగ్రహము ఆధ్యాత్మిక సాధనలలో అత్యంత ప్రధానమైనది. ఇంద్రియములను భగవత్పరము చేయుటచే నివి గ్రహింపబడును. నోటితో హరి నామ గానము, చెవులతో స్మరణము, నయనములతో హరి రూప దర్శనము, చేతులతో హరి పూజనము, కాళ్ళతో హరిమందిర గమనము మున్నగునవి సాధనములుగా చెప్పబడినవి.

6. యజ్ఞములు (**Sacrifices**) – ఈశ్వరార్పణ భావముతో నిష్కామముగా చేయబడు పుణ్యకార్యము లన్నియును యజ్ఞములే. వీనిని గూర్చి నాలుగవ అధ్యాయమున వివరింపబడినది. పంచమహా యజ్ఞములు ప్రతిదినమును తప్పక చేయవలయును.

7. స్వాధ్యాయము. (**Study of the spiritual texts**) ప్రతి దినమును సాధకుడు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత మున్నగు పుణ్యగ్రంధములను నియమానుసారముగా పఠించవల యును. ఇదియే స్వాధ్యాయ యజ్ఞము. గీతాపారాయణమును జ్ఞాన యజ్ఞముగా గీతాచార్యుడు చెప్పియున్నాడు. (అ 18-శ్లో 70)

8. తపస్సు. (**Austerity**) తపస్సునుగూర్చి 17 వ అధ్యాయ మున వివరింపబడియున్నది.

దేవద్విజగురుపూజనము – శుచిత్వము, ఋజువర్తనము.
బ్రహ్మచర్యము – అహింస; ఇవి శారీరక తపస్సులు.
సత్యవచనము – మితమగు హిత ప్రియభాషణము.
పుణ్యగ్రంథపఠనము – వాక్తపస్సు అనబడును.
మనస్సుయొక్క శుద్ధి – సద్భావచింతనము, మౌనము.
మనోనిగ్రహము – ఇవి మానసిక తపస్సు అనబడును.

9. ఆర్జవము. (**Straight farwardness**) త్రికరణశుద్ధియే ఆర్జవ మనబడును. మనస్సులో యోచించిన దానినే నోటితో పలు కుట, పలికినరీతిగనే ఆచరించుట, ఇదియే ఋజుప్రవర్తన మనబడును.

10. అహింస (**Harmlessness**)- మనోవాక్కాయములతో ఎవ్వరికిని హానిచేయవద్దు. 'అహింసా పరమోధర్మః'అని గుర్తింపుము.

11. సత్యము (**Truth**)- సర్వకాలములయందును, సత్యమునే పలుకవలెను. 'సత్యంవద' అన్న వేదసూక్తి సదా స్మరణీయము. 'సత్యము' అనగా పరబ్రహ్మ మనియును అర్థముగలదు. కనుక సదా బ్రహ్మచింతన చేయుము.

12. అక్రోధము (**Absence of anger**)-సమస్త పాపమునకు క్రోధమే మూలము. ఇది రజోగుణమువలన గలుగును. సత్సాంగ త్యముచే, హరినామచింతనముచే క్రోధమును జయింపవలెను.

13. త్యాగము (Renouonciation) త్యాగమనగా భౌతిక వస్తువులను విడిచిపెట్టుట మాత్రమేగాదు. మనస్సునందు గల వాసనలను విడనాడవలెను.

'త్యాగేనైకే అమృతత్వమానశుః' త్యాగమువలననే అమృతత్వము (మోక్షము) సిద్ధించునని ఉపనిషత్తు వచించును.

14. శాంతిః (Peacefulness) శాంతములేక సౌఖ్యమే లేదని త్యాగరాజు వచించెను. చిత్తశాంతియే పరమలక్ష్యము. మనస్సును ద్వంద్వములనుండి నిగ్రహించుటే శాంతి. చిత్తముయొక్క సమత్వమే యోగమని గీతవచించును. (evenness of mind is yoga, equality of mind is yoga)

16. అపైశునము. (absence of crookedness) ఇతరుల దోషములను లెక్కింపరాదు. తనయందు గల దోషములు తెలిసికొని వానిని సరిదిద్దుకొనువాడే జ్ఞాని. పరనింద, పరదూషణము, పరులను విమర్శించుట, మహాపాపములు. ఇతరులపై చాడీలు చెప్పరాదు. ఇట్టి పవిత్రలక్షణములనే అపైశునమని చెప్పుదురు.

16. దయా భూతేషు (Compassion to all beings) సర్వభూతములయందును దయ, ప్రేమ, కరుణ, కలిగియుండవలెను. సమస్తభూతములయందును పరమాత్మయే వసించుచున్నడను భావము కలిగియుండవలెను. అప్పుడే వాస్తవ మగు ప్రేమ కలుగును. విశ్వమంతయును దేవదేవుని ప్రేమమందిరముగా భావించుము.

17. అలోలత్వము. (un-covetousness) లోలత్వమనగా చంచలస్వభావము. దానిని విడనాడుటయే అలోలత్వమగును. భగవంతునిపై పూర్ణవిశ్వాసము సత్కర్మానుష్ఠానముపై దృఢ నిశ్చయము అత్యంతావశ్యకములు - స్థిరబుద్ధిగలవాడే జ్ఞాని. చపలచిత్తుడు మూర్ఖుడు.

18. మార్దవము (Gentleness) మృదుస్వభావము దేవతా లక్షణము. నిత్యదైనందిన జీవితములో సదా మృదుత్వమును వహిం

వుము. సరళభాషణ కలిగియుండుము. కటువుగా, పరుషముగా మాట లాడకుము. ముఖము సదా చిరునవ్వుతో తాండవించవలెను. పలుకులు మధుర మంజులములు కావలెను.

19. హ్రీః (modesty) 'లజ్జ - సిగ్గు' అని ఈపదమునకు అర్థమగును. చెడ్డపనులుచేయుటకు లజ్జింపవలెను. మహాపురుషులనుగాంచి నపుడు మనము వారివలె గొప్పవారము కాలేదే యని సిగ్గుపడవలెను.

20. అచాపలం (absence of fickleness) చపలస్వభావము లేకుండవలెను. క్షణమునకొక మంత్రము - క్షణమునకొక గురువు- క్షణమునకొక సాధన - ఇవి అవివేక లక్షణములు. తాను సత్యమని నమ్మిన అధ్యాత్మిక సాధనయందే పూర్ణవిశ్వాసముతో దీక్షతో నిరంతర నిర్విరామకృషి చేయవలెను.

21. తేజః (Vigar-Energy Brilliance) ఉత్సాహము, బలము, శక్తి, బుద్ధివికాసము, ఇవియే 'తేజస్సు' అనబడును. ముఖము బ్రహ్మవర్చస్సుతో తాండవించును. దేహము దివ్యశోభతో భాసిల్లును. నిరంతర జపతపో ధ్యానాదుల వలనను, బ్రహ్మచర్య వ్రతానుష్ఠానము చేతను నిట్టి తేజస్సు సాధకునకు కలుగును.

22. క్షమ (forgiveness) తనకు మిక్కిలి అపకారముచేసిన పరమశత్రువును కూడ ద్వేషింపకుండుటయే 'క్షమ' యనబడును. శత్రువును ప్రేమించి వాని కుపకారము చేయుటే క్షమాలక్షణము.

23. ధృతిః (fartitude) ధైర్యము మహాపురుషలక్షణము.

ఆధ్యాత్మిక సాధనలు చేయునపుడు అనేక ఆటంకములు, క్లేశములు గలుగు చుండును. సాధకుడు వీనిని గాంచి నిరాశను చెందరాదు. **Every failure is the stepping stone for success** పరాజయము విజయసౌధమునకు సోపాన మనియే సాధకుడు భావించును. ఇదియే ధృతి. ఇట్టిమానసిక ధైర్యము గలవాడే మహాపురుషుడు.

24. శౌచము:-(Purity - Cleanliness) శరీరశుద్ధి, వాక్శుద్ధి, పరిసరముల శుద్ధి- తానుపయోగించు వస్తువులశుద్ధి, ఆహారముయొక్క- శుద్ధి-అన్ని విషయములందును పరిశుభ్రత, పవిత్రత గలిగియుండ వలెను. వీనికంటెను ముఖ్యమైనది 'మానసికశుద్ధి' మనస్సులో దుష్ట సంకల్పములు లేకుండవలెను. చెడ్డ తలంపులు వచ్చినపుడు హరికీర్త నము చేయుము లేదా, గురూపదేశ మంత్రమును వచింపుము.

25. అద్రోహము (absence of hatred) ఇతరులపై ద్రోహచింతనము విడనాడుము. అసూయయే ద్రోహచింతకు కార ణము. గాన అసూయాపిశాచమును నీమనస్సునుండి దూరము చేయుము. లోకమంతయును సుఖముగా సంతోషముగా నుండవలయు నని కాంక్షింపుము.

26. నాతిమానితా (absence of pride) తాను గొప్ప వాడ నని భావించుట, తన కందరును సన్మాన సత్కారములు చేయ వలయు నని తలంచుట, అందరును తన్ను పూజింపవలయునను కాంక్ష విడనాడవలయును.

నిర్భయత్వముతో ప్రారంభమయిన ఈ దేవతా గుణములు 'అనతిమానితతో' అహంకార రాహిత్యమను దివ్యగుణముతో ముగియుచున్నవి.

'నిర్భయత్వము – నిరహంకారము' ఇవి రెండును దైవీసంపదకు ప్రధానలక్షణములు. ఈ రెండును గలిగియున్నచో మిగిలిన సుగుణము లన్నియును తమంతటతామే వచ్చి సాధకుని వరించును.

సూచన – సాధకులు ఈ యిరువది యారు లక్షణములను ఒక అట్టపై పెద్దఅక్షరములతో వ్రాసి గోడపై వ్రేలాడదీయవలెను. ప్రతి రోజును వీనిని పఠించుచు ఆచరణలో పెట్టవలెను. ఇదియే నిత్యదైనం దిన జీవితములో ఆధ్యాత్మిక సాధన యగును.

## 111. అజ్ఞానము కూడ రాక్షస లక్షణమే.

'నేను శాస్త్రములను చదువుకొనలేదు. భగవద్గీతలు వినలేదు. నాకు భారత భాగవతములలో నేమున్నదో తెలియదు' అని కొందరు తమ అవివేకమునుగూర్చి చెప్పుకొందురు. అంతమాత్రముచేత వారు రక్షితులుగారు. నాకు శాస్త్రము తెలియదు గావున శాస్త్రములలో చెప్పిన సదాచారములతోగాని, శౌచాదులతోగాని, నియమవ్రతాదులతోగాని నాకు సంబంధము లేదని పలుకుట యెంతమూర్ఖత? అందువలననే అజ్ఞానము (శాస్త్రవిషయములను తెలిసికొనకపోవుట) రాక్షస లక్షణముగా గీత వలుకుచున్నది. శాస్త్రముగాన దానిని తప్పక తెలిసికొనవలయును. జ్ఞానము దేవతాలక్షణము – అజ్ఞానము అసురస్వభావము.

దేవతాలక్షణములను గూర్చి మనము తెలిసికొంటిమి. రాక్షస గుణములను గూర్చి కూడ మనము తప్పక తెలిసికొన వలయును. డంబము, దర్పము, దురభిమానము, క్రోధము, పౌరుషము. అసురలక్షణములు కావున వీటిని మనము విడనాడ వలయును. మహాభారతమిట్లు చెప్పెను.

కోపమును బ్బను గర్వము, నాపోవని యునికియును దురభిమానము నిర్వ్యాపారత్వము ననునివి, కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా.

మీరు దేవతలో, రాక్షసులో మీరే నిర్ణయించు కొనుడు. ఈ అధ్యాయములో దేవతాగుణములు రాక్షసగుణములు ఒకదాని ప్రక్కనొకటిగా చూపబడుచున్నవి. మీయందే లక్షణము లున్నవో చూచుకొనుడు. దుష్టలక్షణములను వీడనాడి దేవతా లక్షణములను ఆశ్రయింపుడు.

ఈనాడు నాగరికత బాగుగా పెరిగిపోయినదని మనము చెప్పుదుము. సామాన్యమైన శౌచనియమములే మానవులు పాటించుట

లేదు, దంతధావనచేయకయే కాఫీత్రాగువారు (Bed Coffee) స్నానము చేయకయే భోజనము చేయువారు, కాఫీహోటళ్ళలో ఎంగిలి పాత్రలలో భుజించువారు క్షౌరశాలలలో రాత్రులందు గూడ క్షురకర్మను చేయించు కొనువారు వీరందరును, ఆసురప్రవృత్తికి చెందిన వారే.

క్లబ్బులలో సురాపానము చేయుచు-పేకాటలో కాలక్షేపము చేయువారు - స్త్రీలతో శాస్త్ర విరుద్ధముగా భోగించువారు, అమాయిక ప్రజలను కోర్టుల వెంబడిత్రిప్పి సర్వనాశనము చేయువారు - అసురులు గాక మరెవరు ?

'ఇదిగో మంత్రిగారితో చెప్పి నీ కుపకారము చేయించెదను, జడ్జిగారితో చెప్పి నీకేసు కొట్టివేయించెదను. అనిడంబములు చెప్పువారు అంగబలము అర్థబలమును గలదు గదా యని యితరులకు బాధలు కలిగించువారు,వీరందరును రాక్షసగణమే.

నేతిలో నూనె - పాలలో నీళ్లు - గోధుమ పిండిలో జొన్న పిండి - వెన్నలో-కొవ్వు - ఇట్లాహార పదార్థములలో మోసములు చేయువారందరును రాక్షస గణమునకు చెందినవారే.

కంట్రాక్టు లను పేరుతో ప్రజాద్రవ్యాన్ని కాజేసేవారు; కళ యను పేరుతో వ్యభిచార గృహాలను నడిపేవారు, సంస్కృతి; సమానత్వమను పేరుతో స్త్రీ పురుష వివక్షను పాటింపని అవినీతిపరులు. వీరందఱును ఈ గణములోని వారే.

ఇవి రాక్షస గుణాలుగా గీత చెప్పుచున్నది. ఈ గుణములు గలవారు నరాధములు, వీరికి మహానరకమే శరణ్యము.

ఇట్టి మార్గముల నుండి మనము దూరముగా నుందుముగాత.

గోపికాగీతలలో వ్యాసభగవాను డిట్లు గానము చేయును,

'తవకథామృతం తప్తజీవనం, కలిని పీడితం కల్మషాపహం
శ్రవణ మంగళం శ్రీమదాతతం, భువి గృణంతియేతే మహాజనాః'

ఓ కృష్ణప్రభూ, నీ పవిత్ర కథామృతము సకల తాపత్రయ ములను పోగొట్టును. సమస్త దుర్గుణములను నశింప జేయును. కావు ననే మహాకవులు దీనిని గానము చేయుదురు. అయ్యాది సమస్త మంగ ళములను ప్రసాదించును. సర్వశ్రేయములను, సకలైశ్వర్యములను ప్రసాదించును నీ మధుర కథా శ్రవణము. ఈ భూలోకములో నీ కథా కీర్తనము చేయువారు మహా పుణ్యాత్ములు గదా.

ఆ పుణ్యమూర్తి దివ్యగానము చేసి మనమందరమును అసుర లక్షణములనుండి విడువబడుదుము గాత!'

—•.•—

## 112. విపరీత భావనలు అసుర వికారములు.

'ఒక యువకుడు కొన్ని గాజుసీసాలను తట్టలో పెట్టుకొని అమ్ముకొనుటకై బజారునకు పోవుచుండెను. దారిలో ఒక చెట్టుక్రింద ఆగి కూర్చుండెను. గంపను క్రిందబెట్టి నడుము వాల్చెను. అతని మన స్సులో అనేక ఆలోచనలు బయలుదేరెను.' ఈ సీసాలను బజారులో అమ్మినచో పదిరూపాయలు వచ్చును. ఆసొమ్ముతో నూరు సీసాలను కొనవచ్చును. వానిని తిరిగి అమ్మినచో నూరురూపాయలు లభించ గలవు. ఆ సొమ్ముతో మరల బట్టల వర్తకము చేయుదును. దాని వలన పదివేల రూపాయలు మిగులును. ఆసొమ్ముతో విదేశీ వ్యాపా రము చేయుదును. దానిలో ఒక లక్షరూపాయలు మిగులును, ఆ ధన ముతో ఒక చక్కని ఉద్యానవనము, దాని మధ్య సుందరమగు ఇంద్రభవనమును కట్టింతును. నాసంపదను చూచి మహారాజులు తమ కుమార్తెలను తీసికొనివచ్చి, నాకు వివాహము చేయ ప్రార్థింతురు. నేనా అందకత్తెల నందఱను వరుసగా నిలబెట్టి నాకు నచ్చిన అంద కత్తెను వివాహము చేసికొందును. ఆ రాజు నాకు లక్షరూపాయలు కట్నమిచ్చును. ఒక సంవత్సరములో నాకు బిడ్డపుట్టును. నాభార్య యింటిలో పనిచేసి కొనుచుండగా బిడ్డయేడ్చును. నా భార్యను పిలిచి

ఆమెను మందలింతును. ఆమె నామాట వినదు. తోడనే నేను నాకా లితో ఆమెను గట్టిగా ఇట్లు తన్నెదను' అని భావించుచు కాలితో గట్టిగా తన్నెను. కాలివద్ద బుట్టలోనున్న గాజుసీసా లన్నియు ముక్కలు ముక్కలు అయినవి.

ఈ కథలోని సారాంశమును గ్రహింపుము. అసుర ప్రకృతిగల మానవులు తమ శక్తి సామర్థ్యములను గ్రహింపక, విపరీతములగు ఆలోచనలకు లోనై పతనమును బొందుదురు.

'నేనే ఈశ్వరుడను, మహాభోగిని, అని భావించి కీర్తి ప్రతిష్ఠల కొరకు యజ్ఞయాగాదులు చేయువారు, తమ పేరు పత్రికలలో పడుట కొరకు దానము చేయువారు, అసురస్వభావ ప్రేరితులే, వారికీ ప్రపం చమంతయు స్త్రీ పురుషుల సంయోగము చేతనే కలుగు చున్నదని భావింతురు. కావున కామోప భోగములే జీవిత లక్షణము లని వారి భావన. వారికి భగవంతుడు లేడు. వారు నాస్తికులు. ఇట్టి స్వభావము గలవారందరును అసుర సంపత్తికి చేరిన వారే. ఈ అధ్యాయములో దుష్టగుణ వర్ణనలు చేయబడినవి. ఇట్టి రాక్షస లక్షణము మనల నంట కుండునట్లు భగవత్సం కీర్తనము చేయదుము గాత.

గోపిక లిట్లు భగవానుని గూర్చి గానము చేయుచున్నారు.

ప్రణతి కామదం పద్మజార్చితం, ధరణి మండనం ధ్యేయమాపరి
చరణ పంకజం శంతమంచతే, రమణ నస్తనే ష్వర్శ యాధికం
(భాగవతం దశమస్కంధం)

ఓ కృష్ణ భగవానుడా; నీ పాదపద్మముల నాశ్రయించిన వార లకు సమస్త కోర్కెలును వర్షించును. బ్రహ్మదేవుడును నిత్యమును నీపాదములనే పూజించును. ఈ విశ్వంభరా వలయమున కయ్యది మహాలంకారము. సర్వాపదలను తొలగించి సుఖములను ప్రసాదిం చునది నీపాదపద్మమే కదా. అట్టి నీ పవిత్ర పాదాంబుజములను మా వక్షస్థలముపై నుంచి మమ్ముద్ధరింపుము.

---

## 113. నరకద్వారములు మూడు

### A Town with Nine gates.

దయా మయుండైన గీతాచక్రవర్తి అసుర గుణముల నన్నిటిని వివరించి మరల వానిలో మహాఘోర ప్రమాదకరము లైన మూడు దుర్గుణాలను గూర్చి హెచ్చరించు చున్నాడు.

త్రివిధం నరక స్యేదం, ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధః స్తథాలోభః, తస్మాత్ ఏ తత్రయం త్యజేత్ ॥

'ఓ అర్జునా, నరక ద్వారములు మూడు గలవు సుమీ! ఒకటి కామము, రెండవది క్రోధము, మూడవది లోభము ... ఇవి నాశన హేతువులు. కావున వీటిని విడనాడుము'

ఈ మూడిటిని జయించినవాడు మిగిలిన అసుర లక్షణములను తేలికగా నిగ్రహించగలడు. మిగిలిన దుష్టలక్షణము లన్నియు వీనిలో అంతర్భూతము లే.

వీనివలన కలుగు మహానష్టములనుగూర్చి గీతలో అనేక-తావులలో చెప్పబడినది. స్థిత ప్రజ్ఞ లక్షణములను తెలుపుచు పర మాత్మ కామక్రోధముల బారినుండి తప్పించుకొన వలసిన యవసర ములనుగూర్చి వక్కాణించినాడు. మూడవ అధ్యాయములో కామ, క్రోధములు రజోగుణ సముద్భవములని తెలుపుచు దాని దుష్టస్వభా వమును వ్యక్తీకరించి వానిని నిర్జించు ఉపాయమును తెలిపినాడు. పంచమాధ్యాయములో కామ, క్రోధ విముక్తులకే బ్రహ్మనిర్వాణము లభించునని తెలుపబడినది. ధర్మ విరుద్ధమగు విపరీత వాంఛయే, కామము. ఈ కామములలో స్త్రీ వాంఛ బలీయమగుటచే దానిని నిగ్రహించు మని చెప్పుదురు.

ఎంతటి బుద్ధిమంతునినైనను ఈ కామము సర్వభ్రష్టునిగా చేయుచున్నది. వీనికి ఉదాహరణము లెన్నియో గత ప్రసంగ వ్యాసములలో తెలిపియుంటిమి. ఇప్పుడు మరికొన్ని యుదాహరణ ములు బైబిలు గ్రంథమునుండి మనవి చేసెదను.

బైబిలు, భగవద్గీత, ఖురాను మున్నగు మహాగ్రంథముల లోని సిద్ధాంతములన్నియును కామ, క్రోధాది దుర్గుణములను విడిచి పెట్టి దేవతా లక్షణములు నాశ్రయింపు మనియే తెలిపెను. ఏ దేశములో పుట్టినను, ఏ మహనీయులైనను, మత ప్రవక్తలయినను, కామాది వికారములను నిగ్రహింపు డనియే ప్రబోధించుచున్నారు.

'శాంసను' అను మహావీరుని కథ బైబిలులో ప్రసిద్ధి కెక్కినది. ఈతడు మహాబలశాలి, బుద్ధిమంతుడు, పిలస్తియనులను జయించిన మహాపురుషుడు, అయితేనేమి, 'డెలైలా' యను సుందరాంగిని కామించి ఆమెవలననే సర్వనాశనమును బొందినాడు. కామ మెంత భయంకరమైనది.

'దావీదు' ప్రతిభావంతుడగు చక్రవర్తి. ఒకనాడాయన రాజవీధిలో తిరుగుచుండగా 'బెత్‌సెబా' యను ఒక సేనాని భార్య అప్పుడే అభ్యంగనస్నానము చేసి నిడుపాటి తనకురులను విలాసముగా నార బెట్టుకొను చున్నది. ఆసుందరాంగి ప్రతిఅంగము నుండియు మెరయుచున్న యౌవనశోభ దావీదు మనస్సును విషపూరితము చేసినది. ఆతడు వెంటనే మాయోపాయమున నామె భర్తను చంపించి ఆ సుందరాంగిని చేపట్టినాడు. కామాంధకారములో మునిగిన నీచుడు చేయరాని దుష్కార్య మేముండును? తరువాత భగవానునిముందు ఆతడు పడిన పశ్చాత్తాపగాథ ముఖ్యముగా గమనింప తగినది.

స్త్రీ వాంఛను నిగ్రహించినవాడు సర్వమును నిగ్రహించగలడు, యుద్ధభూమిలో కోట్లకొలది మహావీరులను సంహరించిన వానికన్న తనలోని కామరాక్షసిని జయించినవాడే మహా వీరుడు.

కామమే క్రోధమునకు కారణమగును. ఈర్ష్యాసూయలు కూడ దానిలోని భాగములే.

బైబిలులో నొక కథగలదు. ఇరువురుసోదరు లుండెడివారు. వారిరువురును సాయంకాలము దేవాలయమునకు పోయి ధూపము వేయుట వాని నిత్యకృత్యము. చిన్నవాడు సాధుశీలుడగుటచేత అతని ధూపనివేదనము తిన్నగా గగనమార్గమునకు పోయెడిది. రెండవవాడు దుష్టస్వభావముగలవాడు. ఆతని ధూపనివేదనము వంకరటింకరలుగా పోవుచుండెడిది.జను లందరును చిన్నవాడు ఉత్తముడని కీర్తింపసాగిరి. పెద్దవానికి సోదరునికీర్తి దుస్సహమైనది. ఆ ఈర్ష్యాభావము క్రోధముగా మారినది. క్రోధమెంత విషపూరిత మయినది? ఒకనాడు దుర్మార్గుడు తన తమ్ముని కత్తితో నరికివేసినాడు.

ఈకథలోని సారాంశమును గమనింపుడు. కోపము యుక్తాయుక్తములను, ధర్మాధర్మములను, గమనింపనీయదు. క్రోధమువలన సమ్మోహమును, స్మృతి విభ్రమమును, బుద్ధినాశనమును కలుగునని రెండవ అధ్యాయములోనే భగవానుడు పలికియున్నాడు.

విషయములు తటస్థించినపుడు జనించు వికారమే లోభము. ఈ లోభములలో ధనలోభము విశేషముగాన దానిని గురించియే లోభ శబ్దము వాడుచుందురు.

ఒక మహారాజు ఇంటికి సమీపమున నొక పేదవానికుటీర ముండెను. అతడును భార్యయునుకూలిపని చేసికొనుచు, తమకువచ్చిన ఆదాయముతో హాయిగా భుజించుచు, సుఖులై ప్రతిదినమును రాత్రులందు సంగీతము బాడుకొనుచు విలాసముగా గడుపుచుండిరి. తన యింటిలో లక్షలున్నను మహారాజున కెప్పుడును విచారమే. దీనికి కారణమేదియో తెలియక తన ఆస్థానములోని బుద్ధిమంతుడగు నొక పండితుని ప్రశ్నించెను.

ఈ కూలివాడు మిక్కిలి బీదవాడుగదా! అయినను నాకంటె సంతోషముగను ఉత్సాహముగాను కానబడుచున్నాడు. నేను లక్షల

కొలది ధనముతో తులతూగుచున్నను విచారముగనే యున్నాను. దీనికి కారణ మేమి? అని ప్రశ్నించెను.

ఆ పండితు డిట్లు చెప్పెను. మహారాజా నేనొక తమాషాచేసి చూపెదను అనిపలికి, తనవద్దనున్న 98 రూపాయల కట్టను రహస్యముగ ఆకూలివాని యింటిలో నాటిరాత్రి గిరాటు వైచెను.

తెల్లవారినపిదప ఆ కార్మికదంపతులు తమయింటిలో రూపాయలనుచూచి ఆశ్చర్య పడిరి. లక్ష్మి తమయింటికి వచ్చిన దని సంతసించిరి. వారు వెంటనే తలుపులు బిగించి రహస్యముగా ఆ రూపాయలకట్టను విప్పి లెక్కపెట్టిరి ... అందు 98 రూపాయలుండెను.' ఇంకను రెండు రూపాయలయినచో నూరురూపాయ లగును'అనివారు తలంచిరి.తప్పని సరిగా ఆమొత్తము నూరురూపాయలు చేయుటకు వారు నిశ్చయించిరి. వారు సంపాదించిన కూలిసొమ్ము దానిలో కలుపుటకు నిశ్చయించిరి. ఆనాడు ఇంటిలో భోజనములు లేవు. రాత్రి సంగీతములు లేవు. మరునాడు కూడా అంతే – ఇంటిలోనుండి పొగరాకుండుట చూడగా రాజున కాశ్చర్యము కలిగెను. చక్కగా పాటలుపాడువా డానాడు పాట పాడుట లేదు.

రాజును పండితుడును కలిసి మరునాడా కార్మికుని యింటికి పోయిరి. ఏమయ్యా రోజును సంతోషముగా పాటలు పాడువాడవు కదా రెండు రోజులనుంచి విచారముగా కనబడుచున్నావు. కారణ మేమి? అని రాజు ప్రశ్నించెను.

ఆ కార్మికుడు సత్యవాది. 'బాబూ! ఏమని చెప్పను. నాయింటిలో మొన్నటిరోజున 98 రూపాయలు దొరికినవి. దానితో నాలో దురాశ బయలు దేరినది. దానిని నూరు రూపాయలు చేయవలయునని సమకట్టితిని. భోజనములు మానివేసితిమి. వచ్చిన ఆదాయమంతయు దానిలో వేయుచున్నాము. రాత్రింబవళ్ళు ఇదియే ఆలోచన.

దీనితో బెంగ, విచారము పట్టుకున్నది. ఈపాడు ధనము దొంకకున్న యెడల హాయిగా నుండెడి వారము' అని బదులు చెప్పెను.

ధనలోభము మానవుని నెట్లు నిర్వీర్యుని చేయునో గ్రహింపుడు. ఈధనలోభ మెన్నియో అకృత్యములకు దారితీయుచున్నది.

కామము,క్రోధము,లోభము, ఈమూడిటిని క్రమముగా వైరాగ్యము, శాంతము, త్యాగము అను ఉత్తమ గుణాశ్రయముతో నిగ్రహింపవచ్చును. అన్నిటికంటెను తారకమంత్రము మరియొకటి గలదు. అది భగవంతుని దివ్యపాదారవిందముల నాశ్రయించిన, దానితో సర్వదుర్గుణములను నశించును. ఆ మధురమూర్తి సర్వశుభములను ప్రసాదించును. ఆయన సంపూర్ణ మధురస్వరూపుడు.

అధరం మధురం వదనం మధురం
నయనం మధురం హసితం మధురం
హృదయం మధురం గమనం మధురం
మధురాధి పతే రఖిలం మధురం.

ఆసుధామధుర స్వరూపుడు మనల నాశీర్వదించుగాత.

—:o:—

# గీతాకల్పవృక్షము

పదునేడవ అధ్యాయము - శ్రద్ధాత్రయ విభాగయోగము

## 114. నీ నివాసగృహమే నీ ప్రవృత్తిని తెలుపును

క్షీరసాగర తరంగ శీకరా, సారతారకిత చారుమూర్తయే
భోగి భోగ శయనీయ శాయినే, మాధవాయ మధువిద్విషే నమః

పాలసముద్రమందలి తరంగ బిందుసందోహము నక్షత్రముల వలె ప్రకాశించు సుందర మనోహర మూర్తీ. మధురాక్షసాదుల సంహరించిన మహాప్రభూ, ఓ శ్రీకృష్ణ సార్వభౌమా! నీకిదే నమస్కారము.

సర్వలోక రక్షకుండైన కృష్ణభగవానుని యనుగ్రహముతో గీతలోని పదునేడవ యధ్యాయములో ప్రవేశించితిమి. ఇదియొక రసవత్తరమయిన యధ్యాయము. నిత్యజీవితమునకు సంబంధించిన పెక్కు విశేషము లిందు పరమేశ్వరుడు గానముచేయును. సాధకుని కార్యక్రమముల సమూహ మీయధ్యాయ మని వినోబాజీ పలుకును. అనుష్ఠాన వేదాంత మిందు తెలుపబడినది. పరమేశ్వర ప్రాప్తిని కాంక్షించు సాధకు డెట్లుండవలయునో ఈయధ్యాయము చెప్పును.

నేనొక పర్యాయము నామిత్రునితో గూడి యొకరి గృహమునకు పోయితిని. ఆయింటిని చూచితినిగదా. ఏగోడపై చూచినను సినీతారల బొమ్మలే. కామవిలాసములు గలిగించు వాలుచూపుల సుందరాంగులే ప్రతిగోడపైనను గలరు. కొందరు అర్థదిగంబరముగా నున్నారు. మరికొందరు పూర్ణదిగంబరలు. మరికొన్ని చిత్తరువులు యువతీయువకుల ఆలింగన, చుంబన, సంభోగ విలాసములతో కూడి, చూచుటకు హేయమై యున్నవి.

వెంటనే ఆ యింటిని విడిచి మరియొక మిత్రునియింటికి పోయితిని. ఆయింటిగోడలపై రాజకీయనాయకుల చిత్రపటములు. ప్రభుత్వాధికారులతో గూడి ఆగృహయజమాని తీయించుకొన్న చిత్రపటము లనేకము లనేకములు గలవు. మంత్రిగారికి మెడలో తాను పూలదండ వేయుచున్నట్లు, గవర్నరు గారితో కరచాలనము చేయబోవుచున్నట్లు చిత్రపటము లెన్నియో యున్నవి.

పిదప మరియొకరియింటికి పోతిని. ఆయింటిలో నెచ్చటగాంచినను భగవంతుని చిత్రములే, బాలకృష్ణుడు, మురళీకృష్ణుడు, గీతాకృష్ణుడు, గోపాలకృష్ణుడు, గీతాకృష్ణుడు, వీరిచిత్రపటములా కుడ్యములపై శోభిల్లుచున్నవి. మరియు శ్రీరాముడు, లక్ష్మి, సరస్వతి, రమణమహర్షి, వివేకానంద, రామకృష్ణ పరమహంస, అరవిందయోగి, మున్నగు మహాపురుషుల చిత్తరువులే గోచరించుచుండెను.

ఇందు మొదటి గృహము తమోగుణ నిలయము. రెండవ గృహము రజోగుణ నిలయము. మూడవది సత్త్వగుణధామము. నీవు సత్త్వగుణ సంపన్నుడవు కావలయునన్నచో నీ మందిరమును మూడవమిత్రుని గృహమువలె నలంకరించుకొమ్ము. నిత్యజీవితముపై పరిసరముల ప్రభావము విశేషముగా నుండును. సాత్వికులు దేవతారాధనాపరులు. రాజసికులు యక్షరాక్షసోపాసకులు, తామసికులు, భూతప్రేత పిశాచారాధనాపరులు. ఇందు మొదటివారు ఉత్తములు, రెండవవారు మధ్యములు, మూడవవారు అధములు.

సాధకుడు తన పరిసరములను సత్త్వగుణపూరితము గావించుకొనవలయును.

---

## 115. ఆహారమే నీ శీలమును మార్చు పరమోపాయము

ఆహార నియమమును గూర్చి ఆఱవ అధ్యాయములో గీత చెప్పియే యున్నది. ఆహారనియమము వలననే మానవుడు దృఢగా

త్రుడు, ఆరోగ్యవంతుడు, నీతివంతుడు, ఆధ్యాత్మిక పరుడు, సచ్ఛీలుడును కాగలుగును. విరుద్ధాహార సేవనము చేతనే మానవుడు రోగగ్రస్తుడు, అవినీతిపరుడు, నీచుడుగను తయారగును. మనుష్యుడుతిను ఆహారమునుబట్టి అతడెట్టి గుణములు గలవాడో తేలికగా చెప్పవచ్చును. మేక ఆవు మున్నగు జంతువులు వాటి ఆహారమునుబట్టియే సాత్వికమృగములై యున్నవి. మాంసాహారమును భక్షించు సింహము పెద్దపులి మున్నగునవి సహజముగా క్రూర స్వభావమును బొందుచున్నవి. మానవులు కూడ అంతే. సాత్వికాహారమును భుజించువారు సత్వగుణ శోభితులై, నీతివర్తనులై చరింతురు. మాంసాహారి తామసిక రాజసికాహార భక్షణముచేయువారు అట్టిగుణములనే గలిగియుందురు.

ఎట్టి ఆహారము తినిన అట్టి మనస్సే నీకు గలుగును. తామసికాహారములు తినువానికి సాత్విక నిష్ఠ ఎట్లు కలుగును! మానవుడు భుజించు ఆహారాదులను బట్టి అతని శీలసంపద యెట్టిదో నిర్ణయింపవచ్చును.

మాంసాహారము నింద్యము, నీచము, క్షుద్రము. అట్టి ఆహారము మానవుని పతనావస్థకు దారితీయును. పవిత్రములగు గోక్షీరములు త్రాగువానికిని సురాపానము చేయువానికిని ఎంత తారతమ్యము! కాయకూరలు భుజించు వానికిని జంతుమాంసము భక్షించువానికిని అంతే తారతమ్యము.

ఆహార నియమములేక, ఇచ్చవచ్చిన వస్తువులన్నియు భుజించుచు, మేము వేదాంతులము, మేము సాధువులము, మేము సన్యాసులము, మేము సనాతనులము, మేము పండితులము, అనిచెప్పుకొను వారి సంఖ్య ఈనాడు పెరిగిపోవుచున్నది.

ఎక్కడ చూచినను వేదాంత శిరోమణులే, కాని వారు తెల్లవారక పూర్వమే కాఫీ దేవాలయములో సాంబారు ఇడ్లీని, కాఫీ తీర్థమును ఆత్మారామునికి నివేదన చేయువారే.

ఒక చేతిలో భగవద్గీత, రెండవ చేతిలో సిగరెట్టు ధరించు వేదాంతు లీనా డనేకమంది. వీరికి ఆహార నియమముతో పని లేదు. ఏమి తిన్న నేమి? ఎక్కడ తిన్న నేమి! ఎప్పుడు తిన్న నేమి! మనకు కావలసినది ఆత్మజ్ఞానముకదా, ఆత్మకును, ఈనియమములకును సంబంధము లేదు. మాలోగల జ్ఞానాగ్నిలో సమస్తాహార పదార్థములును సర్వవిధి నిషేధములును భస్మము లగును. అని ఈరకపు వేదాంతములు చెప్పుచుందురు. ఇట్టి మిథ్యాచారులను చూచి సంఘము మోసపోవుచున్నది. వీరు వేదాంతమను పేరిట భ్రష్టత్వమును నేర్పుచున్నారు.

ఇట్టివారిని గీత తీవ్రముగా విమర్శించి నిరసించుచున్నది. ఆహార నియమము లేనివాడు ఎంతమాత్రమును వేదాంతి కాడు. భక్తుడును గాడు, జ్ఞానియును గాడు. అతడు కేవలము డాంబికుడు. ఆహారమునే నిగ్రహింపఁ లేనివాఁడు భయంకరములగు కామ క్రోధములను నిగ్రహింపగలడా? కాఫీనే వదల లేనివాడు కాంతాసక్తిని వదలగలడా? మాంసాహారమునే త్యజింపలేని వాడు మానసమును నిగ్రహింపగలడా?

గీతాచార్యుడు ఆహారమును సాత్విక, రాజసిక, తామసికములుగా విభజించి చెప్పుచున్నాడు. రసపుష్టిగల పండ్లు, దంపుడు బియ్యము, కందులు, పెసలు మున్నగు కాయధాన్యములు, నేయి వెన్న మున్నగు నవి సాత్వికము లని గీత పలుకును.

ఏవి తినగూడదో వానిని గూర్చి ముందుగా మనము తెలిసికొనవలయును.

మిక్కిలి చేదుగల పదార్థము తినవద్దు.
మిక్కిలి పుల్లని పదార్థములను ముట్టకుము.
మిక్కిలి ఉప్పని పదార్థమును రుచిచూడకుము.
అతివేడిగా నున్న పదార్థమును తాకకుము.
మిక్కిలి కారముగల వస్తువులను చూడకుము.

ఎండిపోయిన పదార్థములు, ఎక్కువ దాహమును పుట్టించు పదార్థములును తినవద్దు. ఇవి యన్నియును రజోగుణమును కలిగించు ననియే యని గీత పలుకును.

నేనొక మిత్రుని నెరుగుదును. అతనికి కాఫీ అలవాటు. దాని నాతడు దినమునకు ఇరువదిసార్లైనను సేవించును. అతడు త్రాగు కాఫీగ్లాసును మనము చేతితో తాకలేము. ఆతడే దానిని నాలుగు మడతలువేసిన గుడ్డతో పట్టుకొని పైకెత్తి త్రాగును. అది ఎంతటి ఉష్ణముగా నున్నదో వేరుగా చెప్పగలమా? శరీరములో నున్న సున్నితములగు ఇంద్రియము లా మహా-వేడిమికి ఉడికిపోవా ?

ఇక తామసికాహారములనుగూర్చి తెలిసికొందము.

సరిగా ఉడకని పదార్థములు తినవద్దు. వండిన పిదప ఒక జాము నిలువయున్న పదార్థములు తినకుము. ఎండిపోయిన కూరగాయలు, కుళ్ళిపోయినపండ్లు తినవద్దు. ఒక సోదరి కూరకొరకు వంకాయలు తరుగుచుండెను. ఆమె ఒక పుచ్చువంకాయను తీసికొని పుచ్చు మాత్రము కోసివేసి శేషించినది ఉపయోగించుచుండెను. 'పుచ్చు' అనునది కాయలో బహిరంగముగా నొకచోటమాత్రమే కనబడినను అది కాయంతకు సంబంధించినదే యని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. కుళ్ళినమామిడి పండును కుళ్ళుభాగము మాత్రము కోసి శేషించినది భక్షించుటయు మన మెరుగుదుము. ఇదియు నిషేధమే. దుర్వాసన గల పదార్థములు తినవద్దు. ఊరబెట్టి బాగుగా పులవబెట్టిన పిండితో రొట్టెలు, అట్లు వేసికొని భుజించువారనేకులు. ఇవి నిషిద్ధాహారములు, అజీర్ణకరములు, రోగదాయకములు. ఒకరుచేసిన ఎంగిలిపదార్థములు తినుట నిషేధము. కొందరు అమాయిక స్త్రీలు గురువుగారు తిని విస్తరిలో వదలివేసిన ఆహారపదార్థములను భుజించువా రున్నారు. అది మహాప్రసాదమని వారు తలంతురు కాబోలు, లేక గురువుగారే తమ యెంగిలిని తిను మని చెప్పుదురో. గీత దీనిని నిషేధించును. ఇవి యన్నియు తామసికాహారములు. సాత్వికాహారమువలననే ఆరోగ్యము-మానసిక శక్తి - ఆధ్యాత్మిక ప్రభావము గలుగును.

## 116. తపశ్శాలివి కమ్ము

తపస్సును గురించి ప్రజాసామాన్యమునందు భిన్న భిన్నములగు విపరీత భావములు గలవు. తపశ్శాలి యనగా గడ్డములు మీసములు బాగుగా పెంచినవారని, భార్యాబిడ్డలను వదలి సన్యసించినవారని, కొండగుహాలలోనో, నదీతీరాలలోనో ముక్కు మూసుకొని జపము చేసేవా రని భావించెడివా రనేకు లున్నారు.అవియే తపశ్శాలి యొక్క లక్షణములు గావని గీత మనకు చెప్పును. సద్గుణ సంపత్తి, సచ్ఛీలము, సన్మార్గాచరణ, ఆంతరంగిక సౌశీల్యము, ఇవియే తపశ్శాలి లక్షణములుగా గీతాశాస్త్రము మరల మరల తెలుపుచున్నది.

తపస్సును మూడురకములుగా అనుష్ఠాన సౌలభ్యము కొరకు భగవానుడు బోధించును. శారీరక, వాచిక, మానసికము లని తపస్సులు మూడువిధములు.

దేవ, ద్విజ, గురు ప్రాజ్ఞ పూజనము, శారీరక తపస్సు, నిత్యము దేవతారాధనము చేయవలయును. యజ్ఞములద్వారా దేవతారాధనమును గూర్చి మూడవ అధ్యాయములోనే మనము తెలిసికొంటిమి. ద్విజులు అనగా బ్రహ్మజ్ఞాన సంపన్నులను పూజింపుము. వారు లోకారాధ్యులు. అట్టివారి వల్లనే లోకములు పవిత్రములగును. గురువులను (తల్లి, తండ్రి, విద్యాబోధ చేసినవారు, మామ, ఉపనేత, స్త్రీయైనచో భర్త) సేవింపుము. ప్రాజ్ఞులను (అనగా పండితులు, జ్ఞానులు, సాధువులు, సత్పురుషులును) పూజించుము.

శౌచము (పరిశుభ్రత) శరీరతపస్సు, ప్రాతఃకాలముననే స్నానముచేయుట, పరిశుభ్ర వస్త్రధారణము, పరిశుభ్రమగు పరిసరములు, పరిశుద్ధమగు వస్తువుల నుపయోగించుట, ఇవన్నియు శరీర తపస్సులోని భాగములే! ఈనాడు తపశ్శాలుల మను పేరుతో వ్యవహరించు వారిలో ననేకులు ప్రాతఃకాలస్నానమైనను చేయనివారు, మురికిగుడ్డలలో కానుపించువారే. తరువాత లక్షణము ఆర్జవము.

అనగా ఋజుప్రవర్తనము. ఏది మనస్సులో భావింతుమో దానినే నోటితో పలుకుట. ఏది పలుకుదుమో దానినే చేయుట.

మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనః,
మన స్యన్యత్ వచ స్యన్యత్ కర్మ ణ్యన్యత్ దురాత్మనః.

మనోవాక్కాయములు మహాత్ములకు ఏకములు, దురాత్ముల యెడ అవి పరస్పర విరుద్ధము. తరువాత చెప్పబడిన సుగుణము బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన విశేషమును గూర్చి గత అధ్యాయములలో తెలిసికొనియే యున్నాము.

ఇతరుల మనస్సులకు బాధకలిగించనట్లు సంభాషించుట, సత్యమును ప్రియమును పలుకుట, వేదములు,ఉపనిషత్తులు, గీత మున్నగు వేదవాఙ్మయమును పారాయణము చేయుట, వాచిక తపస్సుగా గీతాచార్యుడు పలుకుచుండును. మౌనము, మనోనిగ్రహము, భావసంశుద్ధి మానసిక తపస్సుగా చెప్పబడును.

ఈ సుగుణ సంపదలను గూర్చి గీతలో అనేక అధ్యాయములందు, అందు ముఖ్యముగా పన్రెండు, పదమూడు, పదునాలుగు, పదునారవ అధ్యాయములలో నుదహరింపబడి భక్తిజ్ఞానములు, త్రిగుణాతీతాది దేవతా సంపదలను గూర్చి చెప్పిన విశేషములకు సంబంధించినవిగాని నూతనములు కావు. భగవాను డీ సుగుణసంపదలనే గీతలను అనేక తావులలో, అనేక సందర్భములలో, పదజాలముల మార్పులో మరల మరల గానము చేయును.

ఇట్టి ఉత్తమ లక్షణములను మనము అభ్యాసమును గావించుకొని భగవంతునకు ప్రియతముల మగుదుము గాత ?

...—...

## 117. దానశీలుడ వగుము. Be charitable.

భారతదేశం దానవీరుల పుణ్యభూమి. త్యాగశీలుర తపోభూమి. దాన ధర్మాలకు పేరుగాంచిన పురిటిగడ్డ. శిబిచక్రవర్తి తన శరీరాన్నే

కోసియిచ్చాడు. మాంధాత తన వెన్నెముకనే తీసియిచ్చాడు. హర్ష చక్రవర్తి నాలుగు సంవత్సరములకొక పర్యాయం మహాయజ్ఞమును గావించి తన ధనాగారములోని సర్వస్వాన్ని బీదలకు, పండితులకు, కవులకు, సాధు సత్పురుషులకు, ఉత్తమ గృహస్థులకు దానధర్మాదులను గావించి కట్టుబట్టలతో మిగిలేవాడు. ఇట్టిదాతృత్వాలను తలంచినప్పుడు శరీరాలు రోమహర్షమును చెందును. దానవీరత మహాపురుషలక్షణము. తటాకోదకములకు పరీవాహామువలె సమీకృత ధనమునకు త్యాగము, భోగము, నాశము, మూడుగతు లని భర్తృహరి చెప్పినాడు. త్యాగభోగములలో త్యాగము విశేషముకదా. తాను భోగించుట కంటె తన సుఖమును నితరులకు పంచియిచ్చుట విశేషము. అది దేవతాలక్షణము.

ఒకనాడు శ్రీకృష్ణుడు కర్ణుని వద్దకు వచ్చెను. అప్పుడు కర్ణుడు అభ్యంగనము చేసుకొనుచుండెను. 'కర్ణా! నీవద్దనున్న రత్నశోభితమై యున్న ఆ నూనెగిన్నెను నాకిచ్చెదవా' అని కృష్ణు డడిగెను. అడుగుటయే తడవుగా కర్ణు డాగిన్నెను తన యెడమ చేతితో తీసి కృష్ణునకిచ్చెను.

కర్ణా! నీవు బుద్ధిమంతుడవు. శాస్త్రజ్ఞానము తెలిసినవాడవు. ఎడమ చేతితో అంత నిర్లక్ష్యముగా ఎవరైనను దాన మిచ్చెదరా? అని కృష్ణుడు ప్రశ్నించెను.

అప్పుడు కర్ణు డిట్లు పలికెను.

క్షణం విత్తం క్షణం చిత్తం, క్షణం జీవిత మావయోః
యమస్య కరుణానాస్తి, కర్తవ్యం ధర్మసంగ్రహం.

మానవునకు ధనము శాశ్వతముకాదు. ఈనాటి ధనము రేపు లేకపోవచ్చును. మరియును మనస్సు అతి చంచలమైనది. ఒక క్షణములోనే లోభగుణము ప్రవేశించి, ఆ సద్భావము మారిపోవచ్చును. పైగా జీవితము క్షణభంగురము. ఏక్షణంలో జీవిత మంత మగునో

ఎవరు చెప్పగలరు? కావున జీవించిన ఈ క్షణంలోనే ఉత్తమ ధర్మ మును ఆచరించవలెను.

ఓకృష్ణా! నీవెరుగని ధర్మసూక్ష్మము లేమున్నవి? ఎడమచేతిలో నున్న ఈ రతనాలగిన్నె కుడిచేతిలోనికి నేను తీసికొను నంతలో నా మనస్సులోని సద్భావము మారిపోవచ్చును. కనుక సద్భావము కలిగిన వెంటనే ఉత్తమ కార్యములు చేయుటయే ముఖ్యమని నే నిట్లు చేసితిని' అని కర్ణు డనెను.

ఎంతటి అద్భుత సమాధానమును కర్ణు డొసగెనో తిలకింపుడు. మనమో, ఒక నయాపైసా దానముచేయుటకు వెయ్యి ఆలోచనలు, పదివేల సంప్రదింపులను చేసి, తుద కా పనిని వేయిదినములైనను చేతుమో లేమో చెప్పజాలము. ధర్మాచరణము పట్ల మిక్కిలి చురుకుదనమును చూపుట అత్యంతావసరము.

దానమునుగూర్చి చక్కగా బోధపరచుటకై మూడు భాగములుగా దానిని విడదీసి గీత మనకు బోధించును.

ధనము నితరులకు ఇచ్చినంత మాత్రముచేత దానఫలము సిద్ధింపదు. తనకు కలిగిన సర్వస్వమును గోల్పోవుటయే త్యాగ మనిపించుకొనదు. ధర్మరాజు తనసర్వస్వమును జూదములో కోల్పోయెను. అది త్యాగ మగునా ? నాకొక రాజకీయ మిత్రుడు కలడు. రాష్ట్ర ప్రధానిమంత్రిని ఆహ్వానము చేసి ఆయన గౌరవార్థ మానాడు మొత్తము ఇరువదివేలు ఖర్చు చేసినాడు. ఇది ధర్మ మగునా ? దీనికి త్యాగఫలము సిద్ధించునా? దానమును గూర్చి యిట్లు చెప్పును.

దానము చేయుటలో ముఖ్యముగా గమనింపదగినవి మూడు విషయములు. దేశము, కాలము, పాత్రత. ఈ మూడిటిలోను అతి ముఖ్యమయినది 'పాత్రత'. 'అర్హత' గమనించి దానమును చేయుము. ఆక లగువానికే అన్నముపెట్టుము. దాహముతో నున్నవానికే మంచి

తీర్థ మిమ్ము. చలితో బాధపడువానికే దుప్పటి నిమ్ము. చదువు కొరకు తహతహ పడువానికే పుస్తకదానము, ఉపకార వేతనమును నిమ్ము. ఇట్లు పాత్రతను గమనించిచేయు దానమే సర్వశ్రేష్ఠము. అది సాత్వికము. అయ్యది దేశకాలములను గమనించి చేసితివా మరింత శ్రేష్ఠము. పరమేశ్వరార్పణ భావమే దాని విశిష్టత.

'లోకోద్ధరణ కొరకు ఘనకార్యములు, దానధర్మములు నేను చేయుచున్నాను' అని నీవు భావింపకుము. లోకము నీ దానము కొరకుగాని, నీధర్మకార్యముల కొరకుగాని కనిపెట్టుకొని యుండదని తెలిసికొమ్ము. ఓ పిచ్చివాడా, నీ వెంత? నీ దానమెంత? నీ ధర్మకార్యము యొక్క విలువయెంత? అట్టి గర్వమును చెందకుము. దానము చేయు మహావకాశము గలిగినది గదా యని సంతసింపుము.

ప్రతిఫలము కొరకును, పేరుప్రతిష్ఠలకొరకును చేయు దాన ధర్మములు రాజసికములని గీత పలుకును. దేశకాలములను గణింపక అపాత్రులకు చేసిన దానము తామసిక మగును. దీనివలన దానము యొక్క సత్ఫలితము రాదు సరికదా అట్టి దాన, ధర్మాదుల వలన విపరీత ఫలితములు, దుష్టఫలితములు, మహాపాపమును కలుగుచుండును.

శాస్త్రచోదితముగా చేసిన దానమే మహాఫల సంధాయకం. దేశకాల పాత్రతలను గమనింపని స్థితిలో నీవుంటివో, 'ఓం తత్సత్' అను పవిత్రమగు భగవాను నుద్దేశించియే యట్టికార్యమును చేయుము. ఆయన మంగళకరుడు గావున సర్వమును మంగళ మగును.

—•••—

పదునెనిమిదవ అధ్యాయము - మోక్షసన్న్యాస యోగము.

## 118. గీతాచార్యుని ద్వాదశ మహోపదేశములు.

**The twelve commandments of Geetacharya.**

పదునెనిమిది అధ్యాయములు గీతాశాస్త్రమునంతను వివరించి పార్థసారథి తన శిష్యరత్నమగు పార్థునకు ఆయా యధ్యాయములలోని సారాంశమంతయును క్రోడీకరించి పండ్రెడు సూత్రాలుగా ఉపదేశించినాడు. ఇయ్యది 'గీతార్థసార' మనియును, 'సంగ్రహగీత' యనియును పెద్దలు వచింతురు.

ఈ దిగువ నుదహరించిన ఈ పండ్రెడు సూత్రములును సర్వ వేదాంతసారములు - నిత్యజీవితములో అనుష్ఠానము చేయదగినవి యును నగుటచేత సాధకులు వీనిని ఒక అట్టపై పెద్ద యక్షరములలో వ్రాసికొని తమ ధ్యానమందిరమున గాని పఠన మందిరమున యందుగాని గోడలకు వ్రేలాడ గట్టుకొని ప్రతిదినమును వీనిని పఠించుచు, ఆలోచించుచు, ధ్యానించుచు తమ జీవితములను పవిత్రములు సార్థకములు గావించు కొందురుగాక !

1. బుద్ధ్యా విశుద్ధయా యుక్తః (నీ బుద్ధిని సదా పరమ పవిత్రముగా నుంచుము. 'Let thy intellect be very pure) బుద్ధిని మాలిన్యములు లేక ప్రాపంచిక వాసనారహితముగ నుంచుకొనవలయును. అద్దమువలె మిగుల పవిత్రముగా నున్నపుడే జ్ఞానజ్యోతి బుద్ధిలో ప్రకాశించును.

2. ధృత్యాఽఽత్మానం నియమ్య (నీ మనస్సును ధైర్యముతో నిగ్రహింపుము (Control thy mind with firmness) మనస్సు నిరంతరమును పలువిధములగు ఆలోచనలతో, వికారములలో, చింత

నములతో సంచరించుచుండును. ధైర్యముతో ఆ మనోభావముల నన్నిటిని ఏకాగ్రము చేయవలెను.

3. శబ్దాదీ న్విషయాం స్త్యక్త్వా శబ్దాది విషయములను త్యజింపుము. Remove the sense contacts such as sound etc. శ్రోత్రాది ఇంద్రియములు సదా శబ్ద స్పర్శ రూపరస గంధముల యందు ప్రవర్తించుచుండును. వానిని ఆయా విషయములనుండి మరల్చుము.

4. రాగద్వేషౌ వ్యుదస్య :- రాగద్వేషములను విడనాడుము. Renounce attraction and repulsion - Abondon both attachment and hatred ఒక వస్తువు నందు మనకుగల ఆసక్తిని రాగమని పిలుతురు ... మరియొకదాని యందు గల విరోధ భావమును ద్వేషమందురు. ఈ రెండును ఆత్మజ్ఞానమునకు భంగకరము లగుటచేత వానిని విడనాడుము.

5. వివిక్తసేవీ! ఏకాంతమందు నివసించుము. Live in a solitory place. జపతపోధ్యానములకు ఏకాంత ప్రదేశము చాల ముఖ్యము. తన యింటిలో ఒక ప్రత్యేక గదిని ధ్యానమందిరముగా నేర్పాటు గావించుకొనుట చాల మంచిది.

6. లఘ్వాశీ. మితాహార సేవనమ్ము. (Moderation in diet) ఆధ్యాత్మిక జీవితమునకు ఆహారనియమము లత్యంతావశ్యకములు. తామసిక రాజసికాహారములను విడనాడవలయును. సాత్వికాహారమును హితముగా మితముగా భుజించవలెను. విశేషముగా భుజింపరాదు. దీర్ఘ శుష్కోపవాసములు పనికిరావు. దీనివలన శరీరము కృశించి, జప, తపో, ధ్యానాదులందు శక్తియుండదు.

7. యత వాక్కాయ మానసః శరీరమును వాక్కును మనస్సును చక్కగా నిగ్రహింపుము. (Control the body, speech and mind) శరీరమును స్వాధీనములో నుంచుకొమ్ము. విశేషముగా

పరిశ్రమ వలదు.మరియును ఎట్టి పరిశ్రమయును లేక సోమరిగా నుండ వద్దు. హితమును సత్యమును ప్రయోజన కరమును నగు పలుకులను మాత్రమే మితముగా పలుకుము. మానసికా దోళనములను దూరము చేయుము. అన్ని విషయము లందును మితమును (**moderation**) పాలింపుము.

8. ధ్యానయోగపరోనిత్యం - ప్రతిదినమును ధ్యానయోగా భ్యాసము చేయుము. **Regular meditation every day.** ప్రతి దినమును నియమిత కాలములో క్రమము తప్పక ధ్యానము చేయ వలయును.

**9.** వైరాగ్యం సముపాశ్రితః - వైరాగ్యమును లెస్సగా అను ష్ఠింపుము.**Lead a life of non-attachment and dispassion.** బాహ్యములగు విషయములయందు వైరాగ్యమును, అసంగమును బాగుగా వృద్ధిపొందినపుడే ఆత్మజ్ఞానము కలుగును.

10. అహంకారం, బలం, దర్పం, కామం, క్రోధం, పరిగ్రహం విముచ్య. (అహంకారమును, పశుబలమును, గర్వమును, విషయా సక్తిని, కోపమును, విశేష వస్తుసంగ్రహమును విడనాడుము. (**Renounce egoism, strength, pride, lust, anger and accumilation**) జ్ఞానప్రాప్తికి ప్రతిబంధకములగు ఆరు దుర్గుణములను గూర్చి వివరింపబడినది. తాను గొప్పవాడ నను భావమును విడనాడు టయే అహంకార త్యాగము.పశుబలమును, మొండిపట్టువలయు,దేహ బలముపైననే విశ్వాసము, దుష్టకార్యాచరణకు పనికివచ్చు శరీర బలము - ఇవి వ్యర్థములు. ఇవియే 'బలం' అను శబ్దముతో పేర్కొన బడినవి. కుల ధన సౌందర్య విద్యాధిక్యములను చాటుకొనుటయే గర్వము. విషయభోగములం దాసక్తియే కామము. కామము నెర వేరనపుడు కలుగు మానసికోద్రేకమే కోపము. తన కనవసరములగు వస్తుసమీకరణమే పరిగ్రహము. ఈ అయిదింటిని విడువవలెను.

11. నిర్మమః. మమకార రాహిత్యము (un-attachment) ద్వారా పుత్రాదులయందు, ధన కనక వస్తు వాహనములయందును, గృహారామక్షేత్రములయందును తనకుఁగల సంగదోషమును విడనాడుటయే 'మమకార రాహిత్యము.'

12. శాంతః - పరమశాంతుడు (Peaceful) with out anxiety and worry. మనసులో వట్టి కల్లోలమును, వికారమును లేక పరమశాంతముగా నిలువవలెను.

ఈ ద్వాదశసూత్రములు గీతోపదేశ సారములు. నిత్యజీవితములో సాధకుడు అనుష్ఠానము చేయదగిన దివ్యపథములు.

—...—

## 119. భగవానుని రహస్య సందేశము

**The secret message of Bhagavan.**

గీతాచార్యుడైన భగవానుడు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో పార్థుని నిమిత్తమాత్రంగా నుంచుకొని సమస్తమానవకోటికిని జ్ఞానోపదేశం చేసాడు. పదునెనిమిదిఅధ్యాయాల బోధను కొనసాగించి, చివరమాటగా నిట్లు పలుకుచున్నాడు. నాయనా! నీకు పరమరహస్యమైన జ్ఞాన మంతయును బోధించినాను. దానినంతను జాగ్రత్తగా వింటివి గదా! బాగుగా యోచించుకొని, చక్కగా విచారణచేసి, నిదానముగా ఆలోచించుకొని - నీకు ఎట్లు చేయుట ఇష్టమో అటులనే చేయుము. 'యథేచ్ఛసి తథా కురు' (18-63) అని వచించెను. ఇదియే సద్గురు బోధనావిధానములోని మహత్తర ప్రతిభ. సద్గురు వెన్నడును శిష్యుని నిర్బంధించి పనిచేయించడు. జగద్గురువున కట్టి కర్తృత్వాహంకారముకూడ నుండదు గదా ? గురుదేవునకు శిష్యునిపట్ల గల వాత్సల్య మపారముగదా. కనుక మరల నిట్లు పలుకును. 'నీవు నాకు పరమప్రియుడవు. నన్ను శరణాగతిని బొందినవాడవు. నాకు ఇష్టుడవు. గనుక నీ మేలుకోరి, నీక్షేమమును గాంక్షించి, నీయున్నతిని వాంఛించి

పరమరహస్య విషయము- రహస్యములలో మహారహస్యమును- నీకు నా తుదిసందేశముగా చెప్పుచున్నాను. జాగ్రత్తగా వినుము. అప్రమత్తుడవై ఆలకింపుము. ఏకాగ్రచిత్తముతో, మిక్కిలి శ్రద్ధగా శ్రవణము చేయుము. ఏమందువా ?

'మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే' (18-65)

భగవానుడ నగు నేను నీకు ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. పరమసత్యమును భాషించుచున్నాను. నీవు నాకత్యంతప్రియుడవగుటచేత నీశ్రేయమును గోరి- నీహితమును కాంక్షించి చెప్పుమాట లివి- 1. నీమనస్సును నాయందు నిలుపుము. 2. నాకు భక్తుడవు గమ్ము. 3. నన్ను ఆరాధింపుము. 4. నాకు నమస్కరింపుము. నీవు నన్నే పొందెదవు. ఇది పరమసత్యము. ఇది నా ప్రతిజ్ఞావాక్యము.

సమస్త మానవకోటికి భగవంతుడు తరణోపాయమును సంగ్రహముగా తెలుపుచున్నాడు. సర్వవేదముల సార మిది. సర్వయోగముల మూల మిదియే. భగవత్ప్రాప్తికి నాలుగే నాలుగు మాటలు - వరహాల మూటలు - రతనాల రాసులు.

1. మన్మనా భవ - **Fix thy mind in me** నీ మనస్సు నాయందు నిలుపుమని ఆదేశము. సామాన్యమానవులు ప్రాపంచిక విషయములే సుఖప్రదములని భావించి, వానియందే మనస్సు నిలిపి,వానిని సంపాదించుటకొరకే ప్రయత్నింతురు. భగవంతుడే శ్రీనిధి- శ్రీకరుడు- శ్రీనివాసుడు-శ్రీపతి. సర్వశ్రేయములనుగూర్చి భగవానునియందే మనస్సును నిలుపుము. నీకు సర్వమును సిద్ధించును. నీయోగక్షేమములను వహించువాడు వాడే.

2. మద్భక్తః (**Be my devotee**)-నన్నే ప్రేమించుము. ధనధాన్యములందు, కాంతా కనకములందు, అధికార వైభవములందు ప్రేమను వదలి త్రికరణశుద్ధిగా నన్నే ప్రేమింపుము.నీవు నన్నే పొందెదవు. సందేహము లేదు.

3. మద్యాజీ (work for my sake) నన్నే ఆరాధింపుము. నాకొరకే సకలకర్మలను నిమిత్తమాత్రముగా చేయుము. నీకు అండగా దండగా-తోడుగా-నీడగా-సారథిగానుండి నిన్ను నాయందుంచుకొందును. ఇది పరమసత్యము.

4. మాం నమస్కురు (Prostrate to my lotus feet) పై విధముగా నేను చేయజాలనందువా? నాయనా! చిత్తశుద్ధితో నా పాదారవిందములకు నమస్కరింపుము. ఇదియే చాలును. నీవు తప్పక నన్ను పొందగలవు.

ఇవి భగవంతుని వాగ్దానములు. These are Gody promises. దేవదేవుని దివ్యసుభాషితము లివి. These are the declarations of the Lord of Lords మానవకోటికి భగవానుని దివ్యప్రసాదము లివి. These are the assurances and blessings of the Lord to the mankind. ఈనాలుగు సూత్రములును కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యానమార్గముల సందేశమని విజ్ఞులు భావింతురు.

కేవలము నమస్కార పుష్ప సమర్పణముచేతనే భగవంతుని బొందవచ్చునని చెప్పబడినది. ఇది మిక్కిలి తేలికయైన మార్గము. The most easiest path to attain is prostrations to His lotus feet. నమస్కార విశిష్టతను గూర్చి యిట్లు వివరింపబడినది. శ్రుతిమాత ఇట్లు గానము చేయుచున్నది.

'ధన్యం తదేవలగ్నం తన్నక్షత్రం తదేవపుణ్యా మహః
కరణస్య చ సా సిద్ధి ర్యత్ర హరిః ప్రాక్ నమస్క్రియతే'

ఎప్పుడు శ్రీహరి ముందుగా నమస్కరింప బడుచున్నాడో ఆ సమయమే మంచిలగ్నము. అదియే మంచినక్షత్రము. అదియే పుణ్యదినము. అదియే మంచితరుణముకూడ నగును.

'ఏకోపి కృష్ణస్య కృతః ప్రణామో దశాశ్వమేధీ భవతే న తుల్యః
దశాశ్వమేధీ పునరేతిజన్మ కృష్ణప్రణామీ న పునర్భవాయ'
(మహాభారతం, శాంతిపర్వం 47,91)

కృష్ణపరమాత్మకు చేసిన ఒక్క నమస్కారమైనను అది పది అశ్వమేధయాగములు చేసి అవభృథస్నానము చేసిన పుణ్యఫలముతో సమానమైనది యగును. అయినను పది అశ్వమేధయాగము లాచరించినవాడు పునర్జన్మను బొందుచున్నాడు. కాని శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కరించినవాడు మాత్రము మరల జన్మించడు.

'అతసీపుష్ప సంకాశం పీతవాసస మచ్యుతం
యే నమస్యంతి చ గోవిందం న తేషాం విద్యతే భయం' (మ.శా47,90)

అతసీపుష్పమువంటి వర్ణము గలవాడును, పీతాంబరధారియును, అవినాశియును నగు గోవిందునకు నమస్కరించువాని కెట్టి భయమును లేదు.

'లోకత్రయాధిపతి మప్రతిమప్రభావ మీషత్ప్రణమ్య శిరసాప్రభవిష్ణుమీశం
జన్మాంతర ప్రళయకల్ప సహస్రజాత మాశు ప్రణాశ ముపయాతి నరస్య పాపమ్'

ముల్లోకముల కధిపతియును, మహాప్రభావ సంపన్నుండును, సమస్తమును సృష్టించిన పరమేశ్వరునకు శిరస్సువంచి నమస్కరించిన మానవునకు అనేక జన్మలయందును, ప్రళయముల యందును, కల్పములయందును చేసిన సమస్త పాపములును నశించిపోవును.

—•••—

## 120. మాశుచః-దుఃఖించవద్దు, మామేకం శరణంవ్రజ - నన్నే శరణు బొందుము. చివరిలో భగవానుని దివ్యమగు మధురవాణి. Grieve not, Take refuge in me only, Bhagavan's devine sweet voice at the end.

పరమపవిత్ర మగు గీతోపదేశమును ముగించుచు భగవానుడు పలికిన అమృతవాక్యము లివి. తాపత్రయముతో క్రుంగిపోవుచున్న మానవజాతిపై చల్లిన అమృతవర్ష మిది. సమస్తదుఃఖములను నశింపచేయు మహౌషధ మిదియే. సకలసిద్ధులను ప్రసాదించు పరమమంత్ర మిదియే.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః'

గీతోపదేశములో చరమశ్లోకమై భాసించుచున్నది. వైష్ణవ సంప్రదాయములో నియ్యది మహామంత్రముగా మననము చేయబడును.

గీతాపారాయణము చేయువారు ప్రారంభమునందు ఋష్యాది ధ్యానమునందు ఈ శ్లోకమునందలి మొదటిపాదమును 'శక్తి' యనియును, రెండవపాదమును 'కీలక' మనియు పలుకుచుందురు. దీనినిబట్టి ఈ శ్లోక మెంత ప్రశస్తమైనదో గ్రహింప నగును. ఈ శ్లోకములోని మొదటిపాదములో 'సాధనా విశేషమును' రెండవ పాదమునందు సాధ్యమును తెలుపబడినది.

'నాయనా! దుఃఖించవలదు. తండ్రీ! శోకమువద్దు. బాబూ! విచారము తగదు' అని పరమపిత తన సంతానముపై అమృతవర్షమును కురిపించుచు ఓదార్చుచున్నాడు. గీతాశాస్త్రము 'అశోచ్యాన్' (దుఃఖరాహిత్యము) తో ప్రారంభమై తిరిగి 'మాశుచః' దుఃఖరాహిత్య ప్రబోధముతోనే ముగియుచున్నది. దుఃఖనివృత్తియే గీతోపదేశ సారాంశము. శోకరాహిత్యమే భగవానుని బోధలోని సందేశము. అది ఎట్లుకలుగును? 'నన్నే శరణాగతిని బొందు' మని భగవానుడు పలుకును. సర్వదుఃఖనాశమునకును, సకల బాధాహరణమునకును - ఇది యొక్కటియే పరమోపాయము.

జపమువద్దు, కఠోరతపము వద్దు, మంత్రతంత్రములు వద్దు, తీర్థయాత్ర లక్కరలేదు. శుష్కోపవాసము లనవసరములు. ధ్యాననిష్ఠలతో అవసరము లేనేలేదు. దానములు, వ్రతములు, క్రతువులు - ఇవి యేవియును అవసరమే లేదు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' నిత్యనైమిత్తికాది సమస్త ధర్మములును వాని కవసరములగు కర్మకాండలను, సర్వమును వదిలిపెట్టుము. ఎంత చల్లనిమాట! ఎట్టి అమృత

భావమిది! 'స్వామీ! నన్నేమి చేయుమందు వందువా?'–'నాయనా! నీవు నన్నే ఆశ్రయించుము. నన్నే శరణాగతిని బొందుము. త్రికరణ శుద్ధిగా నన్నే పరమప్రాప్యముగా, పరమగతిగా,పరమనిధిగా భావించి నిరంతరము నన్నే శరణు బొందుము' అని పరమవాత్సల్యమూర్తి యగు భగవానుని దివ్యవాణి. ఎంత తేలికఉపాయమిది? ఇట్లు శరణాగతిని బొందినచో కలుగు ఫల మేమందువా ?

నాయనా! వినుము. నీయొక్క సమస్త పాపములును నశించి పోవును. ఎట్టి కర్మబంధములును నిన్నంటజాలవు. నీకెట్టి దుఃఖములును కలుగవు. పరమేశ్వరుడనైన నేను నిన్ను సకలపాపములనుండియును తప్పక విముక్తుని చేయుదును. ఇది నాప్రతిజ్ఞ. ఇది నా వాగ్దానము. నాయనా! నీకు శోకము వలదు. ఇక నీకు దుఃఖ ముండదు.ఇవి సర్వలోక మహేశ్వరుం డగు శ్యామసుందరుని చల్లని పలుకులు.

సారాంశ మిది. 'భగవంతుని శరణాగతిలో – సమస్త పుణ్యకర్మల ఫలములును అంతర్భూతములై యున్నవి. జప, తపో, దాన, ధర్మాది నిత్యనైమిత్తికాదులవలన కలుగు ఫలములు స్వల్పాతిస్వల్పములు. భగవంతుని శరణాగతిలో మోక్షఫలమే వెలయుచున్నది.

నీమనస్సును, నీబుద్ధిని, నీ యింద్రియములను, నీసర్వస్వమును భగవంతుని దివ్యపాదారవిందములపై పూజాపుష్పములుగా సమర్పించుము. నీవు భగవత్స్వరూపుడ వగుదువు. భక్తియోగముయొక్క సారాంశమైన ప్రపత్తిని, శరణాగతిని, ఈశ్లోకము బోధించుచున్నది. మధుసూదన సరస్వతి మున్నగు వ్యాఖ్యాతల భావ మిది.ఇదియే గీతా తత్త్వరహస్య మని భక్తుల భావము.

ఒక భక్తుడిట్లు పలుకుచున్నాడు.

'సంధ్యావందన భద్రమస్తు! భవతే భోస్స్నాన తుభ్యం నమః
భో దేవాః పితరశ్చ తర్పణ విధౌ నాహం క్షమః క్షమ్యతాం,
యత్ర క్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారం స్మార మఘం హరామి తదలం మన్యే కిమన్యేన మే.

ఓ సంధ్యావందనమా! నీకొక నమస్కారము. ఓ స్నానమా! నీకు వందనము. ఓ దేవతలారా! మీకు నమస్సులు. పితృదేవతార్చన తర్పణ కర్మచరణమా! నీకు ప్రణామము. కంసహారుడు, పాపహారుడు నగు శ్రీకృష్ణభగవానుని శరణాగతిని బొంది యాతని దివ్య నామస్మరణము చేయు నాకిక నితర నిత్యనైమిత్తికములతో నేమి పనియున్నది? ఆ శరణాగతియే నాకు సమస్తము.

ఈశ్లోకమునే శ్రీశంకర భగవత్పాదులును, తదితర అద్వైత వ్యాఖ్యానకారులును ఈవిధముగా వివరింతురు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య' దృశ్యప్రపంచ సంబంధములగు సకల ధర్మములను పూర్తిగా విడనాడుము. దేహాభిమానమును వీడుము. దేహము, మనస్సు, బుద్ధి – వీనికి సంబంధించిన ధర్మము లన్నిటిని విడనాడుము.

'మామేకం శరణం వ్రజ' దృక్స్వరూపమును మాత్రమే సదా చింతింపుము. ఆత్మతత్త్వమునే సదా భావించుము. 'సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే' సమస్తకర్మలును ఆత్మజ్ఞానమునందే పరిసమాప్తిని బొందును. 'అద్వైతామృత వర్షిణీం – ఇతి తే జ్ఞాన మాఖ్యాతం' అని గీతాచార్యుడు గానము చేసియుండుటచేత గీతాశాస్త్రము జ్ఞానశాస్త్ర మైనది. 'తత్త్వమసి' సిద్ధాంతమే గీతాజ్ఞానప్రబోధన సారాంశముగా చెప్పబడును.

సారాంశ మేమన – పైని వివరించిన 'పరాభక్తియును', 'జ్ఞానమును' భిన్నభిన్నములు గావు. రెండును ఒక్కటియే యని శ్రీ శంకరుల అభిప్రాయము.

సాధకులు వారి సంస్కారముల ననుసరించి ఈ పవిత్ర మంగళ శ్లోకరాజమును కొందరు భక్తియోగ పరముగా, మరికొందరు జ్ఞాన యోగముగా నన్వయించి, భావించి, తరింతురు.

---

